ఓమ్.

అనుశ్రుత్యుపనామక

విజ్ఞానలక్ష్మీనారాయణీయమందు

# శ్రీమద్భగవద్గీతా విజ్ఞానము.

బహిరంగ పరీక్షాత్మకము

అంతరంగ పరీక్షాసంగ్రహయుక్తము.





కర్త:

చల్లా కృష్ణమూర్తి శాస్త్రి.



[వెల రు. 5-0-0

ఓన్నమఃపరబ్రహ్మణే.

# పీఠిక.

మంత్రబ్రాహ్మణాత్మకము లైన వేదములందలి పరమార్థబోధకము లగువాక్యము లాధారముగా వెలసినయీశావాస్యాదివేదాన్తములు విస్తరిల్లినపిదపనే వేదప్రామాణ్యాప్రామాణ్యవాదములు జీవేశ్వరభేదాభేద వాదములు ఈశ్వరాస్తిత్వనాస్తిత్వవాదములు నుదయించినవి. అవి యీఁతగా తత్త్వ మన్వేషింపఁ బూనినపూర్వమునులు క్రమముగా దర్శనము లను పేర మతవిషయకశాస్త్రములు నిర్మించిరి. ఇచ్చట దర్శన మనఁగా తత్త్వనిరీక్షణ రూపజ్ఞాన మని యర్థము. దానిని ప్రతిపాదించుటంజేసి శాస్త్రము దర్శన మైనది. ఆదర్శనములలో నుత్తమవిఖ్యాతి గాంచి జగమెల్ల నావరించిన దుత్తరమీమాంసాదర్శనము. ఇదియే నిజ మైనవేదాన్తమతము. ఇదే బ్రహ్మవిద్య. శరీరాంతర్యామి యగుజీవునితత్త్వ మావిష్కరించుటంజేసి యిది శారీరకమీమాంస యనఁబడినది. ఉపనిషత్తు లాధారముగా బాదరాయణుఁడు నిర్మించినబ్రహ్మసూత్రములు దీనికి పునాది. కర్మ జ్ఞానమునకు సాధన మనెడియాచార్యోక్తినిబట్టి పూర్వ మైనకర్మను దెల్పునది పూర్వమీమాంస యనియు. ఉత్తర మైన బ్రహ్మజ్ఞానమును దెల్పున దుత్తరమీమాంస యనియు విద్వల్లోకమున వ్యవహార మేర్పడినది. కాని యిది దీనిమొదటిపేరు కాదు. శంకరభగవత్పాదులు దీనిని వేదాంతమీమాంసాశాస్త్ర మనియే పేర్కొన్నారు. ప్రతిసూత్రమందు నుపనిషద్వ్యాఖ్యార్థ మిమిడియుండుటంజేసి దీని కాపేరు తగును.

ఉపనిషద్విషయ మగాధ మపారము. ఉపనిషత్తులు నిజముగా కర్మప్రతిపాదకములు కాకపోయినను, కర్మము జ్ఞానార్థమే కావున కర్మ నిష్ఠ లగువారికి జ్ఞానమార్గ ముపదేశించుట యావశ్యక మనుతలంపుతో నవి బ్రాహ్మణారణ్యకములఁ బ్రవేశించి వేదాంతము లనుపేరు గాంచినవి. తదర్థవిచారణ మూలముగా నావిర్భవించినపరతత్త్వప్రతిపాదకశాస్త్రము వేదాంతమీమాంసాశాస్త్ర మైనది.

సంస్కృతసారస్వతమం దీశాస్త్రమునకు సంబంధించి యావిర్భ వించిన గ్రంథము లసంఖ్యాకనులు. అట్టివానిలో భారతీయులపాలిటి భాగ్యదేవత యనఁదగుసకలవేదాంతసార మైనభగవద్గీత యొకటి. ఇది యెపుడు పుట్టినదో! ఎట్లు పుట్టినదో! తద్రసపిపాసువుల కావిచార మిపు డనావశ్యకము. కాని, నిజముగా శ్రీకృష్ణపరమాత్మనోటనే యావిర్భ వించిన దేమో యనునట్లు ముముక్షువులకు జీవేశ్వరతత్త్వము కరతలా మలకము గావింపు దీని కిదే సాటి యని మాత్రము భావింపవచ్చును. శాస్త్రము కష్టము, అనఁగా దురవగాహ మనిపెద్ద లని యున్నారు. ఆ మాట యీగీతాశాస్త్రమునకు కూడ వర్తించునదే యైనను, తక్కిన శాస్త్రములవలె కర్కశము గాక చదువ నింపు లొలుకుమృదుమధుర భాషతో సుగమముగా గోచరించుట యిందలివిశేషము.

జగద్గురుశంకరులకు ముందటిభగవద్గీతాప్రచార మొకయెత్తు. తరువాతిదీనిప్రచార మొకయెత్తు. శాస్త్రస్వభావమునుబట్టి భగవద్గీతల ముఖ్యభావ మేకరూప మగును గానిబహురూపము కాఁబో దని తత్త్వ జ్ఞులు తలంపకపోరు. అయిన నేమి? మతభేదములనుబట్టి మార్గభేదము లేర్పడక పోలేదు. వానిలో దేని కదే యుత్తమ మార్గ మనిపించుకొను చుండక పోలేదు. అయితే కలిహృదయము బహువిధమా? కాదు. కాని, యావిషయము నిర్ణయింప గీర్వాణవాణియే తడఁబాటు చెందినది. ఆకావ్యభాష యట్టిది. గీతార్థగాంభీర్య మెఱుంగఁగోరుభాష్యకర్తలస్వమ తావేశముల కాభాష తోడ్పడినది. అదే కాకున్న విభిన్నము లైనభావ వివరణము లెందు కుదయించును? ఆవిచార మిపు డట్లుండనిండు.

శంకరభాష్యము వెలసినపిదప సంస్కృతమందేమి దేశభాషలం దేమి, గీతలకు వ్యాఖ్య లనువ్యాఖ్యలు వృత్తులు వివరణములు పద్యా త్మకగద్యాత్మకము లైనవివిధానువాదము లెన్ని యవతరించినవో లెక్క లేదు. ఒక్కయాంధ్రభాషలో. నేను చూచినయట్టివి సుమారు నూఱు

కృతు లున్న వనుట యతిశయోక్తి కాదు. అదంతయు భక్తజనమనో రంజన మైనగీతలమహిమ.

గీతార్థవివరణమందు పూర్వాచార్యులు వేఱుత్రోవలు పట్టినట్లే నవీనవిద్వాంసులును నూతనమార్గములు త్రొక్కుచునే వచ్చిరి. అట్టి వారిలో తొలుత పేర్కొనఁదగినవారు లోకమాన్య బాలగంగాధరతిలక పండితులు. ఆ మహాప్రతిభాశాలి గీతారహస్యము పెక్కండ్ర నాకర్షించి నది. పెక్కుభాషల కనువదింపఁబడినది. దానితరువాత గీతావిషయమున వెలసినపెద్దగ్రంథములలో నీగీతావిజ్ఞాన మొకటి. ఆరువందలపుటలతోడి యీసంపుటము వంటివి మఱినాలుగు వెలువడ నున్న వనుటయే దీని గురుత్వమునకు గుర్తు. సుమా రేడువందల శ్లోకములలోనివిషయమును మూఁడువేలపుటలగ్రంథ మగునట్లు వివరించిన శ్రీచల్లాకృష్ణమూర్తి శాస్త్రిగారి గీతాశాస్త్రపరిశ్రమ మసాధారణము శ్లాఘ్యము. ఓపికతో చదువు వారి కిది కేవలము 'గీతావిజ్ఞానము' గానేకాదు, ఐహికాముష్మికవిజ్ఞా నముగాను సకలశాస్త్రసముచ్చయముగాను గోచరించును. అదే యీయు ద్గ్రంథమందలిముఖ్యవిశేషము. విజ్ఞానలక్ష్మీనారాయణీయమందలిప్రథమ భాగ మైనయీభగవద్గీతావిజ్ఞానపరిచయ మనెడిగ్రంథ మంతయు బహి రంగపరీక్షకు వినియుక్త మగుటయే యిందలివివిధవిషయవిమర్శనము ససాకల్యము సర్వతోముఖము నయిన దని చెప్పుచున్నది.

శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారి విమర్శనపద్ధతి యపూర్వము స్వతం త్రము. ఇందు కిందలిగీతానామ మీమాంస యనెడి శీర్షికతోడిద్వితీయ ప్రసంగమొక యుదాహరణము. భగవత్-గీతా-ఉపనిషత్-అనుమూఁడు పదములను సార్థకము గావించుట కొనర్చినచర్చలును పూర్వపక్షసమా ధానములును వేదశాస్త్రములనుండి యుదహరించిన ప్రమాణవచనము లును గలసి మొత్తము ౮౪ పుటల గ్రంథ మైన దనుటయే శాస్త్రిగారి విమర్శన మెంతవిపులమో యెంతకూలంకషమో చెప్పఁగలదు. దీని

కింత గ్రంథవిస్తర మేల యని యీమాటవిన్నపుడు తోఁచకపోదు గాని, ఆగ్రంథము చదువుచుండఁగా నీశంకయే తోఁచదు. ఒకపౌరాణికుఁ డొకచక్కనిశ్లోక మెత్తుకొని పురాణము చెప్పునపుడును, ఒకయుపన్యాసకుఁ డొకమంచివిషయ మెత్తుకొని యుపన్యసించునపుడును ప్రసక్తానుప్రసక్తిగా పెక్కువిషయములకు దానితో సంబంధము సమకూర్చుచు వర్ణించునట్లుగా, శాస్త్రిగారిగ్రంథరచనము పాఠకరంజకముగా కొనసాగినది. ఆరీతి గ్రంథ మతివిస్తర మగుటకు హేతు వైన దనుకొనవచ్చును గాని, ఇం దేప్రసంగము చదువుచున్నను పాఠకునికి సకలశాస్త్రపురాణేతిహాసాదులలోనిరహస్యములెన్నో గోచరించు లాభముచెంతనాగ్రంథవిస్తరము గణనకు రాఁబోదు. ఇందలి ప్రసంగము లనఁబడు ప్రకరణము లన్నియు నీరీతినే నడచినవి గాని, అందును, "ఐతిహాసిక సందర్భసంగతి" యనెడి పంచమప్రసంగమందలిపురాణేతిహాస విషయచర్చ యన్నిటిని మించినది. ఈ ప్రకరణమందలి విషయము లివి యని పేర్కొనుటకంటె నిదిఖగోళభూగోళచిత్రపట మని యొకమాట చెప్పినఁ జాలును.

సునిశితము లైనపరిశోధనలు ప్రబలిన యీకాలమందు ప్రత్యక్షమైనజ్యోతిశ్శాస్త్రమందలిప్రాచీనసిద్ధాంతములే కొన్నికొన్ని పూర్వపక్షములగుచుండ నప్రత్యక్షశాస్త్రములమాట చెప్ప నేల? అందును వేదాంతశాస్త్రప్రవృత్తి మొదటినుండియు తాఱుమాఱుగనే యున్న దనుటకు మతబాహుళ్యమే ప్రమాణము. వాదబలమునుబట్టి యొక రౌనన్నది కాదనుటకును, కాదన్న దౌ ననుటకును మతవాదుల కెంతేని యవకాశమున్న దనుట విదితము. పూర్వాచార్యులలో గీతాతాత్పర్యనిర్ణయమున జ్ఞానమునకు ప్రాధాన్య మిచ్చినవారు కొందఱు, భక్తికి ప్రాధాన్య మిచ్చినవారు కొందఱు కర్మకుప్రాధ్యాన మిచ్చినవారు కొందఱు నున్నమాట సత్యమే. కొంచె మెచ్చుతక్కువగా గీతల యన్నియధ్యాయములలోను

కర్మభక్తిజ్ఞానములుమూడింటిని ప్రతిపాదించుశ్లోకములు కొంచెముగానో గొప్పగానో యున్నమాటయు సత్యమే. కాని, పూర్వులు స్థూలదృష్టితో పరిగణన కావించి మొదటిషట్కము కర్మప్రతిపాదక మనియు రెండవ షట్కము భక్తిప్రతిపాదక మనియు మూఁడవది జ్ఞానప్రతిపాదక మనియు నొకవిధ మగునిర్ణయము గావించియున్నారు. ఏతాదృశము లైనపూర్వనిర్ణయము లెన్నియో మన శాస్త్రిగారిమతమున పూర్వపక్షము లైనవి. ఆయాసందర్భములందు వీరు స్వపక్షస్థాపనకు తగినహేతువులు చూపకపోలేదు గాని, పూర్వాచార్యులయభిప్రాయములకు విరుద్ధముగా గీతలమొదటియధ్యాయము లాఱును జ్ఞానషట్కమంటేనే కొంతమే లగు నన్నవీరియాశయము విద్వల్లోక మెంతవఱకు సమ్మతించునో సహృదయులు పరిశీలింతురుగాక.

ఇట్టిశాస్త్రవిషయములు విమర్శించువా రెవ రైనను తమదే సిద్ధాంత మగు నని భావింపఁబోరు. యుక్తిశాస్త్రప్రమాణవాదము బలవత్తర మైనప్పు డెట్టిసిద్ధాంతమును నిలువఁజాలదు. శాస్త్రిగా రామాట యెఱుఁగని వారు కా రని యిందలిచర్చలే చెప్పుచున్నవి. అయినను, ఆత్మవిశ్వాసముతో "కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ" యన్నభావముతో తా మేర్పఱచుకొన్నమార్గమున కనుగుణముగా గీతాశాస్త్రవిషయవిమర్శము సాగించునెడ జంకు కొంకు లేక స్వాభిప్రాయ మావిష్కరించుచు కడుదీక్షతో నీమహాగ్రంథము నిర్మించి కృతార్థు లైరి. అట్టివీరికార్య దీక్షయు తన్మయత్వము నెంతయు ప్రశంసనీయములుగదా! "అపూర్వత పూర్ణత" అనుశీర్షికక్రింద శ్రీశాస్త్రిగారు గావించినచర్చ చదువువారి కీవిషయము విస్పష్ట మగును. అభినవగుప్తాచార్యులు తప్పఁ దక్కిన వ్యాఖ్యాత లందఱును స్వాభిప్రాయము గీతల కారోపించుచు గీతల నిజాభిప్రాయమును వెల్లడింపక పోవుటచేతనే గీతావిజ్ఞానరహస్యము మాటుపడిపోయిన దని చెప్పుచు, ఆమఱుఁగుపడినగీతావిజ్ఞానమును

బయటపెట్టుటకు శాస్త్రిగారు గావించిన ప్రతిజ్ఞ యెంతవఱకు సార్థక మైనదో తెలిసికొనుట కైనను గీతాభిమాను లీగ్రంథము తప్పక పఠింతు రని తలంతును. వేదశాస్త్ర పురాణేతిహాసాదులనుండి రత్నములవంటి ప్రమాణవచనము లెన్నో యీగ్రంథసంపుటములం దుల్లేఖింపఁబడినవి. అవి యన్నియు నీగ్రంథము చదువ నుత్సాహము పుట్టించుచు పాఠకుని తన్మయుని గావింపఁజాలియున్నవి. అట్టి బహుగ్రంథపరిశోధనఫల మైన శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారి యీ మహాకృషి సహృదయరంజకమై చరితార్థ మగుఁ గాక.

ఈగ్రంథములో విమర్శయెడ గనవచ్చుశ్రద్ధ భాషయెడ గన రా దని కొంద ఱనుకొందురేమో కాని, విషయము విస్పష్టముగా తెలియఁ జెప్పుటయే ప్రధాన మనుకొనువా రందు కంతగా శంకింప రని భావింతును.

ధవళేశ్వరము,
సర్వధారిమార్గశీర్ష
కృష్ణత్రయోదశి.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

1848 VII

ఓమ్

నమః పురుషోత్తమాయ.
గురవే మధుసూదనాయ.

# గ్రంథకర్తృ విజ్ఞప్తి.

అభిరూపశేఖరులారా!

శ్రీకృష్ణభగవానుని దివ్యానుగ్రహవిశేషము. నేను జన్మించిన యుత్తరక్షణము నుండియు, ఉబ్బసపుదేవికి వశుడ నగుటచే జిన్నతనమున నెటను జదువ నవకాశము లేక, మాపెదనాయనగారికడ నప్పుడప్పుడు కొంచెము తెలుగు-సంస్కృతము నేర్చుకొనుచు బదునైదేండ్లు కాలక్షేపము గావించితిని. అప్పటికాయన పరమపదించుటయు, జేయునది లేక, నాటికిగల స్వల్ప భాషాజ్ఞానముతో స్వయముగనే మఱి మూడు నాల్గేండ్లు కృషి జేసి ఇంక గొంచెము భాషాపరిచయము గలుగజేసికొంటిని. అప్పటికొక మహానుభావుని యనుగ్రహమున, మాయింటికడనే నాకు బ్రాణాయామోపదేశము లభించెను. అభ్యాగతునిగ వచ్చిన, ఆయన యూరుపేరులు నేనడుగలేదు, ఆయన చెప్పను లేదు. కాని యందు; ఆయన నాపాలిటి భగవంతుడు.

క్రమముగ, తదుపదిష్టాభ్యాసమున, నైదారుమాసము లగుసరికి ఆయుబ్బసపుదేవి నన్ను వదలెను. "బ్రహ్మచారి ముదిరినను-బెండకాయ ముదిరినను" అను సామెతం బురస్కరించుకొనిరో! గర్భాష్టమమునందె యుపనయనముతో బాటుగ

మాతలిదండ్రులు నాకు పెండ్లిగావించిన భార్యయు గాపురము నకు వచ్చెను. ఇక జదువుమాట చెప్పవలయునా? కాని, యేదో చదువుట మానలేదు. అందును, ప్రాణాయామాభ్యాస సంస్కారవశమున నేమో! అధ్యాత్మిక-యోగ-చింతనలు ప్రధాన స్థాన మాక్రమింపజొచ్చినవి. అందువలన, పాతంజలసూత్రాది యోగగ్రంథములను, క్రమముగ మతగ్రంథములను, అందును వివిధవ్యాఖ్యానములతోనున్న మతత్రయ భాష్యములతోడి ప్రస్థానత్రయమును జదువనయ్యెను. అదవాంతరములుగ ఖండన మండనములకు గురియైన మతముల (దర్శనముల) మూలగ్రంథ ములనుకూడ జదువ దొరకొంటిని. ఈలోపల కొంచెమింగ్లీషు హిందీభాషల జ్ఞానముగూడ యలవర్చుకొంటిని. దానిం బురస్క రించుకొని పూర్వోక్తగ్రంథములపై నాయాభాషలందు వ్రాయ బడిన విమర్శాత్మకములు, స్వతంత్రములు నగుగ్రంథములం గూడ గొన్నింటిం జదివితిని.

సరియే, ఇంతకును గురువెవరు? అని ప్రశ్న. "ప్రపం చమే-అనగా పండిత మహాశయు లందరును" అని నా వినమ్ర సమాధానము. "గురుబుద్ధిర్విశేషతః" అని కలదుకదా!

ఈ విధముగ, ఇంచుమించు ముప్పదియేండ్ల వయస్సు గడచినది (ఇపుడేబది జరుగుచున్నది). స్వతంత్రబుద్ధులు, సందేహ ములు-సమాధానములు గూడ తలయెత్త జొచ్చినవి. ఇంత టితో, చదువునందే కాదు, జీవితమునందును నూతనాధ్యాయ

మారంభమైనది. పుత్రలాభముతో బాటు వానికి ప్లీహారోగ మును, అంతవరకు నాకు మిత్రులుగనున్న పండితులకు, నా సందిగ్ధ ప్రశ్నలచే "శేషం కోపేన" అను నుడి ప్రకారము అసూయయు ప్రాప్తించినవి. కాగా :

ఇంచుక వైద్యశాస్త్ర పరిచయమును, వైద్యపరిచయ మును, గల్గించుకొని యెట్లో కుఱ్ఱవి జబ్బును నయముచేస కొంటినిగాని, పండితుల అసూయ మాత్రము, పదివత్సరములకు దక్కువలో తగ్గుదల పట్టలేదు ; ఇపుడిపుడు కొంచెము నయము. కానిండు, అప్పటినుండియు నేను వివిధములగు గ్రంథముల నవ లోకించుచునే (చదువుచునే) యుంటిని. శరీరము దుర్బలము. చేయుట కింకేమి పని యున్నది? మరి కొలది కాలములో ఏ మతమును, సంప్రదాయమును, అనుసరింపక, ప్రస్థానత్రయికి తెనుగున నొక వివరణము వేద విజ్ఞానానుకూలముగ 'అనుశ్రుతి' యనుపేర వ్రాయ వలయునని యూహ యుదయించినది. నాసికాక్షేత్ర నివాసి - సాధు శాంతినాథ్ అనుస్వామి హిందీలో రచించిన 'దార్శనిక తత్త్వవిచార' మను గ్రంథము కంటబడి నది. దానిం జదువుట తోడనే, ఊహలపై నూహలు, సందేహ ములపై సందేహములు కలుగుటయు, నేననుకొన్న గ్రంథము వ్రాయు తలంపుగూడ తీవ్రము గాజొచ్చినది.

ఇట్లుండ (హిందీ) కళ్యాణ, సంస్కృత రత్నాకర పత్రి కలద్వారా (ఇంచుమించు పదేండ్లకు వెనుకటి మాట) రాజ

పుటానా జయపురాస్థాన విద్వాంసులు - సమీూషా చక్రవర్తి - విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులగు శ్రీ శ్రీ మధుసూదన ఓఝూవారి వ్యాసరాజములను రెంటిని జదువుటయు, వారి పాండిత్య కీర్తుల పరిచయమును తటస్థించెను ; ఆపై మరి పదునైదు దినములలో వారిచే రచింపఁబడి అముద్రితములుగనున్న వందల కొలది గ్రంథములం దప్పటి కచ్చుపడిన, రెండుమూడు (ఇప్పటికైనను సుమారు పది) గ్రంథములం దెప్పించి చూచి "నా సందేహములనుదీర్ప భగవంతు డీయనను నాకగపరచెనా ?" అనుకొని వారి వాఙ్మయమిల్ల వారుండగనే (వారిప్పటికి సుమారు రెండేండ్లక్రిందట గీర్తిశాయు లైరి) పది సంవత్సర పాటు అధ్యయనము చేసితిని. వారి గ్రంథము లన్నియు వైదిక విజ్ఞాన పరిభాషాపూరిత సంక్షిప్త జటిల పద్యగద్య మయములు. అయినను అభిప్రాయ సామ్యముండుట వలననో, కాదు - వారి దివ్యానుగ్రహ విశేషమువలన నాకు సులువుగ బోధపడిన వనుకొందును. ఇప్పటున,

"మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతేగిరిం
యత్కృపా. తమహం వందే (సద్గురుం మధుసూదనమ్)"

అన్నసూక్తి నాయెడ జరితార్థమైనదని, యనుభూతికి వచ్చినది.

ఇక వాని యర్థములెల్ల సవివరణముగ దెనుంగువారి కందీయనెంచి యీగ్రంథముం గూర్చితిని. ఇందు "సశీర్షక మూలపాఠము" మొదలుగ జివరవరకు నున్నగ్రంథమంతయు,

వారిగీతావిజ్ఞానభాష్యమున కనుకరానువాదమే. తక్కినదంతయు వారి సంక్షిప్తోపదేశములకు నాచే వారి దివ్యాత్మ స్వరూపి శ్రీకృష్ణభగవానుడు చేయించిన వివరణము. పలుకుబడి తప్పులు, వానివలన గలుగు భావదోషములు నాయవిగను, సద్భావము లెల్లను, శ్రీ మాగురుపాదులవిగను, జనుకట్టుకొనవలయునని నాప్రార్థన.

ఇందు శ్రీగురూపదిష్టతాత్పర్యసిద్ధ్యుక్తియందు సంక్షిప్తములుగనుండి, నాచే వివృతములైన ఆత్మ, బ్రహ్మ-కర్మ; కర్మ-జ్ఞాన-భక్తి-బుద్ధియోగములేగాక, వర్ణాశ్రమసంస్కారములయు, శ్రీ గీతాచార్యునియు, విజ్ఞానములను, వేదవిజ్ఞాన, ఈశోపనిషద్విజ్ఞానములను గతపార్థివ కార్తికశుద్ధమున (1945 నవంబరులో) ప్రారంభించి రచించి, ఈనావాఙ్మయమంతయు 'అనుశ్రుతి' యందలి భాగములుగా నుద్భావించితిని.

మఱి "విజ్ఞానలక్ష్మీనారాయణీయ" మను పేరన్ననో, అది నాయొక దుఃఖపూర్ణేతివృత్తము. నాకు భగవంతుడు ప్రసాదించిన మూవురు పుత్రులందు కడగొట్టువాడు లక్ష్మీనారాయణ మూర్తి. వాడు తన పదమూడేండ్ల వయసునకే-రూపముచే-విద్యచే-ఎల్లరకు అత్యంత మబ్బురముగల్గించునంతటి సంస్కృతాంధ్రాదిభాషాపరిచయముగల్గి, సర్వతంత్ర స్వతంత్రతాబీజములు గల బుద్ధివికాసము గలవాడని, పెద్దల మెప్పుగొన్నవాడు, సన్నిపాతజ్వరము వాతబడి మాకడుపున జిచ్చువెట్టి, ఆపార్థివ

సంవత్సరాశ్వయుజ శుద్ధైకాదశినాడు కారణలీనుడైనాడు. ఆపిమ్మట నొక నెలకు వానికి స్మారకముగా నారంభింపబడిన యీయఖిలకృతికి వానిపేరుంగూడ జేర్చితిని. కానిండు, ఆయీ గ్రంథములన్నియు బాఠకుల యాదరణంబట్టి క్రమముగా నందీయ వలయునని నాతలంపు.

ముద్రణ విషయము.

ఈ గీతా విజ్ఞానమేమో! భగవంతుడు "ఏవం పరం పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః" అని 'రాజర్షి విద్య'గా బేర్కొనుటయే గాక దానిం దన మతముగాగూడ ననుగ్రహించి యున్నాడు. అంతకు బూర్వము ప్రచారమందున్న భక్తియోగ మును, తన మతానుసారము సంస్కరించి 'రాజవిద్య'యను పేర, తనకు బరమ సమ్మతముగ నిందు జేర్చినాడు.

ఆ యీ భగవదనుగ్రహము వలననేమో! నా యీ గ్రంథమును వివరణములతోడి యిందలి యన్ని భాగములను, మా ప్రాంతమందలి రాజపుంగవులే ప్రచురపరుప బూనుకొనిరి. ఇప్పుడు, ఇది కాక, రెండు భాగములు 1. ఆత్మ బ్రహ్మకర్మ, 2. కర్మయోగ విజ్ఞానము లచ్చుపడుచున్నవి. కొలది రోజులలో పాఠకుల కందీయ గలము. ఇందుకై యిప్పటివరకు జందాల రూపముగ ధనమిచ్చి తమకుగల శ్రీకృష్ణభక్తిని వెల్లడించు కొనిన చందాదారుల, శుభనామము లిందు ముద్రితములు చూడగలరు. ఎల్లయెడల వారికి విజయమిచ్చి పాలించుగాక యని భగవంతుని వేడుకొందును.

ఈశ్రేయోభాగులందు ముఖ్యముగ :—

నర్సాపురం తాలూకా బల్లిపాడు వాస్తవ్యులు, త్యాగమూర్తులుగ గీర్తింగనిన మహారాజశ్రీ భూపతిరాజు సూర్యనారాయణరాజుగారి కుమాళ్లు కావ్యకళాపోషక బిరుదాంచితులు, మురళీకృష్ణభక్తులు, సంగీతసాహిత్య కవిత్వానుభూతి—ప్రియత్వపూర్ణులు నగు

మహారాజశ్రీ శ్రీరామకృష్ణరాజుగారిని

భీమవరం తాలూకా గలగపఱ్ఱు వాస్తవ్యులు, అత్యంతప్రాభవమూర్తులని పేరొందిన మహారాజశ్రీ పెన్మెత్స తిరుమలరాగాజుగారి ద్వితీయ పుత్రులును, మాగ్రామ వాస్తవ్యులును నాకుటుంబ ప్రేమశ్రేయోభిలాషులు నగు మహారాజశ్రీ శ్రీ శివరామరాజుగారిని స్మరింపకుండజాలను;

ఈ యిరువురి పూనికవలననే, నాకేశ్రమయు లేకుండ, నాయీగ్రంథముల ముద్రణకార్యము నిర్విఘ్నముగ గొనసాగు మార్గ మేర్పడినది. ఇందుకు వారికి వారి కుటుంబములకు ఆచంద్రతారకముగ, ఆయురారోగ్యైశ్వర్యజ్ఞానప్రసారములను బూర్ణముగ ననుగ్రహింపగోరి శ్రీగీతాచార్యుని త్రికరణశుద్ధిగ బ్రార్థించుటకంటె నేనేమి కృతజ్ఞత చూపగలను ?

సరి :— ఈ గ్రంథమును, ఇందలి విభాగములతో గూడ క్షత్రియు లాదరించి 'తమదే'యని వీథి కెక్కించిరి. ఇట్లు వేదోపనిషద్విజ్ఞానములను బ్రాహ్మణులు 'తమదే'యనుకొని 'విద్యాహ వై బ్రాహ్మణ మా జగామ' ఇత్యాది శ్రుతి చరితార్థమగునట్లు, తమ సర్వజ్యేష్ఠత నాదన్నకముగ బ్రకటించుకొందురా ?

"వర్ణాశ్రమ సంస్కార విజ్ఞాన లేశమింకనేమైన మిగిలియున్న చో మాయందే' అని వైశ్యులనరా ? చూచెదము ;

గ్రంథ విషయమున

దోషైక దృక్కులగు, ప్రస్తుతయుగీయ యథాజాతరూప పండిత ప్రకాండులను గూర్చి 'తాన్ ప్రతినైష యత్నః' అందును.

ఇక విజ్ఞ మహాశయులను గూర్చి 'కిం వా ప్రార్థనయా ? పరోపకృతిషు, స్వాభావిక స్సద్గుణః' అను సూక్తి యుండనే యున్నది. కనుక :

"దృష్టం కిమపి లోకేస్మిన్ ననిర్దోషం ననిర్గుణం
అవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః."

అని ప్రార్థించెదను. కనుక నిక, నే వాద వివాదముల తోడను బని లేదు.

ఇందలి భాషావిషయమున :—వ్యాకరణనియమము లర్థ సౌకర్యము నర్థించి యుల్లంఘించితిని. నేను స్వయముగ దగ్గర నుండుట కవకాశము చిక్కనందున అక్షరముల తప్పులు ధ, ఢ ష్ట, ష్ఠ ఇత్యాదులెన్నో వ్యత్యాసములు పడినవి. బొత్తిగా పఠ నము కష్టపడు అక్షరపు నప్పులను కొన్నింటిని మాత్రమే సవ రించితిని. కాని, ఇంకను ఉండకపోవు. క్షమతో సవరించుకొన వేడుకొనుచున్నాను.

ఈగ్రంథమును చేతికిచ్చి 'పీఠిక వ్రాసి దయచేయవలయు' నని కోరగనే అవ్యాజవాత్సల్యమున నంగీకరించి గ్రంథమం

తయు గష్టమునకోర్చి చదివి తమ అమూల్యాభిప్రాయగర్భిత మగు పీఠిక వ్రాసి యొసంగిన 'అభినవవాగనుశాసన' బిరుదాంకితులు, సంస్కృతవాఙ్మయ చరిత్రేత్యాద్యనేకోద్గ్రంథసిర్మాతలు, ఆంధ్రవిశ్వవిద్యాలయ సంస్కృతాంధ్రాధ్యాపకులు, దిగంత విశ్రాంత పాండిత్యయశోవిభూషితులు, ప్రస్తుతము ధవళేశ్వరము నందు విశ్రాంతిగొనుచున్న బ్రహ్మశ్రీ వేదమూర్తులు మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి కనేక వందనములు వినయావినమ్రుతోత్తమాంగుడనై అర్పించుకొనుచున్నాను.

రాజమహేంద్ర వరమున గ్రంథ ముద్రణ మారంభింపవలయునన్నది మొదలుగ, నిర్వ్యాజ వాత్సల్యమున నాకు జేదోడు వాదోడుగ నుండి, స్నానపానాసనశయ్యా భోజనాది సౌకర్యములెల్లం గూర్చుచు, అటనుండు కాలమున నన్నాదరించిన, ఈశ్వర ఫార్మసీ యజమానులు, బాంధకోటిలో బరమమిత్రులు, పరమార్థ తత్పరులు, గీతాభక్తులు బ్రహ్మశ్రీ శ్రీపాద దేవీశంకర ప్రసాదరావుగారికి కృతజ్ఞతా వందనములన్నంతనే వారి ఋణము నే నెట్లీగలను ?

నేను దగ్గర లేకున్నను తమకు సాధ్యమగునంత వరకు, నిర్దుష్టముగ జేయవలయునను తలపుతో గ్రంథమును ముద్రించి యిచ్చిన శాంతచిత్తులు అవంతీ ముద్రణాలయాధికారులు బ్రహ్మశ్రీ మహీధర కృష్ణమోహన రావు గారి కెల్లపుడును కృతజ్ఞుడనై యుండెదను.

ఇంతకును ఇరువది యైదేండ్లనాడు, నా అనవరతాధ్యయనమునకు సంతసించి వేద-శాస్త్ర-పురాణాది గ్రంథ సంపాదనకై యొక్కమారుగ నైదువందల రూపాయలు నాకిచ్చి నే నీ స్థితిలోనుండ నిమ్ముగూర్చి పరమ జ్ఞానికోటిలోనివారై విశ్రాంతి యందున్న తణుకుతాలూకా పెనుమంట్ర నివాసులు, దాట్ల చిన సీతాద్రిరాజు గారిని స్మరింపకుండ జాలను.

ఇక మాగ్రామస్థులును, దేశసేవాసముపార్జితయశోవిరాజితులును, భగవద్గీతాభక్తులును, నాకు, నాకుటుంబమునకు, నాగ్రంథములకు, నాయుద్యమములకు హితచింతకులును, వేయేల 'త్వమేవాహం' కోటిలోనివారగు మహారాజశ్రీ పేరిచర్ల సుబ్బరాజుగారికి భగవంతు డిత్తోఽధికజ్ఞాన ప్రసారము గావించుగాకయని యీవిజ్ఞప్తి నింతటితో ముగించుచున్నాను.

మట్లపాలెము,
సర్వధారి.
పుష్యశుద్ధ పాడ్యమీ
శుక్రవారము.

ఇట్లు
విధేయుడు,
చల్లా కృష్ణమూర్తిశాస్త్రి.

ఈ గ్రంథము తమదిగా స్వీకరించిన

# రాజమండలి.



## పాలకోడేరు.

మ॥రా॥శ్రీ కొత్తపల్లి బాపిరాజుగారు
,, కొత్తపల్లి వెంకటపతిరాజుగారు
,, కొత్తపల్లి రామలింగరాజుగారు
,, కొత్తపల్లి వెంకటరాజుగారు
,, కొత్తపల్లి లింగరాజుగారు
,, కొత్తపల్లి సత్యనారాయణరాజుగారు
,, కొత్తపల్లి నారాయణరాజుగారు
,, కొత్తపల్లి నారాయణరాజుగారు
,, కొత్తపల్లి తిరుపతిరాజుగారు
,, కొత్తపల్లి చిట్టివెంకటరాజుగారు
,, కొత్తపల్లి తిరుపతిరాజుగారు
,, కొత్తపల్లి రామరాజుగారు
,, కొత్తపల్లి సత్యసూర్యనారాయణరాజుగారు
,, కొత్తపల్లి వెంగళరాజుగారు
,, కొత్తపల్లి వెంకట్రాజుగారు
,, రుద్రరాజు నాగతాతరాజుగారు
,, కునాథరాజు సత్యనారాయణరాజుగారు
,, కొత్తపల్లి రామరాజుగారు
,, దెందుకూరి కొండ్రాజుగారు
,, దెందుకూరి అప్పలనరసింహరాజుగారు

,, గాధిరాజు వెంకటరాజుగారు

,, గాధిరాజు వెంకటపతిరాజుగారు

,, గొట్టుముక్కల అప్పలరాజుగారు

,, మంతెన శివరామరాజుగారు

## గ ర గ ప ల్లు.

మ॥రా॥శ్రీ పెన్మెత్స జానకిరామరాజుగారు

,, పెన్మెత్స సత్యనారాయణరాజుగారు

,, పెన్మెత్స భద్రిరాజుగారు

,, పెన్మెత్స నరసింహమూర్తిరాజుగారు

,, పెన్మెత్స అప్పలరాజుగారు

,, పెన్మెత్స వెంకటరాజుగారు

,, నంబూరి నర్సరాజుగారు

,, నంబూరి వెంకటరాయపరాజుగారు

,, మంతెన వెంకటరాజుగారు

,, మంతెన అప్పలరాజుగారు

,, మంతెన వెంకటరాజుగారు

,, కలిదిండి వెంకటరాజుగారు

,, కలిదిండి బంగారయ్యగారు

,, కఠారి కొండయ్యగారు

,, భైరవరాజు రామరాజుగారు

,, పిన్నంరాజు సుబ్బరాజుగారు

,, ముదునూరి పుల్లంరాజుగారు

,, ముదునూరి వెంకటపతిరాజుగారు

,, దెందుకూరి అప్పలరాజుగారు

,, కొత్తపల్లి సత్తిరాజుగారు

## యండగండి.

మ॥రా॥శ్రీ॥ పేరిచర్ల సోమరాజుగారు
,, పేరిచర్ల సుబ్బరాజుగారు

## ఉణుదుర్రు.

మ॥రా॥శ్రీ॥ కూనపరాజు రామచంద్రరాజుగారు
,, కూనపరాజు సూర్యనారాయణరాజుగారు
,, కూనపరాజు రాజుంరాజుగారు
,, కూనపరాజు సుబ్బరాజుగారు

## పెదఅమిరం.

మ॥రా॥శ్రీ॥ ముదుండి సత్యనారాయణరాజుగారు
,, ముదుండి రామకృష్ణంరాజుగారు
,, ముదుండి అప్పలరాజుగారు
,, దెందుకూరి నరసింహరాజుగారు
,, కొత్తపల్లి పుల్లంరాజుగారు
,, కతారి వెంకటరాజుగారు
,, బోర్డుఎలిమెంటరీ పాఠశాల

## జక్కారం.

మ॥రా॥శ్రీ॥ కలిదిండి సుబ్బరాజుగారు
,, నంద్యాల వెంకటరామరాజుగారు
,, కూసంపూడి సత్యనారాయణరాజుగారు

## కోపల్లె.

మ॥రా॥శ్రీ॥ దంతులూరి రామరాజుగారు

,, దంతులూరి జగన్నాథరాజుగారు

,, దంతులూరి సుబ్బరాజుగారు

## అయభీమవరం.

మ॥రా॥శ్రీ॥ కనుమూరి సోమరాజుగారు

,, కనుమూరి నారాయణరాజుగారు

,, కనుమూరి కృష్ణంరాజుగారు

,, కనుమూరి సూర్యనారాయణరాజుగారు

,, జంపన రామరాజుగారు

,, గొట్టుముక్కుల నరసింహరాజుగారు

,, అల్లూరి రామరాజుగారు

## చెరుకుమిల్లి.

మ॥రా॥శ్రీ॥ దాట్ల మంగరాజుగారు

,, దాట్ల వెంకటపతిరాజుగారు

,, దాట్ల కృష్ణంరాజుగారు

,, దాట్ల పుల్లంరాజుగారు

,, దాట్ల వెంకటరాజుగారు

,, దాట్ల సుబ్బరాజుగారు

,, మంతెన రామచంద్రరాజుగారు

,, మంతెన సత్యనారాయణరాజుగారు

,, మంతెన పుల్లంరాజుగారు

,, దంతులూరి వెంకటరామరాజుగారు.

,, మంతెన పద్మనాభరాజుగారు

,, దాట్ల సుబ్బరాజుగారు

,, కల్దిండి నరసింహరాజుగారు

## ఏలేటిపాడు.

మ॥రా॥శ్రీ॥ మంతెన సుబ్బరాజుగారు
,, మంతెన సత్యనారాయణరాజుగారు
,, మంతెన లక్ష్మీపతిరాజుగారు
,, మంతెన సీతారామరాజుగారు
,, మంతెన సుబ్బరాజుగారు
,, మంతెన సత్యనారాయణరాజుగారు
,, మంతెన నరసింహరాజుగారు
,, మంతెన రంగరాజుగారు
,, మంతెన చిట్టిజగ్గరాజుగారు
,, మంతెన వెంకటరామరాజుగారు
,, మంతెన సత్యనారాయణరాజుగారు
,, దాట్ల చిట్టివెంకటరాజుగారు
,, దాట్ల పుల్లంరాజుగారు

## పోతుమర్రు.

మ॥రా॥శ్రీ నంబూరి సూరపరాజుగారు
,, నంబూరి తిరపతిరాజుగారు
,, నంబూరి రాయపరాజుగారు
,, చేకూరి సత్యనారాయణరాజుగారు
,, పేరిచర్ల రామచంద్రరాజుగారు
,, నంబూరి వెంకటరామరాజుగారు
,, నంబూరి సీతారామరాజుగారు
,, వేగేశన సీతారామరాజుగారు
,, నంబూరి వెంకటరామరాజుగారు
,, ఋనాథరాజు సత్యనారాయణరాజుగారు

## తా డి నా డ

మ॥రా॥శ్రీ అల్లూరి సుబ్బరాజుగారు
.. అల్లూరి సీతారామరాజుగారు
.. అల్లూరి సూర్యనారాయణరాజుగారు
.. అల్లూరి చినసుబ్బరాజుగారు
.. అల్లూరి వెంకటకృష్ణంరాజుగారు
.. వంబూరి వెంకటరాజుగారు
.. నంబూరి రామతాతరాజుగారు
.. నంబూరి విశ్వనాధరాజుగారు

## పె ద పు ల్లే రు.

మ॥రా॥శ్రీ కల్దిండి నారాయణరాజుగారు
.. కల్దిండి రంగరాజుగారు
.. కల్దిండి నారాయణరాజుగారు
.. కల్దిండి విశ్వనాధరాజుగారు
.. కల్దిండి రామచంద్రరాజుగారు
.. కల్దిండి సూర్యనారాయణరాజుగారు
.. కల్దిండి విశ్వనాధరాజుగారు
.. కల్దిండి నారాయణరాజుగారు

## కో ల మూ రు.

మ॥రా॥శ్రీ॥ పేరిచర్ల సత్యనారాయణరాజుగారు
.. పేరిచర్ల వెంకటరాజుగారు
.. పేరిచర్ల దేవన్ రాజుగారు
.. ఇందుకూరి వెంకటరామరాజుగారు
.. నంబూరి సూర్పరాజుగారు

## కలిగొట్ల.

మ॥రా॥శ్రీ॥ ముదునూరి వెంకటపతిరాజుగారు

## అర్ధవరం.

మ॥రా॥శ్రీ॥ సాగిరాజు నారాయణరాజుగారు
,, సాగిరాజు చినసోమరాజుగారు
,, సాగిరాజు పెదనారాయణరాజుగారు
,, సాగిరాజు మల్లపరాజుగారు
,, సాగిరాజు చినసోమరాజుగారు
,, సాగిరాజు సత్యనారాయణరాజుగారు
,, సాగిరాజు వెంకటసుబ్బరాజుగారు

## జల్లికాకినాడ.

మ॥రా॥శ్రీ॥ ఇందుకూరి మల్లపరాజుగారు
,, భూపతిరాజు సుబ్బరాజుగారు

## మామిడూరు.

మ॥రా॥శ్రీ॥ దాట్ల అప్పలరాజుగారు

## కొమరగిరిపట్నం.

మ॥రా॥శ్రీ॥ నడింపల్లి సుబ్బరాజుగారు

## గోడిలంక.

మ॥రా॥శ్రీ॥ రుద్రరాజు కృష్ణంరాజుగారు
,, రుద్రరాజు సుబ్బరాజుగారు
,, రుద్రరాజు నరసింహరాజుగారు
,, రుద్రరాజు రామకృష్ణంరాజుగారు
,, రుద్రరాజు సూర్యనారాయణరాజుగారు
,, నడింపల్లి సూరపరాజుగారు

## గో డి.

మ॥రా॥శ్రీ రుద్ర్రరాజు సత్యనారాయణరాజుగారు
.. రుద్ర్రరాజు వెంకటరామరాజుగారు
.. రుద్ర్రరాజు పుల్లంరాజుగారు

## పొ న్న మం డ.

మ॥రా॥శ్రీ చేకూరి సింగరాజుగారు

## చిం త ల ప ల్లి.

మ॥రా॥శ్రీ అల్లూరి పెదవెంకటసూర్యనారాయణరాజుగారు
.. అల్లూరి చినసూర్యనారాయణరాజుగారు

## బ ట్టే లం క.

మ॥రా॥శ్రీ అల్లూరి వెంకటనరసింహరాజుగారు
.. అల్లూరి వెంకటరాఘవరాజుగారు

## క త్తి మం డ.

మ॥రా॥శ్రీ అల్లూరి సూర్యనారాయణరాజుగారు
.. అల్లూరి చంద్రరాజుగారు

## అం త ర్వే ది పా లె ము.

మ॥రా॥శ్రీ అల్లూరి రామరాజుగారు
.. అల్లూరి నారాయణరాజుగారు
.. జంపన వెంకట్రాజుగారు

## స ఖి నే టి ప ల్లి.

మ॥రా॥శ్రీ అల్లూరి పద్మరాజుగారు
.. రుద్రరాజు రామలింగరాజుగారు

## స త్యా వా డ.

మ॥రా॥శ్రీ కతారి శుబ్బరాజుగారు

## మట్లపాలెము.

మ॥రా॥శ్రీ పేరిచర్ల సుబ్బరాజుగారు
.. పేరిచర్ల అప్పలనరసింహరాజుగారు
.. కనుమూరి అచ్చుతరామరాజుగారు
.. ముదునూరి సుబ్బరాజుగారు
.. రుద్రరాజు అప్పలరాజుగారు
.. కూనపరాజు సత్యనారాయణరాజుగారు
.. ఇసుకపల్లి పుల్లంరాజుగారు
.. చిలుకూరి సత్యనారాయణరాజుగారు
.. జంపన నరసింహరాజుగారు
.. బుద్ధరాజు సుబ్బరాజుగారు
.. దండు అచ్చుతరామరాజుగారు

## అలంపురము.

మ॥రా॥శ్రీ గోరింట వెంకటశివరామరాజుగారు

## వాండ్రం.

మ॥రా॥శ్రీ బుద్ధరాజు వెంకటనరసింహరాజుగారు

## మహదేవపట్నం.

మ॥రా॥శ్రీ॥ గొట్టుముక్కల సత్యనారాయణరాజుగారు
.. గొట్టుముక్కల సుబ్బరాజుగారు
.. గొట్టుముక్కల వెంకటసూర్యనారాయణరాజుగారు
.. గొట్టుముక్కల వెంకటరాజుగారు
.. గొట్టుముక్కల సూర్యనారాయణరాజుగారు
.. గొట్టుముక్కల సోమరాజుగారు
.. వేగేశన పెదవెంకట్రాజుగారు
.. వేగేశన పద్మరాజుగారు

,, వేగేశన అచ్యుతరామరాజుగారు
,, వేగేశన సూర్యనారాయణరాజుగారు
,, వేగేశన చినవెంకట్రాజుగారు
,, వేగేశన సోమరాజుగారు
,, వేగేశన సూర్యనారాయణరాజుగారు
,, వేగేశన పెదసుబ్బరాజుగారు
,, వేగేశన అప్పలరాజుగారు
,, వేగేశన నారాయణరాజుగారు
,, గాదిరాజు వెంకటసుబ్బరాజుగారు
,, గాదిరాజు సుబ్బరాజుగారు
,, గాదిరాజు వెంకట్రాజుగారు
,, గాదిరాజు నరసింహరాజుగారు
,, గాదిరాజు సూర్యనారాయణరాజుగారు
,, గాదిరాజు బాగారయ్యగారు
,, భూపతిరాజు సోమరాజుగారు
,, కల్దిండి సత్యనారాయణరాజుగారు
,, కల్దిండి సుబ్బరాజుగారు
,, పెన్మెత్స చినవెంకట్రాజుగారు
,, పెన్మెత్స లచ్చిరాజుగారు
,, చింతలపాటి వెంకటరాజుగారు

## చినమిరం.

మ॥రా॥శ్రీ గొట్టుముక్కల వెంకటనరసింహరాజుగారు
,, గొట్టుముకకుల వెంకటపతిరాజుగారు
,, గొట్టుముక్కల వెంకటరాజుగారు

## భీమవరం.

మ॥రా॥శ్రీ దంతులూరి వెంకటరామరాజుగారు
,, గాదిరాజు జగన్నాధరాజుగారు
,, పేరిచర్ల సత్యనారాయణరాజుగారు
,, కనుమూరి నరసింహరాజుగారు
,, ఉద్దరాజు సూర్యనారాయణరాజుగారు

## కుముదవల్లి.

మ॥రా॥శ్రీ భూపతిరాజు వెంకటరాజుగారు
,, భూపతిరాజు వెంకటనరసింహరాజుగారు
,, భూపతిరాజు బలరామరాజుగారు
,, భూపతిరాజు సత్యనారాయణరాజుగారు
,, భూపతిరాజు విస్సంరాజుగారు
,, భూపతిరాజు రామమూర్తిరాజుగారు
,, భూపతిరాజు సోమరాజుగారు
,, భూపతిరాజు సూర్యనారాయణరాజుగారు
,, భూపతిరాజు బాపిరాజుగారు
,, భూపతిరాజు సోమరాజుగారు
,, భూపతిరాజు సత్యనారాయణరాజుగారు
,, సాగి అప్పలరాజుగారు
,, భూపతిరాజు నారాయణరాజుగారు
,, భూపతిరాజు చినఅప్పలరాజుగారు
,, కలిదిండి అనంతరాజుగారు

## బల్లిపాడు.

మ॥రా॥శ్రీ॥ భూపతిరాజు పెదనారాయణరాజుగాజు
,, భూపతిరాజు సుబ్బరాజుగారు

,, భూపతిరాజు వెంకటరాజుగారు

,, భూపతిరాజు రామరాజుగారు

,, భూపతిరాజు పుల్లంరాజుగారు

,, భూపతిరాజు వెంకటరామరాజుగారు

,, భూపతిరాజు అప్పలరాజుగారు

,, భూపతిరాజు రామకృష్ణరాజుగారు

,, దండు నరసింహరాజుగారు

,, కలిదిండి సీతారామరాజుగారు

,, పెన్మెత్స మా(్రా)రాజుగారు

,, దాట్లచిట్టి సుబ్బరాజుగారు

,, దంతులూరి రంగరాజుగారు

## కపిటం.

మ॥రా॥శ్రీ॥ దాట్ల బంగా(్రా)రాజుగారి కుమారుడు కృష్ణంరాజుగారు

,, దాట్ల సీతాజుమరాజుగారు

,, దాట్ల నారాయణరాజుగారు

,, దాట్ల రాఘవరాజుగారు

,, దాట్ల వెంకటపతిరాజుగారు

,, దాట్ల సూర్యనారాయణరాజుగారు

,, దాట్ల సీతారామచంద్రరాజుగారు

,, నడింపల్లి నారాయణరాజుగారు

## పోడూరు.

మ॥రా॥శ్రీ రుద్రరాజు వెంకటసత్యనారాయణరాజుగారు (మునసబు)

,, ,, రామరాజుగారు

,, ,, బంగారయ్యగారు

మ॥రా॥శ్రీ రుద్రరాజు వెంకటసత్యసూర్యనారాయణరాజుగారు
,, ,, సూరపరాజుగారు
,, ,, గుణపతిరాజుగారు
,, ,, సోమరాజుగారు
,, ,, సూర్యనారాయణరాజుగారు
,, ,, పండితనరసింహరాజుగారు
,, ,, లక్ష్మణరాజుగారు
,, ,, వెంకటరాజుగారు
,, ,, వెంకటనరసింహరాజుగారు
,, ,, సూరపరాజుగారు
,, ,, నరసింహరాజుగారు
,, ,, మైనరుసీతరామరాజుగారు
,, ,, లక్ష్మణరాజు గారు
,, ,, సూర్యనారాయణరాజు గారు
,, ,, సూరయ్యగారు
,, ,, నారాయణరాజు గారు
,, దాట్ల తిరుపతిరాజు గారు
,, దాట్ల చెల్లయ్యగారు
,, కోసూరి పెదనారాయణరాజు గారు
,, కోసూరి వెంకటనరసింహరాజుగారు
,, కోసూరి సీతారామరాజు గారు
,, సాగి సూర్యనారాయణరాజుగారు

---

# ఒప్పు పట్టిక.



| పేజీ | పంక్తి | ఒప్పు | పేజీ | పంక్తి | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 11 | 1 | పశ్చిమ | 107 | 10 | కలౌ |
| 18 | 2 | అర్జును | 110 | 11 | రాత్రము |
| .. | .. | భగవదా | 116 | 1 | సూర్యునకు |
| 19 | 10 | శుద్ధ | 117 | 20 | సంపర్కమున |
| 22 | 18 | మయః | 125 | 16 | శిరోధాదాన |
| 25 | 4 | శాస్త్రములు | 140 | 19 | నతడు |
| 39 | 19 | నుండిధర్మసృష్టియు | 154 | 9 | అవ్యయ |
| 54 | 16 | కారకము | 164 | చివర | గాని |
| 56 | 6 | యొక్క | 181 | 6 | కౌశిక |
| .. | 21 | చేర్చవలెను | 189 | 6 | జ్ఞానబుద్ధి |
| 72 | 17 | యుగ్మము | 229 | 10 | తల్లిచే |
| 85 | 13 | జిహాసతి | 234 | 9 | అనుధ్యానము |
| 86 | 18 | అన్యేషాం | 241 | 21 | కుత్పాదకము |
| 90 | 20 | పరేవ్యయే | 250 | 11 | వ్యక్తికిని |
| 91 | 23 | కత్వము | 289 | 1 | ఇది |
| 93 | 14 | విశేషణము | 292 | 2 | వర్ణ |
| 99 | 13 | లౌకిక | .. | 8 పంక్తివిదప 5 పంక్తులు వదలవలెను. | |
| 100 | 22 | గ్రహదృష్టి | | | |
| 101 | 2 | కర్మణః | 307 | 21 | నరేంద్రా |
| .. | 3 | వాప్త | 316 | 1 | మనుష్య |
| 102 | 6 | యుపనిషత్త్వము | 318 | 12 | వల్లి-ఛిన్న |
| 104 | 11 | మవశ్య | | | |



# విషయసూచిక.


మన ప్రస్తుతస్థితి : ప్రాక్పశ్చిమములు-గీత ... 1

శాస్త్రశబ్దనిర్వచనము ... 21

శాస్త్రోద్దేశ్యము ... 22

సంస్కారస్వరూపము ... 26

గీతాకాలమీమాంసా ... 30

గీతానామ మీమాంసా ... 50

- ఉపక్రమము ... 50
- భగవచ్ఛబ్దరహస్యము ... 52
- గీతాశబ్దరహస్యము ... 80
- ఉపనిషచ్ఛబ్దరహస్యము ... 94
- సమష్టినామరహస్యము ... 106

గీత-అపూర్వత-పూర్ణత-వైలక్షణ్యము ... 135

వైజ్ఞానికవిషయవిభాగము ... 155

సంఖ్యారహస్యము ... 174

గీతయందలి :-

- విద్యాయోగవిభూతులు - ఆత్మవిద్య ... 195
- బుద్ధివిద్యా-బుద్ధియోగములు ... 218
- విద్యా-యోగ-పరిశిష్టవిచారణ ... 257
- రాజర్షి విద్య ... 259
- సిద్ధవిద్య ... 260

రాజవిద్య ... 263

ఆర్ష విద్య ... 264

భగవద్విద్య ... 265

సమర్థకవచనములు :-

జ్ఞానయోగము ... 268

భక్తియోగము ... 270

కర్మయోగము ... 274

ప్రస్తుత సామ్యవాదము ... 276

గీతయందలి :-

వైరాగ్యబుద్ధియోగము (భగవంతుని సొంతయోగము) 281

జ్ఞానబుద్ధియోగము (సంస్కృత జ్ఞానయోగము) 287

ఐశ్వర్యబుద్ధియోగము (సంస్కృత భక్తియోగము) 292

ధర్మబుద్ధియోగము (సంస్కృత కర్మయోగము) 297

జ్ఞానైశ్వర్య ధర్మబుద్ధియోగములందు వైరాగ్య

బుద్ధియోగ సమావేశము 300

ఐతిహాసిక సందర్భసంగతి ... 303

సశీర్షక మూలపాఠము (సోపదేశోపనిషత్కము) 339

గీతాతాత్పర్యనిరుక్తి (విధానసంగ్రహము) ... 451

శిష్టాదశతయీ ... 452

ఆత్మ-యోగము ... 453

ఆత్మ ... 453

| | | |
|---|---|---|
| వైదికబ్రహ్మవిజ్ఞాన సంగ్రహము | ... | 461 |
| ఆత్మధాతువులు-బ్రహ్మకర్మలు | ... | 464 |
| విద్యా-వీర్య విభాగములు | ... | 469 |
| సంశయము | ... | 471 |
| శోకకారణము | ... | 471 |
| భగవత్ప్రసిద్ధి | ... | 472 |
| శోకనివారణము | ... | 472 |
| కర్మసన్యాస ప్రత్యాఖ్యానము | ... | 473 |
| ధాతుసామ్యము | ... | 474 |
| జ్ఞాన-క్రియా-సామ్యవాదశిక్షా | ... | 477 |
| అనాసక్తి సామ్యవాదము | ... | 477 |
| నిష్కామసామ్యవాదము | ... | 478 |
| యజ్ఞార్థసామ్యవాదము | ... | 479 |
| ఈశ్వరార్పణ సామ్యవాదము | ... | 480 |
| జీవాత్మసామ్యవాదము | ... | 481 |
| సామ్యవాద నిష్కర్ష | ... | 483 |
| సర్వనిష్కర్ష | ... | 484 |
| గీతావిషయరహస్య సంక్షేపము | ... | 485 |
| ఆత్మదర్శన సమీక్షా సంగ్రహము | ... | 485 |
| ఆత్మసమీక్ష :- | | |
| బుద్ధియోగ జ్ఞానోపయిక జీవాత్మజ్ఞానము | ... | 504 |

| | | |
|---|---|---|
| జీవప్రజాపతి-చతుఃపర్వత్వము | ... | 504 |
| ఆత్మ-పరాత్పరుడు | ... | 505 |
| అమృతాత్మలు-మూవురు పురుషులు | ... | 506 |
| పంచబ్రహ్మలు-ఆత్మలు | ... | 508 |
| ఆత్మనిష్కర్ష | ... | 511 |
| బ్రహ్మకర్మ సమీక్షా | ... | 514 |
| యోగత్రయమూలాఖ్యానము | ... | 522 |
| కర్మయోగసమీక్షా | ... | 525 |
| జ్ఞానయోగసమీక్షా | ... | 546 |
| భక్తియోగసమీక్షా | ... | 549 |
| గీత-బుద్ధియోగరహస్యము | ... | 567 |
| వైరాగ్యబుద్ధియోగము | ... | 567 |
| జ్ఞానబుద్ధియోగము | ... | 568 |
| ఐశ్వర్యబుద్ధియోగము | ... | 569 |
| ధర్మబుద్ధియోగము | ... | 570 |
| నిష్కర్ష | ... | 574 |



నా 'ముద్దుల చిట్టి'

లక్ష్మీనారాయణమూర్తి.

౧



ఓమ్
నమ అవ్యయాత్మనే శ్రీకృష్ణాయ

# గీతా విజ్ఞాన మరీచి

శ్రీ భగవద్గీతా విజ్ఞానపరిచయము

## మన ప్రస్తుతస్థితి, ప్రాక్పశ్చిమములు, గీత.

"మొదలు పనిచేయకుండనే ఫలము లభించుచో నెంతైన మంచిది. ఒకవేళ పనిచేయవలసివచ్చినను చేసినట్లు కాకుండ జేయవలయును. ఫలమధికము గావలయును." ప్రతి విషయ మందును మన మనఃప్రవృత్తి యిట్లున్నది. ఇందుకు మూల మర్థసమస్య; దానికీమూల మావశ్యకతావృద్ధి- యిది మన ప్రస్తుత నాగరకతకు మూలము. ఇందువలన నెన్నియో యావిష్కారములు, వానిమూలమున నావశ్యకతావృద్ధి- మరల నావిష్కారములు, ఇంకను నావశ్యకతాభివృద్ధి- సురసా హనుమంతుల పోటీవలెనున్న యీ ప్రస్తుతస్థితియే నాగరకతాభివృద్ధి సూచకమని మన యభిప్రాయమైయున్నది.

ఇట్టి స్థితిలో మరియొకమూలనుండి "ప్రస్తుతము, తిండి, గుడ్డ కావలయు, అన్నవస్త్రములకు జాలినంతయుండినచో శాస్త్రములందలి, సాహిత్యము, మతము, వేదాంతము, నీతి తరువాత చూచుకొందము" అని యొకగోల వినబడుచున్నది.

"ఎంతో నాగరకతవంకకు బరుగిడుచున్న మనకు మధ్య సీనోలయేమి? ఈ నాగరకతకు దీనికి సమన్వయమెట్లు? నూతనావిష్కారప్రక్రియోపదేశమున నీయర్థసమస్యను వారించినచో అన్నవస్త్రములకు గొరతయుండదు. కనుక నాపనిగావింపవలయును, ఆయావిష్కృతపదార్థములను మన ముపయోగించుకొనవలయును, అందువలన నుభయతారకముగ నుండును" అని యొక యుపదేశము.

పైని జెప్పిన యూహలన్నిటికి మూల మీభౌతిక ప్రపంచదృష్టియే యై యున్నది. ప్రకారాంతరమున భౌతికశరీర ప్రధానదృష్టియనియు ననవచ్చును, ఇందువలన భౌతికపదార్థాభిలాష మెండగును. పదార్థమాత్రము క్షణికక్రియాసంపన్నము, క్షణికరూపమగుక్రియ, అవ్యక్త-వ్యక్త-అవ్యక్త అను మూడు భావములతోగూడినదై నాస్తిరూపమగును. కనుక ఈదృష్టి అనగా భౌతికవిజ్ఞానవాదము క్షణికవిజ్ఞానవాదమై యున్నది. నాస్తిరూపమగు నీవాదము నిరాధారము, కనుక క్షోభకు, నసంతుష్టికి మూలము. భౌతికవిశ్వము క్షణికక్రియాసంపన్నము కనుక దాని నుపాసించువారికి విశ్వముం గూర్చి "శూన్యం శూన్యం—క్షణికం క్షణికం, దుఃఖం, దుఃఖం—స్వలక్షణం స్వలక్షణం" అను లక్షణము తప్పదు. శూన్య మెప్పుడును శూన్యమే—పూర్ణ మెప్పుడును గాజాలదు. తృష్ణ మూలమందు గల భౌతికపదార్థములు పూర్ణతాలక్షణసంతుష్టి కెన్నడును కారణములు కాజాలవు సరిగదా, విశేషించి, తృప్తికాశపడి

వలయందు జిక్కుకొన్న మృగము తప్పించుకొనుటకు పడు ప్రయాసమంతయు మరింత చిక్కువడుటకే కారణమగునట్లు శాంతికొరకు భౌతికపదార్థములం దాసక్తుడగువాడు, మరింత అశాంతినే యనుభవించును. ఈసాంసారిక వైభవములు అశాంతి రూపమగు నగ్నియం దాహుతములై యుత్తరోత్తరము అశాంతివృద్ధికే కారణము లగుచుండును. ఈవచనముంజూడుడు.

"నజాతుకామఃకామానాముపభోగేనశామ్యతి,
హవిషాకృష్ణవర్త్మేవభూయఏవాభివర్ధతే"

ఈక్షణికవిజ్ఞానవాదమంతయు, నొక యాస్తికుని దృష్టి యందు తుచ్ఛముగదోచును. ఈ క్షణికవిశ్వమంతయు నొకస్థిర సత్తపై నాధారపడి యుండితీరవలయును. గతిత త్త్వమున కాధారము స్థితితత్త్వమేయగును. ఈ సత్తయేబ్రహ్మ.

ప్రత్యస్తాశేషభేదంయత్ - సత్తామాత్రమగోచరమ్.
వచసామాత్మసంవేద్యం-తద్ జ్ఞానంబ్రహ్మసంజ్ఞితమ్(పంచదశి)

"అస్తీత్యేవోపలబ్ధవ్యః" అనిశ్రుతి: ఈసత్తాబ్రహ్మపై నాస్తివిశ్వము ప్రతిష్ఠితము.

"అసన్నేవసభవతి అసద్బ్రహ్మేతివేదచేత్,
అస్తిబ్రహ్మేతిచేద్వేద సంతమేనంతతోవిదుః : (తై. ఉ)

"సచ్చ, త్యచ్చాభవత్"-"అమృతంచైవమృత్యుశ్చ, సదసచ్చాహమర్జున :"

"సర్వంఖల్విదంబ్రహ్మ" ఇత్యాది శ్రుతిస్మృతుల పర్యాలోచనచే అస్తి—నాస్తి. (ఆత్మవిశ్వ) యనురెండు నొకే

వస్తువుయొక్క స్వరూపములేమైనను నాస్తితత్త్వోపాసకుడు నాస్తికుడై క్షోభకాలవాలమగునని, ఈవరకే యెఱింగితిమి. అస్తి బ్రహ్మోపాసకుడన్ననో, సత్తను మూలమందుంచుకొని. తన యావశ్యకతల నన్వేషించుకొనుటకు ముందుకు సాగును. కనుక భౌతికవిశ్వమతని యంతర్జగత్తునందంతగాఁ దన ప్రభావము జూపజాలదు. అందువలన కేవలము శరీరయాత్రానిర్వాహము నకు దక్కువలో దక్కువ సాధనముల పేక్షింపుచు తావన్మాత్ర మునసే పూర్ణతుష్టి నొందుచు, శాంతితో జీవించును.

"యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతోవిమత్సరః"

"శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతికిల్బిషమ్" (గీతా॥)

ఇట్లు అస్తిబ్రహ్మకు భూమాతోడను, నాస్తితత్త్వమున కల్పత్వముతోడను సంబంధముకలదు. ఆస్తికదర్శనమునను సరించి: "యోవై భూమాతత్సుఖం, యదల్పంతద్దుఃఖం, నాల్పే సుఖమస్తి, భూమానమిత్యుపాస్వ" భూమ చే నిజమగుసుఖము, అల్పతయేదుఃఖము, భూమయనబహుత్వమునకుఁబేరు - దీనికి అస్తలక్షణమగు నాత్మతో సంబంధముకలదు, అల్పతయన దక్కువ. దీనికే ప్రతిష్ఠ నాస్తిలక్షణ విశ్వసంపత్తియైయున్నది కనుకనే కేవల భౌతికవిశ్వమునుండి భూమాలక్షణమగు వాస్త వికసుఖమునాశించుట దురాశామాత్రమే యగునని ఋషియాదే శించుచున్నాడు :— "నామృతత్వస్యతు, ఆశాస్తివిత్తేన," తమే వవిదిత్వాఽతిమృత్యుమేతి, నాన్యఃపంథావిద్యతేఽయనాయ.

ఇంతకు – ఈ యస్తి - నాస్తి తత్త్వనిరూపణవలన విశ్వమందలి మానవసమాజము, అస్తి - నాస్తి భేదమున రెండు తెగలుగ నుండునని తేలినది. మరియు, నీరెండు నొకేవస్తువు యొక్క (బ్రహ్మ) స్వరూపములనియు నించుక గుర్తించితిమి.

అస్తిజ్ఞానపరిచాయకము సూర్యదేవత ప్రత్యక్షముగ నున్నది. సూర్యసత్తయే అస్తిభావమునకు బ్రతిష్ఠ. సూర్యాస్తమయముతో అస్తిప్రపంచము నాస్తిభావమున బరిణతమగును. విశ్వసత్తకును సూర్యుడేప్రతిష్ఠ. మనయాత్మసత్తకును సూర్యుడే యాధారము. "సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ" అని శ్రుతి.

నిజముగ నిదియొక గొప్పచమత్కారమే. ఏమన,-మన యాత్మ అస్తిలక్షణమునకు బ్రతిష్ఠయగుచు, నాస్తిలక్షణమగు శరీరమునకు లేదా భౌతికపదార్థములకును బ్రతిష్ఠయై యున్నది. ఆసూర్యుడే, తనయొక రూపమున నాత్మగను, వేరొక రూపమున భౌతికపదార్థప్రభవమగుచు శరీరముగను నై యున్నాడు. సూర్యుని యీరెండు విరుద్ధరూపములును క్రమముగ మిత్ర + వరుణ నామములం బ్రసిద్ధములై యున్నవి. మిత్రరూపమున నతడే యాత్మయు, వరుణ రూపమున నతడే శరీరమునై యున్నాడు. ప్రకారాంతరమున నతడే ఆత్మ సృష్టిప్రవర్తకుడును, భూతసృష్టి లేదా అర్థసృష్టి జనకుడు నై యున్నాడు.

ఉత్తర-దక్షిణ ధ్రువముల నందరు నెరుంగుదురు. ఈ రెండు ధ్రువములనంటి యొకగీటు గీచినచో దానిని మధ్యా

హ్నవృత్తమనియు, యామ్యోత్తర వృత్తమనియు, ధ్రువప్రోత వృత్తమనియు నందురు. ఈ వృత్తసంఖ్య 360 కలదైనను ప్రస్తుతము మనకు గావలసినది మధ్యరాత్రికిని మధ్యాహ్నమునకును సంబంధము గలదియు, ఆఖ్యాన రహస్యభాష ననుసరించి 'యూర్వశీ అప్సరా' యను మధ్యవృత్తము. ఇదేఆ మిత్ర + వరుణ భావములను విభాగించునది. అనగా పూర్వ పశ్చిమములను విభాగించునది—మధ్యాహ్న మధ్యరాత్రముల యీవలిభాగము అనగా దేని క్షితిజముపై సూర్యోదయమగునో అది పూర్వదిక్కు. దానికి అవలిభాగము అనగా దేని క్షితిజముపై సూర్యాస్తమయమగునో అది పశ్చిమదిక్కు. పూర్వకపాలము సూర్యుని మిత్రరూపప్రతిష్ఠ. పశ్చిమకపాలము సూర్యుని వరుణరూప ప్రతిష్ఠ.

వైదిక పరిభాషానుసారము శత్రువును వరుణుడనియు, మిత్రుని మిత్రుడనియు నందురు. మిత్ర + వరుణశబ్దములే యీయర్థమును జెప్పును. ఞిమిదా (స్నేహనే పాణి, భ్వాది) ధాతువునుండి మిత్రశబ్ద ముత్పన్నమైనది. యేవ్యక్తి లేక తత్త్వము మనతో గలియునో, మనకై పునను వచ్చునో, మనకనుకూలమగునో, అది మిత్రతత్త్వము. పూర్వకపాలస్థ సౌరతత్త్వము ఈ పనులు గావించును గనుక మిత్రశబ్దమున వ్యవహరింతుము. రాత్రి పండ్రెండు గంటలు దాటినవి మొదలు పగలు 12 గం॥ వరకు సౌరతత్త్వమున కీస్థితి యుండును. ఈ తత్త్వసత్తయే

మన జ్యోతి-ప్రకాశము.అహఃకాలసూచకము. కనుకనే వైజ్ఞానికు లహోరాత్ర విభాగము ననుసరించి ఈకాలము నహఃకాలముగా నంగీకరించిరి. శాబ్దికులు దీనిని అద్యతన మందురు.(నేడు)

సంవరణార్థకవృఞ్ (వరణే-క్ర్యాది) ధాతువునుండి వరుణశబ్ద ముత్పన్నమైనది. ఏవ్యక్తి లేక తత్త్వము మనతో వియోగమొందునో, మనల నావరించునో, మనకు బ్రతికూలమో అది వరుణుడనుము. పశ్చిమకపాలస్థ సౌరతత్త్వ మట్టిదికనుక నది వరుణుడు. పగలు 12 గంటలు మొదలు రాత్రి 12 గంటలు వరకు సౌరతత్త్వమున క్షీణస్థితి యుండును. ఈతత్త్వసత్త మనకు తమస్సు-అంధకారము-రాత్రి సూచకము. కనుక నీకాలము రాత్రిగ నంగీకరించిరి. వైయాకరణులు దీనిని అనద్యతన మందురు. (రేపు)

మిత్రతత్త్వమింద్రుడు, "రూపం రూపం మఘవాబోభవీతి" అన్నట్లు ఇంద్రుడు జ్యోతి కధిష్ఠాత. వరుణుడు జలదేవత. ప్రకారాంతమున:—జ్యోతిర్మయప్రాణ మింద్రుడు, ఆప్యప్రాణము వరుణుడు. ఇంద్రుడు దేవసృష్టికి మూలాధారము, వరుణుడసుర సృష్టి ప్రవర్తకుడు. ఇరువురియందును అశ్వమాహిష్యము (సహజవైరము) కలదు. అతనిది తూర్పు, ఇతనిది పడమర. తూర్పున నుదయము, పడమట నస్తమయము.

ఇంద్రతత్త్వ మాత్మకు బ్రతిష్ఠ—వరుణతత్త్వము శరీరమునకు బ్రతిష్ఠ. శరీరమునందు నీరు దిగిపోయినచో వ్యర్థ

మగునుగదా ! అట్లే వికాసహీనమగు నాత్మయు వ్యర్థమే. లోక సృష్టి యింద్రునిది. లోకసృష్టి వరుణునిది. సప్తలోకములు నాపోమయములే.

అప్సుతం ముంచభద్రంతే లోకాహ్యప్సు ప్రతిష్ఠితాః
ఆపోమయాః సర్వరసాః సర్వమాపోమయంజగత్. (భారతము)

"అద్భ్యస్సృథివీ" అనునట్లు మనపృథివియు జలపిండమే. పంచాగ్నివిద్యయందలి "ఇతితు పంచమ్యామాహుతావాపః. పురుషవచసోభవన్తీతి" అను సిద్ధాంతప్రకారము అప్ప్రధాన శుక్లశోణితమిథున భావమువలన మనశరీరమైనది. లోకలేదా శరీరసృష్టియే అర్ధసృష్టి. సూర్యుడిట్లు ఆపోమయ వరుణరూప మున నీభౌతికసృష్టి భాగ్యవిధాతయు, ఇంద్రప్రాణరూపమున భౌతికప్రపంచమునకాత్మయు నగుచు, విశ్వరూపుడు, విశ్వాత్మ యగుచున్నాడు.

1. "విశ్వరూపం హరిణంజాతవేదసం। పరాయణం జ్యోతిరేకంతపన్తం
సహస్రరశ్మిః శతధావర్తమానః। ప్రాణఃప్రజానాముదయత్యేషసూర్యః.
(ప్రశ్న)

2. "దివోరుక్మ ఉరుచక్షాఉదేతి దూరేఅర్థః తరణిః భ్రాజమానః
నూనంజనాః సూర్యేణప్రసూతాః అయన్నర్థాని కృణ్వన్నపాంసి.
(ఋక్)

3. చిత్రందేవానాముదగాదనీకం । చక్షుర్మిత్రస్యవరుణస్యాగ్నేః
ఆప్రాద్యావాపృథివీ అంతరిక్షం । సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ.
(యజు)

అహోరాత్ర స్వరూపసంధాతయు, దేవాసురప్రవర్తకము, ఆత్మ-లోకప్రభవము, జ్యోతిః-తమోరూపము-నగు. మిత్ర+వరుణుల లేదా ఇంద్ర+వరుణుల జంట నీమంత్రములు స్పష్టపఱచును.

"అహర్వైమిత్రః (ఐ. బ్రా.) "మైత్రంవా అహః" (తై. బ్రా.)
మిత్ర-ఇంద్ర, అహస్సు.

"రాత్రిర్వైవరుణః" (ఐ. బ్రా.) "వారుణీరాత్రిః" (తై. బ్రా.)
వరుణుడు-రాత్రి.

1. అహర్వైదేవా అశ్రయంత; రాత్రీమసురా అశ్రయంత. (ఐ. బ్రా.)
2. దివాదేవానసృజత తద్దేవానాందేవత్వమ్ (షడ్వింశబ్రా.) నక్తమసురాన్ తదసురాణామసురత్వమ్.

1. అథయత్ పురస్తాద్వాసీంద్రోరాజాభూతోవాసి
2. అథయత్ పశ్చాదసి వరుణోరాజాభూతోవాసి } జై. ఉ.

1. ఆపోవరుణస్య పత్న్యఆసన్ (తై. బ్రా.) ఇమేలోకాఃసరిరమ్(శత)
2. అసౌవావజ్యోతిః, తేనసూర్యం నాతిశంసతి (కౌషీ)
3. సంజ్యోతిషా అభూమేతి-సందేవైరభూమేత్యేవైతదాహ (శత)
4. ఏషఏవేంద్రః - యఏష (సూర్యః) తపతి. (శత)

ఇంకొక చమత్కారము గమనింపవలయును. ఇంద్రుని రూపము జ్యోతిఃప్రధానము. కనుక శుక్లము. (తెలుపు) "యత్ శుక్లంతదైంద్రమ్" (శత) వరుణరూపము తమఃప్రధానము. కనుక కృష్ణము. (నలుపు) "అథయత్ కృష్ణం తదపాంరూపం" (జై. ఉ.) రెండును క్రమముగ దేవ-అసురసృష్టికి లేదా,

ఆత్మ-శరీరములకు **మూలకారణములు.** ఇక:-ఎవరి ఆత్మ యందు వరుణప్రాధాన్యముండునో వారి శరీరస్థుడగు నాత్మేంద్రు డాత్మస్థానమును విడచి శరీరమునందు బ్రతిష్ఠితుడగును. అనగా వారుణీసృష్టియొక్క రూపమునందు, అంతస్థలమున వరుణ సామ్రాజ్యమును, బహిస్థలమున నింద్రసత్తయు నుండును. కనుక వీరియాత్మ కృష్ణాపోమయువరుణుని కారణమున మలిన ముగను, (నలుపుగను) శుక్లేంద్రుని కారణమున శరీరము శుక్ల ముగ నుండును. ఇక ఇట్టి వారుణమనుష్యుల ప్రధానదృష్టి శరీరమందే యుండును. ఆత్మ యెంతమలినముగనున్నను శరీ రము శుభ్రముగను పుష్టముగను స్నిగ్ధముగ నున్నజాలును. అది నే వారిధ్యేయము.

సరిగ నింటుకు విపరీతముగ నెవరియాత్మయం దింద్రప్రా ధాన్యముకలదో వారి శరీర వరుణభాగ మంతఃప్రవేశము సేయ నవకాశము దొరుకదు. అంతస్థలమున నింద్రసామ్రాజ్యము, బహిస్థలమున వరుణ సత్తయు నుండును. వీరియాత్మ శుక్లేం ద్రునివలన నిర్మలమై యుండును. శరీరము వరుణసత్తచే కృష్ణ వర్ణముగ నుండును. ఇట్టి యైంద్రమనుష్యులదృష్టి యాత్మపై నుండును. శరీరము స్వస్థముగనున్న జాలును ఇక వేరే శరీర చింతలుండవు. ఆత్మను మలినపరచు నాహారవిహారములకు వారు వెరతురు.

పై జెప్పిన విషయములందు ఆయాదేశ విశేషపరిస్థితు లందు ఆంశికరూపమున కొన్ని యపవాదము లుండవచ్చును.

కాని సామాన్యముగ పశ్చిమదిశయందు వరుణమనుష్య ప్రాధాన్యమును, పూర్వదిశయందు ఇంద్రమనుష్య ప్రాధాన్యమునుం డును. వారు శరీరముచే గౌరవర్ణులు. ఆత్మచే మలినులు. వీరు శరీరముచే కృష్ణవర్ణులు. ఆత్మచే నిర్మలులు. వారికి భౌతిక వైభవ ముపాస్యము. వీరికి యుపాస్య మాత్మవైభవము. వారు రాత్రికి-అంధకారరూపక్షణిక విజ్ఞానమున కుపాసకులు. వీరహస్సు- జ్ఞానప్రకాశమునకుపాసకులు, వారు వరణులై వరుణులైరి. అనగా :—

జలమునకే వరుణుడని పేరు. వస్తుతః దానికి వరణమని పేరు. ఇది యాక్రమించినచోట నలువైపుల జుట్టుముట్టి యితర సత్తను సహింపక పరాభ్యుదయముం గూలద్రోసి తనసత్తనే స్థిరము గావించుకొనుట మూలముగా సంవరణము గావించును గనుక వరణమని జలమునకు పేరు. దీనిని పరోక్షభాషయగు వైదికభాషయందు వరుణశబ్దమున వ్యవహరించిరి. ఇట్లు శ్రుతి చెప్పినది.

"యచ్చవృత్వాఽతిష్ఠం స్తద్వరణోఽభవత్, తంవాఏతంవరణంసంతం వరుణమిత్యాచక్షతే పరోక్షేణ, పరోక్షప్రియా ఇవహిదేవాః ప్రత్యక్ష ద్విషః" (గో. బ్రా.)

నీరు స్పర్శయందు జల్లగ నుండును. ఎంతో నమ్రత గలది. దానితో స్నేహమొనరించిన వానిం దనలో కలిపికొని పేరులేకుండ జేయును. జలము సత్యమర్యాదారహితము ఋత ప్రధానము. దీనికి నియతమార్గము లేదు. స్వకీయస్వాభావిక

బుతభావమువలన నేదో యొకమార్గము జూచుకొనుచుండును. వారుణీప్రజాస్వభావముగూడ నిదే.

ఇంద్రతత్త్వమే మిత్రము. మిత్రతత్త్వమనుకూలము. సత్యమార్గప్రతిష్ఠితము. సౌరరశ్మిలం జూడుడు. ఎట్టినియత మార్గమున వ్యాపించునో! ఒకనూవుగింజ నడ్డముగ బెట్టినను, అవిదానిం దగిలివచ్చిన మార్గమున వెనుకకుబోవునేకాని యిటు నటుబోవు. కాని, జ్యోతిర్మయములగుటవలన స్వభావముచే నుగ్రములు. కనుకనే సత్యస్వరూపియగు సూర్యుడు తపనుడన బడును. కాని యితడు తన సత్యశక్తిచే దోషములను వెలువ రించివేయును. ఆత్మను నిర్మలముగావించును. అంతటను తన విభూతి ప్రదానముగావించును. వరుణునివలె నితడంధకారమున (మోసమున) బడద్రోయడు. మరి: వికాసమిచ్చును. ఐంద్ర ప్రజాస్వరూపముగూడ నిదేవిధముగలది.

రెండు తెగలవారలును వరుసగా బూర్వ పశ్చిమదిక్కు-లందు విభక్తులై యున్నారు. పశ్చిమదేశమంతఃకృష్ణము బహిశ్శు క్లము, భౌతికవాదము లేక జడవాదము నుపాసించును. పూర్వ దేశమిందుకు వ్యతిరేకము. వారు సామ్రాజ్యలోలుపులు. పాశ్చాత్యరాజుల మనోవృత్తిని శ్రుతియొకచో నిట్లుచెప్పెను:-

"తస్మాదేతస్యాంప్రతీచ్యాందిశి యేకేచనీచ్యానాంరాజానో యేఽపాచ్యానాంస్వారాజ్యాయైవ తేఽభిషిచ్యన్తేస్వరాడిత్యేతానభిషిక్తానాచక్షతే(ఐ.బ్రా)

మరియు :— నింకొకరహస్యము శ్రుతి స్పష్టముగానే చెప్పినది :—వరుణయాగమున నల్లని వస్త్రదానమున్నది. వరు

ణుని కొరకు కృష్ణవ్రీహి (నల్లవడ్లు) విధానమున్నది: అది వరుణ ప్రతికృతియగు మనుష్యశిరస్సునను నాహుతిగ వేయవల యును, ఎందుకన: నట్టిమనుష్యుడు పాపాత్ముడని శ్రుత్యభిప్రా యము. యజమానుడీ యాహుతిచే, తన పాపముల నా వరుణ ప్రతికృతియగు మనుష్యుని నెత్తిపై బడవేయును: ఈ మంత్రము లీపురుషునింగూర్చి ప్రమాణములు:

"పురోడాశం దశకపాలంనిరవపత్కృష్ణానాంవ్రీహీణాం"

"తద్ధివారుణం. యత్కృష్ణ. ఖలత్తే. ర్విక్లిధస్య. శుక్లస్య. పింగా క్షస్య. మూర్ధన్జుహోతి" :—

(ఖలత్తేః=బట్టతలవాడు, వేడి, విక్లిధః=ఇంచుకపరిశ్రమ వలన చెమటపట్టువాడు. తక్కినదిసుగమము.)

ఇంతవరకు నల్ల — తెల్ల యితిహాసము నిష్కర్షగ దేలి నది. మనువీరెండు తెగలను ఆర్య—అనార్య భేదమున వ్యవహ రించెను. ఇందువలన మన ప్రస్తుతస్థితిం బరిశీలించుకొన్నచో భారతవర్షము కేతుమాలా వర్షమైనదని యుపక్రమమునందు దహరించిన పంక్తులవల్లనే తోచగలదు. పరిణామమ్మున వినాశ కారకమును, ప్రస్తుత వైభవవినోదకారణమును, భౌతిక విశ్వ దృష్టి ప్రధానమునగు క్షణికజడ విజ్ఞానముననుసరింపుచు, 'ధన మూలమిదంజగత్' అను సూత్రముం జపించుచు ఆర్యఋషు లుపదేశించిన యాదర్శమించు మించుగ నష్టప్రాయము గావించు కొని - ధర్మ - కర్మ - శాస్త్ర - ద్విజ - గురు-పూజ్యాద్యవ హేళ

గావింపుచు, "సుఖమాత్యంతికంయత్తత్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియం" అను సహజమగు నాత్యంతికసుఖవిస్మృతినొంది కృత్రిమ సుఖసాధనములను సత్యములని వాని నపేక్షించి యన్వేషింపుచు ఇంద్రియములకతీతమైన సుఖముమాట మొదలులేదు సరిగదా, యింద్రియములకైన చాలినంత సుఖములేక వాంఛామాత్ర పరిగ్రహమున నదే సంపూర్ణసుఖమని యనుభవరహితమగు సిద్ధాంతరూపమున తృప్తినొందుచున్నాము. వర్ణాశ్రమాదిధర్మముల విషయమిక నడుగనే యక్కరలేదు. దేవపితృపూజాదులందలపెట్టనైనరాదు. ఇవియెల్ల ప్రత్యక్షప్రమాణమున బరిహాసపాత్రములై పోయినవి. అనుమానమేమియు లేదు. ఇక : ప్రస్తుతము :—పైనిజెప్పిన :—

మిత్రావరుణ సంబంధముననైన రెండు తెగల సృష్టి వివర్తముల విన్నవెంటనే యొక నిర్ణయమునకు వచ్చెదము : ఎట్లన :—"భారతీయాదర్శానుసారము సంసారిక వైభవములను త్యజించి వేళకుదొరికిన దేనినోతిని తృప్తినొందుచు, అహోరాత్రము లాత్మచింతనయందు మగ్నులమైయుండవలయును. ఏలయన కర్మమయవిశ్వ మశాంతి కారణము. కనుక కర్మత్యాగమే యుచితము"

ఇత్యాదికమగు నీయభిప్రాయమునకు దూరమునుండియే పదివేల వందనములు. అభ్యుగమపక్ష నసుసరించి యొకించుక తడవు కర్మత్యాగలక్షణమగు విశుద్ధాత్మవాదముపాదేయ మనుకొన్నను, కర్మ (సంచితకర్మ) వలన గర్మమయవిశ్వమందు

బుట్టి కర్మసాధకములగు కర్మేంద్రియములతోఁగూడి యుండు వాఁడు కర్మత్యాగము సేయుటనునది సర్వదా అసంభవము.

రాజ్యవైభవము, సామాజికసంఘటన నియంత్రణ, వ్యవస్థలు, మొదలగునవి లేకుండ బ్రపంచశాంతియుండదు. ఇవి యెల్ల నాత్మవాది దృష్టియం దశాంతిమూలములు. ఇట్టిస్థితిలో గర్మత్యాగలక్షణమగు నాత్మవాదము కేవలము పుస్తకమం దుండదగిన వస్తువేగాని దానికి వ్యావహారిక రూపమీయ వీలు పడదు. చివరకు మరల పాశ్చాత్యాదర్శమే శరణ్యమగును.

ఈవిప్రతిపత్తిని దూరీకృతము సేయుటకే గీతాశాస్త్ర మవతరించినది. గీతాశాస్త్రదృష్టియందు విశుద్ధాత్మవాదము లేదా. జ్ఞానవాదమవశ్యమనుపాదేయము. "నచసన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి." "నకర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" అను వచనము లీవిషయము స్పష్టముసేయును. కర్మత్యాగలక్షణ సాంఖ్యనిష్ఠకు భగవంతు డేకాంతశత్రువు.

దౌర్భాగ్యవశమున గొన్ని శతాబ్దులనుండి భారతీయ విద్వాంసులు విశుద్ధ జ్ఞానయోగ ప్రతిపాదన గావించి కల్పితమగు జగన్మిథ్యావాద * వ్యామోహమున బడవైచి మనలను కర్మసంపత్తి శూన్యులంగావించి వైచియున్నారు. ఆర్యసంతతి యీ సాంప్రదాయ దురుపదేశమువలన కర్మవైముఖ్యము నొందినది. అందరు నాత్మనిత్యతారాగమునపస్వరముల బాడ

* ఈవిషయ విమర్శ మరియొకచో జూడవలయును.

మొదలుపెట్టిరి. అందరి యంతఃకరణములందును "సంసారము మిథ్య, కర్మ విడువుము" అను విషబీజము నాటుకొన్నది. ఇందుకు బరిణామముగ నీదేశము కర్మశజాతులకు బలినివేదన గావింబడినది. భయంకరమగు నీయపచారమువలన శతాబ్దుల కొలది సర్వతంత్రస్వతంత్ర భారతము పరతంత్రతాశృంఖలా బద్ధమైపోయినది. అంతటితో వ్యాఖ్యాతలగు విద్వాంసుల లీల సమాప్తినొందినది. వారు, శాస్త్రములందును ఈ ముద్రందగిలించిరి. గీతవంటి బుద్ధి యోగశాస్త్రముంగూడ జ్ఞానయోగపు రంగునందు ముంచి లేవనెత్తుటయందు లోపము సేయలేదు. ఈచర్చతో నిపుడు పనిలేదు. ఇందువలన నీశాస్త్రమెట్లు వికృతి నొందినదను విషయము ముందు విశదపడగలదు. ప్రస్తుతము చెప్పదలచినది :-గీతాదృష్టియందు కర్మత్యాగలక్షణమగు జ్ఞాన మార్గమునకు విలువలేదనియే.

అట్లయినచో పాశ్చాత్యాదర్శప్రకారము కర్మపరిగ్రహ లక్షణముగల విజ్ఞానవాదమునే గీత ప్రతిపాదించుచున్నదా? కాదు :-గీతకు కర్మత్యాగలక్షణవిశుద్ధజ్ఞానమార్గము హేయమైనట్లే కర్మపరిగ్రహలక్షణ విశుద్ధవిజ్ఞానమును తుచ్ఛము. ఏల యన :-మూలమునందు జ్ఞానములేని విజ్ఞానము భూతభాగ సమృద్ధికి గారణమయ్యును, శాంతిలక్షణమగు నాత్మానుగ్రహములేకుండుటచే క్షణికమగుటవలన చివరకు క్రాంతిజనకమై మనకు నాశకారణ మగును. కనుక నీవాదము కల్యాణమార్గ ప్రతిబంధకమే యగును.

ఉన్నతి నొందుటకుగల స్వతంత్ర మార్గములు జ్ఞానము-కర్మయని రెండు. ఈరెంటిని గీత నిషేధించుచో మరి గీతాభిప్రాయమేమి? జ్ఞాన+కర్మల సమన్వయము. జ్ఞాన+విజ్ఞానముల యేకీకరణము. ఆత్మ+విశ్వముల సంమిశ్రణము. మూలమం దాత్మ ప్రతిష్ఠితమై యున్నప్పుడే విశ్వవిజ్ఞాన ముత్తమము. విజ్ఞానమూలమగు విశ్వవిభూతి కుచ్ఛేదము లేనప్పుడే ఆత్మజ్ఞానము శ్రేష్ఠము. ప్రత్యేక ప్రత్యేకము రెండును త్యాజ్యములగును. ఆత్మమూలకమగు పారలౌకికసుఖమును మనము వాంఛింతుము. అది మన పరమపురుషార్థమే; కాని దానితో నైహలౌకిక స్వార్థమును సర్వదా పోగొట్టుకొని చేతులు కడుగుకొని కూర్చుండము. "జ్ఞానం విజ్ఞానసహితం" "జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా" "కర్మణ్యకర్మయః పశ్యేత్ అకర్మణిచ కర్మ" ఇత్యాది ప్రమాణములు ముమ్ముందు విశదమగును.

ఉత్తమభోజనము, సుందరవేషభాషలు, ప్రజావృద్ధి, సమృద్ధవైభవము, రాజ్యసత్త, సామ్రాజ్యసుఖోపభోగములు, శిల్పము, కళ, వాణిజ్యము మొదలగునవన్నియు మనకుగావలెను. పారలౌకిక పురుషార్థమును గావలెను. ఇటు సమృద్ధి-అటు ఆనందము-మన మానందోపాసకులమైనపు డిహమునందుమాత్ర మేల దుఃఖపడవలెను? ఆనందము మనజన్మసిద్ధమగు హక్కు. సామ్రాజ్యసుఖభోగములు మనప్రిత్ర్యములు, స్వతంత్రత మన యారాధ్యమంత్రము. అయి యీ మనవిషయములందు స్వార్థప్రేరి

తులగు నరరాక్షసులు హస్తక్షేపముగావించి యుద్ధముగ నున్నచో అర్జునునకువలె మనకును భగవదాదేశము "యుద్ధాయ కృతనిశ్చయః" అని కావలసినదే. "మయిసన్న్యస్య మత్పరః" అన్నట్లు జ్ఞానోపాసన విడచి కర్తవ్యమువంకకు మరలవలసినదే. అందులకు వెనుదీయరాదు. ఏలయన :-

"పరతంత్రరాష్ట్రమునకు ధర్మములేదు. శాస్త్రములేదు. క్షణమైన సుఖములేదు. పరతంత్రున కెవిద్యేల : వానికి సభ్యత యేమి? ఆవశ్యకత కేమియుండును? నామమాత్రమునకున్నను వానివలన లాభమేమి?" అని స్వతంత్ర పరతంత్రముల యీమీమాంసనే శాస్త్రకారులు మనయెదుటబెట్టిరి. ఈమను వచనము జూడుడు :

"యద్యత్పరవశంకర్మ, తత్తద్యత్నేనవర్జయేత్
యద్యదాత్మవశంతుస్యాత్ తత్తత్సేవేతయత్నతః
సర్వంపరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖం
ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః" (4-158-159)

మనయుద్దేశ్యము సుఖమైనచో దుఃఖమేలవచ్చెను? ఆనందస్వరూపబ్రహ్మ యీవిశ్వ కర్మయందనవరతరతుడయ్యును నిత్యసుఖియైనపుడతని యంశభూతులమగు మనము విశ్వమువలన గ్లానిబద్ధనేల? దీనికి నివారకమగుట్టి - ఆయుపాయము మన మన్వేషింపదగినదే. దాని ప్రభావమువలన, విశ్వాసక్తిమూల దుఃఖమాక్రమింపరాదు. విశ్వసంపత్సంబంధి సుఖము

తొలగరాక- అట్టి యుపాయము జ్ఞానవిజ్ఞాన సమష్టిరూపమగు బుద్ధి యోగ మొక్కటే, దానిని ప్రతిపాదించునది గీతాశాస్త్ర మొక్కటే-

ప్రాచీనవ్యాఖ్యాతలు దీని 18 యధ్యాయములను ఒక్కొక్కటి కారేసిచొప్పున (1) జ్ఞానయోగము (2) భక్తియోగము (3) కర్మయోగము నని మూడుభాగములుగా నెంచిరి. ఒకరి దృష్టియందు గీత విశుద్ధజ్ఞానయోగ గ్రంథము, వేరొకరి దృష్టి యందు శుద్ధభక్తియోగశాస్త్రము, ఇంకొకరిదృష్టికి కేవల కర్మ యోగశాస్త్రము- దార్శనికదృష్టితో నెల్ల మతములును సువ్యవస్థితములే. కాని, గీతసుద్ధదర్శన (జ్ఞాన) గ్రంథముకాదు. మరే మన:—జ్ఞానయుక్తవిజ్ఞానగ్రంథము, విజ్ఞానదృష్టితో పూర్వోక్తములగు **మూడు యోగములు** నయోగములు. గీతయందీ **మూడు**యోగములందొకటియు జెప్పబడక నేటివరకు వ్యాఖ్యాతల దృష్టికి *పరోక్షముగ నుండియున్న బుద్ధియోగము నిరూపింపబడుచున్నది. కనుక గీతను బుద్ధియోగ శాస్త్రమందుము. ఈబుద్ధియోగదృష్టితో గీత నాల్గుభాగములు సేయవచ్చును. కారణమేమన (1) వైరాగ్యము (2) జ్ఞానము (3) ఐశ్వర్యము (4) ధర్మము. అని బుద్ధితత్త్వము నాల్గు భాగములగును. ఈ నాల్గింటి స్వరూపములను జెప్పు నాల్గువిద్యలు, (1) రాజర్షి విద్య (2) సిద్ధవిద్య (3) రాజవిద్య (4) ఆర్షవిద్యయనియందురు. మొదటి యారధ్యాయములును (1) వైరాగ్యబుద్ధియోగ

* అభినవగుప్తుని వ్యాఖ్య బుద్ధియోగము నించుక సూచించెను

ప్రవర్తికయగు రాజర్షివిద్య. తరువాతి రెండధ్యాయములును (7-8) (2) జ్ఞానబుద్ధియోగ ప్రవర్తికయగు సిద్ధవిద్య—ఆపై నాలుగధ్యాయములు (9, 10, 11, 12) (3) ఐశ్వర్యబుద్ధియోగ ప్రవర్తికయగు రాజవిద్య. పిమ్మట చివరవరకు గల యారధ్యాయములును (4) ధర్మబుద్ధియోగ ప్రవర్తికయగు ఆర్షవిద్య; ఈ విద్యలయందలి రహస్యములను దెలుపునుపనిషత్తు లిరువది నాల్గు. మొత్తమీయుపనిషత్తులందలి యుపదేశములు 160 నూటయరువది. ఇదియే గీతాశాస్త్రవిషయదిగ్దర్శనము :—

మరియు, గీత మనలను సుఖవంతుల జేయగోరుచున్నది. సుఖప్రతిబంధకములు — క్లేశప్రవర్తకములు, లెక్కచూడగా నాలుగు కలవు. (1) ఆసక్తి (2) మోహము (3) అస్మిత (4) అభినివేశము,- అని ప్రసిద్ధములు : ఇందు, ఆసక్తిభావము రాగాసక్తి, ద్వేషాసక్తియని రెండువిధములు. రెంటిని వేరుగ జూచినచో క్లేశములైదు. "అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః పంచక్లేశాః" అను యోగదృష్టిచే స్పష్టము. కాని, విజ్ఞానదృష్టితో రాగ-ద్వేషములు రెండు నొకటే-అనుకూలబంధనమురాగము—ప్రతికూలబంధనము ద్వేషము. బంధనత రెంటను సమానము. బంధనతయే ఆసక్తి. కనుక గీత రెండిటిని నాసక్తి శబ్దమున గ్రహించెను.

(1) ఆసక్తిక్లేశమునకు జికిత్స వైరాగ్యబుద్ధియోగము, (4) అభినివేశక్లేశచికిత్స ధర్మబుద్ధియోగము, (2) మోహక్లేశ

చికిత్స జ్ఞానబుద్ధియోగము, (6) అస్మితాక్లేశ చికిత్స ఐశ్వర్య బుద్ధియోగము. ఇందేది యనుష్ఠించినను మిగిలిన నాల్గుక్లేశము లును తొలగును. ఇదే గీతారహస్యార్థము.

## శాస్త్ర శబ్ద నిర్వచనము

శ్రీ భగవద్గీతోపనిషత్తు శాస్త్రము: శాస్త్రశబ్దార్థ మెరుగక నేటికొందరీ శబ్దమును, సంస్కృతవాఙ్మయ భాగాతీయ గ్రంథ వాచకమని స్థిరపరచుకొనిరి. ఆయావిషయములను జక్కగా పరీక్షించిన మహానుభావులు తమ చిరకాలానుభవము లను పరీక్షసేయుట కసమర్థులగు సామాన్యుల హితము గోరి శబ్దములద్వారా నేమార్గమును మనయెదుట నుంచిరో అట్టి- విధినిషేధాత్మకమును, పూర్ణముగా బరీక్షింపబడినదియు, సర్వ మాన్యమునగు శబ్దరాశి రూపపథమే మనకు శాస్త్రమగును: శాస్=శిక్షణ (నేర్పుట) ఆజ్ఞ, ఆదేశము: త్ర=రక్షణ. పాలన విధి, మార్గము, పద్ధతి, యుపాయము. ఆదేశపద్ధతి ప్రతిపాదక శబ్దసంగ్రహమే శాస్త్రమ్=శాస్త్రము. ఇది యేభాషయందైన నుండవచ్చును.

పై శాస్త్రార్థమునందు గీత యెంతవరకు సాఫల్యము నొందెనో చూతము. గర్భమునం బడినది మొదలు మృత్యుపర్యం తము సుఖాభిలాషయున్నను, జీవికి కోరికొనకున్నను దుఃఖమే కలుగుచున్నది. గాని సుఖమనునది లేదు - ఉన్నదనియు, దానిని

స్వప్రయోజకతవలన సంపాదించితిననియు ననుకొన్న సుఖమైన నించుక పరిశీలించినచో పరమార్థమున దుఃఖముగనే తేలుచుండును. కనుకనే దుఃఖమును ప్రతికూలవేదనయన్న ఋషులు క్షణికసుఖము ననుకూలవేదనయనిరి. ఇట్టి యుభయవిధ దుఃఖములకు కారణమేమి? కోరికొన్నను సుఖమురాదేల? శాశ్వతసుఖోపాయమేమి? అందుకు ప్రతిబంధకములేవి? ఏకర్మచేయవలయును - చేయరానికర్మ మేది? అను నిట్టి ప్రశ్నలకు ప్రత్యుత్తరము నిచ్చునదే శాస్త్రము. కర్మ - అకర్మ - విచారణగావించి శాశ్వత సుఖప్రాప్తికుపాయము జూపుచు, బ్రహ్మమూలకమగు దర్శనముయొక్కయు, కర్మమూలకమగు విజ్ఞానముయొక్కయు సంపూర్ణ నిరూపణము సేయునట్టి విధినిషేధాత్మక శాస్త్రమగు నీ భగవద్గీత సర్వోత్కృష్టశాస్త్రమునజెల్లును.

## శాస్త్రముయొక్క సామాన్యోద్దేశము

"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" "అంశో నానావ్యపదేశాత్" ఇత్యాది వచనములచే నీశ్వర ప్రజాపతి యంశభూతుడగు జీవప్రజాపతియం దీశ్వరకళలన్నియుగలవు. "సవాఏష ఆత్మావాఙ్మయః ప్రాణమయో మనోమయః" (బృహ) యన్నట్లు ఆత్మయందలి మనఃప్రాణ వాక్కులు మూడు నధ్యాత్మసంస్థయందు (i) కారణశరీరము

(మనస్సు) (ii) సూక్ష్మశరీరము (ప్రాణము) (iii) స్థూలశరీరము (వాక్కు) రూపమున వికాసమొందెను.

ప్రజ్ఞామాత్రాత్మయు, మనోమయ, ప్రపంచకారణశరీర మాత్మకు మొదటి వేష్టనము. దానికిపైని, దేవమాత్రాత్మయు ప్రాణప్రపంచమగు సూక్ష్మశరీరము రెండవవేష్టనము. అన్నిటిపైని-భూతమాత్రాత్మయు వాక్ప్రపంచస్థూలశరీరము మూడవ వేష్టనము. ఆత్మకు సోపాధిక, నిరుపాధిక, భేదమున రెండు వివర్తములు. విశుద్ధము, నిష్కలము, ఏకలము నగు నాత్మ నిరుపాధికము. దానివిషయమునందు శాస్త్రము కుంఠితమగును. ఏమన:-అది సర్వదా నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, అనంత కల్యాణగుణాకరము కనుక శబ్దాతీతమగు దాని గూర్చి శబ్దాత్మకశాస్త్రమేమియు నుపకారాపకారములం దలపెట్టజాలదు. ఇట్టి ఈ యాత్మచే మాయా, కల, గుణ, వికార, అంజన, ఆవరణ అను నుపాధులచే సోపాధికమగుచు, మనఃప్రాణ వాగ్రూపములగు, పూర్వోక్తత్రిసంస్థలందు బరిణమించును. ఈమూడు సంస్థలును క్రమముగ [1] ఆత్మ-[2] ప్రాణ-[3] పశు—అను పేరులతో వ్యవహరింపబడినవి. ఇందు (1) ఆత్మ, మనోమయమై జ్ఞానప్రధానమగును. కారణశరీరమిదియే (2) ప్రాణము, ప్రాణప్రధానమగుచు క్రియాప్రధానమై సూక్ష్మశరీరమగును. (3) పశువు, వాఙ్మయమై యర్థప్రధానమగును. ఇదే స్థూల శరీరము. "ఆత్మోపకః సన్నేతత్త్రయమ్" (శత) అన్నట్లు

ఈమూటి సమష్టినాత్మయందుము. కనుకనే "ఆత్మానైతనూః" "ఆత్మనోవా ఇమానిసర్వాణ్యంగాని ప్రభవన్తి" "ప్రాణోవై బ్రహ్మ" "ఆత్మావైపశుః" ఇత్యాది నిగమవచనములు సార్థకములగుచున్నవి. మొదటియాత్మ నిరుపాధికము నిర్విశేషము. అదే త్రికలము, సోపాధికమునై సవిశేషమనబడును. ఇదే అనగా ఆత్మ-ప్రాణ-పశు-సమష్టియే ప్రజాపతియందురు.

ఇట్లు-అమాయీ, నిష్కల-నిర్గుణ-అవికారీ-నిరంజన-నిర్విశేష-అపాప్మా, తత్త్వము. పూర్వోక్తపరిగ్రయుక్తిచే సవిశేషమై ప్రజాపతియనుపేరున :-మాయీ. సకల, సగుణ, సవికార, సాంజన, పాప్మయుక్తమగుచున్నది. పరిగ్రహదశయందు ఆత్మయొక్క వాస్తవికజ్ఞానజ్యోతి తిరోభావమొందును. మలినసత్వయుక్తమగు నాత్మయొక్క యీమలిన ప్రకాశమువలన క్షేత్రజ్ఞాత్మ (విజ్ఞానాత్మా-బుద్ధి)యు, ఇంద్రియసంచాలకమగు ప్రజ్ఞానాత్మయు (సర్వేంద్రియమనస్సు) మలినములగును. ఫలతః-కర్తవ్యాకర్తవ్య వివేకముపోగా; కింకర్తవ్యవిమూఢుడై సుఖలాలసాడోలాయమానాంతఃకరణమున నుత్పథగామియై మరింత పంకమగ్నుడగును. ఈయాపన్నివారణకు మాయాదిపరిగ్రహదోషములం దొలగించుటవసరము. దోషమును దుడిచివేయు ప్రక్రియకు శాస్త్రములందు సంస్కార మనిపేరు. భారతవర్షమునందలి యన్నిశాస్త్రములకును ముఖ్యోద్దేశ్య మాత్మసంస్కారము. ఈ విషయమున నితరశాస్త్రములన్నిటికంటె గీతాశాస్త్రమే సాఫల్యము నొందినది.

ప్రాచీనశాస్త్రమర్యాదననుసరించి ఆత్మయొక్క స్థూలకళారూప స్థూలశరీర సంస్కారార్థ మథర్వవేదోపవేదమగు నాయుర్వేదము ప్రవర్తిల్లినది. ప్రాణకళారూపసూక్ష్మశరీర సంస్కారార్థము, మన్వాదిధర్మశాస్త్రలు ప్రవర్తిల్లినవి—మనోమయకారణ శరీరరూపాత్మ సంస్కారార్థ ముపనిషచ్ఛాస్త్రమును, తద్వ్యాఖ్యాభూతమగు శారీరకదర్శనమును ప్రవృత్తములయ్యెను. ఈమూడు శాస్త్రములును మూడుశరీరములను ప్రధానములుగా గొన్నవైనను, తక్కిన రెండు శరీరములను గూడ ధ్యానమందుంచుకొనియే యుండును. కేవలము ప్రధానతలందే భేదము- ఇందువలననే: కారణశరీరసంస్కారకమగు వేదాంతశాస్త్రము (సూక్ష్మశరీర) భావనాపవిత్రతయు, స్థూలశరీరశుద్ధియు నవసరమనును. (2) ధార్మికసంస్కారములుగూడ, (1) ఆత్మసంస్కారములు, (2) దైవసంస్కారములు, (3) భూతసంస్కారములునని మూడు విధములు. (3) ఆయుర్వేదమునకు నిర్దేసితి. ఈమూటిని సమష్టిగ ప్రజాపతిసంస్కారశాస్త్రమని యొకపేరున జెప్పవచ్చును. కాని, యీపేరు గీతాశాస్త్రమునకే తగును. ఏలయన, వానికొక్కటి ప్రధానము తక్కినవి రెండు నప్రధానములుగ నుండుచుండును. గీతయన్ననో, ఆత్మ-ప్రాణ-పశువులను మూటికి సంస్కారకమగుచు నధికమహత్వముకలదై యున్నది: చూడుడు: గీతయందు (1) స్థూలశరీరసంస్కారకములగు నాహారవిహారాదుల సంపూర్ణవిధానము లభించును.

(2) ప్రాణమయసూక్ష్మశరీర సంస్కారకములగు భావశుద్ధి, సత్వశుద్ధి, ఆస్తిక్యము మొదలగువాని విస్తరము లభించును. (3) మనోమయకారణశరీరాత్మకుపయోగించు బుద్ధియోగాది సంస్కారప్రాచుర్యము లభించును. ఆత్మప్రాణపశుసమష్టిరూప (కారణసూక్ష్మస్థూలశరీరరూప) సవిశేషాత్మ సంస్కారకరణమే శాస్త్రోద్దేశ్యము. ఆయీ తనయుద్దేశ్యమందు గీత సాఫల్య మొందినది గనుక నిది యితరశాస్త్రములకంటె నుత్కృష్టము అపూర్వము నై యున్నది.

## సంస్కారస్వరూపనిర్వచనము

దోషయుక్త పదార్థమును శుద్ధిగావించు ప్రక్రియా విశేషము. సంస్కారము, సంస్కారరహిత వస్తువునం దన్యధర్మప్రవేశము వలన నది విషమరూపమ్ము నొంది యందలి పరమాణువు లన్నియు ఛిన్న భిన్నములు కాగా నానాభావరూప వ్యుత్థ్యాదయమువలన నేకత్వము నశించుటచే ప్రాతిస్విక రూపముం గోల్పోవును. సరిగా పైగుణములకు వ్యతిరేకముగా బనిచేయునదియు వస్తుస్వరూపస్థాపకము నగునది సంస్కారము. సమ్ + కార=సుడాగమమురాగా సంస్కారశబ్ద మేర్పడును. "సమ్ ఇత్యేకీభావే" యను నిరుక్తసిద్ధాంతాను సారము సమ్=ఏకత్వము ఇదే సమత్వము. దీనిని గలుగజేసి వస్తువున కమృతసిద్ధి కలుగజేయునదే సంస్కారము. అవనతి మూలమగు విషమత్వముం ద్రోచివైచి, అభ్యుదయ నిశ్శ్రేయ

సమూలమగు సమత్వయోగమున వస్త్వైకత్వరూపామృతభావ మును స్థిరీకరించునది సంస్కారమని ఫలితార్థము. ఇవి (1) దోష మార్జనము, (2) గుణాధానము, (3) హీనాంగపూర్తియని మూడు విధములు. ఈమూటివలనను పదార్థములందు పూర్వో క్తాతిశయ ముత్పన్నమగును.

(1) దోషమార్జనము :—దోషమననేమి ? యన్నచో నియతపరిభాష రచించుటకష్టమే. ఒకరిదృష్టికి దోషమే మరి యొకరిదృష్టికి గుణమగును. శాస్త్రములందుగూడ దేశ, కాల, పాత్ర, ద్రవ్య,శ్రద్ధా తారతమ్యమున గుణదోష సాంకర్య మగ పడుచున్నది. ఉదాహ :—సత్యభాషణము గుణమే, "వర్ణినాం హివధోయత్ర తత్రసాక్ష్యనృతంవదేత్" అని యపవాదము. "మాహింస్యాత్సర్వభూతాని"అన్నట్లు అహింసగుణమే, "తస్మా ద్యజ్ఞేవధోఽవధః" అను నపవాదమును గుణమగుచున్నది. కనుక గుణదోషములకు వ్యాపకలక్షణము గుదుర్చుటొక విధ ముగ నసంభవమే. కాని యొకవిధముగా సామాన్యలక్షణ మొకటి చెప్పవచ్చును. "ఏకారణములవలన దన యంతరాత్మ యందుగాని, తనపనులచే నితరుల యంతరాత్మయందుగాని - దుఃఖాద్యశాంతి భావోదయమగునో, యవియెల్ల దోషములన వచ్చును. మనకు సుఖమును ఇతరులకు గష్టము గూర్చుస్వార్థ మూలకకర్మలెల్లను వైయక్తికకారణములై అఘరూపదోష ములనబడునని "భుంజతే తేత్వఘంపాపాయేపచంత్యాత్మకార

ణాత్" ఇత్యాదివచనములచే స్పష్టము. ఏలయన :-మనుష్యుడు సమాజప్రాణి, సమాజమునందుండియే బ్రదుకుదెరువుం గాంచును. కనుక తనసుఖముతో సమాజశాంతి సుఖములకును బాధ్యుడగును. వైయక్తికస్వార్థభావనయే సమాజక్షోభ కొకప్పటికి గారణమగుచుండును. వ్యక్తులే సమాజము, రాష్ట్రమును గదా! వ్యక్తుల స్వార్థచింతయే చివరకు రాష్ట్రక్షోభగ బరిణమించి యాక్షోభ లోకక్షోభకే కారణముగూడ గావచ్చును. అందువలన మనకు నితరులకును దుఃఖప్రాప్తియగును. కనుక నివి యెల్ల దోషములందుము. గుణదోషముల కీలక్షణము శాస్త్రసమ్మతమే: ఈవచనము లీలక్షణమును సమర్థించును.

"యస్మాన్నోద్విజతేలోకః లోకాన్నోద్విజతేచయః"
"పరస్పరంభావయంతః శ్రేయఃపరమవాప్స్యథ" గీతా॥

ఇట్టిదోష మేకారణమువలన వచ్చునో ఆకారణములను భవిష్యత్తు కొరకాటంకపరచుటయు, పూర్వము సంచిత సంస్కారరూపమున నున్నవానిని సమూలనాశము గావించుటయును మొదటిదియు ముఖ్యమునగు దోషమార్జన సంస్కారము.

(2) <u>గుణాధానము</u> :—గుణము వస్తువునకు స్వీయలక్షణము. దోషమన్యధర్మము. అది తొలగుటతోడనే ఆత్మసహజ గుణము ప్రకాశించును. ఏ కారణమువలన నాగుణము బలపడుచుండునో యా కారణమువలన నాగుణములకు బలము గూర్చుచుండుటయే గుణాధానసంస్కారమగును. తనకును పరులకును

సుఖము సంపాదించుటకు దగిన కారణములను స్థాపించుటయే గుణాధానసంస్కారమని ఫలితార్థము.

(3) హీనాంగపూర్తి:—పై రెండుగుణములు వస్తువు నందుండవచ్చును. కాని అంగవైకల్యము కలిగినచో వస్తువ పూర్ణమగు. పూర్ణబలము లేనందువలన కేంద్రభావము చ్ఛేద మొందును. సర్వాంగపూర్తియున్నచో కేంద్రభావము సరిగ నుండి పూర్ణబలమున వస్తువు మహద్భావ మొందును. అట్టి వారే మహాశయులు, మహాత్ములు, సర్వధర్మోపపన్నులగు సవిశేషప్రజాపతికి బహిరంగములు నంతరంగములు ననేకము. అన్నియు బాగుండుటయే పూర్ణత: స్థితప్రజ్ఞత: అట్టి లక్షణములు కూర్చుట హీనాంగపూర్తి. ఈ మూడుసంస్కారముల నొందిన యాత్మపురుషార్థ సాధనకు సమర్థమగును. ఈ మూటి నేకముగగొని యాత్మసంస్కారము మూడు భాగములు కలది యనుకొన్నను బాధలేదు:

ఇందు ముఖ్యము దోషమార్జనము. అదిలేనిచో తక్కిన రెండు నంటవు. దోషమంతఃప్రవేశము గావించును. అందువలన వస్తుసత్త్వప్రకాశము తిమిరమగును: అంతః—అయతి (గచ్ఛతి) కనుక నంతరాయము. ఇట్లు "అంతరాయతిమిరోపశాంతయే" అన్నట్లు అది తిమిరము. దీనిరాకుండ జేసికొనుటయు, వచ్చి యున్నది పోగొట్టుకొనుటయు ముఖ్యము. శుద్ధ వస్త్రమునకు గాని రంగు అంటదుకదా! ఈ సంస్కారోద్దేశ్యమున గీత యన్ని విధములను సాఫల్యమొందినది. శ్రౌతస్మార్తభేదసంస్కారము

లను కర్మయోగప్రసంగమున జూచుకొందము. సంస్కార హీనుడు కొయ్యబొమ్మవంటివాడై ధర్మహీనుడగును. శాస్త్ర లక్ష్య మాత్మసంస్కారకరణమే. అందగ్రగణ్యము గీత :

## గీతాకాలమీమాంస

గీత వ్యాసలేఖినినుండి యవతరించినది మహాభారతకాలమే. దీనికాలము అనునీమొదలగు పిష్టపేషణ వ్యవహారము గావింపదలపులేదు. వాస్తవిక గీతావిర్భావ ప్రథమకాలద్యోతక మగు నీక్రిందిశ్లోక మార్గప్రణాళిక ననుసరించి ఏ యుగధర్మము లకు జెందినదో దానిని విమర్శించుకొందము.

"ఇమంవివస్వతేయోగంప్రోక్తవానహమవ్యయం,
వివస్వాన్మనవేప్రాహ. మనురిక్ష్వాకవేఽబ్రవీత్"

మహాభారతకాల మెరింగినట్లందరును వైవస్వతయుగ మెరింగియుండరు. అది దేవయుగసంబంధము కలది. దేవయుగము? వేదసంబంధము కలది. వేదమునకు వైదికేతిహాస సంబంధము కలదు. ఇక వేదమునందితిహాసము లేదనుకొను భారతీయులు విద్వాంసులుగూడ పూర్వోక్తకాల నిర్ణయమునందు మూకీభావము వహించవలసియున్నది. కనుక కొంచెము విమర్శ యవసరమే.

ఈ భూమిపై మానవోత్పత్తి యెప్పుడైనది? అంతకు పూర్వమేప్రాణివర్గముండెను? ఇత్యాదులు మరొకచోట జూచు

కొందము. ప్రస్తుతము మానవసభ్యతాక్రమికవికాసముం గూర్చి యే చూతము. వేదపురాణాదులందీవిషయ సంబంధముగల యుగముల నారుభాగములు సేయవచ్చును. అవి యిట్లాయాస్థల ములందు వ్యవహరింపబడెను. (1) తమోయుగము (2) ప్రాణి యుగము, (3) ఆదియుగము (4) మణిజాయుగము (5) స్పర్ధా యుగము, (6) దేవయుగము. వీనిని క్రమముగా తెలిసికొందము.

(1) తమోయుగము :—ఈ యుగవిశేషము లేమియు దెలియరావు. ఈ యుగమున పశుపక్షిమనుష్యాదులుండిరా? లేరా? ఉన్నచో వారిస్థితి యెట్టిది? ఇత్యాది ప్రశ్న లజ్ఞాన గర్భలీనములగుటచే దీనిని అసద్యుగమనియునందురు. ఈశ్రౌత స్మార్తవచనములం గమనింపవలయును.

1. తమఆసీత్తమసాగూఢమగ్రే (ఋక్)
2. అసదేవేదమగ్రఆసీత్ (తై. బ్రా.)
3. ఇదంవాఅగ్రేనైవకించనాసీత్ (తై. బ్రా.)
4. దేవానాంపూర్వ్యేయుగేఽసతః సదజాయత (ఋక్)
5. ఆసీదిదంతమోభూత మప్రజ్ఞాతమలక్షణం
   అప్రతర్క్యమనిర్దేశ్యం, ప్రసుప్తమివసర్వతః (మను)
6. అసాంప్రతమవిజ్ఞేయం, బ్రహ్మాగ్రేసమవర్తత
   తస్యాత్మనాసర్వమిదం, వ్యాప్తమాసీత్తమోమయం (వాయు)
7. మహాప్రళయకాలాంత ఏతదాసీత్తమోమయం
   ప్రసుప్తమివచాతర్క్యం, అప్రజ్ఞాతమలక్షణం
   అవిజ్ఞేయమవిజ్ఞాతం, జగత్స్థాస్నుచరిష్ణుచ. (మత్స్య)

నిజముగ నొకప్పుడు పృథివి-అంతరిక్ష-ద్యులోకముల త్రిలోకి లేక స్థావరజంగమాత్మకమగు నేసృష్టియు లేక ఉన్న దేమో తెలియని తమోమయముగా నుండియుండును. "ఇదంవా అగ్రేనై వకించనాసీత్, నద్యౌరాసీత్, నపృథివీ, నాంతరిక్షమ్. (తై. బ్రా.) ఇత్యాదులిందుకు పుష్టికారకములు. ఇదెంతకాల ముండెనో! వికాసవాదక్రమిక సిద్ధాంతానుసారము, లక్షల కొలది వత్సరము లిట్లుండియుండు నేమో! ఏమయినను ఈయుగ మునుగూర్చి యింతకంటె ప్రసంగించవలసినది లేదు.

(2) ప్రాణియుగము:—పిమ్మట జీవసర్గవికాసము కల్గినది. ఒకానొక యచింత్యశక్తియొక్క మానసప్రేరణమున దాంపత్యభావమువలన జడ-చేతనరూపములగు, ధాతు-మూల-జీవ-నామక త్రివిధజీవసర్గవికాసముదయించెను. పశువులే యీనాటి సభ్యప్రాణులు. ఏలయన ఆనాటిమనుష్యులకు పశువులే గురువులు. ఈదృష్టితో నిది పశుయుగ మనదగును. అన్వేషణ యిటనుండియే ప్రారంభము. కనుక మనమనుమానింపగలము. పశువులు, నగ్నములై పోరాడుచు బలహీనములను జంపి తినుచు వర్షాతపాదులకు చెట్లక్రిందనో గుహలయందో కాలము బుచ్చుచుండునట్లే యీనాటి మనుష్యులుగూడ వర్తించియుందురు. సంకేతభాషయేగాని వైఖరీవికాసముకూడ నుండియుండదు. ఆఫ్రికారణ్యములందు నేటికి నిట్టిపశుప్రాయు లున్నట్లు విందుము. మనుష్యుని యీయవస్థ చాలకాలముం

డును. మానవసభ్యతావికాసము క్రమముగ నెన్నాళ్లకోగాని కలుగదు.

(3) ఆదియుగము :-ప్రకృతిదేవి యనుగ్రహమున క్రమముగ మనుష్యబుద్ధి వికసించెను. దానితో సంస్కరణమారంభమయ్యెను- నగ్నతయందు లజ్జానుభవము కల్గెను. పశుగుప్తేంద్రియములు పుచ్ఛవేష్టనమున ప్రకృతివలననే కప్పబడెను. మనమూ వల్కలాదులచే మూసికొనవలెనను బుద్ధిపుట్టెను. పశువులనుండి యిది నేర్చి, వర్షాతపములనుండి తప్పించుకొనుటకు, పిట్టలవలన గడ్డి గాదరతో గృహనిర్మాణము గావించుకొనుట గుర్తించిరి. పశుపక్ష్యాదుల పారస్పరిక సంఘటనముజూచి తాము సంఘీభావమునొంద నలవర్చుకొనిరి. చెకుముకిరాయి వలన నగ్ని నావిష్కరించుకొనిరి. పచ్చిమాంసమునకు బదులు కాల్చిన కరకుట్లు దిననారంభించిరి. ఎముకలు మొదలగువానిని భూషణములుగ రచించుకొనిరి. పశుచర్మవేష్టిత వాద్యవిశేషమున సామూహికవినోదక్రీడల కలవడిరి. పశుపాలన మారంభమయ్యెను. చిన్నచిన్న మండలు లేర్పడినవి. ఒక్కొక మండలి కొకపెద్ద యుండెను. అశ్వములు, కంచరగాడిదలు స్వారి కుప యోగపడెను. పాషాణలోహాదిఖండములచే క్రూరమృగములను శత్రువులను జంపనేర్చిరి. యిట్లు మనుష్యసభ్యతకు విఘ్నేశ్వర పూజయగు నీయుగ మాదియుగమని వ్యవహారము. వేలకొలది సంవత్సరము లిట్లు గడచెను. నేటికి నరవ్యాదులం దీయుగ చిహ్నములు గోచరించును.

(4) మణిజాయుగము. ఈ యుగమునందు మానవసభ్యత యొకవిధముగా పూర్ణవికాసమొందెను. గ్రామనిర్మాణము, కృషికర్మ, దూది-పట్టుబట్టలు నేయుట, పంచాయతీ వ్యవస్థ, ప్రజాసత్తాక రాజ్యతంత్రసృష్టి, వాపీ, కూప, తటాకాది నిర్మాణము, ఉద్యానోపవనాదిస్థాపనము, గాంధర్వ వివాహ పద్ధతి, జ్ఞాన-క్రియా-అర్థ-శిల్పముల యాధారమున మానవ సమాజము నాల్గు భాగములుగ విభజించుట, యింకను వివిధ వైజ్ఞానికావిష్కారములు మొదలగునవి యీ యుగమందలి ముఖ్యవిశేషములు. కనుక నిది పూర్ణసభ్యతాయుగమందుము. నేడు విజ్ఞానమనుకొనుదానికంటె నధికవిజ్ఞానము మణిజాయుగమున నుండెడిది.

మానవసమాజమున నానాటి నాల్గుభాగములవారును, [1] సాధ్యులు, [2] మహారాజికులు, [3] ఆభాస్వరులు, [4] తుషితులు నని పేర్కొందిరి. దేవయుగమునందావిష్కృతములగు వర్ణవ్యవస్థకుమూలమీనాల్గుశ్రేణులే. దానితో బోల్చిచూచినపుడీయుగమందలి పరమవైజ్ఞానికజ్ఞానప్రధానులగు సాధ్యులే బ్రాహ్మణులు. పరమప్రతాపులును, మహాధనుర్ధరులు నగుమహారాజికులే క్షత్రియులు. కృషి, గోరక్ష, వాణిజ్యములందు దక్షులగు పూర్ణసంపన్నులాభాస్వరులే వైశ్యులు. శిల్పవిద్యాపారంగతులును, నిస్స్వార్థబుద్ధితో సమాజసేవామగ్నులు నగు తుషితులే శూద్రులు. ఈనాల్గుజాతుల నేతృత్వమును సాధ్యుల చేతియందే

గలదు. ఈసాధ్యజాతి తనయపూర్వప్రతిభాబలమున ప్రాకృతిక తత్వపరీక్షాపురస్సరముగ మొదట యజ్ఞవిద్య (Chemistry) నావిష్కారము గావించెను. దీని నాధారముగా గొనియే పిమ్మటి దేవయుగమందు భౌమదేవ వ్యవస్థాప్రవర్తకుడగు బ్రహ్మయాదేశమున నతని జ్యేష్ఠపుత్రుండగు అధర్వుడు బ్రహ్మను మూలముగాజేసి దేవత్రిలోకియందు యజ్ఞవిద్యాప్రసారము గావించెను. దేవయుగమునకు బూర్వము విశ్వప్రభుత్వము సాధ్యులదే. వీరు, ఈశ్వరవాదులగు భౌమదేవతలకు విరోధులు. కనుకనే "పూర్వదేవాః, సురద్విషః" యని పేరొందిరి. సాధ్య జాతి కీశ్వరసత్తయందు విశ్వాసములేదు. వారు కేవలము ప్రకృతిసిద్ధ క్షణికవిజ్ఞానోపాసకులు మాత్రమే. నేటి క్షణిక విజ్ఞానవాదుల స్థానమే సాధ్యులదియును. ప్రకృతినియమముల వలననే విశ్వరచన జరిగినదనియు వానిని జక్కగా దెలిసి పని చేయుచో మనమును సృష్టినిర్మాణము చేయగలమనియును, నూతనసూర్యుని, నూతనచంద్రుని సృష్టింపగలమనియును, విశ్వపర్యవసానము ప్రకృతియైనపు డంతకంటె వేరుగ నీశ్వర కల్పనకొరకు బుద్ధిశక్తి వ్యయముసేయుట యనవసరమనియు వారి యభిప్రాయము. ఆనాటి తక్కిన జాతులవారు వారి యాదేశానుసారము వర్తించువారు గనుక నది సాధ్యయుగ మనియు నందురు. మణిజాయనుపద మానాటి మానవసంజ్ఞ. యజ్ఞవిద్యానిష్ణాతమును, యజ్ఞమువలన యజ్ఞకర్మ సంపాదన

జేయునదియు నగు నీసాధ్యజాతి స్వరూపము యజుశ్శ్రుతి యిట్లు వక్కాణించెను.

"యజ్ఞేనయజ్ఞమయజంత దేవాః. తానిధర్మాణిప్రథమాన్యాసన్
తేహనాకంమహిమానస్సచంతే యత్ర పూర్వేసాధ్యాఃసంతిదేవాః.

దేవయుగమందు ఈశ్వరునిగూర్చి యజనము జరుగుచుండెడిది. ఈ సాధ్యులు యజ్ఞముచే యజ్ఞముయొక్క యజనము సేయుచుండిరి. నాటి శాసనపద్ధతి ప్రజాతంత్రాత్మక గణతంత్ర ప్రాధాన్యముగా నుండెడిది. ఇట్లు చాలకాలము జరిగెను.

(5) <u>స్పర్ధాయుగము.</u> సభ్యతావిజ్ఞానాదులందు పరాకాష్ఠంజేరుకొన్న సాధ్యుల యనీశ్వరవాద ప్రధానమగు క్షణిక విజ్ఞానవాద ప్రాబల్యమునందు జివగను వారిలో వారికే మత విరోధము పుట్టినది. గణతంత్రాత్మికమగు శాసనప్రణాళికకూడ నీవిరోధమునకు త్తేజక మయ్యెను. ఇందుకు ఫలితముగా సృష్టిని గూర్చి పదియువాంతరమతములు ప్రచలితములైనవి. నేటి సంప్రదాయ కలహములవంటి కలహములే వ్యాప్తములయ్యెను. ఆపదిమతవాదములును ఋక్సంహితయందు, (1) సద్వాదము, (2) అసద్వాదము, (3) సదసద్వాదము, (4) వ్యోమవాదము, (5) అపరవాదము, (6) రజోవాదము, (7) అంభోవాదము, (8) ఆవరణవాదము, (9) అహోరాత్రవాదము, (10) సంశయవాదము, అని పేరొందినవి. వీనివివరణము మరియొకచోట చూచుకొనవచ్చును: సత్యసిద్ధాంత మెప్పుడు నొకటియే

యగును. నిత్యవిజ్ఞానమూలకమగు సత్యసిద్ధాంతమునందు విరోధావసరములేదు. కాని యీక్షణికవిజ్ఞానమునకు సంబంధించిన యీవాదముల పరిణామమున మానవసంఘమందు సంఘర్షణ ముదయించెను. దీనికి మూలమనీశ్వర వాదమూలకమగు ప్రజాతంత్రమే. సంఘశాంతికి దెబ్బతగిలి కలహసామ్రాజ్యము విస్తరించెను. విజ్ఞానమదమత్తములగు అర్ధలుబ్ధరాష్ట్రములం దశాంతి యెప్పటికిం దప్పదు. ఈ యుగమును, సంఘర్ష, కలహ, అశాంతి, క్రాంతి, విప్లవయుగనామములచే కూడ బేర్కొనిరి.

(6) దేవయుగము. శాంతి-క్షోభ, సంయోగ-వియోగ, భావ-అభావ, ఉన్నతి-పతన, సుఖ-దుఃఖ, జన్మ-మృత్యు-ఇత్యాది ద్వంద్వములన్నియు నొకదానికొకటి కారణములో - సూచకములో యగుచుండుట ప్రకృతిసిద్ధము: సాధ్యుల యవివేకము వలన నుత్పన్నమయిన మతవాదక్షోభ పరమశాంతిపరాయణులును శిల్పోపజీవులునగు తుషితులందు గూడ సంఘర్ష పుట్టించెను. చివరకీ తుషితులందే శాంతిమూర్తియగు నొక మహాపురుషుడుదయించి విశ్వశాంతికి గారణుడయ్యెను: ఈ విషయము పాఠకులకాశ్చర్యము కలిగింపవచ్చును:

ఆ మహాపురుషుడు పూర్వప్రచలిత దశవాద ఖండన పూర్వకముగ నేకత్వమూలక బ్రహ్మవాదస్థాపనచేసి, యేకేశ్వర వాదమూలక రాజ్యతంత్రమేర్పరచెను. "ఈ పదిమతములకొక మూలాధారము లేనపుడివి యన్నియు వ్యర్థములు. ఈశ్వరసత్త

లేకుండ నివియెన్నడును నిలువజాలవు.” అని ఘోషించి యాతడీ పదివాదములకును ప్రతిద్వంద్విగా సిద్ధాంతవాదమును స్థాపించెను. యీ మహానుభావుని యీ ప్రాథమిక సంస్కరణము నుద్దేశించి మంత్రశ్రుతి యిట్లు చెప్పుచున్నది—

నాసదాసీన్నోసదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమాపరోయత్
కిమావరీవః కుహకస్యశర్మన్ అంభఃకిమాసీద్గహనంగభీరమ్.
నమృత్యురాసీదమృతంనతర్హి నరాత్ర్యాఅహ్నఃఆసీత్ప్రకేతః
అనీదవాతంస్వధయాతదేకం, తస్మాద్ధాన్యత్‌నపరఃకించనాస
తమఆసీత్తమసాగూఢ మగేఽప్రకేతం సలిలం సర్వమా ఇదమ్
తుచ్ఛేనాభ్వపిహితం యదాసీత్, తపస్తన్మహినా జాయతైకమ్.

ఋక్ 10/129/1-2-3

ఆనాడొక నియమము జ్ఞప్తియం దుంచుకొనదగినది: ఏ విద్వాంసు డేతత్త్వ మొదట బరీక్షించునో ఆ విద్వాంసు నాతత్త్వనామమున బిలుతురు. ఉదాహరణమున, వసిష్ఠప్రాణ తత్త్వవేత్త వసిష్ఠుడు, భృగుతత్త్వవేత్త భృగువు. ఇట్లంతట నెరుంగవలయును. ఈ నియమానుసారము బ్రహ్మవాద స్థాపకు డగు నితనికి బ్రహ్మయని పేరువెట్టిరి. ఇతడు దేవయుగమున కాది ప్రవర్తకుడని:- “బ్రహ్మదేవానాం ప్రథమః సం బభూవ విశ్వస్యకర్తా భువనస్యగోప్తా” అను ముండక శ్రుతివలన స్పష్టము.

అవతార విజ్ఞానము ననుసరించి బ్రహ్మయొక్క జన్మ యాధికారికమును ప్రకృతిసిద్ధమునై యున్నది. కనుక నాది

బ్రహ్మను స్వయంభూ అందురు. ఏకేశ్వరవాద స్థాపనానంతర మీబ్రహ్మయు ప్రకృతిసిద్ధనిత్యబ్రహ్మవలె, నిక్కడగూడ నాల్గు విధముల సృష్టులు కావించెను. నిత్యసిద్ధము నపౌరుషేయము నగువేదతత్త్వము ననుసరించి వేదగ్రంథములు ప్రకటమయ్యెను. ఇదియే మొదటిదగు వేదసృష్టి యనబడినది. నిత్యసిద్ధమగు త్రైలోక్యము ననుసరించి యీ పృథివిపై లోకవ్యవస్థ గావించెను.

పృథివిని పద్మముగ నెంచుకొని దీని నెనిమిది విభాగములు గావించెను. ఈ విభాగము పురాణములందు పద్మభువనకోశమని ప్రసిద్ధి నొందెను. ఈ విభాగమందు దేవత్రిలోకియు ఆసురత్రిలోకియు నను రెండు సంస్థలు నిర్మింపబడినవి. ఇదే రెండవదగు లోకసృష్టి. పిమ్మట పంచక్షితి, పంచజన, పంచచర్షణి మొదలగు రూపమున ప్రజాసృష్టివ్యవస్థ గావించెను. ఇది మూడవసృష్టి, అనంతరము ప్రకృతిసిద్ధ నిత్యవర్ణ ధర్మాను సారము చాతుర్వర్ణ్య ధర్మము ప్రకటము గావింపబడెను. ఈ విధముగ ప్రకృతిసిద్ధ నిత్యబ్రహ్మయొక్క ప్రాణముఖమునుండి యపౌరుషేయ వేదసృష్టి, ఆపోముఖమునుండి లోకసృష్టి, వాఙ్ముఖమునుండి ప్రజాసృష్టి, అన్నగర్భితాన్నాద ముఖము నుండియు నైసర్గిక యానియమము ననుసరించియే పుష్కరమందుత్పన్నుడగు నీ స్వయంభూ బ్రహ్మయు, పైని జెప్పిన నాల్గుసృష్టులు గావించెను.

ప్రకృతియందు వలె అగ్ని, ఇంద్ర, వరుణ, ఆది దేవతల వికాసము గావింపబడెను. హైహయ, కాలకేయ, వృత్ర, నముచి, త్వష్ట, మొదలగు నసురుల వ్యవస్థ జరిగెను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాల్గు వర్ణముల యొక్కయు,అంత్యజ,అంత్యావసాయీ-దస్యు-మ్లేచ్ఛఅను నాలు గవరవర్ణములయొక్కయు విభాగము గావించెను. నాల్గువర్ణము లతోడనే వర్ణ్యుపకారకములగు బ్రహ్మచర్య, గార్హస్థ్య, వాన ప్రస్థ-సన్యాసములను నాలుగాశ్రమముల వ్యవస్థయు జేసెను.

నవత్యంశాత్మక భారతవర్షము దేవత్రిలోకి యొక్క మనుష్యలోకముగా నెంచబడినది. దీనికి మధ్యరేఖ యుజ్జయిని. తూర్పుసీమ (సరిహద్దు) పీతసముద్రము (Yellow Sea) పశ్చిమ సీమ మహాసాగరము (Madetarenean Sea) దక్షిణసీమ నిరక్ష వృత్తస్థానీయమగు లంకాద్వీపము. ఉత్తరసీమ శర్యణావతపర్వ తము (వాలక్). ఈవిశాలభారతమునకు మనువు సమ్రాట్టుగ జేయబడెను. మను సంబంధము వలననే యిది మనుష్యలోక మనుటయు, ప్రజలుమానవులనుటయును. అగ్ని దేవత యిక్కడి అతిష్ఠాతా శవసానపాత్ (అధిష్ఠాత-వైశ్వానరాయి) గావింపబడెను. మనుష్యలోక భరణ పోషణములు గావించును గనుక యగ్నిని భరతుడనిరి. "అగ్నేమహానసి బ్రాహ్మణ భారతేతి"(యజుస్సు) ఇత్యాది మంత్రములచే స్పష్టము. భరతుని పాలనయందలి యీ దేశము భారతదేశమయ్యెను. ఇక్కడి ప్రజలు భార తీయులు.

శర్యణావతపర్వతము మొదలు హిమాలయమువరకు భూమత్రిలోకియం దంతరిక్షలోకముగ నెంచిరి. వాయువిక్కడ శవసోనపాత్తు. ఇచ్చటి ప్రజలు యక్ష, రాక్షస, గంధర్వ, పిశాచ, గుహ్యక, సిద్ధ, కిన్నరాది విభాగములచే భాగింపబడిరి. వీరిని తిర్యగ్యోనులందురు. సుప్రసిద్ధములగు నందన, కానన, వైభ్రాజ, ఉమాస్కందాదివనము లీలోకశోభను పెంపొందజేయుచుండెను. జాంబూనదమని ప్రసిద్ధినొందిన సువర్ణ మిచ్చోటిదే.

హిమాలయప్రాంతమును, ప్రాఙ్మేరువు (పామీరు) ను భూమస్వర్గలోకము. ఇంద్రు డిక్కడి శవసోనపాత్తు, ప్రజలు దేవతలు. మరియు నింద్రుడు జ్యోతిర్విభాగమునకు లోకపాలుడుగను, తూరుపుదిక్కునకు దిక్పాలుడుగను గావింపబడెను. వరుణుడు జలవిభాగమునకు లోకపాలుడుగను, పశ్చిమదిక్కునకు దిక్పాలుడుగను గావింపబడెను. ఇట్లే చంద్రు డోషధులకు బ్రాహ్మణవర్గమునకును లోకపాలుడు. ఉత్తరమునకు దిక్పాలుడు. యముడు వనస్పతులకును, పితరులకును లోకపాలుడు, దక్షిణమునకు దిక్పాలుడు గావింపబడియెను. బ్రహ్మమూలక రాజ్యతంత్రమును, రాజా, సమ్రాట్, స్వరాట్, విరాట్ భేదములచే నాల్గుతరగతులుగా విభజింపబడినది. ప్రజాతంత్రము సమూలవినాశము గావింపబడెను.

ఇదేవిధమున ఆఫ్రికా, అమెరికా, యూరపులుమూడును అసురులకేయుబడి యసురత్రిలోకి యనబడెను. బ్రహ్మతన జ్యేష్ఠ

పుత్రుడగు నథర్వుని త్రయీవిద్యకు మొదటి శిష్యునిగావించెను. అథర్వుడు సరస్వతీ నదీతీరమున మొట్టమొదట యజ్ఞస్థాపన జేసెను. ఈస్థాన మించుమించు 48½ యక్షాంశలపై నుండును. అనగా నించుమించుగ నుత్తరరష్యాయందుండును. ప్రయాగకు సమీపమున వింశనక్షేత్రమునందు లుప్తమగు లుప్తసరస్వతియు, పశ్చిమభారతపూర్వసీమస్థ సింధునదమున కావల వశిష్ఠాశ్రమ సమీపమున బ్రవహించు ప్రాచీసరస్వతియు, పైని జెప్పిన సరస్వతికంటె వేరైనవని జ్ఞప్తియుంపవలయును. దేవతలాపై జెప్పిన సరస్వతియందవబృథ స్నానము (యజ్ఞాంతస్నాన) జేయుచుండిరి. యజ్ఞవిరోధులగు నసురులాచోటున దండెత్తజాలరు. కనుకనే యాస్థానము నపరాజితాదిక్ అనిరి. యీ సరస్వతియందవాంతరశాఖానదులేకు కలియుచున్నవి. ఈ నదియే వర్తమానమున బాల్కాకశ్ సరస్సు అను పేర నొప్పుచున్నది. అథర్వుని ద్వారా ప్రదత్తమగు సారస్వతయజ్ఞబలమున దేవతలప్పుడప్పు డసురులనోడింప గలిగియుండుచుండిరి. ఈ యుగమునందలి గొప్పవిశేషమేమన:—భారతీయ ప్రజల కర్మమెల్ల దేవేంద్రుని వంకనుండి నిర్ధారితమగుచుండును. దీనికి బ్రతిఫలముగ భారతీయ ప్రజల భోజనాచ్ఛాదన వ్యవస్థయు, చికిత్సయు, మరియితరావశ్యకతలును, వేయేల సర్వభారమును రాజతంత్రమువీూద నుండును. అశ్వినీకుమారు లిచటి ప్రధానవైద్యులు. వామదేవుడు అన్నకోశాధ్యక్షుడు. వసోర్ధారా యందుమూడు సంవత్స

రములకు సరిపడిన యన్నము మొదటనే సంచితమైయుండును. శిక్షాప్రసారము నిమిత్తము మూడులోకములందును కశ్యప, వశిష్ట, అంగిరా, భృగు, అత్రి, భరద్వాజాది ప్రముఖకులపతుల యధ్యక్షతను, బ్రహ్మపరిషత్తులు మహాశాలలు సువ్యవస్థిత ములై యుండెను. రాజతంత్రమును జక్కగా నుంచునట్టి గ్రామ, నగరాది నిర్మాణము జరిగినది. సేన, సేనాధ్యక్ష, గ్రామణి, సూత, ఇత్యాది చతుర్దశరత్నములు, రాజతంత్రసంచాలకులుగ నుండిరి. వైజ్ఞానిక తత్త్వపరీక్షకొరకు, సింధునద పశ్చిమప్రాంత మున వశిష్ఠధరుణమునకు సమీపమున బ్రవహించు సరస్వతీనదీ తీరమునందొక మహా విజ్ఞానశాల యుండెను. ఇది సూర్యసదన మనియు, విజ్ఞాన భవనమనియు బ్రసిద్ధము. సౌభ, ప్లవ, దివ్య, సూత, హార్యశ్వ, ఇత్యాది స్థల-జల-నభశ్చరములగు వివిధ విమానముల నావిష్కరించిన శ్రేయ మీ విజ్ఞాన భవనమునకు లభించెను. నిగమాగమ భేదమున విద్యలకు రెండు విభాగము లీకాలమున నయ్యెను. 4 వేదములు, 4 ఉపవేదములు, 6 వేదాంగ ములు, 4 ఉత్తరాంగములు, ఇట్లు నిగమము 18 భాగములు- ఆగమము 18 సంహితలు, 14 సిద్ధాంతములు, 6 కల్పములు, 10 యామళములు, 8 డామరములు, 64 తంత్రములు, మొత్తము 120 భాగములు, మహాసృష్టి కాలవ్యవస్థకొరకు నిత్యసిద్ధము లగు కృత, త్రేతా, ద్వాపర, కలిభేదమున చతుర్యుగావిష్కా రము నయ్యెను.

ఇట్లు- మహా తంత్రాయియగు నామహేశ్వరుని విశ్వ మండలి గుప్తరహస్యముల యాధారమున భగవంతుడు స్వాయంభువీభూలోకమున నెల్లవ్యవస్థలును జేసివైచెను. అతని నివాసము కాకేశశపర్వతము (కాకస్‌స్) ఏషియామైన రిదియే. దీనిని దహారైశియాయని యందురు. ఈశబ్రహ్మ సంబంధము వలన దేవత్రైలోక్యమును, ఏశియామైనరును ఏశియాయని పిలిచిరి. ఇది ఏశ్యాశబ్దవికృతరూపము. ఈశబ్రహ్మయొక్కయు, నతనిచే నావిష్కృతమగు వేదధర్మానుయాయులగు ప్రజల యొక్కయు ప్రాతిస్విక సంపత్తియే ఏశియామొత్తమంతయును. మనమేశియావారము, ఏశియా మనది.

ఇక పైగావచ్చిన మహానుభావులెల్లరును మనకతిథులు. అతిథిసేవాపరాయణమగునార్యజాతి వారికిని, వారి వంశజులకును చాలినంత యాతిథ్యసత్కారము తనకుగాని, తనసంతతికిగాని కొంచెమైన మిగులకుండ జేసివైచెను. ఆయతిథిమహానుభావులు, ఎవరు చెప్పగలరు? తిథిసీమోల్లంఘనము గావించిరి, గావింపుచున్నారు. వీరతిథులని మనమెరుంగకున్నాము. ఏమైన గానిండు. మనము మన స్వరూపమును గుర్తింపనంతవరకు వారు వారి గౌరవము కాపాడుకొనుటకు, స్వదేశయాత్రకు నిశ్చయించుకొనరు. (1945 నవం.)

ఇంతవరకు దేవయుగ వ్యవస్థాదిగ్దర్శనము గావింపబడినది. యిక ప్రస్తుతమనుసరింతము. స్వాయంభూమనువునకు వివస్వాన్

నామకుడగు పుత్రుడు కలడు. ఆవివస్వంతున కెనమంద్రు పుత్రులు, నొక కన్యయు గలరు. కొడుకులందు బెద్దవా డిక్ష్వాకువు, కన్యపేరు ఇల, (డ). పీరిరువురి వలనను సూర్యచంద్ర వంశములు ప్రవర్తిల్లినవి. ఇల-యజ్ఞవిద్యయం దారితేరినది. ఈమహావిదుషి యజ్ఞవిద్యకెంతో ప్రోత్సాహ మిచ్చెను. కనుకనే యజ్ఞమునం దాయమకు స్మారకముగా ఇడాప్రాశన మను నొక కర్మవిధానము గలదు. వివస్వంతుడు భారతసమ్రాట్టయినను ఇచటి కెన్నడును రాలేదు. అతని జీవిత దశయందే పెద్దకొడుకగు నిక్ష్వాకు వుత్తరాధికారము నొందెను. ఆ యధికారమునొంది భారతమున కరుదెంచిన సూర్యవంశీయ ప్రథమ సమ్రాట్టు యితడే. ఇత డయోధ్యను రాజధానిగా చేసికొనెను.

పై దేవయుగాభాసమువలన మానవబుద్ధి యెంతవరకు వికసింపవలయునో అంతవరకు వికసించెనని యెరుంగవచ్చును. కాని దురదృష్టవశమున జంద్రుని దుర్బుద్ధికి పిమ్మట దేవయుగ కాలీనవ్యవస్థ నన్నివిధముల బాడుసేసి శాశ్వత కళంకమున కాలవాలమైనది. నేడావ్యవస్థయంతయు లోపించినది. మనమంతయు పోగొట్టుకొన్నాము. సభ్యత- సంస్కృతి- విజ్ఞానము- శిల్పము- కళ- మొదలగు నన్నిటియందును విశ్వమునకు బాఠము జెప్పు మన మర్థ విదగ్ధులగు వృథా సభ్యతాభిమానులచెంత జీవయాత్రగడుపుకొనుట కేమనుకొనవలయును? "కాలాయ

తస్మై నమః" మహాభారత యుద్ధమునందు సూర్యవంశ్యుల పక్షమున నయోధ్యాపతి సుమిత్రుడు వచ్చెను. ఇతడు వివస్వంతునకు 128వ తరమువాడు. భారతీయసమ్రాట్టు భగవంతుడు శ్రీరామచంద్రమూర్తి వివస్వంతునకు 63వ తరమువాడు.

ఇక:- పై పరిస్థితిని గమనింపుచు మూలగీతాకాల మీమాంస గావింపుడు. భగవంతుడిట్లు చెప్పెను.

ఇమం వివస్వతే యోగంప్రోక్తవా నహమవ్యయం.
వివస్వాన్ మనవేప్రాహ, మను రిక్ష్వాకవేబ్రవీత్
ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
సకాలే నేహమహతా యోగోనష్టః పరంతప !
స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోసి మే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమమ్.

ఇట నొక విషయము గమనింప వలయును. గీతయంతయు భగవంతుని యుద్దేశ్యము కాదు. భగవంతుని మతము మొదటి యారధ్యాయములయందలి రాజర్షి విద్య మాత్రమే. తక్కిన సిద్ధవిద్య, రాజవిద్య, ఆర్ష విద్య అను మూటిని సంశోధిత రూపమునభగవంతుడు గీతయందు సమావేశము గావించెను. ఇట్టి స్థితియందు మూలగీత కేవలము రాజర్షివిద్యయే యనదగును: "ఏవంపరంపరా ప్రాప్త మిమంరాజర్షయో విదుః" అను వాక్యమునందీధ్వని వెలువడుచున్నది. తప్పక యేదో యొక శరీరమును ధరించి యామహాత్మ దేవయుగారంభ

మున నుండియుండును. వివస్వంతు డాయన శిష్యత్వమును స్వీకరించి యా యలౌకిక గీతాయోగము నుపదేశము పొంది యుండును. ఈదృష్టితో రాజర్షి విఖ్యాత్మిక మూలగీతా కాల మద్దైయె యుండవలయును. మహాభారత కాలమందన్ననో భగవంతు డా పూర్వోపదిష్టయోగ సంస్కారమాత్రము గావింపుచున్నాడు. ఇక గీతా శ్లోకములు వ్యాసభగవానుని బుద్ధి వైభవ రూపములని యెవ్వ రెరుగరు? మొదట భగవంతుడు వివస్వంతునకు జెప్పెననగా నావివస్వంతు డెప్పటి వాడనుటలో నీ యుగధర్మాఖ్యానము సేయవలసి వచ్చెను- ఇంక కొంచెము వక్తవ్యము కలదు:-

పై విషయముల వలన మన యున్నతికాలము దేవ యుగమనియు నది మహాభారత యుగమునకు వేలకొలది సంవత్సరములకు పూర్వమై యుండుననియు నెరింగితిమి. ఇక- భారత కాలమన్ననో, మనకవనతికాలమే యనవచ్చును. సోదరులందు ఘోరశత్రుత్వము, జఘన్యమగు రాజ్యలిప్స- నింద్యమగు ద్యూతకర్మవలన పరస్వత్వాపహరణము, సభ్యులనబడువారు సొంతచేతులతో కొంపలంటించుట, విషపానము సేయించు పనులరయుట, సభ్యమండలియందొక నిరపరాధయగు యార్యస్త్రీ యొక్క- సతీత్వభంగమున కుంకించుట, మొదలగుకర్మ లీయుగ నికృష్టతకు జాలినంత ప్రమాణములు.

సాధ్యయుగానంతరము సంఘర్షయు గోపశాంతికొరకు

దేవయుగ సంస్థాపకుడగు స్వాయంభూ బ్రహ్మ యవతరించినట్లు—త్రేతాయుగమందలి రాక్షసవిప్లవ మణచుటకు, భగవంతుడు శ్రీరాము డవతరించినట్లు—ద్వాపరాంతమున, కలియారంభమున దేవయుగధ్వంసరూపమగు నీభీషణయుగక్రాంతి నాశముకొరకు, రాజర్షి విద్యాపునరుద్ధారకుడు సర్వేశ్వరుడు నగు భగవంతుడు కృష్ణరూపమున బూర్ణావతార మెత్తెను. ధర్మగ్లాని మే యవతారగారణము. ఈదృష్టితో గూడ మహాభారతకాలము మన యవనతికాల మనవచ్చును.

మహాభారతకాలమునకు బూర్వము వేలకొలది వత్సరములవరకు దేవయుగము. దానికి బూర్వము వేలకొలది వత్సరములవరకు సంఘర్ష యుగము. అంతకు పూర్వము గొన్నివేల యేండ్లు సాధ్యయుగము. లేదా మణిజాయుగము. దానికి మున్ను చాలకాల మాదియుగము. అంతకుపూర్వము పశుయుగము. ఇట్లనుమానించినచో మహాభారతమున కెన్నియో వేల సంవత్సరములకు బూర్వము మానవసభ్యత వికాసమొంది యుండును. మహాభారతమున కిప్పటి కించుమించుగ నైదువేల యేండ్లు కలవు. ఆనాటికే మనసభ్యత ధ్వంసమైపోయినది. ప్రస్తుత చరిత్రకారు లదిమొదలుగ మనచరిత్ర నవలోకించుచు మనసభ్యతా-సభ్యతలను నిర్ణయింప సాహసించుట యన్యాయము. మనమెట్టివారమో యెట్లైపోయితిమో తెలిసికొనుటకై దువేల సంవత్సరములకు బూర్వపు దేవయుగ, సాధ్యయుగ కాలీనేతి హాసాన్వేషణ సేయవలసియున్నది. కాని,

కొలది శతాబ్దులకు సంబంధించిన శిలాలేఖనములు, నాణెములు, కుండపెంకులు, విదేశీయులగు హ్యూయెన్‌సాంగు మొదలగు వారి యాత్రావృత్తములు, కల్పనారసికులగు పాశ్చాత్యుల కల్పితగ్రంథములు మొదలగువాని యాధారమున మన పూర్వ చరిత్ర కేతిహాసము యథాతథముగా నెరుంగుట అసంభవమని తెలిసి కొనవలయును.

ఇతి శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్రశ్రీ సుబ్బాంబా-
సుబ్బరాయతనూజస్య కృష్ణమూర్తి శర్మణః
కృతిషు, అనుశ్రుత్యుపనామక విజ్ఞాన
లక్ష్మీనారాయణీయే శ్రీమద్భగవ
ద్గీతావిజ్ఞానపరిచయే బహి
రంగ పరీక్షోపక్రమే
ప్రథమః ప్రసంగః

---





# అథద్వితీయః ప్రసంగః
## గీతానామమీమాంసా

ముందొక విషయము గమనింపదగినది :- జ్ఞానవిజ్ఞానముల కపూర్వకోశమగు గీతాశాస్త్రము నేడు విశ్వమందు గీతానామమున ప్రసిద్ధమై యున్నది. విజ్ఞానము కారణవాదము ననుసరించును కనుక విజ్ఞానదృష్టితో నామమీమాంస యవసరము. పరమేష్ఠి కృష్ణుని పూర్ణావతార మహాపురుషుడు, భగవంతుడునగు వాసుదేవకృష్ణుని ముఖకమలమునుండి తాత్త్వికరూపమున విని స్మృతమును, కృష్ణద్వైపాయన మహామునియగు వ్యాసదేవుని లేఖనిచే ఛందోబద్ధమయినదియునగు నీగీతాశాస్త్రమునకు 'భగవద్గీతోపనిషత్' అని పూర్ణనామము. ఇదే సంకోచభావమున <u>గీత</u> యను రెండక్షరములుగ పరిణమించెను. పూర్వోక్తనామమునందు, భగవత్ — గీతా — ఉపనిషత్ అను మూడవిభాగములు కలవు. ఇందొకశంక :-

(1) వాసుదేవ కృష్ణుడే భగవంతుడన్న మాటయేమి? యతనివలె వ్యాస, కపిల, కణాద పతంజల్యాది మహాపురుషులెందరో భగవచ్ఛబ్దమున పేరొందిరిగదా. కాని, వారిగ్రంథములకు వేనికిని భగవచ్ఛబ్దముతో 'భగవన్మహాభారతము' 'భగవత్పురాణము' 'భగవద్రామాయణము' అను వ్యవహారములేదు. కేవల మొకగీతకే 'భగవద్గీత' యని వ్యవహారమేల ? కనుక

నిందలి భగవచ్ఛబ్దమునకేదో మౌలికరహస్య ముండియుండును.

2. గీతాశబ్దమునకు నిదివ్యుత్పత్తి. గానముచేయబడినది యనునర్థమున నీపదము ఈశాస్త్రమున కప్రాసంగికము. అయి నను, ఒకానొక గుప్తకారణమున కృష్ణుడు సంగీతప్రియుడు. స్వయముగా కూడ "వేదానాం సామవేదోస్మి" యని తన సంగీతప్రేమ వెల్లడించెను. జీవనసంగిని యగువాణిచే విభూషిత కరుడతడన్నవిషయముకూడ నిందుకు బరిపోషకమగును. కాని యుద్ధావసరమున శోకాతురుడగు నర్జునునికి సంగీతముతో నధ్యాత్మ విద్యోపదేశమా? ఇది యుపహాస్యాస్పదకల్పన యగును. గీతాశబ్దమునకు-కథితా-ఉక్తా-రచితా, యని యర్థ మనుకొన్నచో సూటిగా జెప్పక యీ ద్రావిడ ప్రాణాయామ మెందుకు? గీతాశబ్దమందేదో రహస్యమున్నది. లేనియెడల వ్యాసుడైన నీ ద్రావిడ ప్రాణాయామ మభ్యసించి యుండడు.

ఇక నుపనిషచ్ఛబ్దముగూడ నొక జటిల సమస్య. సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు అనుభేదమున నపౌరుషేయ వేదము నాల్గు భాగములు. ఉపనిషత్తు వేదమున కంత్యభాగము కనుక వేదాంతమందురు. ఉపనిషత్తు శ్రుతికి సంబంధించినది. గీత శ్రుత్యనుసరణము కావించుచున్నను స్మృతి యైయున్నది. విద్వాంసు లెవ్వరును గీత శ్రుతియనిగాని, వేదాంతిమభాగమనిగాని యంగీకరింపరు. ఇట్టి స్థితిలో దీనికుప నిషత్తను శబ్ద మెట్లు చెల్లును? ఇట్లు మొత్తము భగవత్-గీతా-

ఉపనిషత్ అను మూడు శబ్దములును వివాదగ్రస్తములై యున్నవి. కనుక క్రమముగా నీ మూడు నామముల రహస్యము లను మన మెరుంగవలసియున్నది: అందు ముందుగ:

భగవచ్ఛబ్ద రహస్యముం జూతము:— శాస్త్రములందు భగవచ్ఛబ్దమునకేమి యర్థము గావింపబడినది? ఏ గుణములు, లేదా శక్తులున్నచో భగవంతు డందురు? అన్నచో ఆర్యజాతి భగవచ్ఛబ్దముచే ప్రధానముగ విశ్వకర్మయగు నీశ్వరునే గ్రహించుచున్నది. ఈశ్వర శబ్దము గీతననుసరించి "యోలోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః" అని. అవ్యయ పురుష వాచకమై యున్నది. అవ్యయుడు లేక ఈశ్వరుడు విశ్వవ్యాప్తుడయ్యు నసంగుడు, అవికృతుడు, ఏకరూపి. గోపథమునందు

సదృశం త్రిషు లింగేషు సర్వాసుచ విభక్తిషు
వచనేషు చ సర్వేషు యన్నవ్యేతి తదవ్యయమ్" అని యున్నది.

అవ్యయు డిట్టివా డయ్యును, యోగమాయానుగ్రహమున ననేక రూపధారి యగుచున్నాడు. యోగమాయ యితనిని ఖండఖండ రూపములం బరిణతి నొందించును. అట్టి ఖండ రూపమును జీవుడందురు. "మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" (గీత) 'అంశోనానావ్యపదేశాత్' (బ్ర సూ) ఇత్యాదులింకు ప్రమాణములు. ఈఖండభావము వలన నవ్యయప్రాతిస్వికశక్తి తిరోహిత మగుచున్నది. అవ్యయ స్వరూప దర్శన ప్రతిబంధిక యోగమాయ, దానివలననే జీవుడు స్వరూపోపలబ్ధి

గానక దుఃఖ మొందుచున్నాడు. "నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః" (గీత) యోగమాయయను జీవుని భగవచ్ఛక్తి లేనివానిగా జేసివైచినది.

భగవచ్ఛక్తి ప్రాప్తివలయుచో యోగమాయావరణము తొలగవలయును. వెంటనే యవ్యయుని స్వీయశక్తి వికాసము నొందును. మేఘావరణము తొలగగనే నిత్యప్రకాశిత సూర్యుడు ప్రకటమగుటతో దీనిని పోల్చవచ్చును.

సరి:— ప్రయాస నేమియు లేకుండ జన్మకాలము నుండియే యోగమాయావరణము తొలగియున్న జీవుడు (జన్మౌషధిమంత్ర సమధిజాః సిద్ధయః (యో సూ) తన శక్తుల ప్రభావమువలన భగవంతుడని పేరొందును. అట్టి జీవుడే మహా పురుషుడు, అమానవపురుషుడు, అవతారము మొదలగు పేరులచే నొప్పును,- అవ్యయమునందు ముఖ్యముగా జ్ఞానము, క్రియ, బలము అను మూడు శక్తులు కలవు. అవాంతరములగు నితరశక్తులన్నియు నీ మూటియందు నంతర్భావములు. ఈ శక్తి త్రయము నుపనిషత్తు వచించుచున్నది:

న తస్య కార్యం కరణంచ విద్యతే -
నతత్సమశ్చాభ్యధికశ్చ శ్రూయతే.
పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే -
స్వాభావికే జ్ఞాన - బల - క్రియాచ.

పరిభాష ననుసరించి అవ్యయుడు పరుడు. కనుక నతని శక్తి పరాశక్తి యందురు. శక్తు లనంతములు కనుక 'వివిధైవ

శ్రూయతే' యనుట. అవ్యయుడనంత శక్తి. ఈశక్తులందు: ఆరు శక్తులయొక్క సొత్తమునకు భగమని పేరు. అవి యివి:

1 2 3 4
ఐశ్వర్యస్యసమగ్రస్య. వీర్యస్య. యశసః. శ్రియః ~~(ధర్మస్య)~~
5 6
జ్ఞాన. వైరాగ్య. యోశ్చైవ షణ్ణాంభగఇతీరణా.

భగముకలవాడు గనుక భగవంతుడనిపేరు. ఇవి యతని ప్రాతిస్వికశక్తులు. ఏలయన :-"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి" అన్నట్లు జడ-చేతనములగు నెల్లభౌతిక పదార్థకేంద్రములందును భగవంతు డీశ్వరావ్యయుడు ప్రతిష్ఠితుడై యున్నాడు. ఈదృష్టితో పదార్థమాత్రమును భగవంతుడనవచ్చును. అంతయు బ్రహ్మవైభవమేకదా! "సర్వంఖల్విదం బ్రహ్మ" బ్రహ్మైవేదం సర్వం" అని శ్రుతులు :-కనుక నాయారును అతని ప్రాతిస్వికములై యున్నవి. జ్యోతిర్విజ్ఞానానుసారమాత్మజ్యోతి సర్వోత్కృష్టము. ఏలయన :- సూర్య, చంద్ర, అగ్ని, విద్యుత్, తారకాది భూతజ్యోతులు ప్రకాశితవస్తుజ్ఞానకారకములు మాత్రమే. ఆత్మజ్యోతి (జ్ఞానజ్యోతి) ప్రకాశాంధకారము లజ్ఞానమునకు గారకములు. భూతప్రకాశసత్తయందు మనమంధకారము జూడజాలము. ఆత్మప్రకాశమందు రెంటిని జూడగలము. మరియు భూతజ్యోతి కాత్మజ్యోతియే ప్రతిష్ఠ—జ్ఞానజ్యోతి యాధారముననే పూర్వోక్త పంచజ్యోతి పరిజ్ఞానము లభించును. కనుక ఆత్మజ్యోతి, జ్యోతిషాం జ్యోతియగును. శ్రుతియు నిట్లే చెప్పుచున్నది :—

నతత్రసూర్యోభాతిన చంద్రతారకం నేమావిద్యుతోభాంతికుతోయమగ్నిః
తమేవభాంతమనుభాతిసర్వం తస్యభాసాసర్వమిదం విభాతి. (ముండక)

ఇది స్వయంప్రకాశము కనుక స్వజ్యోతి.

ఇక—సూర్యునివలె స్వయంప్రకాశతత్త్వము భాసతే ఇతిభమ్ అనిగాని, లేదా యేనాసాభాతి ఇతిభమ్ అనిగాని యందురు. ఆత్మజ్యోతిభమ్- దేనిచే భం ప్రాప్తించు నయ్యది ('యేనాసాభం ప్రాప్యతే'తత్) భగమనబడును. (1) ధర్మ (వీర్య) (2) జ్ఞాన, (3) వైరాగ్య, (4) ఐశ్వర్య, (5) యశః, (6) శ్రీ లారును భమ్ ప్రాప్తిద్వారములు కనుక భగనామములు. ఎవనియం దీయారును వికాసమొందునో ఆ మహాపురుషుడే భగవంతుడు.

పూర్వోక్తప్రకారము: ప్రాణులందరి హృదయస్థుడై భగవంతుడున్నచో నీభగవచ్ఛబ్ద విశేషమేమన్నచో ;—ఈ భగ ప్రతిద్వంద్వీభావమును గూడ నించుక యెరుంగవలయును. (1) రాగద్వేషములు, (2) సమ్మోహము, (3) అస్మితా, (4) అభినివేశము ఈ నాల్గింటిసమష్టియు అవిద్యాబుద్ధి. ఇట్లు (1) వైరాగ్యము (2) జ్ఞానము (3) ఐశ్వర్యము (4) ధర్మము, ఈ నాల్గింటి సమష్టియు విద్యాబుద్ధి. అవ్యయాత్మకు విద్య, కర్మయని రెండుధాతువులు. అతడు మన ప్రత్యగాత్మ. హృదయస్థుడగు నీశ్వరుడితడే. ఇతని కతిసమీపమున విజ్ఞానాత్మ

యగు బుద్ధికలదు. దానియందీ రెండువిధముల నాల్గు భావము లును, వ్యతిక్రమమున బ్రతిష్ఠితములై యున్నవి.

ఈ రెంటియందు నేదోయొక భావమే యెల్లప్పుడును బుద్ధియందుండు చుండును. మరియు, అవ్యయాత్మయొక్క విద్యాభాగమువలన బుద్ధియొక్క విద్యాభాగమును, కర్మ భాగమువలన బుద్ధియొక్క కర్మభాగమును (అవిద్యాభాగము) ప్రబలములగుచుండును. ఇట్లే - బుద్ధియొక్క విద్యాభాగముచే అవ్యయుని విద్యాధాతువును, అవిద్యాభాగముచే అవ్యయాత్మ యొక్క కర్మధాతువును ప్రసన్నములగుచుండును. ఇక :—పైజె ప్పిన నాల్గు విద్యాబుద్ధులకును అవ్యయుని విద్యాభాగముతో యోగము కుదిరినచో బుద్ధియోగనిష్ఠ ప్రాప్తించును. అటు గాక :— అవిద్యాబుద్ధులకు ద్విధాతుమూర్తియగు నవ్యయుని కర్మభాగముతో యోగము కుదిరినచో బుద్ధియోగ పతనము జరుగును.

బుద్ధికిని ప్రత్యగాత్మకును మధ్య అవిద్యారూపపాపావ రణమున్నది. ఇదే దుఃఖమూలము. దీనిం దొలగించు శక్తి బుద్ధి యోగమునకే కలదు. దానివలననే కర్మతః ఉత్పన్నమగు నాయా వరణము స్వయంనివృత్తమగును. ఎట్లన :— (1) వైరాగ్య బుద్ధియోగమువలన రాగద్వేషాత్మకావరణమును, (2) జ్ఞాన బుద్ధియోగమువలన అజ్ఞానావరణమును, (3) ఐశ్వర్యబుద్ధియోగ మువలన అస్మితావరణమును, ధర్మబుద్ధియోగమువలన అభిని

వేశావరణమును తొలగిపోవును. పోగా :—అవ్యయాత్మయందు ప్రతిష్ఠితమగు భగనామకస్వరూపధర్మ మావరణరహితమై విజ్ఞానాత్మపై ననుగ్రహముకావించును. ఇదే ఆత్మసాక్షాత్కారము : బుద్ధిసహకృత కర్మాత్మను, బుద్ధియోగద్వారమున ప్రత్యగాత్మ సంప్రాప్తిగావించుకొనుటయే ఆత్మసాక్షాత్కారము. కర్మాత్మలక్షణముగల జీవునిపై ప్రత్యగాత్మలక్షణముగలట్టియు, భగధర్మావచ్ఛిన్నుడై హృదయమందున్నట్టియు, భగవంతుని యనుగ్రహమిదే. ఈ యనుగ్రహమువలననే అవ్యయుని భగసంపత్తి ననుభవింప సమర్థుడగుచు, బుద్ధియోగస్థుడగు కర్మాత్మ మహాపురుషకోటిం జేరి, భగవంతుడై పోవును. ప్రత్యగాత్మ యొక్క యా ప్రకాశపుంజము, ఆత్మయొక్క విద్యాభాగముచే ఈ బుద్ధియోగద్వారముననే ప్రాదుర్భూతమగును.

భూతజ్యోతులైదింటికి ప్రతిష్ట యాత్మజ్యోతియని పూర్వము చెప్పబడినది. ఈవిషయమున నింకొకటిగూడ తెలిసికొనవలయును. ప్రకృతి మండలమందు ప్రత్యగాత్మ లక్షణముగల యీపరమాత్మజ్యోతి మొట్టమొదట విశ్వకేంద్రస్థుడును, స్వజ్యోతిర్ఘనుడును నగు సూర్యునందే యవతీర్ణమగును. కనుక పంచజ్యోతులందును సూర్యజ్యోతి ముఖ్యముగ నెంచబడినది. సూర్యసత్త యాత్మసృష్టికి పరిచాయిక — సూర్యాభావము ప్రళయకాలసూచకము. మొదట సూర్యునిలోనికి వచ్చిన పరమాత్మజ్యోతి సూర్యరశ్మి ద్వారమున మనయొక్క భూతాత్మ

యను కర్మాత్మయందు ప్రతిష్ఠితమగును. ఇంతకు జెప్పవచ్చిన దేమనగా హృదయస్థుడగు నీశ్వరునకు మనయధ్యాత్మసంస్థతో సాక్షాత్సంబంధముండదనియు, సూర్యుని ద్వారానే యుండు ననియు గుర్తింపవలెను. సౌరత్రిలోకియను రోదసీత్రిలోకియం దున్న ప్రాణులన్నిటికి మూలప్రతిష్ఠ సూర్యుడే. పారస్పరికమగు నీయాంత్మసంబంధమును శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

1. హిరణ్మయేపరేకోశేవిరజం బ్రహ్మనిష్కలం
తచ్ఛుభ్రంజ్యోతిషాంజోతిరాయుర్హోపాసతేఽమృతమ్ (ముండకే)
2. యత్రాసుపర్ణా అమృతస్యభాగ మనిమేషం విదధాభి స్వరన్తి
ఇనో విశ్వస్య భువనస్య గోపాః సమాధీరః పాకమన్వావివేశ[ఋక్.
3. యస్మిన్ వృక్షే మధ్వదః సుపర్ణో నివిశన్తేసువతే చాధివిశ్వే
తస్యేదాహుః పిప్పలం స్వాద్వగ్రే తన్నోనశద్యః పితరం నవేద.
"తదృత్ కించార్వాచీన, మాదిత్యాత్, సర్వంతత్, మృత్యునాప్తమ్"
(శత)

ఈ నిగమముననుసరించి సూర్యునిక్రిందిదగు యావత్ప్ర పంచమును మృత్యుప్రధానము. మరి:— సూర్యునకు పైనున్న యావద్వివర్తమును అమృతప్రధానము. సుపర్ణము (పక్షి) పక్ష బలమున నాకాశమున సంచరించునట్లు సూర్యుని రశ్మి లాకాశ మంతటను అమృత మర్త్యలోకములందు సంచరింపుచుండును. సూర్యునిపైనుండు నమృతభాగ మాత్మజ్యోతి. కనుక పైకి బోవు రశ్మి లమృతాత్మ యంశరూప జ్ఞానజ్యోతి నుదరము నందుగొని దానిని విజ్ఞానముద్వారా సూర్యజ్యోతియందు ప్రవేశ

పెట్టుచుండును. ఈ ప్రక్రియ యనవరతము సాగుచుండును. పిమ్మట నీ రశ్ములద్వారానే యినుడు, తనక్రిందనున్న మృత్యులోక భౌతికరసమును స్వయముగాగూడ పానము సేయుచుండును. ఈ భౌతికరసమువలన మర్త్యలోక ప్రజలనుగూడ పోషించుచుండును. ఇట్లు పైనుండియు క్రిందనుండియు రసములను గ్రహించు సూర్యుడమృత మృత్యుమయుడై విశ్వమధ్యమునందు తన సహస్రకిరణములతో వెలుగుచున్నాడు. అమృతలోకస్థమగు విజ్ఞానజ్యోతితో కూడిన యీ సూర్యుడు రశ్మిద్వారా యీ పృథివీలోకమునందు బుద్ధిప్రవర్తకుడగుచు బుద్ధిరూపమున మన యధ్యాత్మ సంస్థయందు బ్రవేశించుచున్నాడు. అమృతలోకస్థమగు చిదాత్మజ్యోతి సూర్యునందు జొచ్చి సూర్యస్థభూతజ్యోతితోగూడి భూతజ్యోతిప్రధాన మయిపోవుచున్నది. ఈ సూర్యభూతజ్యోతి భూమియందలి మనుష్య శరీరమందు రశ్మిద్వారా ప్రవేశించి బుద్ధిరూప జ్ఞానజ్యోతి స్వరూపముగాపరిణమించుచున్నది. అనగా:- సూర్యున కావైపున జ్ఞానజ్యోతి, యీవైపున మనుష్య శరీరము, మధ్య సూర్యుడు- ఇట్లుండగా: జ్ఞానజ్యోతి సూర్యునందుజొచ్చి, తద్రూపమున బరిణతమై పోవుచున్నది. అచ్చటనుండి జ్ఞానజ్యోతి గర్భితమగు నాభూతజ్యోతి రశ్మిద్వారా మన భౌతిక శరీరముం జొచ్చి యాధ్యాత్మిక జ్ఞానజ్యోతి యనబడుచున్నదని "యత్రసుపర్ణాః" యను మంత్ర నిష్కర్ష.

ఆధ్యాత్మిక విజ్ఞానమునందు బ్రహ్మాశ్వత్థమనియు, కర్మాశ్వత్థమనియు రెండువృక్షము లెన్నబడినవి. బ్రహ్మాశ్వత్థమునకు ఈశ్వరతంత్రము లేదా ప్రకృతి తంత్రముతో సంబంధము. కర్మాశ్వత్థమునకు జీవతంత్రము, లేదా వికృతి తంత్రముతో సంబంధము. ఈ రెంటినుండి కర్మాశ్వత్థము "యస్మిన్ వృక్షే" యను మంత్రమున గ్రహింపబడినది.

సంచిత కర్మాధారమున జన్మ, జన్మాధారమున కర్మ ఇట్లు చక్రమువలె పరివర్తనమగుచుండు కర్మసంతానము కర్మాశ్వత్థము. ఇందున్నజీవుడు శుభాశుభ కర్మఫలము లనుభవించును. కనుక నితడు మధు + అద=మధ్వధః అనబడును. భోగ సాధనము బుద్ధి. భోగము రెండువిధములు కనుక ఆధ్యాత్మిక సూర్యుడగు బుద్ధినుండి రెండు రశ్ములు (సూర్యునందువలె) వెలువడుచుండును. (1) జాగ్రదవస్థ, ఇందు రశ్ములు, విశ్వాంతర్గత బహిరంగ విషయరస మాస్వాదించును. (2) సుషుప్తి (సు + సు + ప్తి) మనస్సు విషయ సహితేంద్రియములతో బుద్ధి యందును (సు + ప్తి) బుద్ధి ఆత్మయందును (సు + సు + ప్తి) లీనమగుట) యందు విశుద్ధాత్మానుభవము నొందును. ఆనందానుభవమునకు ద్వైతముతో సంబంధము. సుషుప్తియందున్ననో ద్వైత మంతరించును. కనుక జాగ్రదవస్థయందువలె విషయానుభవానందము లేక కేవలాత్మానందానుభవమే యుండును. ప్రకారాంతరమున:- జాగ్రదవస్థ సమృద్ధానందము - విషయానందము-

అశాంతిమూలము, అలసట దెచ్చును. సుషుప్త్యవస్థ:-శాంతానందము అలసటను తీర్చును. శాంతికి మూలము. మరల జాగ్రదవస్థ యుపక్రమింపగనే యా రశ్ములు విశ్వము వంకకు ప్రసరింపుచు తమతమ ఐంద్రియక విషయములందు లగ్నము లగుచుండును.

ఎవ్వని బుద్ధి తన విజ్ఞానజనకమగు నాయాత్మ తత్త్వమును మూలముగా బెట్టుకొని విషయములం దనాసక్తి పూర్వకముగ ప్రవృత్తమగునో వానికి శుభ ఫలము లభించును; అటుగాక;- తన తండ్రియగు నాత్మను మఱచి విషయములందాసక్తి పూర్వకముగ ప్రవృత్తమగుబుద్ధి ఆయుత్తమఫలప్రాప్తియందసమర్థమగును. ప్రకారాంతరముగ:- (1) ఆత్మానుగామినియగు బుద్ధి భగవత్స్వరూపసంపాదికయగును. అదిగల వ్యక్తులకు అమృతాత్మయొక్క జ్ఞానరసము లభించును. (2) ఇక, విశుద్ధ భోగానుగామిని యగుబుద్ధి భగసంపత్తి నుండి చ్యుతముగావించును. ఈ రెంటిపరిస్థితుల నీశ్రుతి స్పష్టము సేయును.

"పరాంచిఖానివ్యతృణత్స్వయంభూః తస్మాత్పరాఙ్పశ్యతినాంతరాత్మన్ కశ్చిద్ధీరఃప్రత్యగాత్మానమైక్షత్ఆవృత్తచక్షుః అమృతత్త్వమిచ్ఛన్"(కఠ)

ఆత్మతో బుద్ధికి యోగము కల్గించినచో పరమానంద సంపత్తి ప్రాప్తించును. భగవత్పదము లబ్ధమగునని నిష్కర్ష. ఇది 3 వ మంత్రార్థము.

ఇంతవరకు దేలిన దేమనగా :- "(1) అమృతమృత్యుమయమగు విశ్వకేంద్రమందున్న అమృతమృత్యుమయుడగు సూర్యుడు, భూలోకస్థ మనుష్యునందు బుద్ధిరూపమున ప్రవేశించును. బుద్ధినావిజ్ఞానాత్మ (సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ) దీని విజ్ఞానబలమువలననే నేనునాశరీరయాత్రగావింపగలిగియున్నాను. ఇక (2) బుద్ధి కుపాదానము సూర్యుడు కనుక సూర్యునందలి అమృతాత్మ మూలకమగు నమృతభాగమువలన వైరాగ్యాది నాల్గువిద్యాభావ లుత్పన్నములగును. అట్లే మర్త్యభాగము వలన రాగద్వేషాది నాలుగవిద్యాభావలు వికసిల్లును." ఇందు మొదట విద్యాబుద్ధులం దెలిసికొందము.

(1) వైరాగ్యలక్షణ విద్యాబుద్ధి :—పుత్రమిత్రకళత్ర గృహవిత్తాదులం దుపేక్షాబుద్ధి వైరాగ్యము. (దృష్టానుశ్రవిక విషయవితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్) ఇది కలవానియాత్మ సంపూర్ణవైభవ విశాలమగును. అతడు మహాత్ముడనదగును. ఎట్లన :-నొకడు పైసకొరకు ప్రాకులాడును. ఇంకొకనికి లక్షలు కలసివచ్చినను "రాజ్యంసురాణా మపిచాధిపత్యం" లెక్క సేయడు. మొదటివాని యాత్మకంటె రెండవవాని యాత్మ విశాలము కదా! ఇదియే భగవత్త్వసంపత్తికి మొదటిమెట్టు. లోకత్రయసంపత్తియంతయు నతనిముందర తుచ్ఛమగును.

(2) జ్ఞానలక్షణవిద్యాబుద్ధి :—కొలదియో గొప్పయో జ్ఞానమందరకు గలదు. కాని యంతమాత్రమున భగసంపత్తి

యము. జ్ఞానమున కనేకధారలు కలవు :-ప్రస్తుతము రెండు ధారలను గురించి చూతము. (1) ప్రత్యక్షదృష్టమగు ద్రష్టృత్వ లక్షణజ్ఞానము. (2) శబ్దగ్రంథజనితమగు స్మృతిలక్షణజ్ఞానము. విజ్ఞానమువలన పరీక్షితము మొదటిది (Practical work) రెండ వది శ్రుతిమాత్రజ్ఞానము (Theory) ఇందు మొదటిది భగశబ్ద వాచ్యము.

(1) మనము విని నమ్మెదము, పరీక్ష సేయము. కనుక మనది స్మార్తజ్ఞానము. (2) ఎవడే యర్థమునకు ద్రష్టయో (అనగా: పరీక్షకుడు, అనుభవకర్త-సాక్షాత్కర్త) అతడా యర్థమున "తత్రభవాన్" అనబడి యావిషయమునందు ప్రమాణభూతుడగును. అతడే ఆప్తుడు. ఇట్లు చాకలి, మంగలి, దొంగ, వేశ్య అందరును తమతమ విషయములందు "తత్ర భవాన్" వాచ్యులే-ఆప్తులే యగుదురు. "ఆప్తోపదేశః శబ్దః" అను సూత్రవ్యాఖ్యానమునందలి వాత్స్యాయనుని యీ పంక్తులు గమనింపవలయును.

"ఆప్తః ఖలు సాక్షాత్కృతధర్మా. యథార్థదృష్టస్యార్థస్య. చిఖ్యాప యిషయా ప్రయుక్తఉపదేష్టా. సాక్షాత్కరణమర్థస్యాఽప్తిః. తయాప్రవర్తతే ఇత్యాప్తః. ఋష్యార్యమ్లేచ్ఛానాంసమానంలక్షణం. తథాచసర్వేషాం వ్యవహారాః ప్రవర్తన్తే"

ఈద్రష్టృత్వలక్షణజ్ఞానమునుగూడ రెండు భాగములు గావింతుము ; (1) అతీంద్రియపదార్థ ద్రష్టృత్వలక్షణజ్ఞానము.

(2) ఇంద్రియ సాపేక్ష పదార్థ ద్రష్టృత్వ లక్షణ జ్ఞానము: ఈ రెంటియందును ఆప్తత సమానము. కాని భగవత్వమందు భేదము; ఇందు చక్షురాదీంద్రియ ప్రయత్నసాధ్య ప్రత్యక్ష జ్ఞానము రెండవది. అది భౌతిక ప్రపంచార్థము లందందరకు తత్తదుచితముగా ననుభూతమే. ఇక మొదటిది:— భూత, భవిష్యత్, స్వర్గ, నరక, ఆత్మ, పరమాత్మ, ఇత్యాద్యతీంద్రియ పదార్థములందు భౌతిక విజ్ఞానము కుంఠితమగును. ఈ విషయములందు దివ్యదృష్టి, ఆర్షదృష్టి యనబడు తపోమూల యోగదృష్టియే సఫలత నొందును. ఇదియే భగ శబ్దవాచ్యము. ఈ యభియుక్తి జూడుడు.

ఆవిర్భూత ప్రకాశానాం అనభిప్లుతచేతసాం
అతీతానాగత జ్ఞానం, ప్రత్యక్షాత్ నవిశిష్యతే.
అతీంద్రియా నసంవేద్యాన్ పశ్యన్త్యార్షేణ చక్షుషా
యే భావాన్ వచనం తేషాం నానుమానేన బాధ్యతే."

(3) ఐశ్వర్యలక్షణవిద్యాబుద్ధి:-స్వతఃసిద్ధములును, యోగసిద్ధములునగు నణిమా ద్యష్టసిద్ధుల సమష్టియైశ్వర్యనామక భగము. వీనికీశ్వర సంస్థతోడనే సంబంధము: ఎట్లన:— బలతత్త్వము, (1) ఆత్మబలమనియు (2) విత్తబలమనియు రెండు విధములగును. (1) ఆత్మబలము స్వతంత్రము. (2) విత్తబలమాశ్రితము. శరీరమాత్మకు విత్తము. ఆత్మసంపత్తి కనుక శరీరబలమునకు విత్తబలమునం దంతర్భావ మంగీకరింపబడినది. ఇక

ఆత్మబల మైశ్వర్యవాచ్యము. విత్తబలమును శ్రీయందురు. ఈశ్వర సంబంధ ముండుట వలననే యాత్మబల మైశ్వర్య మగును.

ఆయీశ్వరుడే చిన్నలో చిన్నకీటాణువు. ఇదే [1]అణిమా భావము. అతడే మహా విశ్వము. ఇది యతని [2]మహిమా (భూమా) భావము. ఇట్లే [3]గురు, [4]లఘువులు రెండునతడే: (గురువు=బరువైనది, కదలలేనిది) (లఘువు=తేలికైనది, వేగము కలది) అతడొక చోటనుండి యన్ని యర్థములను తనసీమ యందు(లో) గొనియున్నాడు. ఇదే [5]ప్రాప్తిభావము; అతడంత ర్బాహ్యములందు యథేచ్ఛా విహారము గావించుచున్నాడు. ఇది [6]ప్రాకామ్యము. అంతర్యామి రూపమున నన్నిటికి శాస్త యగుచున్నాడు ఇది [7]ఈశిత్వము. సూత్రాత్మయై నియతి దండ మున సర్వము వశీకరించుకొనుచున్నాడు ఇదే [8]వశిత్వము.

జీవుడన్ననో, అతని త్రిగుణమహానాత్మయందు మొదట నెంతబలము నియతమో అంతియే శక్తిగలవాడేగాని పైనుద హరించిన శక్తులు కలవాడు గాడు. జన్మకాలమునందే ఈశక్తు లుండినచో నామనుష్య నీశ్వరు డందుము. యోగ ప్రక్రియా విశేషములవలన నీశక్తి సంసిద్ధియైనచో వానిని యోగి యం దుము.

ఈశ్వరుని యీ యష్టసిద్ధులకును, దేవయోనులందను గ్రహము కలదు. యక్ష, రాక్షస, పిశాచ, గంధర్వ, పితృ,

ఐంద్ర, ప్రాజాపత్య, బ్రాహ్మ, భేదభిన్నులగు నీరిభేదముల వారును దేవయోనులు. వీరి నివాసస్థానము చంద్రధరాతలము. వీరికీ సిద్ధులు జన్మ సిద్ధములు. మనుజుడును ప్రక్రియా విశేష మున వీనిం బొందవచ్చును. ఈ నిదర్శనములను జూడుడు:—

1. అణిమ:— యోగశాస్త్రోక్త మనస్సంయమనము వలన చాలసిద్ధు లలవడును. ఇది యిచ్ఛామాత్రమున నణుత్వ మొందుట (శరీరతః) హనుమంతు డీ సిద్ధివలన సురస శరీరము నుండి వెలువడెను. సీతాన్వేషణము నందీసిద్ధి నుపయోగించు కొనెను.

2. మహిమ:— సురసా విషయమునందీ సిద్ధిని హను మంతు డగపరచెను. చాక్షుషమన్వంతరమున నగు జల ప్రళ యమునందు, భౌమవిష్ణువు మత్స్యరూపమెత్తి ఈ సిద్ధి ప్రభా వమున బెరిగెను. తచ్ఛరీరాశ్రిత నౌకయందున్న ఋషులతో చాక్షుషమనువు ఆ ప్రళయముం దప్పించుకొనెను.

3. గరిమ — శరీరమును గావలసినంత బరువు గలదా నినిగ జేయుట. సౌగంధికా హరణమునందు, నిషధపర్వతము నందు హనుమంతుని తోకనైన కదుపజాలక భీముడు తెల్ల బోవుటయు, రావణుని సభయం దంగదుని కాలి నెవ్వరును కదల్పజాలమియు, కృష్ణుడు చాణూరుని జయించుటయు మున్నగు వానియం దీసిద్ధియే కారణము.

4. లఘిమ:— శరీరమును వాయువుకంటె తేలికపర చుట. దీనివలన పార్థివాకర్షణ ప్రభావముండదు. విమానాద్య

వసరము లేకుండ నాకాశ సంచారము కలుగును. గ్రామదేవతల యాకాశ సంచారము, హనుమంతుని సముద్రోల్లంఘనము, భాగవత శిఖామణి నారదు డాకాశమున దిరుగుట, . ఈ సిద్ధి ప్రభావములే. యోగమునకు (1) ధారణ, (2) ధ్యాన, (3) సమాధులని మూడంగములు. దీర్ఘకాల మాదరపూర్వకముగ నభ్యసించిన యీ మూడు నేకమై సంయమ మనబడును.

"కాయాకాశయోః సంబంధ సంయమాత్.
లఘుతూల సమాపత్తే శ్చాకాశ గమనమ్."

అను పతంజలి సిద్ధాంతానుసారము శరీరాకాశ సంయమనము వలన గురుత్వాకర్షణ విముక్తమై శరీరము తేలికయగును.

5. ప్రాప్తి:— ఒకచో గూర్చుండి దూరవస్తువుల నాకర్షించుట ప్రాప్తి. ఈ శక్తి వలన సిద్ధులు పర్వతోపరి వృక్షాగ్ర ఫలముల నున్నచోటనుండియే తిందురు.

6. ప్రాకామ్యము:— పృథివి, జల, తేజో, వాయ్వాదుల యుపద్రవమునుండి తప్పించుకొనుట. ఈ సిద్ధికల యోగి, గుప్తద్వారమందైన బ్రవేశింపగలడు. జరాసంధుని యాకస్మిక దండయాత్రాసందర్భమున గృష్ణుం డొకదినములోపలనే సముద్రమందలి ద్వారకయందు యాదవులనందరనుజేర్చి యుద్ధమునకు సిద్ధమయ్యెననునది యీసిద్ధివల్లనే. నలచక్రవర్తి యీసిద్ధియందు నిష్ణాతుడు. నలునిజాడ నెరింగివచ్చిన కేశియనుదూతి

దమయంతితో చెప్పు నీసందర్భమందలి శ్లోకములం జూడ వలయును.

> హ్రస్వమాసాద్యసంచారం. నాసౌవినిమతేక్వచిత్
> తంతుదృష్ట్వాయథాసంగముత్సర్పతియథాసుఖం॥
> సంకరేఽప్యస్యతుమహాన్ వివరోజాయతేఽధికః
> తస్యప్రక్షాళనార్థాయ కుంభా స్తత్రోపకల్పితాః
> తేతేనావేక్షితాః కుంభాః పూర్ణాఏవాభవన్ స్తతః
> తృణముష్టిం సమాదాయ. సవితుస్తం సమాదధత్
> అథప్రజ్వలితఃతత్ర. సహసాహవ్యవాహనః
> తదద్భుతవిధం దృష్ట్వా విస్మితాహమిహాగతా.

7. ఈశిత్వము :— అలౌకికకర్మకరణయోగ్యశక్తి ప్రాప్తి ఈశిత్వము. అణిమాదుల నితరములందు ప్రవేశపెట్టుటయే ఈశిత్వము. దీని ప్రభావము వలననే లఘిమాప్రవేశము గావించి కృష్ణుడు గోవర్ధనమెత్తెను. ద్వారకయందుండియే ద్రౌపదీ మానరక్షణ మొసరించెను.

8. వశిత్వము :— తనకంటె బలశాలిని వశముగావించు కొనుట. ఈ సహజశక్తివలననే కృష్ణుడు కాళియహ్రదమున దుమికి, విషధరశిక్ష గావించెను. ఋషులయాశ్రమమందలి క్రూర జంతువులు పరస్పరవైరములుడిగి యుండుట దీనివలననే.

(4) ధర్మలక్షణ విద్యాబుద్ధి :— ప్రాకృతికనిత్యనియమ సమష్టియే ధర్మశబ్దవాచ్యము. ఇదియే వస్తుస్వరూపప్రతిష్ఠ. వర్ణమూలకమగు నీనిత్యధర్మాధారమున మహర్షులు వర్ణాశ్రమధర్మ

వ్యవస్థగావించిరి. అది యే ధర్మశాస్త్రమంకురు. దాని ననుస రించువాడు ధర్మిష్ఠుడనబడును. అట్టి స్వాభావిక ధర్మవృత్తి భగశబ్దవాచ్యము. ధర్మరక్ష యే ధర్మిస్వరూపరక్ష. ధర్మిచే ధృత మగు ధర్మము ధర్మిని ధరించును. ధర్మపరిత్యాగము ధర్మనాశ కమే యగును. ఈ వచనము గమనింపవలయును.

"యోధృతస్సన్ధారయతేసధర్మ ఇతికథ్యతే
ధర్మ ఏవహతోహన్తి ధర్మోరక్షతిరక్షితః.

(5) యశము :—దీనికి బుద్ధియోగ సంబంధము లేకు న్నను, భగవత్త్వస్వరూప సంపాదనయందుపయోగము కలదు. యశమొకవిధమగు సౌమ్యప్రాణము. దీనికి ప్రభవము (మూల కారణము) చంద్రుడు. చంద్రునకు మూడుమనోతలు (1) రేతః (2) శ్రద్ధా (3) యశః, అని. జన్మతః ఈచాంద్రయశః ప్రాణము గల వ్యక్తి లోకమందు యశస్వియగును. లోకమందు కొందరు ధర్మనిష్ఠులయ్యు యశస్సునొందరు సరిగదా విశేషించి అపయ శస్సు నొందుచుండుటయు, ఏమియు జేయకున్నవారు స్వల్ప ముగా జేసినవారు ఒకప్పుడు వ్యతిరేకాచరణులుగూడ యశస్సు నొందుచుండుటయు జూడ నీయశః ప్రాణము ప్రకృతికి జెందిన ట్లెంచవలయును. అనగా, ఈ యశః ప్రాణముకలవాడు యశ స్వియు, లేనివాడు యశఃప్రాప్తికి యోగ్యములగు కార్యము లాచరించియు నపయశస్వియు నగునని ఫలితార్థము.

(6) శ్రీ :—దీనికి పృథివితో సంబంధము. శరీరకాంతియే

శ్రీ. శరీరోపాదానము పృధివి. దానినుండియే శరీరవికాసము. శరీర సుందరతయే శ్రీభావము. దీనికి బుద్ధియోగ సంబంధము లేదు. యశః శ్రీ ఈ రెంటికి బుద్ధియోగ సంబంధ మేల లేదు? ఈ విషయము బుద్ధియోగ ప్రకరణమున జూతము. ఇక్కడ చెప్పదగినది "పై జెప్పిన భగసంపత్తులన్నియు ఎవనియందు జన్మకాలమునుండియు ప్రయాసతో బనిలేకుండ స్వతః విద్యమానములై యుండునో అతడు మానవ శరీరధారియయ్యు భగవంతు డనబడును" అనియే.

ఇప్పుడు:— పై జెప్పిన లక్షణములు కృష్ణునందుబట్టెనా? లేదా? యని చూతము:— (1) వైరాగ్యము:— వైరాగ్య బుద్ధియోగ మూలమగు రాజర్షి విద్యోపదేశమున అర్జునుని రాగ ద్వేషరహితుని గావించిన యాచార్యుడు స్వయముగా నెట్టి వాడో విచారించుట వ్యర్థము. "నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి" ఈవాక్యము వైరాగ్యభావ సూచకము. ఆయన కోరినచో మహా సామ్రాజ్య నిర్మాణము గావించుకొన గలడు. కాని యట్టి వాసనకూడ నతనికి లేదు. కంస సామ్రాజ్య మతని చేజిక్కినను ఏమిచేసెనో అందరు నెరుంగుదురు గదా!

ఇక జ్ఞానము:— ఆయన జ్ఞానశక్తిం జూడ బోయినచో కొయ్యబారిపోదుము. గీతాశాస్త్రమంతయు నందుకు చాలి నంత ప్రమాణము. దాని మథనమున విద్వాంసులకే యూపిరి యాడుటలేదు. అది విశ్వారాధ్యమై యుండగా నతని జ్ఞాన

మీమాంసకు బూనుకొన్నచో ప్రాయశ్చిత్తభాగుల మయ్యె దము.

ఐశ్వర్యము:— దీనినిగూర్చి మాటాడ బనిలేదు. ఐశ్వర్య యోగ ప్రథమ ప్రవర్తకుడు భగవంతుడగు శంకరుడు యోగీశ్వరుడు. యోగ పరమాచార్యుడగు కృష్ణుడు యోగేశ్వరుడు: (యత్ర యోగేశ్వరః కృష్ణః గీతా) చిన్నతనమునుండియు నీ యైశ్వర్య యోగభావ మగపర్చుచుండెను. (మృద్భక్షణ విశ్వ రూపప్రదర్శనము) దుర్యోధన రాజసభలో దూతావస్థయందు విశ్వరూపదర్శనము, జయద్రథ వధయందర్జునరక్షణకు సూర్యుని గప్పుట, విరాడ్రూప దర్శనము, ఈ యోగ సూచకములే.

ధర్మము:— కృష్ణునంత ధర్మపక్షపాతి లేడని ("యదా యదా హి ధర్మస్య") అను వచనమే చెప్పును. వర్ణాశ్రమ మూలక ధర్మమునకు, తత్ప్రతిపాదక ధర్మశాస్త్రమునకు నత డనన్య భక్తుడు. "స్వే స్వే కర్మణ్యభిరతః" "స్వధర్మే నిధనః శ్రేయః" "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" ఇత్యాది రూపమున గొప్ప యావేశముతో భగవంతుడు తన ధర్మనిష్ఠను వెల్లడించెను. యశఃశ్రీ భావములు సుస్పష్టములే. పాండవ విజయ శ్రేయస్సు ఎవరికి లభించెను? ఉగ్రసేనుని రాజ్యపునరావృత్తి గావించిన యశస్సు ఎవరిది? బాలురు, వృద్ధులు, యువకులు, వేయేల యోగులు, జ్ఞానులు- అన్ని స్థితులయందలి ప్రాణులును ఎవని సరస మాధురికి మోహితు లగుచుండిరి?

ఉ. ఆ మధురోక్తు లానయము లాదరహాసము లాదయారసం,
బౌమురిపెంబు లాతగవు లాగమనక్రియ, లామనోహర
ప్రేమకరావలోకములు, ప్రీతి గనుంగొనవేమి, మాధవుం
గామినులేల? నిర్దళిత కర్ములు యోగులు బాయనేర్తురే?

ఈ విధముగ కృష్ణునందు భగవత్వవ్యాప్తిపూర్ణముగ బట్టి యున్నది. కనుక నీయనను భగవంతు డందుము. భగవంతుడనియే కాదు, అచ్యుత భగవాను డందుము.

ఇంతవరకు యశశ్శీలిత్తో చతుర్విధ బుద్ధియోగముల దిగ్దర్శనము గావించితిమి. ఇక క్రిమ పాప్తములును చతుర్విధములునగు అవిద్యాబుద్ధులపై గూడ నొకచూపుంచుట యనుచితము కాదు.

సూర్య నందమృత- మృత్యునామకములగు రెండు భావములు కలవనియు, అం దమృతభాగము వలన చతుర్విధ బుద్ధుల స్వరూపము సంపన్నమగుననియు, ఈవరకు దెలిసి కొంటిమి. ఇక మర్త్యభాగమునుండి చతుర్విధములగు నవిద్యా బుద్ధుల స్వరూపము సంపన్నమగును. వైరాగ్యమునకు విరోధి రాగద్వేష యుగ్మము. (2) జ్ఞానమునకు విరోధి సంమోహము (అవిద్య) (3) ఐశ్వర్య విరోధి అస్మిత, (4) ధర్మవిరోధి అభినివేశము. విద్యాబుద్ధి చతుష్టయమందును లేదా షట్చక్రములందును, భగశబ్దము నిరూఢమైనట్లు ఈయవిద్యా బుద్ధిచతుష్టయమందు యోగమాయా శబ్దము నిరూఢము. మహామాయత్తో

దీనికి నిత్యయోగ ముండుటచే దీనిని యోగమాయ యందురు. మరియునానాభావమే మృత్యుభావము "మృత్యోః సమృత్యు మాప్నోతి య ఇహ నానేవపశ్యతి" (కఠ) అని శ్రుతి. యోగ మాయయే యింకుకు మూలము. మృత్యుభావమే పూర్వకథ నానుసారముగ నవిద్యాబుద్ధిజనకము. కనుక మృత్యుప్రధాన మగు నీయవిద్యా బుద్ధి చతుష్టయమును మనము తప్పక యోగ మాయ యనవచ్చును. "యోగమాయా హరేశ్చైతత్ తయా సంమోహ్యతే జగత్" (సప్తశతీ) అన్నట్లు ఈ యోగ మాయయే మృత్యులక్షణ మోహ ప్రవర్తికయై యున్నది.

యోగమాయయు-భగసంపత్తియు బరస్పరము, పోరా డునవి. యోగమాయజయించును. ఐనచో జరుగునదేమి? క్రమ మునను సరించి చూతము. యోగమాయానుగ్రహమువలన బుద్ధి యొక్క యేకత్వలక్షణవ్యవసాయధర్మ ముచ్ఛిన్నమగును. కాగా, నానాత్వలక్షణయగు నవిద్యాసమావేశమువలన నాబుద్ధి యనేకశాఖలుగా బరిణతమైపోవును. ఇదే యీబుద్ధియొక్క బహుశాఖాలక్షణ మగునవ్యవసాయము.

వ్యవసాయాత్మికాబుద్ధిరేకేహ కురునందన :
బహుశాఖాహ్యనంతాశ్చబుద్ధయోఽవ్యవసాయినామ్. (గీతా)

ఈ యవ్యవసాయమువలన వ్యవసాయాత్మికయగు నేక బుద్ధియొక్క వికాస మణగిపోవును. చివరకు బుద్ధినంటియున్న అవ్యయాత్మయొక్క విద్యాభాగము పరాశక్తులతో నిత్యసంప

స్న మైయున్నను ప్రకాశితముకాదు. కనుక సాధారణమనుష్యులు వ్యామోహమగ్నులై కర్తవ్యాకర్తవ్యమునుండి చ్యుతినొంది పోవుదురు. ఇదే వీరి దుఃఖమునకు మూలకారణము. కనుకనే భగవంతుడు :

"త్రిభిర్గుణమయైర్భావై రేభిః సర్వమిదంతతమ్
మోహితం నాభిజానాతిమా మేభ్యః పరమవ్యయమ్."

అనియెను. ఇందుకు విపరీతముగ భగనామక చతుర్విధ బుద్ధియోగ ముదయమగుచో, భగసంపత్తి జయించుచో— అవిద్యాబుద్ధులు పారిపోవును. అవిద్యావరణము తొలగుట తోడనే బుద్ధియందు స్వస్థతకల్గును. అది సమభావపరిణతినొంద గనే దానిపై నాత్మయొక్క విద్యాప్రకాశానుగ్రహముకల్గును. ఇదే దీని యాత్మసాక్షాత్కారము. ఇదే భగవత్వము. పిమ్మట ననంతములగు నాత్మశక్తులు తమంతతామే వెల్లడియై యీభగ వంతునిసర్వజ్ఞుగావించును. అందువలన నతీతానాగతములన్నియు దెలియును. ఉత్పత్తి, ప్రళయము, ఆగతి, గతి, విద్య, అవిద్య, అన్నియు ప్రత్యక్షములగును. పూర్వజన్మజ్ఞానము కల్గును. కను కనే భగవంతుడు కృష్ణుడు "అపరంభవతోజన్మ పరంజన్మవివ స్వతః" అన్న యర్జునుని జిజ్ఞాసకు, "బహూనిమేవ్యతీతాని జన్మానితవచార్జున। తాన్యహంవేదసర్వాణినత్వంవేత్థపరంతప!" అని సమాధానము చెప్పెను. భగవానునిలక్షణమున నభియుక్తి:

"ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానామాగతింగతిం
వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యోభగవానితి."

ఇంతకు భగవంతుడననేమో తేలినది. ఇక ప్రకృతవిషయముతో సమన్వయము జేయవలయును.

మనవాసుదేవకృష్ణునందు పై జెప్పిన బుద్ధియోగ నిష్ఠా సంబంధములగు వైరాగ్య, జ్ఞానై, శ్వర్య, ధర్మములను నాల్గు భాగముల వికాసమును కలదు కనుక భగవంతుడంటిమి. తన కర్మాత్మను బుద్ధియోగముద్వారా ప్రత్యగాత్మ లక్షణముగల యవ్యయునందు ప్రతిష్ఠితముగావింపుచు సమభావపరిణతింగాంచుటయే అచ్యుతభావము. "అవ్యయాత్మనిష్ఠత్వమచ్యుతత్వమ్" అను లక్షణము ననుసరించి అవ్యయాత్మనిష్ఠయే అచ్యుతనిష్ఠ. కాని, వస్తుతః అచ్యుతభావమునకు "బుద్ధియోగనిష్ఠత్వమచ్యుతత్వం" అని లక్షణముగా నెరుంగవలయును. ఏలయన, బుద్ధియోగనిష్ఠ లేకుండ సమతాలక్షణయోగోదయముండదు. సమత లేనిచో నాత్మయొక్క అచ్యుతధర్మ వికాసముకాదు. చివరకు అచ్యుతభావమునుగూర్చి కారణత్వము బుద్ధియోగనిష్ఠకే సిద్ధించుచున్నదికదా!

అచ్యుతభావమునకు బుద్ధియోగనిష్ఠతో సంబంధము జెప్పినపుడొక విప్రతిపత్తి సిద్ధమగును. ఎట్లన:—వేదవ్యాస, కపిల, కణాదాదులకు గూడ నీదృష్టితో నచ్యుతభగవత్త్వము చెప్పరాదా? ఏలయన:—వారియందుగూడ నీ నాల్గు బుద్ధియోగములందేయొకటిరెండో యుండవచ్చునుగదా? యన్నచో:- అట్లుకాదు, పంకజశబ్దము కమలమునందువలె అచ్యుతశబ్దము

నాల్గు బుద్ధియోగములందును యోగారూఢమైయున్నది. కనుక నేయొకటిరెండో, చివరకు మూడున్నను, అచ్యుతత్వము పొసగదు.

వస్తుతః నాల్గుక్లేశము లవ్యయాత్మచ్యుతికి గారణములు. నాల్గింటియందేయొక క్లేశమున్నను అచ్యుతత్వము పొసగదు. ఏలయన; పూర్ణతవలన హృదయభావము వికసించును. హృదయప్రతిష్ఠయే పూర్ణసమతనుప్రవర్తింపజేయును. పూర్ణసమతయే అచ్యుతభావమునకుజనని. ఒకటి తక్కువైనను విషమత సిద్ధించునుకదా! కనుక జన్మకాలమునుండియు పై నాల్గు నిష్ఠలవికాసము కలవానినే అచ్యుతభగవానుడందుము. వ్యాసాదులు ఒకటిరెండు నిష్ఠలుండుచో భగవచ్ఛబ్దవాచ్యులగుదురే కాని అచ్యుతభగవానులు కాజాలరు. ఇతర భగవంతులకంటె కృష్ణభగవానుని విశేషమిదియే. స్వయముగా వేదవ్యాసాదులు కూడ "కృష్ణస్తుభగవాన్‌స్వయం" అని అంగీకరించిరి. ఇంకొక గొప్పవిశేషము:- పూర్వోక్తచతుర్విధ బుద్ధియోగస్వరూపము సర్వప్రధమమున గృష్ణుడే ప్రపంచమునెదుటబెట్టెను. కనుక నతనిని అచ్యుతభగవానుడనుటయేగాక జగద్గురువని కూడ నంగీకరించిరి (కృష్ణంవందేజగద్గురుం) అచ్యుతభగవత్త్వమే మహాపురుష భావమునకు ద్యోతకము. ఇది జీవునికంటె విలక్షణ ధర్మము.

విద్యాసముచ్చితకర్మయొక్క తారతమ్యము వలన జీవుల

కేను సంస్థలేర్పడుచున్నవి: అగ్ని-వాయు-ఇంద్ర అనునీమూటి తారతమ్యమువలనను, కర్మప్రధానములగు (1) ఖనిజ (అసంజ్ఞ) (2) ఉద్భిజ్జ (అంతస్సంజ్ఞ) (3) జీవజ (ససంజ్ఞ) భేదమున మూడు జీవసంస్థలు ఏర్పడును. అగ్నికి కర్మంతో సంబంధము కలదు. మరియు దీనికి (1) ఘన (2) తరళ (3) విరళ అని మూడవస్థలు. ఈ మూడే వరుసగా పైన జెప్పిన అగ్నివాయు ఇంద్రులు. కనుక నీమూడు జీవసంస్థలును కర్మప్రధానములే. వీనిని వరుసగ [1] వైశ్వానర, [2] తైజస, ప్రాజ్ఞప్రధానములనియు నందురు.

ఇందు, ససంజ్ఞయను మూడవజీవసంస్థ (1) కర్మాత్మసంస్థ (2) చిదాభాససంస్థ (3) ఈశ్వరసంస్థ యని మూడవాంతర భాగములగును. ఇవి వరుసగ (1) కర్మప్రధానము (2) విద్యాకర్మోభయప్రధానము (3) విద్యాప్రధానము నగును.

ఇందు ఈశ్వరసంస్థ (1) ఊర్క్-సంస్థ, (2) శ్రీసంస్థ, (3) విభూతిసంస్థయని మూడు భాగములు. ఈమూడును ఆత్మవివర్తవిద్యాప్రధానములు.

## సప్తసంస్థ జీవపరిలేఖ

1. వైశ్వానరాగ్నిసంస్థ—అసంజ్ఞ —ఖనిజ —కర్మప్రధాన.
2. తైజసవాయు —అంతస్సంజ్ఞ—ఉద్భిజ్జ—కర్మప్రధాన.
3. ప్రాజ్ఞఇంద్ర —ససంజ్ఞ —జీవజ —కర్మప్రధాన.
3. కర్మాత్మ —కర్మప్రధాన.
4. చిదాభాస —విద్యా+కర్మప్రధాన.
5. ఈశ్వర —విద్యాప్రధాన.
5. ఊర్క్ —విద్యాప్రధాన.
6. శ్రీ —విద్యాప్రధాన.
7. విభూతి —విద్యాప్రధాన.

ఇందు చివరవగు ఊర్క్, శ్రీ, విభూతులు మూటి వికాసముగలజీవు డవ్యయుని యాంశికవికాసము కలవాడు కనుక ఈశ్వరాంశగల మహాపురుషుడని భగవదభిప్రాయము. అతడలౌకికు డందురు.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోఽంశసంభవమ్.

తానేకరూపియై యనేకరూపములందు వ్యాపించుటయీశ్వరవిభూతిభావము. ఈ విషయము సూర్యుడు తన ప్రతిబింబములందాతపముద్వారా వ్యాప్తినొందుటతో పోల్చవచ్చును. కృష్ణభగవానుడు సత్యాత్మయవతారము. కనుకనే

ఆసత్యాత్మవలె నితడుగూడ సర్వలోకసాక్షియగుచు విభూతి సంబంధమున జీవమాత్రమందు వ్యాప్తుడగును. ఈదృష్టితో నితని నీశ్వరుడనవచ్చును. ద్వైపాయను డీవిభూతిభావము నిట్లు చెప్పుచున్నాడు.

"గోపీనాం తత్పతీనాంచ సర్వేషామేవదేహినాం
యోఽంతశ్చరతిసోఽధ్యక్షః క్రీడనేనేహదేహభాక్
అనుగ్రహాయభూతానాం, మానుషందేహమాస్థితః
భజతేయాదృశీః క్రీడా యాః శ్రుత్వాతత్పరోభవేత్. (భాగవతే)

వైరాగ్యాది షట్క-సంపత్తియే శ్రీతత్త్వము. అయ్యది శ్రీకృష్ణునందు పూర్ణముగ గలదని యిదివరకే నిరూపింపబడినది. సర్వాతిశాయి భావయుక్తమగు నాత్మబలమే ఊర్క్-బలము. కృష్ణునం దయ్యది వేరుగా జెప్పబనియేలేదు. తాళములన్నియు తాళ శబ్దవాచ్యములయ్యు భూపాలతాళము తాళశబ్దవాచ్యమనట్లు వ్యాసాదులు భగవచ్ఛబ్దవాచ్యులయ్యును అచ్యుతభగవత్త్వము కృష్ణునకే సిద్ధించినది. కనుక తక్క-నవారి శాస్త్రములకు భగవచ్ఛబ్దయోగములేక కృష్ణోపజ్ఞమగు గీతాశాస్త్రమునకే భగవచ్ఛబ్దయోగము కలిగినది. అందువలననే భగవద్గీత భగవద్గీత.

ఇతి భగవచ్ఛబ్దరహస్యమ్.

## అథ గీతాశబ్దరహస్యమ్

శ్రీకృష్ణుడే అవ్యయాత్మప్రాప్తి సాధనభూతమగు బుద్ధియోగనిష్ఠకు ప్రథమద్రష్ట. ఈ ప్రథమద్రష్టృత్వలక్షణ దృష్టిచే నీయుపనిషత్తు 'భగవద్గీతోపనిషత్' (భగవతా-గీతా-కథితా-ఉక్తా-ప్రోక్తా-ఉపనిషత్) అందుము. ఈశ్వరప్రపంచము (1) బ్రహ్మ (2) కర్మయని రెండుభాగములు: విశ్వమందెక్కడ జూచినను (1) తెలిసికొనుట (2) సేయుట (జ్ఞాయతే-క్రియతే) కంటె నేమియులేదు. ఇందు (1) తెలిసికొనుభాగము బ్రహ్మ చేయునట్టిభాగము కర్మ-కనుక (1) బ్రహ్మవిద్య (2) కర్మచర్య. (1) బ్రహ్మతత్త్వమునందు అవ్యయ—అక్షర—క్షర పురుష (నివృత్తి) వివర్తములు మూడు. (2) కర్మతత్త్వమునందు 1. జ్ఞాన, (ప్రవృత్తి) (ఉభయము) 2. కర్మ- (3) భక్తి అని మూడు విభాగములు ఇట్లు 'షట్కాశికమిదం సర్వమ్' అను ననుగమశ్రుతి సార్థకమగుచున్నది. ప్రకారాంతముగజూచినచో బ్రహ్మ:-(1) జ్ఞానాత్మ (2) కర్మాత్మ అని రెండు విధములనియు, నిందొక్కొక్కటి పైవిధమున మూడు విధములగుననియు, ప్రతివస్తువును బ్రహ్మకర్మ మయు మనియు, ఫలితార్థము.

పైనుదహరించిన బ్రహ్మకర్మలుమూడు మూడు తత్త్వముల వేర్వేరుదర్శనములు వెలసినవి: బ్రహ్మతత్త్వమందలి మూడు భాగములందును, (1) క్షర పురుషనిరూపణము వైశేషిక

దర్శనమును, (2) అక్షరపురుషనిరూపణము సాంఖ్యదర్శనమును, (3) అవ్యయ గర్భితాక్షర పురుష నిరూపణ వేదాంత దర్శనమును గావించును. ఇట్లే కర్మతత్త్వమందలి మూడు భాగములంకును. (1) జ్ఞానయోగము (నివృత్తికర్మయోగము) సాంఖ్యదర్శనము నిరూపించును. (2) కర్మయోగము (ప్రవృత్తికర్మయోగము) యోగదర్శనము నిరూపించును. (3) భక్తియోగము (ఉభయయోగము) శాండిల్యయోగము నిరూపించును. ఇంతకు దేలినదేమనగా :— ఇందేశాస్త్రమును, విశుద్ధావ్యయ నిరూపణమును, ముఖ్యముగా జ్ఞానకర్మ భక్తియోగసమన్వయ రూపమును, వీనికంటె సర్వదా విలక్షణమునగు బుద్ధియోగ నిరూపణమును జేసియుండలేదు. ఈ రెంటిని ముఖ్యముగ ప్రపంచమునకు వెల్లడించిన శ్రేయము కేవలము శ్రీకృష్ణునకే దక్కినది. అవ్యయబ్రహ్మయు, బుద్ధియోగప్రతిపాదకమగు గీతాశాస్త్రమును ఆయన నిజసంపత్తియైయున్నవి. ఆయన మతమదియే. గీతయుచ్ఛిష్ట శాస్త్రముకాదు : నవీనశాస్త్రము : గీత నామతమని శ్రీ భగవానుడే చెప్పెను.

యే మే మతమిదం నిత్యం నానుతిష్ఠన్తిమానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యన్తేతేఽపికర్మభిః (గీతా॥)

గీతకు బూర్వముక్షరాక్షరాత్మలకే ప్రాధాన్యము. అవ్యయాత్మనిగూఢమై యుండెను. కర్మాత్మలందు జ్ఞానకర్మలే ప్రసిద్ధములు. భక్తియోగము క్వాచిత్కమైయుండెను. ఒకపక్షము వారు ; "కర్మవిడువుడు, జ్ఞానముపొందుడు" అనియు, మరియొక

వర్గమువారు "కర్మప్రధానము. జ్ఞానమునకై ప్రయాసపడుట వ్యర్థము." అనియు చెప్పుచుండిరి. కాని, గీత "ఏకంసాంఖ్యంచయోగంచ యః పశ్యతిసపశ్యతి" అనుచు, జ్ఞానగర్భిత కర్మయోగస్వరూపము మొదట ప్రపంచమున వెలయించెను. ఇవే బుద్ధియోగమని ప్రసిద్ధినొందెను. దీనితోపాటుగ నిగూఢముగనున్న అవ్యయ విద్యానిరూపణ సేయుటయేగాక ఆసిద్ధాంతముల యాచరణవిధానముగూడ వెల్లడించెను. ఇతర విద్యాశాస్త్రములు సిద్ధాంతమాత్ర ప్రతిపాదకములగు దర్శములన్నచో, గీత తదాచరణరూపమగు విజ్ఞానశాస్త్రమనవచ్చును. అవ్యయుడు విద్యామయుడు. విద్యలు పూర్వోక్తములు నాలుగు. కనుక విద్యాబుద్ధులు నాలుగు. వీనివలన నవ్యయుని విద్యాభాగము ప్రసన్నమగును. కనుక వీనిని విద్యాబుద్ధులనుటతగును. ఇంతకును, అవ్యయపురుషలక్షణ బ్రహ్మవిద్యయు, బుద్ధియోగలక్షణ యోగచర్యయు, కృష్ణోపజ్ఞములగుటచే ఆయన శాస్త్రము భగవద్గీతయందుము.

పూర్వపక్షము :—ఇది సరిగాలేదు. దర్శనశాస్త్రములందంతవివరముగ నవ్యయబ్రహ్మయొక్కయు, బుద్ధియోగముయొక్కయు స్పష్టనిరూపణలేకున్న పోనిమ్ము; వేదమునందు సంహితాబ్రాహ్మణారణ్యకోపనిషత్తులన్నిటియందును స్పష్టముగా నవ్యయప్రశంసయు, బుద్ధియోగప్రశంసయు నున్నది. లేనిచో "సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి" అన్నమనువచనమునకు వ్యాఘాతముకాదా ? వేదపూర్ణతకు లోపమురాదా ? చూడుము :—

## సంహితయం దవ్యయుడు—బుద్ధిప్రశంస

ఇందువచ్చు పర-అజ-అవ్యయ శబ్దము లవ్యయవాచకములుగను, ధీ శబ్దము బుద్ధివాచకముగ నెరుంగవలయును.

1. వియ స్తస్తంభషడిమారజాంసి అజస్యరూపేకిమపిస్విదేకమ్ (ఋక్)
2. సనఊర్జే అవ్యయం పవిత్రం ధామధారయా
3. పునానోరూపే అవ్యయం విశ్వావర్షన్నభిశ్రియః
4. యస్మాన్నజాతః పరో అన్యోఅ స్తియ అవివేశభువనానివిశ్వా(యజు)
5. ధియో యోనః ప్రచోదయాత్
6. పురుష ఏవేదంసర్వమ్.

| బ్రాహ్మణము | ఆరణ్యకము |
|---|---|
| 1. బ్రహ్మవాఅజః (శత) | 1. సవీషపురుషఃసముద్రః(ఐ.ఆ.) |
| 2. పురుషోహిప్రజాపతిః | 2. తద్యోఽహంసోఽసౌ యోఽసౌసోఽహమ్. } ,, |
| 3. యన్నవ్యేతితదవ్యయమ్(గోపథ) | |

## ఉ ప ని ష త్

1. అప్రాణోహ్యమనాః శుభ్రోహ్యక్షరాత్ పరతఃపరః
2. పరాస్యశక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావికీజ్ఞాన బలక్రియాచ
3. దివ్యోహ్యమూర్తః పురుషః సబాహ్యాభ్యంతరోహ్యజః
4. పరాత్పరంపురుషముపైతిదివ్యమ్. 5. పరేఽవ్యయేసర్వఏకీభవన్తి
6. పురుషాన్నపరంకించిత్ సాకాష్ఠాసాపరాగతిః
7. విద్యావిద్యేఈశతేయాస్తుసోఽన్యః. 8. తమేవవిదిత్వాతిమృత్యుమేతి
9. తతస్తుతంనిష్కలంధ్యాయమానః. 10. తద్విజ్ఞానేనపరిపశ్యన్తిధీరాః
11. యస్తువిజ్ఞానవాన్భవతి యుక్తేనమనసాసదా
సోఽధ్వనః పరమాప్నోతి తద్విష్ణోః పరమంపదం.

12. తద్యచ్ఛేద్ జ్ఞానఆత్మని
13. అప్రమత్తేనవేద్ధవ్యంశరవత్తన్మయోభవేత్.

మరియు, "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే" ఇత్యాది వచనములచే వేదశాస్త్రసిద్ధవిషయమునే గీత ప్రతిపాదించుచున్నదిగాని క్రొత్తదేమియుగాదు. "యేమేమతమిదం" అను శ్లోకతాత్పర్యము కృష్ణునికామతము ప్రియమని సూచించునేగాని మరేమియులేదు. కనుక గీతామతము కృష్ణోపజ్ఞమనుట పొసగదు.

సమాధానము :—వేదమునందు అవ్యయప్రశంసయు, బుద్ధియోగప్రశంసయు లేకపోలేదు. కాని, ముఖ్యముగా (1) నాల్గువిధముల బుద్ధియోగముద్వారా అవ్యయప్రాప్తినొందు నుపాయము గీతయొక్క యపూర్వోపదేశము. (2) ఉపనిషత్తులందలి బుద్ధియోగము విశుద్ధజ్ఞానయోగముగా నెంచబడినది. ఆభ్రాంతిని దొలగించి, "బుద్ధియోగము జ్ఞానకర్మల సముచ్చయరూపమనియు, వైరాగ్యజ్ఞానైశ్వర్యధర్మభేదమున నది నాల్గువిధములనియు మొదట నుపదేశించినది శ్రీకృష్ణుడే. వేయేల? కేవల ముపనిషదాధారమున నెంతప్రయత్నించినను అవ్యయవిద్య-చతుర్విధబుద్ధియోగము అను నీవిషయముల వాస్తవికస్వరూపము గీతవలనవలె నవగతము గావించుకొనుట దుర్ఘటమనుట నిశ్చయము. ఈదృష్టితో నీగీతాశాస్త్రము శ్రీకృష్ణోపజ్ఞమని యంగీకరింపవలయును. ఈయపూర్వతవలననే గీత యుపని

ష త్తనికూడ పేరువచ్చినది. ఈవిషయము ముం దుపనిషచ్ఛబ్ద రహస్యమందు జూచుకొందము.

ప్రమాణావసరము :—ఏయర్థముం దెలిసికొనవలయు నన్నను ప్రమాణమవసరము. ప్రమాణములేకుండ ప్రమాతకు, ప్రమితిలేనందున ప్రమేయసిద్ధి కాజాలదు. [ప్రమ (ప్రమితి)= యథార్థజ్ఞానము, దానిని గలిగించుసాధనము ప్రమాణము. దానివలన లభించునర్థము ప్రమేయము. దానిని గోరువాడు లేక త్యజించువాడు ప్రమాత.] ప్రమాణవాదియగు గౌతముని యీసూత్రవ్యాఖ్యానములం జూడవలయును.

ప్రమాణతోఽర్థప్రతిపత్తౌప్రవృత్తిసామర్థ్యాదర్థవత్ ప్రమాణమ్ (గౌ.సూ.)ప్రమాణమంతరేణనార్థప్రతిపత్తిః। నార్థప్రతిపత్తిమంతరేణ ప్రవృత్తి సామర్థ్యమ్। ప్రమాణేనఖల్వయంజ్ఞాతాఽర్థముపలభ్యతదర్థ మభీప్సతి। జిహాసతివా। తస్యేప్సా-జిజ్ఞాసా-ప్రయుక్తస్య సమీహా ప్రవృత్తిరిత్యుచ్యతే। సామర్థ్యం పునరస్యాః ఫలేనాభిసంబంధః సమీ హమానః తమర్థమభీప్సన్, జిహాసన్వా, తమర్థమాప్నోతిజహాతివా। తతస్తుసుఖం, సుఖహేతుశ్చ। దుఃఖం దుఃఖహేతుశ్చ। సోఽయం ప్రమాణార్థోఽపరిసంఖ్యేయః । ప్రాణభృద్భేదస్యఅపరిసంఖ్యేయ త్వాత్।.........అర్థవతిచప్రమాణే, ప్రమాతా, ప్రమేయం, ప్రమితిరితి అర్థవన్తిభవన్తి । కస్మాత్ ? అన్యతమాపాయేఽర్థస్యానుపపత్తేః। తత్రయస్యేప్సాజిహాసాప్రయుక్తస్యప్రవృత్తిఃసప్రమాతా। సయేనార్థం ప్రమిణోతితత్ప్రమాణం। యోఽర్థః ప్రమీయతేతత్ ప్రమేయమ్। యదర్థవిజ్ఞానం సాప్రమితిః । చతసృషుచైవం విధాసుఅర్థతత్త్వం పరిసమాప్యతే. (వాత్స్యాయనః)

ప్రమాణములు (1) ప్రత్యక్షము, (2) అనుమానము, (3) శబ్దము (శాస్త్రము) అని మూడు విధములు. (1) దృష్టి, (2) శ్రుతి, (3) స్మృతి, (4) నిబంధము. ఈనాల్గు ప్రమాణములు నామూటియం దంతర్భావములగును. (1) దృష్టి=ప్రత్యక్షప్రమాణము, (2) శ్రుతి, స్మృతి=శబ్ద (శాస్త్ర) ప్రమాణము, (3) నిబంధము=అనుమానప్రమాణము ఈమూటియందును ప్రత్యక్షప్రమాణము ముఖ్యము. ఏలయన:-ఇతరప్రమాణముల ప్రామాణికత దీనిపై నాధారపడి యున్నది. ఈప్రమాణప్రామాణికతకు చక్షువాధారము. చక్షువునకు సత్యమాధారము. ప్రకృతియందు సూర్యుడు సత్యదేవత. సౌరతత్త్వనిర్మితము చక్షువు. కనుక చక్షువు సత్యమనవచ్చును. ఈశ్రుతిం గమనింపదగును.

"సత్యంవై చక్షుః, సత్యంహివై చక్షుః । తస్మాత్ యదిదానీంద్వౌవివదమానావేయాతాం, అహమదర్శ, మహమశ్రౌషమితి యఏవబ్రూయా

'దహమదర్శమితి.' తస్మాఏవ శ్రద్ధధ్యామః. (శత)

"ఏతద్వైమనుష్యేషు సత్యంనిహితం, యచ్చక్షుః। తస్మాదాచక్షాణమాహుః । యదద్రాక్షమితి । యద్యువైస్వయంపశ్యతి, నబహూనాంచాన్యేషాం శ్రద్ధధ్యాత్। తస్మాద్విచక్షణవతీమేవ వాచంవదేత్। సత్యోత్తరాహైవాస్యవాగుదితాభవతి" (ఐ. ఆర.)

పూర్వము శ్రుతిని శాస్త్రప్రమాణమంటిమి. ఇప్పుడీ ప్రత్యక్షదృష్టి సంబంధముగల వాక్యరూపముగు శ్రుతిని ప్రత్యక్షప్రమాణమే యందుము. వస్తుతః దృష్టి ప్రమాణముకాదు.

దృష్టిమూలకమగు వాక్యమే ప్రమాణముగదా! చూచుట యెంతప్రమాణమో, చూచినవాని వాక్యమునంతే ప్రమాణము. కనుకనే 'ద్రష్టుర్వాక్యంశ్రుతిః' 'నిరపేక్షోరవఃశ్రుతి:' అని మీమాంసాశాస్త్రము లక్షణము గావించెను. ద్రష్టవాక్యమున కితరాపేక్షతోపనిలేమిచే స్వతఃప్రమాణము.

ద్రష్టయొక్క వాక్యమతనికి దృష్టియు మనకు శ్రుతియు నగును. కనుక చివరకు రెండునొకటియే. అందువలన దృష్టియు శ్రుతియు ప్రత్యక్షములై యున్నవి; చెప్పువాని దృష్టి వినువానికి శ్రుతి, యని ఫలితార్థము. ఇట్లు ద్రష్టలగు ఋషివాక్యములగు వేదము మనకితర ప్రమాణాపేక్షలేని శ్రుతి. "సాక్షాత్కృత ధర్మాణః ఋషయోబభూవుః । తేఽవరేభ్యః అసాక్షాత్కృత ధర్మభ్యః ఉపదేశేనమంత్రాన్ ప్రాదదుః" (యా.ని.)

ఇక అనుమాన ప్రమాణమును విచారింతము. "శ్రోతుర్వాక్యం స్మృతిః" అన్నట్లు విన్నవాని వాక్యము స్మృతియందురు; అనుభవాహితసంస్కారము స్మృతి. వస్తుతః అనుభవాహితసంస్కారము వాసన. ఈ వాసనాసంస్కారపుంజమే చివరకు స్మృతిజనకమగును. కనుక తాచ్ఛబ్దన్యాయమున వాసననే స్మృతి యందురు. సౌరతేజోమయ సత్యదృష్టిగలవాక్కు శ్రుతి యనియు, శ్రుతివిషయకమై చాంద్రప్రజ్ఞానమనోధిష్ఠితమగు, వాసనాపుంజప్రధానమగు వాక్కు స్మృతియనియు ఫలితార్థము. సంగ్రహముగ సూర్యతేజము శ్రుతి, చంద్రతేజము స్మృతి : శ్రుతి స్వతః ప్రమాణము. స్మృతి పరతః ప్రమాణము.

ద్రష్టయొక్క వాక్యము శ్రోతలకు శ్రుతి. శ్రోతయొక్క వాక్యము శ్రోతలకు స్మృతి: ద్రష్ట తనవాక్యమున "తత్రభవాన్" ఆప్తుడు. శ్రోతయో యట్టివాడుగాడు, ఆ ప్తవచనస్మర్త మాత్రమే. ప్రవర్తకుడుగాడు, అభినేతమాత్రమే. కనుక స్మర్త వాక్యములు మూలవక్త కనుకూలములైనంతవరకే ప్రమాణ ములు. కనుక శ్రుతికి దృష్టితోడను, స్మృతికి శ్రుతితోడను సంబంధము. కనుక దీని ననుమానప్రమాణమందుము. ఏల యన:-ద్రష్టలగువారికే దృష్టిప్రమాణము. శ్రోతలకనుమానమే ప్రమాణముకదా !

ఇక నిబంధవిషయము :—నిర్ణయసింధు, ధర్మసింధు, ఇత్యాదులు నిబంధము లనబడును. ఇవి మన యల్పజ్ఞతవలన శ్రౌత స్మార్త వచనములందర్థవిరోధము దోచినచో తర్క- న్యాయములద్వారమున నొక నిర్ణయవ్యవస్థను మనయెదుట నుంచును. మన కర్మకలాపమంతయు వీనిపై నాధారపడి యున్నది.

ఈవిధముగ సత్యజ్ఞానము ఈ నాల్గుప్రమాణములపై నాధారపడియున్నది. ప్రమాణశూన్యవిషయము లేదా అర్థము భారతీయదృష్టికి ఉన్మత్తప్రలాపము; హేయము. ఇందు ప్రత్య క్షము సర్వశ్రేష్ఠము. ఇక ద్రష్టయొక్క వాక్యము ననుసరించి స్మృతియు ఈ రెంటి విరోధసమన్వయము గావించు నిబంధమును గూడ అర్థనిర్ణయమునకు పిమ్మట ననుభూతికి సహకారులు. ఈవిధముగ ప్రమాణాంశము లందరకు నొకవిధముగనేయున్నను

పేరులందుమాత్రమే భేదము. మహర్షులు విజ్ఞానదృష్టితో దృష్టి, శ్రుతి, స్మృతి, నిబంధములని పేర్లు పెట్టిరి. ఇతరులకీ సూక్ష్మ దృష్టి లేదు.

మహర్షుల యీగుప్తవిజ్ఞాన మెరుగమిచే "లిపిలేనందున ముఖాముఖిగ వినుటచే దీనిని శ్రుతియని" రను విదేశీయ విద్వన్నిర్ణయ మెంత యశుద్ధమో, దానికి దాళము వేయు మనవారి తెలివితేటలెట్టివియో గమనింపవలయును.

ఇక:— పై ప్రమాణచతుష్ట యాధారమున గీత స్వతః ప్రమాణమా? పరతః ప్రమాణమా? యనిచూతము. ప్రాచీనుల దృష్టియందిది స్మృతి. అదియొకవిధముగ సరియైనదియే, అయినను స్వకీయచతుర్విధబుద్ధి యోగసంబంధమువలన గీతను శ్రుతి శాస్త్రమర్యాదనుండి యొక్కమారుగ బయటికి త్రోసివేయజాలము. గీతావిషయమునకు కృష్ణుడపూర్వద్రష్ట. ద్రష్టృవాక్యమగుటచే నయ్యది శ్రుతియు, స్వతఃప్రమాణమునై యున్నదనుట సిద్ధము. కనుకనే సామాన్యదృష్టితో గీత స్మృతియు, ఉపనిషత్తునై యున్నది. ప్రాచీన మతానుసార ముపనిషచ్ఛబ్దము కేవలము వేదాంతిమభాగవాచకము. గీతకు ప్రథమప్రవక్త శ్రీకృష్ణుడే యగుటకుపనిషత్తనుటకును జే చాలినంతప్రమాణము. ఇట్లు కృష్ణోపజ్ఞమగు గీతను భగవద్గీతా యనవచ్చును.

అయినను అభినివేశచికిత్స బ్రహ్మకైనను దుస్సాధ్యము. గీతాశబ్దసంబంధమున నిదేస్థితి. పూర్వోక్తకథనమువలన నీవిప్రతి

పత్తి కొలగింపబడినను వేదాభినివిష్టులగువారు "గీతాశాస్త్రము కృష్ణోపజ్ఞముకాదు. అందువలన దీనిని భగవత్ గీతాయనరాదు" అనిచేయందురు. మరల "పునస్తత్రావలంబిత్తో బేతాళః" అన్న ట్లగును. వారి

పూర్వపక్షము:— స్వరూపమిట్లుండును. "గీతయందు వలెనే యుపనిషత్తులందును అవ్యయబ్రహ్మ యొక్కయు, బుద్ధి యోగముయొక్కయు నిరూపణకలదు. క్షరబ్రహ్మకార్యము, అక్షరబ్రహ్మకారణము, అవ్యయబ్రహ్మకార్యకారణశూన్యము కనుక గీత "నకరోతి నవిప్యతే" యనుటకు ఉపనిషత్తునందలి "నతస్యకార్యం కరణంచవిద్యతే" యను వాక్యమాధారము. రజస్సులనబడుభూరాది లోకములారును సత్యాత్మయగునవ్య యాధారమున బ్రతిష్ఠితములన్న "వియస్తస్తంభషడిమారజాంసి అజస్యరూపేకిమపిస్విదేకమ్" అను నట్టివచనాధారమున గీత "యోలోకత్రయమావిశ్యబిభర్త్యవ్యయఈశ్వరః" అన్నది. గీత యందు అవ్యయపరములైయున్న పర-అవ్యయ, అజ, ఉత్త మాది శబ్దములన్నియును అనగా: 'అజోఽపిసన్నవ్యయాత్మా' 'పరస్తస్మాత్తుభావోఽన్యః' 'ఉత్తమఃపురుషస్త్వన్యః' "యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాదపిచోత్తమః" "అవ్యక్తోఽక్షరమి త్యాహుః" ఇత్యాదులన్నియు, ఉపనిషత్తులందున్న: "అక్షరా త్పరతఃపరః" 'పరేఽవ్యయేసర్వఏకీభవన్తి' ఇత్యాద్యాధారములు కలవియే. ఇక —

బుద్ధిద్వారా అవ్యయునిదర్శించు బుద్ధియోగము జ్ఞాన

కర్మసముచ్చయరూపమనియు, వైదిక కర్మకలాపమంతయు దీనిపై నాధారపడియుండుననియు అందువలన క్లేశనివృత్తియగు ననియుగూడ వేదమందున్నదే: ప్రతికర్మకు నుపసంహారమున 'ఏవంవిత్' (ఇట్లు తెలిసినవాడు) అని యుండుచుండును. వేనేల? 'ఏకంసాంఖ్యంచయోగంచ యఃపశ్యతిసపశ్యతి' "నకర్మణామనారంభా న్నైష్కర్మ్యంపురుషోఽశ్నుతే" ఇత్యాదిగ గీతయందున్న జ్ఞానకర్మసముచ్చయరూపబుద్ధియోగము స్పష్టముగ నుపనిషత్తులందును కలదు: ఈవచనములంజూడవలయును.

"తమేవధీరోవిజ్ఞాయ. ప్రజ్ఞాంకుర్వీతబ్రాహ్మణః"
"తమేవవిదిత్వాఽతిమృత్యుమేతినాన్యః పంథావిద్యతేఽయనాయ"
"యఏవంవేద. తరతిశోకమాత్మవిత్: యోహైవం విద్వాన్"

ఇత్యాదులన్నియు బుద్ధియోగసూచకములే, స్పష్టముగా జూడుడు.

"తృష్ణాలజ్జాభయం దుఃఖం విషాదోహర్షఏవచ
ఏభిర్దోషైర్వినిర్ముక్తః సజీవః శివఉచ్యతే
తస్మాద్దోషవినాశార్థం ఉపాయం కథయామితే
జ్ఞానంక్వచిద్వదంత్యత్ర కేవలం తన్నసిద్ధయే
యోగోపిజ్ఞానహీనస్తు నక్షమోమోక్షకర్మణి
తస్మాద్జ్ఞానంచయోగంచ ముముక్షుర్దృఢమభ్యసేత్." (యోగశిఖ)

కనుక గీతకృష్ణోపజ్ఞము కాదందుము. ఇందు క్రొత్తదేమియు లేదు.

సమాధానము :-"ఈపూర్వపక్షమందు కొంచెము వాలికత్వ కలదు. గీతోక్తవిషయము లుపనిషత్తులందున్నదియు

నిజమే" అని యంగీకరించి గీతాశబ్దము సింకోకవిధముగా సమర్థించుకొందము. ఆత్మవిద్య నుపనిషత్తనియు, దానిని ప్రతిపాదించు శాస్త్రముగూడ నుపనిషత్తనియు వ్యవహరింతురు. ఈవిషయమున గీత కుపనిషత్త్వమునందు బాధలేదు. వేదమందు ఉపనిషత్తంతిమరూపమై ఈశ, కేన, కఠాదిశాఖాభేదమున ననేకమై శ్రౌతీఉపనిషత్ అనబడుచున్నది. గీతయన్ననో స్మృతియయ్యు నుపనిషత్త్వమున నొప్పుచున్నది. దీనికి సాక్షాత్కర్త భగవంతుడు శ్రీకృష్ణు డలౌకికామానవపురుషుడు. అయినను స్మృతియే కనుక స్మార్తీఉపనిషత్తు అనవచ్చును గదా? పోనీ కేవలముపనిషత్తనుటకు మనస్సొప్పకున్నందున స్మృతిత్వజ్ఞాపకార్థము గీతాశబ్ద ముపయోగించుకొనవచ్చును. శ్రౌతోపనిషత్తులందు పరస్పరభేదసూచన ఈశ, కేనేత్యాది నామములు గావించునట్లు తదనుసారిణి యగు నీయుపనిషన్నామము భగవత్-గీతా-యను శబ్దములచే స్మార్తోపనిషత్త్వము సూచించునదనవచ్చును.

అయినచో 'గానముచేయబడిన' అనునర్థ మిచ్చునట్టి గీతాశబ్దమేల? కథితా-ఉక్తా ఇత్యాది శబ్దము లుపయోగించినచో నేచిక్కు లేకుండునే? యన్నచో సంకుచితభావమును వ్యాపనగలదిగ జేయుటయే గానమగును. సామస్వరూపమిదియే. కనుకనే 'గీతిషుసామాఖ్యా' 'ఋచ్యధ్యూఢం సామగీయతే' "ఋచాసమంమేనే తస్మాత్సామ" "త్రిచంసామ" ఇత్యాదు

లీవిషయమునే సూచించునుగదా। నూతనత్వము లేకున్నను ఉపనిషత్తులందు సంకుచితముగ నున్నవిషయమునే విస్తరించి వ్యావహారిక రూపమున స్పష్టముగావించిన దీనికి గీతాశబ్దము తగును. శ్రౌత ఉపనిషత్తుల లక్ష్యము సంపూర్ణాత్మప్రపంచమో, పరాత్పరుడో అయినచో గీతాలక్ష్య మవ్యయబ్రహ్మమాత్రమే. ఇక ఉపనిషత్తులందలి యోగశబ్దముయొక్క యర్థమెట్లున్నను చతుర్విధబుద్ధియోగస్పష్టీకరణము మాత్రము కేవలము గీత సొత్తే. దానికి ద్రష్ట శ్రీకృష్ణుడే. అందుకు దాని కుపనిషత్వ మంగీకార్యమే, కాగా మొత్తముపై కృష్ణోపజ్ఞము కాదందురు గనుక "తుష్యతుదుర్జనః" అను న్యాయప్రకార మాభేదసూచనకు గీతాశబ్దము ప్రయోగింపబడిన దనుకొనవలయును.

ఇచట నొకవిషయము మరువరాదు. గీతాశబ్దము యౌగికమేగాని పంకజాదిశబ్దములవలె యోగరూఢముకాదు. కనుక ఉపనిషత్ శబ్దవిశేషముగా నెంచవలయునుగాని ప్రత్యేక శబ్ద మనుకోరాదు. స్వయముగ వ్యాసుడుగూడ నీవిశేషణభావమును వెల్లడించెను.

"సముపోఢేష్వనీకేషు కురుపాండవయోర్మృధే
అర్జునే విమనస్కేచ గీతాభగవతాస్వయం."

కనుకనే అధ్యాయసమాప్తియందు: 'భగవద్గీతాసు— ఉపనిషత్సు' అని యుండుట - అటుగాక యాశబ్దము రూఢమే యగుచో 'భగవద్గీతాయాముపనిషత్సు' అనియుండును. ఇట్లు

గీతాశబ్దము విశేషణమయ్యును, దాని యపూర్వతవలన క్రమముగా రూఢమైపోయి 'గీతా' యన్నంతమాత్రమున 'అను గీతా, రామగీతా, శివగీతా' ఇత్యాదులందు పోక కేవలము భగవద్గీతోపనిషత్తు సంజ్ఞామాత్రమే మన ధ్యానమాకర్షింపబడుచున్నది. ఇతి : గీతాశబ్దరహస్యమ్.

ఉపనిషచ్ఛబ్దరహస్యమ్ :—అన్యత్ర వ్యాఖ్యాతమగు నీవిషయ మచటగూడ జూడవలయును. ప్రకరణసంగతికొరకు మాత్ర మిచట నించుక చర్చించుకొందము :—

పూర్వపక్షము :—పూర్వము గీతాశబ్దరహస్యమునందు "యత్కించిత్పదార్థతావచ్ఛేదకావచ్ఛిన్నేశబ్దస్యశక్తిః" అను నియమము ననుసరించి ఆత్మవిద్యాత్వ ముపనిషచ్ఛబ్దావచ్ఛేదకముగా జెప్పబడినది. కేవలము ఈవిధముగ ప్రాచీను లంగీకరింపరు. ఏమన :-వారిమతమున, వేదాంతత్వ ముపనిషచ్ఛబ్దావచ్ఛేదకము. వేదము (1) మంత్ర, (2) బ్రాహ్మణభేదమున రెండు విధములు. బ్రాహ్మణము (1) బ్రాహ్మణము, (2) ఆరణ్యకము (3) ఉపనిషత్తు అని మూడు విధములు. ఇట్లు మొత్తము వేదము నాల్గువిధములగును.

ఇందు (1) మంత్రభాగము విజ్ఞానస్తుతీతిహాసములను, (2) బ్రాహ్మణము కర్మకాండను, (3) ఆరణ్యకము ఉపాసనను, (4) ఉపనిషత్తు జ్ఞానకాండను నిరూపించును. జ్ఞానయోగ ప్రతిపాదకోపనిషత్తు వేదమున కంతిమభాగము కనుక "సర్వే

వేదాంతాః" అని వేదాంతనామమున వ్యాసాదులు వ్యవహరించిరి. వ్యాససూత్రము లీయుపనిషద్వచనార్థ నిర్ణయము గావించునవై వేదాంతదర్శన మననొప్పుచున్నవి. ఇట్లుపనిషచ్ఛబ్దము వేదాంతిమరూపములగు ఈశాద్యుపనిషత్తులందు రూఢమై యున్నది. గీతాశాస్త్రము వేదమున కంతిమభాగము కాదు. కనుక వేదాంతత్వ ముపనిషచ్ఛబ్దావచ్ఛేదకమను నియమ ప్రకారము, గీత నుపనిషత్తనరాదు. స్మృతియనుటయే తగును. స్మార్తోపనిషత్తనుటయు సంభవింపదు: అట్టి దెచ్చటను లేదు.

## (మతాంతర) సమాధానము (ప్రస్తుతము)

గీతోపదేష్ట సామాన్యవ్యక్తి కాడు. ఉపనిషత్తులు వేదాంతములన్న వ్యాసాదులు కూడ స్వయముగ నతనిని పూర్ణావతారమని యంగీకరించిరి. వేదద్రష్టలగు మహర్షులకంటె నతని కున్నతస్థానము కలదు. తదుపదిష్ట గీత శ్రౌతోపనిషత్తుల కెందును దీసిపోదు. అందలి యాత్మవిద్య భగవానునిచే గనుగొనబడినది. కనుక నది ద్రష్టయొక్క వాక్యము. ఈసాధర్మ్యము నంగీకరించి, పూర్ణావతారోపదిష్టము కనుక, గీతనుపనిషత్తన్నను బాధలేదు. కనుక అది స్మృతియైనను ప్రాచీనులుపనిషత్తనిరి. శ్రుతి లెక్కలోనికి రాకున్నను, శ్రౌతోపనిషత్తుల కెందును దీసిపోకున్నను, ఇది స్మార్తోపనిషత్తనుటకు కూడ తగదనుట న్యాయ సంగతము కాదనుటయే ప్రస్తుత సమాధానము. ఇంకను :—

ఇప్పటిమనవారికి ఆర్యసాహిత్యమంతయు కంటకప్రాయముగ

నున్నను, గీతాశాస్త్రము మాత్ర మత్యంతాదరణీయముగ నున్నది. పెక్కుమంది పెక్కువిధముల వ్యాఖ్యానములు గావింపుచు తమతమ యుచ్ఛృంఖల విహారములకన్నింటికిని గీతయందు ప్రమాణములు జూపుచు దాని నడ్డముగా బెట్టుకొని, గీతోపదిష్టసిద్ధి కనుకూలములగు యజ్ఞదాన తపస్సులకేమి, స్వభావసిద్ధములగు వర్ణాశ్రమాచారాదులకేమి వారివారి యిష్టానుసారము గీతామతనిర్ణయము గావించియు, గావింపుచునున్నారు. మొత్తము పైవారిమతమున గీత కర్మయోగశాస్త్రమేకాని ఆత్మవిద్యాశాస్త్రముకాదు. ఇందు కొందరు ప్రాచ్య పాశ్చాత్యసాహిత్య తులనాదృష్టితో జాలప్రయాసపడి, ఉపక్రమోప సంహారబల విమర్శన పూర్వకముగా "గీతకర్మయోగశాస్త్రమే" యని తేల్చుటకు గావించిన పరిశ్రమ యెంతయు స్తుతింపదగినదే. కాని, గీత కర్మయోగశాస్త్రమే యైనచో దానికుపనిషత్తను పేరే వచ్చియుండదు. ఏలయన:— కర్మ - ఉపాసన - జ్ఞానములు పూర్వము చెప్పినట్లు వేదమందలి బ్రాహ్మణ - ఆరణ్యక - ఉపనిషత్తులందు క్రమముగా నిరూపింపబడినవి. అందు కర్మయోగమునకు బ్రాహ్మణములతో సంబంధము కలదు. ఉపనిషత్తు జ్ఞానయోగసూచకము. ఇట్టి స్థితిలో గీత జ్ఞానయోగసూచకమగు నుపనిషచ్ఛబ్దముతోగాక కర్మయోగోపయికమగు బ్రాహ్మణశబ్దముతో "భగవద్గీతా బ్రాహ్మణ" మని యుండవలసినది. అట్లులేదు. ఉపనిషత్తెందుకు జ్ఞానయోగశాస్త్రమో, గీతయు నందుకే యుపనిషత్తు.

ఈస్థితిలో మనము దానిని జ్ఞానయోగశాస్త్రము లేదా బుద్ధి యోగశాస్త్రమని యంగీకరింపవచ్చునుకదా!

శంక :—అయినచో "ఉపనిషత్సు అనుదానికి పిమ్మట 'యోగశాస్త్రే' యని ఉపసంహారమున్నది. ఆ యోగశబ్దము "లోకేఽస్మిన్ద్వివిధానిష్ఠా" యను సిద్ధాంతము ప్రకారము కర్మ యోగసూచకము. కనుక గీతను కర్మయోగశాస్త్రమనవచ్చు" నన్న చో:

సమాధానము :—ఆ యోగశబ్దము కర్మను సూచించు ననుట కాధారమేమి? సాంఖ్యశబ్దముతో పాటువచ్చు యోగ శబ్దమునకు గర్మయోగమర్థమనుకొన్నను స్వతంత్రముగావచ్చు యోగశబ్దమునకు నదేయర్థమనుట పొసగదు. అట్లు స్వతంత్ర ముగా గీతయందు యోగశబ్దము వచ్చినచోనెల్ల కర్మగర్భిత జ్ఞానయోగమో, బుద్ధియోగమో, సూచించునని జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఒకచోట గీత "దూరేణహ్యవరంకర్మ బుద్ధియోగాద్ధనంజయ" అని బుద్ధియోగమునెదుట కర్మయోగ మును నిందగూడ జేసెను. "యోగః కర్మసుకౌశలం" "యోగ యుక్తాత్మా—యోగీభవార్జున, సయోగీపరమోమతః" యోగీ నియతమానసః, యోగీవిగతకల్మషః, యోగినంసుఖముత్తమం, "యోఽయం యోగస్త్వయాప్రోక్తః సామ్యేన" సయోగీ మయివర్తతే, కర్మిభ్యశ్చాధికోయోగీ-ఇత్యాది స్థలములందు యోగ-యోగిశబ్దములు బుద్ధియోగ-బుద్ధియోగి సూచకములే. "దదామిబుద్ధియోగంతం" అని భగవంతుడు బుద్ధియోగమునే

వరముగా నిచ్చెను. కనుక "యోగశాస్త్రే" అనుదానికి అందును ఉపనిషత్పూర్వకమగు యోగశాస్త్రే అనుదానికి "కర్మయోగశాస్త్రే" యని యర్థమెన్నడును కాజాలదు. అట్లయినచో "భగవద్గీతేషు బ్రాహ్మణేషు యోగశాస్త్రే" యని యుండవలసినదే.

శంక :—అట్లయినచో భగవంతునకు జ్ఞానయోగమో, సన్న్యాసమో ఇష్టమయినచో కర్మయోగమును స్తుతించుచు, జ్ఞానయోగమును నిందింపనేల ? చూడుము :-

"నచసన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి
నియతం కురుకర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః
కర్మణైవహిసంసిద్ధిమాస్థితాజనకాదయః
"నానవాప్తమవాప్తవ్యంవర్త ఏవచకర్మణి." ఇత్యాది.

కనుక గీత కర్మయోగమేకాని జ్ఞానయోగమును ప్రతిపాదింప దనవచ్చును.

సమాధానము :—యుక్తి, సుందరము, ప్రమాణయుక్తమేకాని గీత రహస్య పూర్ణశాస్త్రము. దాని వాస్తవికాభిప్రాయము దెలిసికొనుట అంత సులువైనపని కాదు. వినుము :- వేదము మంత్రబ్రాహ్మణభేదమున రెండు భాగములని యిదివరకే చెప్పియుంటిమి. ఈరెంటికి మూలప్రతిష్ఠ జ్ఞానము—కర్మ. జ్ఞానములేకుండ కర్మసాగదు. కనుకనే మహర్షులు వేదమును జ్ఞాతవ్య-కర్తవ్య భేదమున రెండుభాగములు జేసిరి. విజ్ఞానస్తుతీతిహాసములు జ్ఞాతవ్యములు; మంత్రభాగము

వీనిం జెప్పును. కర్తవ్యములు కర్మ, ఉపాసన-జ్ఞానములు. వీనిని బ్రాహ్మణభాగము చెప్పును. అందు కర్మను బోధించుభాగము విధి. ఉపాసనను జెప్పుభాగ మారణ్యకము. జ్ఞాననిరూపకభాగ ముపనిషత్తు అందురు. ఈమూడు కర్తవ్యములందును కర్మ-జ్ఞానమధ్యపతితమగు నుపాసనయే బుద్ధియోగనిష్ఠ. ఈమూటి యందును (1) కర్మయోగము యజ్ఞముద్వారా ప్రాప్తములగు నైహలౌకికవిజయములకు మార్గము జూపుచున్నది. (2) బుద్ధి యోగము పారలౌకిక శాశ్వతసుఖప్రాప్తి కుపాయము జూపు చున్నది. (3) జ్ఞానయోగము బ్రహ్మనిరూపణ గావించుచు, పరాముక్తియను కైవల్యముక్తిపథము జూపుచున్నది. అభ్యు దయ నిశ్శ్రేయసకరములగు నీమూడు పాయములకంటె మించిన యింకొకటేమియు లేదని లోకవ్యవహారమే ప్రత్యక్షప్రమాణము. కనుక నైహలౌకి ఫలాసక్తి గోరువారికి గర్మనిష్ఠయు, అది పతనసామగ్రియని వైరాగ్య ముదయించినచో కర్మత్యాగలక్ష ణముగల మూడవ సాంఖ్యనిష్ఠయు, నిందొకటి గృహస్థులకును; రెండవది సన్యాసులకును సంబంధముకలవై యున్నవి.

ఇక రెండవదగు బుద్ధియోగనిష్ఠయన్ననో, పైరెంటికి మధ్యస్థమై "తన్మధ్యపతిత స్తద్గ్రహణేనగృహ్యతే" యను న్యాయ ముననుసరించి కర్మజ్ఞానోభయాత్మకమై యున్నది. పైరెండు నిష్ఠలకు ముఖ్యచిహ్నములు వరుసగ కామన-పరిత్యాగము; అని రెండు. కామనాలక్షణముగలది ప్రవృత్తి - పరిత్యాగ లక్షణము గలది నివృత్తి-ఇందు (బుద్ధియోగమున) నీరెండును కామనాపరి

త్యాగరూపమున నేకీభవించి యొకేరూపము నొందుటచే, నిది రెండు నిష్ఠలను జెందియున్నట్లున్నను చివరకు జ్ఞానయోగము నందే చేరికనొందును. మధ్యస్థమగు నారణ్యకము నుపనిషన్నా మమున బిలుచు ఋషులయభిప్రాయము కూడ నిదియే యన వచ్చును: (బృహదారణ్యకోపనిషత్) బుద్ధియోగమునందిట్లు ఉపేక్షా (ఉప + ఈక్షా = దగ్గరచూపు) రూపజ్ఞానయోగముచే అపేక్షా (అప + ఈక్షా = తప్పుచూపు) రూప కామనాపరిత్యా గమువలన సర్వకర్మప్రవృత్తియున్నను, వాసనారహితమగుట వలన నిర్లేపతచే నది నివృత్తిరూపమేయై జ్ఞానయోగ పర్యవ సానముచే ముక్తి సిద్ధి కారణమగును.

కనుకనే: భగవంతుడీ బుద్ధియోగము నెక్కువగ నభి మానించెను. అతడు స్వయముగ జ్ఞానయోగపక్షపాతి (జ్ఞానీ త్వాత్మైవమేమతం" కాని అంకుకొంచెము సంశోధన జేయ వలయునని యతనికోరిక; కర్మయోగమునందు భయంకరపరి ణామము దెచ్చిపెట్టునది వాసనాలేపము. దానికి భయపడి కర్మ పరిత్యాగలక్షణ జ్ఞానయోగము నాశ్రయించినను, అది విడిచి పోదు. కనుక దానికి మూలమగు కామనాపరిత్యాగమే తగిన పని "కామ్యానాం కర్మణాంన్యాసంసన్యాసం కవయోవిదుః" కర్మవిడిచి కామనవిడువకున్న సన్యాసము సిద్ధికి కారణము. కాదు. "నచసన్యసనాదేవసిద్ధింసమధిగచ్ఛతి" కామన విడిచి నచో కర్మ విడువవలసినపనియేలేదు. కర్తవ్యమును లేదుగనుక నికనట్టివాని, నియతకర్మలందు, లోకసంగ్రదృష్టి యావేశిం

చును. లోకోపకారక కార్యములతనికి కర్తవ్యములగును. "నియతంకురు కర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః" "లోక సంగ్రహమేవాపి సంపశ్యన్‌కర్తుమర్హసి" "నానవాప్తమవాప్తవ్యం వర్తఏవచకర్మణి" శ్రీకృష్ణుడిట్లు జ్ఞానయోగమును సంశోధించి దానికి విలక్షణమగు బుద్ధియోగరూపము నిచ్చెను. దీని మహత్త్వమును నతడే యిట్లు వర్ణించెను.

దూరేణహ్యవరంకర్మబుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌశరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః,
బుద్ధియుక్తోజహాతీహ ఉభేసుకృతదుష్కృతే
తస్మాద్యోగాయయుజ్యస్వయోగః కర్మసుకౌశలం॥
తపస్విభ్యోధికోయోగీ జ్ఞానిభ్యశ్చమతోధికః
కర్మిభ్యశ్చాధికోయోగీతస్మాద్యోగీ భవార్జున॥

"బ్రాహ్మణభాగము పేరునకు బ్రాహ్మణారణ్యకోపనిషత్తులని మూడు భాగములు. కాని వస్తుతః బ్రాహ్మణ-ఉపనిషత్తని రెండే విభాగములు. ఇట్లే కర్తవ్యవిభాగముకూడ పేరునకే కర్మ-ఉపాసన-జ్ఞానములని మూడు భాగములు కాని వస్తుతః కర్మ-జ్ఞానములని రెండే భాగములు. ఇక ఉపాసనాత్మకమగు బుద్ధియోగనిష్ఠయందు కర్మజ్ఞానములే కాక వేరేమున్నది? కనుక దీనిని వేరే యొకనిష్ఠయనుట గీతావచనవిరోధముకూడను.

లోకోస్మిన్ ద్వివిధానిష్ఠాపురాప్రోక్తామయానఘ
జ్ఞానయోగేనసాంఖ్యానాం కర్మయోగేనయోగినాం.

కనుక బుద్ధియోగ మీరెంటియందేదో యొకదానియం

దంతర్భావము నొందింపవలయును.” అనుకొని కర్మయోగ వాదు లీబుద్ధియోగమును కర్మవాదాంతర్భాగ మనుకొన్నారు. అట్లనుకొన్నచో “బృహదారణ్యకోపనిషత్”ను వ్యవహారము నకు విలువయేమి? గీత కుపనిషద్వ్యవహారమెట్లు? కనుక గీతకు జ్ఞానయోగ లేదా బుద్ధియోగశాస్త్రత్వము (సంశుద్ధరూపము) సిద్ధించి యుపనిషత్త్వ సిద్ధి చుచున్నది. దీనిని స్మార్తోపనిషత్తు అనవచ్చును.

వేదాంతినుత్వము లేకున్నను గీత కుపనిషత్త్వమెట్లు? అను ప్రశ్నకు ఒకవిధముగా సమాధాన మీయబడినది కాని, వైజ్ఞానికదృష్టి కియ్యది సంతుష్టినీయజాలదు. ఆదృష్టిలో వేదాంతిమత్వ, ఆత్మవిద్యాత్వము లుపనిషచ్ఛబ్దావచ్ఛేదక ములుగావు. మరేమన:-తత్తత్కర్మకలాపేతిక ర్తవ్యతాప్రకార విశేషోపపాదనముచే వ్యవస్థితమగు విజ్ఞానసిద్ధాంతత్వమే యుపని షచ్ఛబ్దావచ్ఛేదకము. ఉప=ఉపపత్తి నిరూపణద్వారమున, (నేని జ్ఞానప్రతిపత్తిచే కావించు కర్మయందు కర్తవ్యశ్రద్ధ) ని= నిశ్చయరూపమున, షత్=ప్రతిష్ఠనొందునో అది యుపనిషత్తు- విద్యాశ్రద్ధలతోగూడిన యాయుపనిషత్తువలన కర్మ కర్తృత చక్కగా నుపపన్నమగును.

విశేషణప్రాయమగు గీతాశబ్దము గీతాశాస్త్రమునరూఢ మైనట్లు కాలాంతరమున అన్నివిధముల మౌలికవిజ్ఞానసిద్ధాంత ములకును సంబంధముగల యుపనిషచ్ఛబ్దము, వేదాంతిమభాగ ములగు నీశకేనాదులందు నిరూఢమై పోయినది. ఇంతమాత్ర

మున ఉపనిషచ్ఛబ్దార్థము సంకోచము నొందదు. కర్మ, యుపాసన-జ్ఞానము ఈయన్నిటికి నుపనిషత్తులు కలవు. ఇందు దేని కుపనిషత్తు లేకున్నను అయ్యది నిరర్థకము.

సామాన్యముగా జాలకాలమునుండియు మనమొకదృష్టి కలవాటుపడి యున్నాము. ఏమన :—"కర్మమయసంసారము-సాంసారిక కర్మలు బంధనమునకు గారణములు. యజ్ఞతపోదానాదికర్మలు క్షణికములగు స్వర్గాదిసుఖములకు గారణము లయ్యును పరిణామమున శాశ్వతములగు నాత్మానందమునకు విఘాతములే యగును." అని యీ కల్పితకర్మోపనిషత్తు నాశ్రయించి కర్మత్యాగమే నిశ్శ్రేయసప్రాప్తికి ముఖ్యకారణమనుకొని కర్మమార్గమందు తిరస్కారభావమును, జ్ఞానమార్గము నందాదరభావమును పెట్టుకొనియున్నాము. ఈ విషయమున గీతాశాస్త్రము, కర్మ-జ్ఞానముల వాస్తవికోపనిషత్తులం జూపుచు మనలను జ్ఞానమయబుద్ధియోగ లక్షణకర్మయందు బ్రవృత్తుల జేయుచున్నది. మనమీ రహస్యముల నెరింగినచో కర్మమార్గము మనకు హానికరమని యశ్రద్ధగాజూడము. కనుక పై నిర్వచనానుసారము గీతనుపనిషత్తు అందుము. ఉదాహరణమునకు: యజ్ఞప్రక్రియం జూతము :— యజ్ఞకర్మసిద్ధికొరకు, వేదియు, గార్హపత్య, ఆహవనీయ - దక్షిణాగ్ని కుండములును నిర్మింపబడును. ఈయన్నిటికి నాకారసన్నివేశములందు నియమములున్నవి. ఆహవనీయకుండము: చతుష్కోణము. వీని స్థానము వేదికిపూర్వభాగము. గార్హపత్యకుండము : గోళాకా

రము వేదికి పశ్చిమభాగమున దీనికి స్థానము. దక్షిణాగ్నికుండము: దీనికి స్థానము దక్షిణమున వేది మధ్యభాగమున కెదురుగ నుండును. ఇవన్నియు నట్లేలయుండవలయును? పురుషనిర్మాణము ననుసరించి యజ్ఞరూపము నిర్మింపబడినది. పురుషయజ్ఞమే ఈ వైధయజ్ఞమునకుపనిషత్తు: 'పురుషోవై యజ్ఞః, "యజ్ఞోవై పురుషః"-(దీని వివరణమంతయు వేదవిజ్ఞానపరిచయాంతర్గత ఉపనిషద్విజ్ఞానపరిచయ ప్రసంగమున విస్తరింపబడినది అచ్చట జూడవలయును. ప్రస్తుతమిటప్రకరణ సంగతికిపనికి వచ్చునంతమాత్రము తెలిసికొందుము:) యే కర్మకుగాని జ్ఞానమునకుగాని ప్రకృతి సిద్ధమగునేదో యొక మౌలికరహస్యమవశ్యముండితీరును. ఆ మౌలికవిజ్ఞానమే తత్తద్విషయికోపనిషత్తు. ఈ క్రింది వచనములందుపనిషచ్ఛబ్దములను చక్కగా విమర్శింపుడు.

1. "ఆరణ్యమియాత్ నపునరేయాత్ ఇత్యుపనిషత్ ఇతివైఖానసేభ్యో వియమోవిధీయతే. (శాంకర బ్ర। సూ॥భా3–4–68)
2. "యదేవవిద్యయాకరోతిశ్రద్ధయోపనిషదా, తదేవవీర్యవత్తరంభవతి. (ఛాందో 11–10)
3. తస్యవాఏతస్యాగ్నేర్వాగేవోపనిషత్
4. వేదస్యోపనిషత్సత్యం, దానస్యోపనిషద్దమః
   దమస్యోపనిషద్దానం । దానస్యోపనిషత్తపః,
   తపసోపనిషత్త్యాగః । త్యాగస్యోపనిషత్సుఖం
   సుఖస్యోపనిషత్స్వర్గః స్వర్గస్యోపనిషచ్ఛమః॥

వేదాంతత్వ ముపనిషచ్ఛబ్దావచ్ఛేదక మనుకొన్నప్పుడు,

ఈశోపనిషత్తు శుక్లయజుర్వేద మంత్రభాగము 40 వ యధ్యాయముకదా? బృహదారణ్యకము శతపథబ్రాహ్మణ చతుర్దశ కాండముకదా! పై లక్షణమెట్లు సమర్థింతురు?

కనుక మాచేనిర్వచింపబడిన లక్షణమే సర్వవ్యాప్తికలదై యన్ని విధముల సమన్వయమునకు దగును. ఆదృష్టితో జూచిన: బ్రాహ్మణము లందుపనిషత్తు, ఆరణ్యకములందుపనిషత్తు, ఉపనిషత్తులందుపనిషత్తు ఈ మొదలగు నన్నియుపనిషత్తులకు నొకే లక్షణము కుదురును. క్లిష్టనిర్వచనములతో బనియుండదు.

మరియు యవనభాషయందు ఉసూల్ అనబడుదానిని, పాశ్చాత్యులు ప్రిన్సిపిల్ (Princeple) అనుదానిని భారతీయు లంతకంటె సార్థకదృష్టితో ఉపనిషత్తనిరి: ఈ నిర్వచనానుసారము గీత యుపనిషత్తనుట కెంతయు దగియున్నది. అయ్యది మనకు వట్టి విజ్ఞానమేకాక వ్యావహారిక విజ్ఞానముకూడ సోపపత్తికముగా నిరూపించుచున్నదికదా!

## భగవద్గీతోపనిషన్నామ సమష్టిరహస్యమ్

దర్శనభక్తుల కీప్రసంగములన్నియు విసుగుబుట్టించును, కాని వైజ్ఞానికదృష్టియందు విమర్శకు విలువగలదు. తక్కిన భాషాసాహిత్యములమాట యెట్లున్నను సంస్కృత సాహిత్యము నందు, అందును వైదికసాహిత్యమునందు ప్రతిశబ్దమునకు, నామమునకు గొప్ప రహస్య ముండియున్నది. వేయేల. శబ్దము ప్రకారాంతరమున బ్రహ్మయే యైయున్నది.

"ద్వేవావబ్రహ్మణోరూపే శబ్దబ్రహ్మపరంచయత్
శాబ్దేబ్రహ్మణినిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి."

శబ్దముదాక బోనక్కరలేదు. ఒక యక్షరమునందును, స్వరమందు రహస్యములేని ప్రయోగమే యుండదు. వైయాకరణులు పరబ్రహ్మవలె శబ్దము నిత్యమనిరి. వైజ్ఞానికులీ విలక్షణత ననుసరించియే వేదమపౌరుషేయమనిరి. విజ్ఞానదృష్టి యందు నిరర్థకవస్తువేలేదు. గీతయో ప్రత్యక్షవిజ్ఞానశాస్త్రము "జ్ఞానం విజ్ఞానసహితం" ఇక భగవత్=భగవంతునిచే, గీతా=విస్తరించి చెప్పబడిన స్మార్త, ఉపనిషత్=విజ్ఞానసంబంధమగు త్రైకాలిక రహస్య సిద్ధాంతము, అనునర్థముతో నొక సంప్రదాయమువారు సంతుష్టులైనను అంతమాత్రమున విజ్ఞానదృష్టిగల వారు తృప్తినొందరు.

రహస్యజ్ఞాన ముపనిషత్తు అన్నపుడు, రహస్యము పరోక్షభావమునకు జెందినది. వైదికశబ్దములన్నియు నదేమిచిత్రమో

పరోక్షభాషా (రహస్య) మయములే అయియున్నవి. ఈక్రింది నామనిర్వచనములం జూడుడు. (1) అగ్రిర్హ్వై తమగ్నిరిత్యాచక్షతేపరోక్షం, (2) ఇంధోహవాతమింద్రమిత్యాచక్షతేపరోక్షం, (3) తంవాఏతంవరణం 'నంతంవరుణ ఇత్యాచక్షతే' (4) అత్రిర్హ్వానామైతద్యదత్రిరితి, (5) తంవాఏతం ముచ్యూంసాతం మృత్యురిత్యాచక్షతేపరోక్షం, (6) రసతమంహ్వై తద్రథంతరమిత్యాచక్షతే పరోక్షమ్. ఇత్యాదులెన్నియో ఒకశబ్దమునకే ఎన్నియో నిర్వచన రహస్యములు. కనుకనే నామమునకంతమహత్వ మీయబడినది. "యస్యనామమహద్యశః" "హరేర్నామైవనామైవ" "కకారం కీర్త్యకేశవం" విద్య,శ్రద్ధ, యుపనిషత్తు కలవారికే దానిరుచి తెలియును.

నేటివారు సత్యమునకు గల్పించు పరిభాషలవంటివా యివి? కాదు. నేటి కల్పితపరిభాషలం దించుకయు త్రాణ, శక్తి లేదు. కారణము? ఇవి పరీక్షాపరిష్కృతములుకావు. కనుక భావనాజనకములు కాజాలక యథార్థసిద్ధికి దూరములగుచున్నవి. సరియగు పరోక్షభావ మిందు లేనేలేదు. మనము దాని మరచిపోయియే కల్పితపద్ధతుల నాశ్రయించుచున్నాము.

ఇక నిట్టిపరోక్షభావరహస్యమువలన ప్రయోజనము? ఆత్మ సర్వధా పరోక్షము, అంతట నది యేమిసేయుచున్నను ప్రత్యక్షము కాకున్నది. మన ప్రతికార్యమును రహస్యముగ జరుగవలయును. మంత్రణమే కర్మకు జీవనము. 'పనిచేసినది లేను

ప్రకటనలుమాత్ర మధిక' మిది మనయవనతికి మూలము. ఆచారము, వ్యవహారము, సంభాషణ, అన్నియు ప్రచురము గావించుకొనుటకు మనము సిగ్గుపడుచున్నాము. పరోక్షభావ మర్యాదకు తిలాంజలి యర్పించితిమి. చివరకి క్షయరోగము మనకు "లోపల లొటారము పయికి బండారము" అయినది. కర్తవ్య మెంతగూఢముగనున్న నంతగ నాత్మబలము పెరుగును. శక్తివృద్ధికి పరోక్షభావమును మించిన యుపాయము లేదు. మంత్రము మననమునకే గాని వాచనమునకుగాదని జ్ఞాపకముం చుకోవలెను.

కానిండు, ప్రస్తుతము :—ఆర్యసాహిత్యమందలి ప్రతి శబ్ద మందును గుప్తరహస్యమిమిడియున్నది: ఆ రహస్యము (1) ఈశ్వరదత్తము దివ్యమునగునలౌకిక ప్రతిభావిశేషముచేతనో (2) గురుపరంపరచేతనో సురక్షితమై యుండును. ఈ సూత్ర ములం జూడుడు :

(1) తస్యాంసాధనానిగాయంత్యాచార్యాః, (2) తత్తు విషయత్యాగాత్ సంగత్యాగాచ్చ (3) అవ్యావృతభజనాత్ (4) లోకేఽపిభగవద్గుణశ్రవణకీర్తనాత్ (5) ముఖ్యతస్తు 1. మహత్కృపయైవ, 2. భగవత్కృపాలేశాద్వా (6) మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ (7) లభ్యతేఽపితత్కృప (భగవత్కృప) యైవ. (8) తస్మిన్‌తత్ జనేభేదాభావాత్ (9) తదేవసాధ్యతాం తదేవసాధ్యతాం. (నార॥భ।సూ।) ఈ సూత్ర పర్యాలోచనచే (1) భగవత్కృప సర్వజన సులభముగాదు.

ఇక : గురువే శరణ్యము, గురువు లేకుండ మన పరిమితబుద్ధితో సంప్రదాయమును విడిచి రహస్యముం దెలిసికొనుట కష్టసాధ్యము. గురువే మనకు దివ్యదృష్టి ప్రదానముం గావింపవల యును. భగవానుడు వక్తయైయుండ నర్జునివంటివాని దివ్య దృష్టి ప్రదానముగావింపకుండ రహస్యజ్ఞానము కలుగలేదు. స్వబుద్ధి వైభవమెంతయున్నను, టీకాటిప్పణులవలన రహస్య మెరుంగ గోరుట వ్యర్థము. కనుకనే ఆగమశాస్త్రము దీక్ష యవ సరమనియు అది లేనివాడు జ్ఞానమునకనధికారియని నిర్ణయించినది.

రహస్యము రహస్యమే. ఏకాంతవస్తువు. అది గుప్తనిధి అందరును దానికధికారులుగారు. కనుకనే దేవయుగకాలమం దగు బ్రహ్మపరిషత్తునందు కులపతియుపదేశమున రహస్యము జెప్పవలసి వచ్చినప్పుడా గురువు ఆరహస్యమందరయెదుట జెప్పక జిజ్ఞాసువగు తన ప్రియశిష్యుని హస్తగ్రహణము కావించి యేకాంతమునకు గొంపోయి యుపదేశించును. మహర్షి గార్గ్యుడ జాతశత్రునకిట్లే కావించినట్లు ఈ మొ॥గు నెన్నియో యుదాహ రణములు మనము వేదములందు జూడగలము. గీతయందును నిట్లు కలవు.

1. "యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితంబ్రూహితన్మే శిష్యస్తేఽహం శాధిమాంత్వాం ప్రపన్నమ్.

2. సఏవాయం మయాతేఽద్యయోగః ప్రోక్తః పురాతనః భక్తోఽసిమేసఖాచేతి రహస్యం హ్యేతదుత్తమం॥

3. తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా,
ఉపదేక్ష్యన్తితేజ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥ ఇత్యాదులు.

నిజముగా గీతయొక రహస్యశాస్త్రము. రహస్యజ్ఞాన మీశ్వర వరప్రసాదము, కనుకనే రహస్యగ్రంథమగు వేదమ పౌరుషేయమనిరి. తపః ప్రభావమున మహర్షులు దానిందెలియ గలిగిరి. వారుదానిని మంత్రవాక్యద్వారా మన యెదుటబెట్టిరి. మనగీతయో, వేదమనబడకపోయినను దానియంత మహాత్వము గలదియే. కనుకనే దాని నుపనిషత్తనుపేరున బిలిచిరి. ఇది స్మార్తో పనిషత్తు అని మున్నే యెఱింగితిమి.

విజ్ఞానదృష్టికి శ్రౌతస్మార్తోపనిషత్తులు సమానములే, కాని వాగ్దృష్టితో జూచినచో అహోరాత్రము కున్నంతభేద మున్నది. కనుకనే గీత నపౌరుషేయవేదము లెక్కలోనికి గొన లేదు. స్వతఃప్రమాణముగా నంగీకరింపలేదు. శ్రౌతోపనిషత్తు విజ్ఞానవాక్య--స్మార్తోపనిషత్తు శబ్దవాక్య. విజ్ఞానవాక్యను మంత్ర మందురు. మంత్రపరిభాష సర్వదా స్వతంత్రము. ప్రాకృతిక విజ్ఞానతత్త్వమున కేరూపమున, ఏయుచ్చావచభావ మున-ఏస్వరలహరితో ప్రకృతియందు సన్నివేశముకలదో సరిగా దానికి ప్రతికృతియగు వాక్యే విజ్ఞానవాక్య. దానినే మంత్ర మందురు. మంత్రప్రతిపాద్యవిషయమునకుగలమహాత్వ మామంత్ర వాక్యనకుగూడ గలదు. ఇదే మంత్రమునకు మంత్రత్వము.

ఉదాహరణమునకు గాయత్రీమంత్రముం జూడుడు.

అగ్ని ప్రధానదేవత గాయత్రము. అయ్యది గాయత్రీఛందస్సుచే ఛందితమై యుండును. గాయత్రీమంత్ర మాగాయత్రికి ప్రతికృతి. దీనియం దాగాయత్రియందువలెనే ఉదాత్తానుదాత్తాది స్వరసమావేశముకలదు. ఆగాయత్రీదేవత, నధ్యాత్మజగత్తునందు బ్రతిష్ఠింపదలచుచో నామంత్రము జపించినచో సమానాకర్షణ సిద్ధాంతానుసారము ఆదేవత యాకర్షింపబడి, యాత్మయందు బ్రతిష్ఠితమగును. మంత్రప్రయోగమందు మాత్రాస్వరవర్ణాను లందేది తప్పినను ఆసంబంధము చెడి మేలునకు బదులు కీడు సిద్ధమగును. మఱియొక విషయముగూడ జ్ఞప్తియుంచుకోవలయును. దీని కందరు నధికారులుగారు. ఎవరియంతరాత్మయందు జన్మాదినుండియు నీదేవతాప్రతిష్ఠకలదో యతడే యీదీక్ష కధికారి. కనుకనే ధర్మసూత్రములు ఈగాయత్రి కందరు నధికారులు కారని చెప్పెను. ఇంతకును జెప్పవలసిన దేమన :-మంత్రస్వరూపము సర్వథా నిశ్చితము. దానినున్నరూపమున బ్రయోగించిననే లాభము. భాషాంతరీకరించి జపించుట తప్పు. మంత్రము బజారుసరుకు కాదు. రహస్యవిజ్ఞానముకు ప్రతిచ్ఛాయ. కొంచెము తారుమారు గావించినను మంత్రశబ్దము దుష్టమై యిష్టమునకు బదులు అనిష్టము ప్రాప్తించును. ఈశ్రుతిచూడుడు.

"దుష్టః శబ్దః స్వరతోవర్ణతోవా. మిథ్యాప్రయుక్తోనతదర్థమాహ
సవాగ్వజ్రోయజమానంహినస్తి యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్.

గీతాశాస్త్రము శబ్దవాక్కు. కనుక మంత్రరూపముగాక శ్లోకరూపమై యున్నది. వేదవాక్కు పారాయణమాత్రముననే

మహాత్త్వము కలది. గీతావాక్య మట్టిదికాదు. చిరకాలపారాయణవలన కొంచెమతిశయము వచ్చిన రావచ్చును. కనుక గీతామహాత్మ్యమున మహాత్త్వము జెప్పబడినది. కాని గీతార్థమాచరణపై యాధారపడి యున్నది. మంత్రవాక్యయొక్క శబ్దముకూడ నుపయోగపడును. కాని, శబ్దవాక్యయొక్క అర్థమే మనకుపకారకము శబ్దశ్రవణమాత్రమున ప్రయోజనము లేదు. ఈభేదమే శ్రౌతోపనిషత్తులతో నీగీతోపనిషత్తును భేదించినది. వేద మీశ్వరకృతము. గీత యీశ్వరావతారుడగు కృష్ణునిచే నుద్భావింపబడినది. మనుష్యకృత శాస్త్రశబ్దములందు రహస్య ముండకపోయినను, ఈ యీశ్వరీయగీతాశాస్త్ర మవశ్యముగ రహస్యసంబంధము కలదేయగును.

ఇయ్యది చతుర్విధబుద్ధియోగములద్వారా చతుర్విధక్లేశములను తొలగించుచు చతుర్విధభగోదయకారణ మగుచున్నది. ఏమనుష్యునిబుద్ధియదు భగప్రతిష్ఠకలదో వాని కీయుపనిషత్తుపనిషత్తగును. గీత భగవంతునిది. ఎవడు దీనిని మూలప్రతిష్ఠగా జేసికొనునో, వాడు తన ప్రాతిస్వికభగసంపత్తియుక్తుడై భగవంతుడగును. "గీత భగప్రాప్తి కుపాయము జూపి జీవుని భగవత్సంపత్తియుక్తుని జేయును" అను నీరహస్యప్రతిపత్తికొరకే భగవత్ శబ్దప్రయోగము వ్యాసుడుకావించెను.

గీత కేవలము మన్వాదిశాస్త్రములవలె, విధి నిషేధాత్మక శాస్త్రమేకాదు. దీనిశైలియుపనిషత్తుల శైలివంటిది. ధర్మముయొక్క విధినిషేధములను ధర్మశాస్త్రములు చెప్పునే

గాని మౌలికరహస్యజ్ఞానము చెప్పవలసివచ్చినప్పుడు "ధర్మంజి జ్ఞాసమానానాంప్రమాణం ప్రథమంశ్రుతిః." అని చెప్పి తటస్థములగును. గీత యట్లుగాక, విధినిషేధములతో వాని వాని యుపపత్తులను గూడ నిరూపించును. ఈ విధమున నియ్యది స్మృతియు నుపనిషత్తునగుచున్నది. వాగ్దృష్టిచే నిది శబ్దవాక్కని చెప్పబడినది. మొత్తముపై "భగవద్గీతోపనిషత్తు" అను నామమునకు: "భగవత్ప్రాప్త్యుపాయభూత శబ్దవాఙ్మయ రహస్య శాస్త్రము." అని నిష్కర్షగ దేలినది:

1. భగవత్ప్రాప్త్యుపాయభూతమును .... భగవత్.
2. శబ్దవాఙ్మయమును .................... గీతా.
3. రహస్యజ్ఞానమయము, నగుశాస్త్రము ఉపనిషత్

} భగద్గీతోపనిషత్ శాస్త్రము.

ఇది నామవ్యాఖ్యానములందు రెండవది.—

ప్రకారాంతరమున జూతము:— స్వర, వ్యంజనములు, స్ఫోటము అను నీ మూడును వేర్వేరు వస్తువులనియు, స్వరము మాత్రిక - వ్యంజనమర్ధమాత్రిక, స్ఫోటమమాత్రిక - యనియు, వ్యంజనమున కాధారము స్వరము దానికాధారమును సర్వాధారమును స్ఫోటమనియు, (స్ఫుటభావము) శబ్దశాస్త్రజ్ఞుల కెరుకలోని విషయములే.

అదేమిచిత్రమో! వ్యంజనమునకు ప్రతిష్ఠ యొకబిందువు. స్వరమునకు ప్రతిష్ఠ రెండుబిందువులు. ఇట్లుండగా స్వరము మరి యేడుబిందువులను భరించును. మొత్తము 9 బిందువులందును,

5, 6 బిందువులందు స్వరము తాను మూలబింబరూపమున (ఉత్క్రమముగ) నుండి మిగిలిన 7 బిందువులను పూర్వమందు 4 ను ఉత్తరమందు మూటిని భరించుచు అర్క (రశ్మి) రూపమున నందు వ్యాప్తమగుచుండును. అవివ్యంజనములు, స్వరమునకిట్టి రూపమేల ? 9 బిందువులందది ఏల వ్యాపించును. వ్యంజనము స్వరరహితమై యుచ్చారణకు విషయమేలకాదు ? ఈ ప్రశ్న లన్నిటి నుపనిషత్తు సూర్యదేవత. చూడుడు స్త్ర్యర్కట్ :

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| స్ - | త్ - | ర్ - | య్ - | అ | | ర్ | క్ | ట్ |
| . | . | . | . | . | . | . | . | . |
| 1 | 2 | 3 | 4 | ఉత్క్రమ్ | | 5 | 6 | 7 |
| రశ్ములు | | | | స్వరవ్యాప్తి | | రశ్ములు | | |

ఈ యంత్రకునిపనిషత్తు సూర్యదేవతయనుకొంటిమి :—

ఛందోవిజ్ఞానము ననుసరించి సూర్యబింబ ప్రతిష్ఠ బృహతీఛందస్సు. క్రాంతివృత్తమునందే డహోరాత్ర వృత్తములు కలవు. వీనిని పూర్వాపర వృత్తములనియు నందురు. ఇవి దక్షిణము నుండి క్రమముగ (1) గాయత్రి (2) ఉష్ణిక్కు (3) అనుష్టుప్, (4) బృహతి (5) పంక్తి (6) త్రిష్టుప్ (7) జగతి అనియందురు. ఇవియే హిరణ్మయ (అగ్నిమయ) సూర్యరథాశ్వములు. అశ్వమునే ఛందమందురు. ప్రాకృతిక దేవతలకు ప్రతిష్ఠఛందస్సే.

ఇందు మధ్యది బృహతి. అది తక్కినవానికంటె పెద్దది. ఆసురజ్యోతిషమున దీనినే విషువద్వృత్తమందురు. పాశ్చా

త్ర్యల Equater ఇదియే. గాయత్రికి 6 అక్షరములు. ఉష్ణిక్‌కు 7. అనుష్టుప్‌కు 8. బృహతికి 9 అక్షరములు. ఇదే సూర్యప్రతిష్ఠ. కనుక సూర్యుని బృహత్ అందురు. "సూర్యోబృహతీ మధ్యా ధస్తిష్ఠతి" 'బృహద్గతస్థౌభువనేష్వంతః' 'విభ్రాడ్‌బృహత్ పిబతు' ఇత్యాదులు ప్రమాణములు. ఈ బృహతియందు రెండక్షర ములపై సూర్యబింబ ప్రతిష్ఠ. మిగిలిన ఏడక్షరములందును సూర్యరశ్మి వ్యాప్తి. ఆరశ్మి సంస్థయందు పృథివ్యాద్యుపగ్రహ ప్రతిష్ఠ. ఇట్లు తొమ్మిది బిందువులందు సౌరసంస్థ ప్రతిష్ఠితమై యున్నది.

"నివేశయన్నమృతం మర్త్యంచ" అన్నట్లు సూర్యసం దమృతమృత్యుభావములు రెండుకలవని భగవచ్ఛబ్దరహస్యమున దెలిసికొంటిమి. అందు అమృతభాగము అసంగము, మర్త్య భాగము ససంగము. మర్త్యభాగమునుండి పృథివి యుత్పన్న మైనది. అమృతము మర్త్యమునకు బ్రతిష్ఠ. కనుక సూర్యుని యమృతరశ్ముల యాకర్షణమున బృథివి స్వస్థానమున (క్రాంతి వృత్తమున) దిరుగుచు సూర్యుని బరిక్రమించుచున్నది.

అమృత సూర్యునుండి స్వరవికాసము, మర్త్యపృథివి నుండి వ్యంజనోత్పత్తి. ఇక అమృతసూర్యాధారమున బృథివి యున్నట్లు స్వరాధారమున వ్యంజనములుండుననుట స్పష్టమే. 'స్వరహర్ద్దేవాఃసూర్యః' ఇత్యాదిగా సూర్యునిస్వరత్వముస్పష్టము. కనుకనే సూర్యుని స్వర్లోక, స్వర్గ అందురు. వ్యంజనముల ససంగభావముననే "కాదయోమావసానాః స్పర్శాః" అనుట.

బృహతీనవాక్షరవ్యాప్తి సూర్యునివలె తత్స్వరూపస్వరమునకు నవబిందువ్యాప్తియని విశదపడినది.

వ్యంజనాలంబనము, స్వరాలంబనము, స్ఫోటమని మున్నే యనుకొంటిమిగదా! స్ఫోటము నిత్యము. వ్యంజనమనిత్యము. మధ్యపతితస్వరము నిత్యానిత్యము. మూటి సమష్టియు శబ్ద బ్రహ్మ. ఇందు నిత్యరూపస్ఫోటాను యాయులు వైయాకర ణులు. వారిదృష్టియందు శబ్దము నిత్యము. మర్త్యప్రధాన పదార్థ విద్యానుయాయులు నైయాయికులు. కనుకవారు వ్యంజనోపాసకులు కనుక వారిదృష్టికి శబ్దమనిత్యము. రెండు మతములును వారివారిదృష్టి ననుసరించి సత్యములే.

శబ్దబ్రహ్మ పరబ్రహ్మల కభేదము. ఓమ్ ఇత్యాకారక శబ్దబ్రహ్మ పరబ్రహ్మ వాచకమని "తస్యవాచకః ప్రణవః" "ఓమ్ తత్సదితినిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః" ఇత్యాదులచే స్పష్టమే. "స్వరోఽక్షరం" అను ప్రాతిశాఖ్యసూత్రానుసార మది యేకాక్షరము. "ఓమిత్యేవంధ్యాయథఆత్మానం" ఇత్యాదులచే ఓంకారము మూలముగనే పరబ్రహ్మోపాసనావిధానముకలదు. వాచ్యవాచకముల కభేదము. శబ్దబ్రహ్మపరబ్రహ్మముల కభేదము. శబ్దార్థనిత్యతకిదే మౌలికరహస్యము. పూర్వమీమాంసకు లిందువలననే వాచకశబ్దమునకును వాచ్యఅర్థమునకు నౌత్పత్తిక సంబంధమంగీకరించిరి. పాణిని "సర్వేసర్వార్థవాచకాః" యను దానికిదే యాధారము.

శబ్దబ్రహ్మతుల్యమగు పరబ్రహ్మనిరూపణ ఆత్మవిద్య యను శీర్షికక్రింద కావింపబడును. అయినను ప్రకరణసంగతి కొరకు కొంచెమిట నుదాహరించుట యనవసరముకాదు.

శబ్దబ్రహ్మకు స్ఫోట, స్వర, వ్యంజనములవలె పరబ్రహ్మ కును అవ్యయ - అక్షర - క్షర అని మూడువివర్తములు. (1) అర్థప్రధానక్షరుడు విశ్వమూర్తి (2) క్రియాప్రధాన - అక్షరుడు విశ్వ నిమిత్త కారణము. (3) జ్ఞానమూర్తి అవ్యయుడు విశ్వాలంబనము: అక్షరుడు క్షరునకు, అవ్యయుడంతకును ఆధారము (1) భౌతిక, క్షణిక, విశ్వము క్షరాత్మకము. అది వాక్ప్రధానము, మర్త్యము, అనిత్యము. (2) ఈ విశ్వమూర్తి క్షరకూటమున కాలంబనము. ప్రాణమయ క్రియాప్రధాను డక్షర పురుషుడు (3) ఈ యిరువురి కాధారము మనోమయ జ్ఞాన మూర్తి యవ్యయుడు (1) అవ్యయుడు నిత్యుడు, (2) క్షరుడ నిత్యుడు (3) అక్షరుడునిత్యానిత్యుడు. (1) అవ్యయుడు స్ఫోట స్థానీయుడు (2) అక్షరుడు స్వరస్థానీయుడు (3) క్షరుడు వర్ణస్థానీయుడు మూటి సమష్టియే పరబ్రహ్మ. ఇతనినుండియే 1. ఈశ్వర, 2. జీవ, 3. జగత్తులను స్వతంత్రసంస్థ లుదయించును ఇందు - ఈశ్వరుడు భగవంతుడు. జీవుడు క్లేశవంతుడు. విశ్వము క్లేశరూపము. మధ్యస్థుడగు జీవునకు క్లేశమూర్తియగు విశ్వసంపర్కమున క్లేశవత్త్వము, భగవదనుగామిత్వమున భగవత్త్వము సిద్ధించును. భగవత్త్వసిద్ధి పరమపురుషార్థము.

(1) క్షరాక్షర గర్భితావ్యయుడు అవ్యయప్రధానతచే

"బిభర్త్యవ్యయ ఈశ్వరః" అన్నట్లు ఈశ్వరుడు, (2) క్షరా వ్యయ గర్భితాక్షరుడ క్షరప్రధానతచే 'జీవభూతాంమహా బాహో' అన్నట్లు పరాప్రకృతిరూపి జీవుడు. ఇతడు భగలక్షణా వ్యవసంపత్తిచ్యుతుడై క్లేశవంతుడగును. (3) అవ్యయాక్షర గర్భితక్షరుడు క్షరప్రధానతచే "క్షరఃసర్వాణిభూతాని" అన్నట్లు అపరాప్రకృతిరూప విశ్వమూర్తి. ఈ భూతభాగమే క్లేశము. ఇట్లు త్రిపురుషతారతమ్యమున నొకేపరబ్రహ్మ మూడు రూపము లెత్తును. మూటియందు మూడు భావములున్నను, ప్రధానత ననుసరించి 'తద్వాద' న్యాయమున అవ్యయ - అక్షర - క్షరుల నియు, వరుసగ ఈశ్వర - జీవ - విశ్వములనియు నందుము.

పరబ్రహ్మ యిట్లగుటకు కారణమేమన్నచో దానికుప నిషత్తు త్రిగుణభావమయి - మాయ లేదా ప్రకృతి. దాని సత్వ భావమీశ్వరసృష్టికి - రజోభావము జీవసృష్టికి - తమోభావము విశ్వసృష్టికి ప్రవర్తము లగుచున్నవి. అవ్యయుడజుడయ్యును దురత్యయయగు నీ మాయానుగ్రహముచ నిట్లు మూడు రూప ములొందును. "అజోఽపిసన్ అవ్యయాత్మా భూతానా మీశ్వ రోఽపిసన్। ప్రకృతింస్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమా యయా" అని గీతావచనము.

తమోగుణప్రధానవిశ్వము క్లేశరూపము. తమస్సు అవిద్య. దీనికే (1) రాగద్వేషములు, (2) మోహము, (3) అస్మితా, (4) అభినివేశము: అని నాల్గు భేదములు. వీని వలననే జీవునకు దుఃఖము. క్లేశప్రధానవిశ్వస్థుడగుచు తదా

సక్తిగల రజోగుణప్రధానుడగు జీవుడు క్లేశవంతుడు, విషయా సక్తి జననియగుకామనామయప్రవృత్తికి రజోగుణమేమూలము.

"కామఏషక్రోధ ఏషరజోగుణ సముద్భవః (గీత.)
మహాశనో మహాపాప్మావిద్ధ్యేనమిహవైరిణమ్ "

ఇదే విధముగ విశ్వమునం దేకరూపముననూ, అసంగ భావమునను వ్యాప్తుడగు నీశ్వరుడు, సత్యగుణప్రధానుడగుచు భగవంతుడై యున్నాడు. సత్వమే విద్య. ఇది (1) వైరాగ్యము, (2) జ్ఞానము, (3) ఐశ్వర్యము, (4) ధర్మము నని నాల్గుభాగములును, భగశబ్దవాచ్యములు. అది కలిగిన యీశ్వరుడు భగవంతుడు. ప్రకృతియొక్క యీగుప్త రహస్యమునే జీవుడు గుర్తించి భగవత్త్వమును సంపాదించుకొనునో అతడు నిజముగా గొప్ప భాగ్యవంతుడు.

అటు భగవంతుడు, ఇటు క్లేశము. మధ్య సదంశపతితుడు క్లేశవంతుడున్నాడు. అతని ప్రవృత్తి విశ్వమువంకకైనచో క్లేశవంతుడే. అటుగాక బుద్ధియోగద్వారమున నవ్యయాత్మ నెరుంగగలిగినచో ఆత్మజ్ఞానప్రభావమున నీకర్మాత్మ స్వయముగ క్లేశమయవిశ్వపరాఙ్ముఖుడై అవ్యయేశ్వరుని భగవత్త్వమున కనుగ్రహపాత్రుడై భగవంతుడగును. భగవంతుడు, క్లేశవంతుని భగవతుని జేయుటకే గీతాయోగసంస్కరణము గావించెను. ప్రకారాంతమున దీని నాలోచింతము. ఈశ్వరుడు నిత్యసుఖి. అతడు జ్ఞానప్రధానుడు. అర్థప్రధానమగు విశ్వము దుఃఖమూర్తి-మధ్య పతితజీవుడు సమయానుసారముగ రెండు

ననుభవించుచు సుఖియు దుఃఖియు నై యున్నాడు. క్షణస్థాయి యగు నితనిసుఖము, రాగాత్మకము కనుక చివరకు క్షోభజనక మగును. ఐకాంతిక సుఖముకొరకవ్యయాశ్రయము తప్పదు. అతని (అవ్యయు) నుండియే "తేషామహంసముద్ధర్తామృత్యుసంసారసాగరాత్" అను నాశ్వాసనము లభించును.

ఈశ్వర, జీవ, విశ్వములను మూడును పరబ్రహ్మవివర్తములే. అయినను కేవలమీయుపాధి యీశ్వరునికే నియతమై పోవును. ఏలయన సంకేతభాషానుసారము, పరశబ్దమవ్యయునకును, పరావరశబ్ద మక్షరునకును, అవరశబ్దము క్షరునకును వాచకములు: మూవురియందును మూవురును గలరు కనుక నీమూవురను పరబ్రహ్మ, పరావరబ్రహ్మ, అపరబ్రహ్మ యన వచ్చును. అయినను అవ్యయాక్షర క్షరప్రధానతల ననుసరించి యవ్యయప్రధాను డీశ్వరుడనియు అక్షరప్రధానుడు జీవుడనియు, క్షరప్రధానము విశ్వమనియు రూఢములై పోయినవి. ప్రకృతము పరబ్రహ్మయను నీశ్వరసంస్థయొక్క విచారణమే చేయుచున్నాము.

పరబ్రహ్మతత్త్వము విశ్వసంబంధమునఁ బ్రజాపతిరూపమునఁ బరిణతినొందును. ఈ ప్రాజాపత్యదశయందే పరబ్రహ్మకీశ్వరుడని వ్యవహారము. విశుద్ధదశయందు కేవలము పరబ్రహ్మయనియే యందురు. ఏలయన, ఈశ్వరశబ్దము సాపేక్షికము. పాలించువాడు, శాసకుడు ఈశ్వరుడగును! ఈశ్వరుడనగనే ఎవరికి? అని ప్రశ్నయుదయించును. క్షరాక్షరులవ్యయునకు బ్రకృ

తులు (స్వభావము) యివి శాసనద్వారములు. ఇక శాసితమగు పదార్థము వేరుగ నుండవలయునుగదా! అదిలేని నాడీశ్వర శబ్దమపూర్ణము. ఈ లోపమును విశ్వమేపూరించును:

ఉదాహరణమున కధ్యాత్మసంస్థను చూడుడు. ఇందు ఆత్మ-శరీరము, ఈ రెండుభాగములు కలవు. ఆత్మయే శరీరమునకు ప్రభువు, ఈశ్వరుడు. ఆధిదైవికసంస్థయందు నింతే. మహావిశ్వమీశ్వర శరీరము. క్షరాక్షరగర్భితుడగు నవ్యయుడే దీనికాత్మ, రెండును గలిసి ఈశ్వరుడు, విశ్వదర్శనమే ఈశ్వరదర్శనము. శరీరమే చక్షుర్విషయమగును. ఆత్మ కంటికగపడునది కాదు. ఈ దృష్టితో నీశ్వరశరీరదర్శనమే ఈశ్వరదర్శనమగును. ఈ విశ్వశరీరము కారణముగా నీశ్వరుని-విశ్వాత్మ, విశ్వేశ్వర, జగదాధార, జగన్నియంత, జగదీశ్వర,విశ్వంభర, ఇత్యాద్యుపాధివిభూషితుని గావింతుము. ఇక నీ పరబ్రహ్మవిశ్వమునందే రూపమునను న్నాడు?

స్పష్టమే! స్వయముగా పరబ్రహ్మ అవ్యయాక్షరక్షరరూపియైనపుడు, విశ్వమునందును మూడు రూపములే యుండును. విశ్వసృష్టి ననుసరించి యామూడు సంస్థలును క్రమముగ (1) అవ్యక్తసంస్థ (2) వ్యక్తావ్యక్తసంస్థ (3) వ్యక్తసంస్థ యనదగినవి. (1) స్వయంభూ, పరమేష్ఠి, యనునది యవ్యక్తసంస్థ (2) సూర్యుడు వ్యక్తావ్యక్తసంస్థ (3) చంద్రుడు, పృథివి, వ్యక్తసంస్థ- (1) అవ్యయప్రధానము (2) అక్షరప్రధా

నము (3) క్షరప్రధానము. (1) అమృతము, (2) అమృత మృత్యువులు, (3) మృత్యువు. అధ్యాత్మసంస్థయందును, (1) ప్రత్యగాత్మ ఆధ్యాత్మిక- ఈశ్వరుడు (2) శారీరక- ఆత్మ జీవాత్మ (3) శరీరము, అను నీ మూడే విభాగములు. ఈ మూటికి నామూటితో సంబంధముండుననుట చెప్పనక్కరలేదు. ఇక:— జీవాత్మక్షర సంస్థయం దున్నంతవరకు జనన మరణ ప్రవాహ ప్రవాహితుడగుట తప్పదు. క్షరసంస్థనుండి వేరై యక్షరసంస్థను జేరుకొన్నప్పుడు క్షరగ్రంధి విమోకమువలన ముక్తుడగును. ఇదే ఇతనికి (1)సాలోక్య, (2) సామీప్య (3) సారూప్య (4) సాయుజ్య లక్షణముగల అపరాముక్తి యై యున్నది. మఱి బుద్ధియోగకృపవలన పరలక్షణముగల యవ్యయ సంస్థ నొందుచో: "పరే వ్యయే సర్వ ఏకీభవన్తి" "పరాత్పరం పురుష ముపైతి దివ్యం" ఇత్యాద్యనుసారముగ నవ్యయునందు లీనుడగుచు, సమవలయభావము నొందును. ఇదియే అక్షర గ్రంధి విమోక మూలమగు పరాముక్తియై యున్నది. అనగా సంక్షిప్త సారాంశమిది.— జీవాత్మ, చంద్రగర్భిత పృధివ్యాకర్షణ యందున్నంతవరకు బద్ధుడును మృత్యుభావాక్రాంతుడు నగును. సూర్యుని జేరినపిమ్మట ముక్తుడగును. సూర్యునిపైకి బోయినచో బ్రహ్మయందు లీనుడు నగును. ఇట్టి భాగ్యశాలిని సూర్య భేది యందురు. అతడు బ్రహ్మాండమును భేదించుకొని (శిరః కపాల భేదనమున) బోవును కనుక నా పేరతనికి దగును. ఈ

క్రింది పరిలేఖ పరిశీలనచే నీ విషయములెల్ల హృదయంగమములగును.

1. } (1) స్ఫోటము-అమాత్రిక-సర్వాలంబనము, నిత్యము, అవ్యయ
(2) స్వరము-మాత్రిక-వ్యంజనాలంబనము, నిత్యానిత్య-అక్షర
(3) వర్ణము-అర్ధమాత్రిక-వ్యవహారాలంబనము, అనిత్య-క్షర } శబ్దబ్రహ్మ వివర్తము.

2. } (1) అవ్యయ-అమాత్రిక-సర్వాలంబన-నిత్య-అమృత-జ్ఞాన
(2) అక్షర-మాత్రిక-క్షరాలంబన-నిత్యానిత్య-మృత్యుగర్భితామృత } క్రియా
(3) క్షర-అర్ధమాత్రిక-విశ్వాలంబన-అనిత్య-మర్త్య-అర్ధ } పరబ్రహ్మ వివర్తము

(1) క్షరాక్షరగర్భితావ్యయుడు-అవ్యయ-పర-ఈశ్వర-భగవాన్-సత్త్వ-నిత్యసుఖి
(2) క్షరావ్యయగర్భితాక్షరుడు-అక్షర-పరావర-జీవ-క్లేశవాన్-రజస్-సుఖిదుఃఖి
(3) అవ్యయాక్షరగర్భితక్షరుడు-క్షర-అవర-జగత్-క్లేశ-తమ-నిత్యదుఃఖి

## పరబ్రహ్మసంస్థ-అధిదైవతమ్-అధ్యాత్మమ్

అధ్యాత్మం.

1. } (1) స్వయంభూ
(2) పరమేష్ఠి } సత్వగుణవికాస-అవ్యక్తసంస్థ-అవ్యయప్రధాన, ప్రత్యగాత్మా. అధ్యాత్మిక

2. (1) సూర్యుడు-రజోగుణవికాస-వ్యక్తావ్యక్తసంస్థ-అక్షరప్రధాన-జీవాత్మా.

3. } (1) చంద్రుడు
(2) ప్రధివి } తమోగుణవికాస-వ్యక్తసంస్థ-క్షరప్రధాన, విశ్వమ్.

## శబ్దబ్రహ్మ-పరబ్రహ్మ మేళనము

| | | | |
|---|---|---|---|
| (1) పరమేష్ఠిగర్భిత స్వయంభూ | 2. | — | అవ్యయ — స్ఫోట |
| (2) అమృతమృత్యుమయ సూర్య | 1. | — | అక్షర — స్వర |
| (3) చంద్రగర్భిత పృథివి | 2. | — | క్షర — వ్యంజన (వర్ణ) |

| ఈశ్వరశరీరం — విశ్వము | ఆత్మన్వీ ప్రజాపతి | ఈశ్వరాత్మ — ఆత్మ |
|---|---|---|

ఈశ్వరః

పూర్వోక్త విషయమును మరొక విధముగా సమన్వయింప వచ్చును:— అవ్యయ అక్షర క్షర సమష్టి సర్వమ్. ఆత్మన్వీ ప్రజాపతికే యీ మూడు వివర్తములు. (1) అవ్యయుడీశ్వరాత్మ. దీనినే ఆదిదైవికాత్మ యందురు. (2) అక్షరుడు జీవాత్మ దీనినే ఆధ్యాత్మికాత్మ యందురు. (3) క్షరుడు శిపివిష్టాత్మ, దీనినే అధిభౌతికాత్మ యందురు. ఈ మూటిసమష్టియే సర్వమ్. ఈ మూడే స్వాతంత్ర ఆత్మన్వీ లేక ప్రజాపతులు. సపరిగ్రహాత్మనే ఆత్మన్వీయని ప్రజాపతియని యందురు. ఈదృష్టితో ప్రతియొక ఆత్మన్వీకిని (ప్రజాపతికిని) ఆత్మ- శరీరము రెండు భాగము లుండును. ఇవి క్రమముగా జూతము.

(1) మహామాయావచ్ఛిన్నము, పంచపుండీరాత్మకము, సహస్రబల్శానూర్తి యగు బ్రహ్మాశ్వత్థము, మహావిశ్వము, ఇదే ఆ త్రిపురుషాత్మకుడు, పరబ్రహ్మమూర్తి, అవ్యయ లక్షణుడు, వ్యాపకుడు నగు నీశ్వరాత్మకు శరీరము. భూః భువః

సువః అను నీ మూడు మహా వ్యాహృతులతో గూడిన పూర్వోక్త మహావిశ్వమునం దీ యీశ్వరాత్మ యవిభక్తరూప మున, వ్యాపు డగుచున్నాడు: ("అవిభక్తం విభక్తేషు") ఈ ఈశ్వరాత్మ అవ్యయప్రధానుడు. ప్రకారాంతరమున:- ఈ మొదటి సంస్థయందు క్షర డక్షరగర్భితుడు. ఇక నవ్యయుడు పూర్ణ రూపమున వికసించును. తద్వికాసమే చతుర్విధ భగసంపత్తికి మూలప్రతిష్ఠ. కనుకనే యీ మొదటి యాత్మస్వీని, భగవంతు డందుము. ఇదియే గీతాశబ్దపూర్వమగు భగవత్ శబ్దము. ఏల యన, మనోమయుడగు నవ్యయుడు జ్ఞానశక్తి ఘనుడు. విద్యా జ్ఞానములు సమానార్థకములు. విద్యశక్తి, శక్తి శక్తుల కభేదము. తాప మగ్ని కభిన్నము కదా? ఈ యవ్యయ విద్య పూర్వోక్తమట్లు నాల్గు భాగములు (పాదములు). ఈ విధ ముగా నవ్యయుడు చతుష్పాద్బ్రహ్మ. ఒక్కొక పాద మొక్కొక యక్షరము. శుద్ధుడగు నవ్యయుడీ నాల్గుపాదములు కారణముగ చతురక్షరుడు.

ఇతనినుండియే అక్షరునిద్వారా క్షరోపాదనముచే సర్వ సృష్టియైనది. ఈ విషయము నీ గీతావచనములు చెప్పును. "మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే స చరాచరం" "అహం సర్వస్య ప్రభవః మత్తః సర్వం ప్రవర్తతే" "ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయం" చతుష్పాద్బ్రహ్మయగు నవ్య యుని మూడక్షరములు స్వతంత్రముగ నుండును. కేవల మొక పాదమే మర్త్యమగు నీ సర్వసృష్టియందు సంయుక్తమగును.

మిగిలిన మూడక్షరములును అమృతరూపమున సర్వథా అసంగములుగ నుండును. శ్రుతియు "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహా భవత్పునః" అనుచున్నది. కనుక నీ రహస్యముం బట్టియే అక్షరభావమునుండి క్షరమైపోయిన యొకయక్షరమును విడచి మిగిలిన యమృతరూపములగు మూడక్షరములచే భగవత్, ఈశ్వర శబ్దము లేర్పడినవి.

(1) స్వరోఽక్షరమ్ సహైర్వ్యంజనైః (ప్రాతి)
(2) అక్షరమితి త్ర్యక్షరమ్. (తాం. బ్రా)
(3) వాగిత్యేకమక్షరమ్.

ఇత్యాది ప్రమాణముల నూహింపవలయును. ఇదియే అవ్యయుని త్రిపాద్విభూతి. ఇదియే మొదటి యాధిదైవిక సంస్థ.

(2) యోగమాయావచ్ఛిన్నమును, పంచప్రాణాత్మకమును, కర్మాశ్వత్థరూపము నగు పాంచభౌతిక శరీరమే, సేంద్రియ జీవాత్మకు విశ్వము, అవ్యయ క్షరగర్భితమును, అక్షరానుగృహీతమును, వైశ్వానర-తైజస-ప్రాజ్ఞమూర్తి యునగు కర్మాత్మయే, జీవాత్మ. దీనియందక్షర వికాసము క్షరమూర్తియగు విశ్వమువంకకు వంగియుండును. కనుకనే దీనిని క్లేశవాన్ అందుము. ఇది రెండవదైన యధ్యాత్మ సంస్థ.

(3) విష్ణుమాయావచ్ఛిన్న, చిత్యాగ్నిమయ, భౌతిక పిండమే శిపివిష్టాత్మకు శరీరము. మరియు అవ్యయ-అక్షరగర్భిత-

క్షరానుగృహీత-చితేనిధేయ ప్రాణాగ్నియే ఈ శరీరమునకాత్మ. ఇది మూడవదగు నాధిభౌతికసంస్థ. ఈ క్రింది పరిలేఖనముల వలన నీ విషయము హృదయంగమ మగును:

(1) అవ్యయప్రధాన - ఈశ్వరాత్మా - అధిదైవికసంస్థ
(2) అక్షరప్రధాన - జీవాత్మా - ఆధ్యాత్మికసంస్థ } సర్వమ్
(3) క్షరప్రధాన - శిపివిష్టాత్మా - అధిభౌతికసంస్థ

1. { (1) క్షరాక్షరగర్భితావ్యయాత్మ—ఆత్మా } ఆత్మన్వీ
   { (2) క్షరప్రధానము. బ్రహ్మేశ్వర్థాత్మకం, విశ్వమ్ శరీరమ్ } ఈశ్వరః 1.

2. { (1) క్షరావ్యయగర్భితాక్షరాత్మా—ఆత్మా } ఆత్మన్వీజీవః
   { (2) క్షరప్రధానం, కర్మేశ్వర్థాత్మకం, శరీరమ్. శరీరమ్ } 2.

3. { (1) అవ్యయాక్షరగర్భిత - క్షరాత్మా—ఆత్మా } ఆత్మన్వీ
   { (2) క్షరప్రధానః చిత్యాగ్నిపిండః—శరీరం } శిపి. విష్టః 3.

ఈశ్వరుడు జ్ఞానప్రధానుడు, శిపివిష్టాత్మకజగత్తు విజ్ఞానప్రధానము. మధ్యస్థజీవుడు భయాత్మకుడు. జ్ఞానప్రధానాత్మ భగవానుడాపైవున నున్నాడు. విజ్ఞానప్రధానవిశ్వ మీపైవున నున్నది. ఈవిశ్వమే యాజ్ఞానమూర్తి భగవానుని కుపనిషత్తు (కూర్చుండుచోటు) భగవద్దర్శనము కావలయునన్నచో విశ్వలక్షణోపనిషదారాధనమే చేయవలయును. నిరాకారభగవత్ప్రాప్తికి సాకారవిశ్వోపాసనయే సాధనము. ఇచ్చటనే ఈశరీరమందే, ఈవిశ్వమందే ఈవిశ్వాంతర్గత భౌతికపదార్థములందే మనకతడు లభించును. "ఏషసర్వేషుభూతేషు గూఢోఽఽత్మాన ప్రకాశతే। దృశ్యతేత్వగ్ర్యాబుద్ధ్యాసూక్ష్మయాసూక్ష్మదర్శిభిః"

అన్నట్లు అతడు భూతములందె యున్నాడు. బుద్ధియోగమే యతని గనుగొనదగిన యుపాయము. "భూతేషుభూతేషువిచిత్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవన్తి" అన్నట్లు ధీరులు అనగా బుద్ధియోగులు భూతములందతని దర్శించి ముక్తులగుచున్నారు. అతని నిక్కడనే ఈ శరీరమందె కాంచకున్నచో వినాశము. "ఇహ చేదవేదీదథసత్యమస్తినచేదిహావేదీన్మహతీవినష్టిః" ఇచటనే అన్వేషించినచో తప్పక దొరుకును. ఇక్కడనే అతని యుపలబ్ధినొందిన జీవితము ధన్యము. భూతాత్మికయగు నీ యుపనిషన్మాహాత్మ్యము ఋషియిట్లు కీర్తించుచున్నాడు.

"ఇహచేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్యవిస్రసః.
అథమర్త్యోఽమృతోభవతి. అత్రబ్రహ్మసమశ్నుతే॥"

ఆ వైపున భగవత్సంపత్తి ఈ వైపున నుపనిషత్సంపత్తి మధ్యజీవసంపత్తి యున్నవి: జీవుడనగనేమి? ఆభగవంతుని సూక్ష్మవితానమే, భగవంతుని గీతయే, (వితానభావమే)జీవుడు. "ఏకంవాఇదంవిబభూవ సర్వం" అన్నట్లు ఈశ్వరుడొకడే నానారూపముల (జీవరూపముల) బరిణతుడగును. ఈశ్వరుడు సత్యమూర్తి. జీవుడు యజ్ఞమూర్తి. ఈశ్వరుడు తనకుదానే యజ్ఞరూపమున బరిణతుడై యీ యజ్ఞమునుండియే జీవసృష్టి వితానము గావించునట్లు "యజ్ఞంకృత్వా సత్యాంతసవామహై" ఇత్యాదులచే స్పష్టము. "సహయజ్ఞాః ప్రజాఃసృష్ట్వాపురోవాచ ప్రజాపతిః" ఇత్యాదిగీతా సిద్ధాంతమును ఈశ్వర ప్రజాపతి యొక్క యజ్ఞమునుండియే ప్రజోత్పత్తి నంగీకరించెను. సత్య

మతని సూక్ష్మరూపము, నిగూఢరూపము, సంకుచితరూపము. యజ్ఞమతని స్థూలరూపము, ప్రకటరూపము వితానరూపము. వితానమే గీత లేక గానమని యీవరకే చెప్పియుంటిమి. యజ్ఞాత్మకజీవుడు సత్యాత్మకేశ్వరుని గీత. గీతకాదు గీతా.

అవ్యయుడు స్వయముగా వితానమయినచో గీత యన వచ్చును. కాని, "మయ్యాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్" అన్నట్లు అవ్యయుని అక్షర ప్రకృతియే జీవరూపమున బరిణమించుచున్నదని "జీవభూతాంమహాబాహో యయేదం ధార్యతే జగత్" అను గీతావచనము చెప్పుచున్నది. జీవస్వరూప సమర్పక మకురమని పూర్వమే చెప్పియుంటిమి. "తథాక్షరా ద్వివిధా స్సోమ్యభావాః ప్రజాయన్తే తత్రచైవాపియన్తి" యన్న శ్రుతి వచనము దీనిని సమర్థించుచున్నది. ఈ యక్షరుడతని పరాప్రకృతి. ఇదే జీవుని జీవత్వము. ఈ స్త్రీభావప్రధానమగు నక్షరప్రకృతి కారణమున యజ్ఞమూర్తి జీవుని గీతయనక భగవంతుని గీతాయందుము.

భగవద్గీతావాక్యము స్వతంత్రము. ఉపనిషద్వాక్యము స్వతంత్రము. భగవానుని యుపనిషత్తును విశ్వమే. గీతారూప జీవుని యుపనిషత్తును విశ్వమే. రెంటియందును భేదమేమన:— అతని యుపనిషత్తు మహావిశ్వము. అతడు విశ్వగర్భమునందు ప్రతిష్ఠితుడు. ఇతని యుపనిషత్తు ఈ చిన్న శరీరము. ఇతడు దీని గర్భమందున్నాడు. అతడు తన యుపనిషత్తగు విశ్వమును సదు

ప్రయోగము గావింపుచు నిత్యముక్తుడై యున్నాడు. ఇతడు తన యుపనిషత్తగు శరీరమును విషయాసక్తము గావింపుచు బద్ధుడగుచున్నాడు. జీవునిదగు నీ బంధ భావ విమోచనముకొరకే యీ యుపనిషత్తు మనయెదుట బడినది. శాస్త్రము కేవలము మనుష్యసంబంధము కలది. మనుష్యావచ్ఛిన్నజీవాత్మ యుద్ధారార్థమే శబ్దశాస్త్రసంకలనము గావింపబడినది. ఈ విధముగ జీవాత్మయే శాస్త్రమునకు ప్రధానలక్ష్యము. గీతాశాస్త్రము గూడ నిట్టి మర్యాద గలదే. "అహంత్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ" అన్న గీతావచన మీ విషయమును విశదము గావించును. మరియు:—జీవాత్మ యక్షర ప్రధానము. ఈ దృష్టితో గీతాశాస్త్ర మక్షరశాస్త్ర మనవచ్చును. భగవత్-గీతా-ఉపనిషత్ అను మూడు శబ్దములందును గీతా శబ్దమే రూఢమైపోవుట కిదియే కారణమైయుండవచ్చును. కేవల భగవత్ శబ్దముచేగాని కేవల ముపనిషత్ శబ్దముచేగాని గీతా శాస్త్రబోధ యగుట లేదు. ఇక కేవలము గీతాయన్నచో గీతాశాస్త్రమే స్ఫురించును. గీతాశబ్దము జీవాత్మ సూచకమని మున్నె చెప్పియుంటిమి గదా!

గీతాశాస్త్ర మిట్లక్షర శాస్త్ర మయ్యును భగవల్లక్షణావ్యయునియొక్కయు, విశ్వముయొక్కయు సువిశద నిరూపణ గావించెను. ఈ దృష్టితో దీనిని సర్వశాస్త్రము లేక పూర్ణ శాస్త్ర మనవచ్చును. "కిమన్యైః శాస్త్రవిస్తరైః" యనుట కిదియే మూలము. ఈ పూర్ణతా సూచనార్థమే "భగవద్గీతోప

నిషత్తు”ని పెద్దపేరున బిలుతుము. ఇయ్యది కేవలము భగవత్-గీతా-ఉపనిషత్తులగు ఈశ్వర-జీవ-జగత్తులను వివరించుచున్నది. వేరే ప్రతిపాద్యవిషయము విశదము గావించుచున్నది. గీత మధ్యస్థుడగు జీవున కాత్మసంపత్తి పరిచయము కల్గించుచున్నది. గీత మధ్యస్థజీవుని జ్ఞాన (భగవత్) విజ్ఞాన (ఉపనిషత్) ద్వారమున సమత్వయోగమున గొంపోవుచున్నది.

ఈశ్వర — జీవ — శిపివిష్ట ఇవిమూడు నర్థములు. ఈ మూటికి గ్రమముగ భగవత్ - గీతా - ఉపనిషత్ అను మూడు శబ్దములు వాచకములు. ఈ యర్థభావములు క్రమముగ మూడక్షరములు, రెండక్షరములు, నాల్గక్షరములు, గలవి కనుక తద్వాచకశబ్దములునంతే. ‘ఈశ్వర’ మొదట ‘శిపివిష్ట’ చివర: ‘జీవ’ మధ్య—కలవు. ఇందువల్లే ‘భగవత్’ మొదట ‘ఉపనిషత్’ చివర—‘గీతా’ మధ్య—కలవు. కనుక ఈశ్వర జీవశిపివిష్టాత్మకమగునీ శాస్త్రమును, భగవద్గీతోపనిషత్, అందురు.

గీత పూర్ణశాస్త్రమంటిమి. విజ్ఞానదృష్టితో పూర్ణమననేమి? చూతము: “శూన్యమన్యత్ స్థానం పూర్ణమన్యత్ స్థానం” అనుణ ప్తసిద్ధాంతానుసారము, పరబ్రహ్మకుశూన్యము పూర్ణము అని రెండుస్థానము లంగీకరింపబడినవి. శూన్యమే పూర్ణమునకు ప్రతిష్ఠ. పూర్ణతయే శూన్యమునకుజనని. కనుకనే ఈ రెంటిని పర్యాయములుగా వాడుచుందురు. లోకదృష్టితో 10 పూర్ణ సంఖ్య - అయినను విజ్ఞానదృష్టితో 9 యే పూర్ణసంఖ్య. పలయన: పూర్ణతయందాగామి సంబంధము తెగిపోయి యాగ

మన మాగిపోవును. అపూర్ణతయందాగామి సంబంధము తెగకుండును. కనుకనే దానవిషయమున 9, 11, 21, 51, 101, 1001, వస్తు సంఖ్యావస్థ నిర్ణీతమైనది. పరలోకగతప్రేతాత్మకు తత్సంబంధులతో సంబంధ విచ్ఛేదమగుచున్నది. కనుక దాని తృప్తికొరకైన శ్రాద్ధకర్మయందు 10, 100, ఇట్లు పూర్ణదక్షిణావిధానమున్నది. అపూర్ణతయే సృష్టికి జనని. పురుష+పురుషసంబంధము పూర్ణ+పూర్ణ సంబంధము. ఇందువలన సృష్టికాజాలదు. స్త్రీ పురుష దాంపత్యభావము న్యూనము. అపూర్ణము. "న్యూనాద్వై ప్రజాః ప్రజాయంతే" అన్నట్లు న్యూనభావమే ప్రజాతంతువితాన ప్రవృత్తికారణము. కనుకనే వైజ్ఞానికులు న్యూనమునే పూర్ణమనిరి. కనుక వారికి 9 యే పూర్ణము 9, 99, 999, ఇత్యాది క్రమమున సంఖ్యావిరామము 9 తో నగును. ఇదియే పూర్ణత ; భావి, సంబంధవిచ్ఛేదరహిత విశ్రాంతియే పూర్ణత.

దశాక్షరచ్ఛందమును విరాట్టందురు. "దశాక్షరావై విరాట్" ఛందమునందొకటి రెండక్షరములు తక్కువైనను, ఎక్కువైనను భంగములేదను "నవై ఏకేనాక్షరేణఛందాంసివియన్తి, నద్వాభ్యాం" అన్నవచనానుసారము తక్కువపడినచో నిచృద్విరాట్ లేక న్యూనవిరాట్టనియు ఎక్కువైనచో "భూరివిరాట్టనియు నందురు. ఇక : రహస్యము జెప్పవలయునన్నచో శాస్త్రజ్ఞులు సంఖ్య నాశ్రయింతురు. గీత పూర్ణశాస్త్రము.

పూర్ణతకుగుర్తు 9 యక్షరములుగదా, చూడుడు. భగవత్ గీతా ఉపనిషత్ ; ఈశ్వర, జీవ, శివివిష్ట, తొమ్మిది యక్షరములే,— ఈ క్రింది పరిలేఖలం బరిశీలించినచో పూర్వోక్త విషయములు చక్కగా దెలియును :

| | | |
|---|---|---|
| (1) ఈశ్వర | త్ర్యక్షర | పరబ్రహ్మ |
| (2) భగవత్ | | శబ్దబ్రహ్మ |
| (1) జీవ | ద్వ్యక్షర | పరబ్రహ్మ |
| (2) గీతా | | శబ్దబ్రహ్మ |
| (1) శివివిష్ట | చతురక్షర | పరబ్రహ్మ |
| (2) ఉపనిషత్తు | | శబ్దబ్రహ్మ |

| ఈశ్వర-త్ర్యక్షర : | జీవ-ద్వ్యక్షర : | శివివిష్ట-చతురక్షర |
|---|---|---|
| భగవత్ | గీతా | ఉపనిషత్ |
| 3 | 2 | 4 |

9 అక్షర : విరాట్ పూర్ణపురుష.

| భగవత్ | గీతా | ఉపనిషత్ |
|---|---|---|
| ఈశ్వరప్రపంచ : | జీవప్రపంచ : | శివివిష్టప్రపంచ : |
| అవ్యయప్రధాన | అక్షరప్రధాన | క్షరప్రధాన |
| మనః, జ్ఞానం, అమృతం | ప్రాణ-క్రియా అమృతమృత్యు | వాక్, అర్థ మృత్యు |
| జ్ఞానయోగ | భక్తియోగ | కర్మయోగ |
| అధిదైవతం | అధ్యాత్మం | అధిభూతం |
| ఏతద్ధ్యేవాక్షరం పరం (అవ్యయః) | ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యోయదిచ్ఛతి తస్యతత్ (బుద్ధియోగః) గీతాశాస్త్రనిష్కర్ష. | ఏతద్ధ్యేవాక్షరంబ్రహ్మ (క్షరః) |

ఇతి శ్రీ ...... నామమీమాంసానామ
ద్వితీయః ప్రసంగః.

---

# తృతీయప్రసంగము

## ప్రథమోద్దేశము

### భగవద్గీతకు : శాస్త్రాంతరవైలక్షణ్యము



### అపూర్వత, పూర్ణత

దార్శనికదృష్టితో గాక వైజ్ఞానికదృష్టితో గీతాశాస్త్రముం జూచినప్పుడే పైశీర్షిక సమన్వయించును. లేనిచో గీతాశాస్త్రము గతానుగతికశాస్త్రమే యగును. ప్రాచీనులాత్మకల్యాణమునకు మూడే మార్గముల నెంచుకొనిరి. అవి
1 2 3
కర్మ - భక్తి - జ్ఞానములు. అధికారి తారతమ్యము ననుసరించి యెవ్వరైన తన యధికారానుసార మీమూటియందు నేదో యొక మార్గము నాశ్రయించి హితసాధన గావించుకొనవచ్చును. మూడు మార్గములును వేదసమ్మతములే.

వేదమునందలి యీమూడు భాగములకు సంబంధించిన (1) విధి, (2) ఆరణ్యక, (3) ఉపనిషత్తులపై - వరుసగ - జైమిని - శాండిల్య - వ్యాసులు : పూర్వమీమాంస - మధ్యమీమాంస - ఉత్తరమీమాంస యను దర్శనములను నెలయించిరి. ఈక్రింది పరిలేఖను జూడవలయును.

| విధి. పూర్వభాగము : | ఆరణ్యకము. మధ్యభాగము | ఉపనిషత్. ఉత్తరభాగము |
|---|---|---|
| జైమినిదర్శనము | శాండిల్యదర్శనము | వ్యాసదర్శనము |
| పూర్వమీమాంస | మధ్యమీమాంస | ఉత్తరమీమాంస |
| కర్మయోగ | భక్తియోగ | జ్ఞానయోగ |
| యోగనిష్ఠ | భక్తినిష్ఠ | సాంఖ్యనిష్ఠ |
| గృహస్థు డధికారి. | వానప్రస్థు డధికారి. | సన్న్యాసి యధికారి. |

పై దృష్టితో గీతం జూచి యీ మూడు యోగముల సంగ్రహమే యిది యనుకొన్నచో పై శాస్త్రముల వలననే ఆయీ విషయములు గతార్థము లగుచుండగ భగవంతునకుగాని వ్యాసునకుగాని ఈ పిష్టపేషణ వ్యవహారమేమి ప్రయోజనము? పై మూడు యోగముల నేకత్రితము జేయుటకైనను మూటికి నొకడే యధికారిగగూడ నుండజాలడు గదా! ప్రాచీన మత దృష్టి ననుసరించి గీతా విభాగ మీక్రింది పరిలేఖ విశదముగావించును.

| కాండ | అధ్యాయము | యోగము | |
|---|---|---|---|
| జ్ఞానయోగ కాండ | 1— | విషాదయోగము | 180 సాంఖ్యము. |
| | 2— | సాంఖ్యయోగము | |
| | 3— | కర్మయోగము | |
| | 4— | జ్ఞానకర్మ సన్న్యాసయోగము | |
| | 5— | కర్మసన్న్యాసయోగము | |
| | 6— | ఆత్మసంయమయోగము | |
| భక్తియోగ కాండ | 7—1 | జ్ఞానవిజ్ఞానయోగము | 209 భక్తి |
| | 8—2 | అక్షరబ్రహ్మయోగము | |
| | 9—3 | రాజగుహ్యయోగము | |
| | 10—4 | విభూతియోగము | |
| | 11—5 | విశ్వరూపదర్శనయోగము | |
| | 12—6 | భక్తియోగము | |

| | | |
|---|---|---|
| 13—1 | ప్రకృతిపురుషవిభాగయోగము | 211 యోగము |
| 14—2 | గుణత్రయవిభాగయోగము | |
| 15—3 | పురుషోత్తమయోగము | |
| 16—4 | దేవాసురసంపద్విభాగయోగము | |
| 17—5 | శ్రద్ధాత్రయయోగము | |
| 18—6 | సన్యాసయోగము | |
| | | 700 |

ఈ విభాగము లందొక్కొక నిష్ఠయే గీతార్థముగా వెలసిన వ్యాఖ్యా నానువ్యాఖ్యానముల ననుసరించి సాంప్రదాయిక బృందము, అన్యోన్య కలహము బెంచుకొనుచున్నది. వైజ్ఞానిక దృష్టి కీవిభాగము నిరుపయోగము. కాని ఐతిహాసిక దృష్టిచే నిదియొక విధముగ నాదరణీయమే. సర్వసాధారణుల కిది సహజముగ గ్రాహ్యముకూడ సనవచ్చును. వైజ్ఞానికవిభాగ మందరకు నుపయోగింపక పోవచ్చును: ఏలయన:—

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః"

అని కదా గీతావచనము. కనుకనే "సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప" యగుచు వచ్చినది. ఎంత చెప్పినను నేటి స్థితియు నంతే. మరల నెప్పటివలె కర్మ - భక్తి - జ్ఞాన నిష్ఠలకు సంబంధించిన వ్యాఖ్యా నానువ్యాఖ్యానములు వెలయుటయే కాక ప్రస్తుతము వ్యక్తిగతములు సామాజికములు నగు నభిప్రాయముల కనుగుణమగు టీకా టిప్పణులుకూడ బయ

లుదేరుటచే గీత చివరకు వ్యక్తి తుష్టికి గారణమై వ్యాక
వ్యాపకబుద్ధి యోగ వంచితమైపోయినది.

గీతోపదేశము భారత యుద్ధావసరమున నైనది.
ప్రసంగముతో వ్యాస భారత రచనజరిగినది. కనుక నీ
సిక కాలముతో గీతోపదేశమునకుగూడ సంబంధము క
అందువల్లనే యితిహాస గ్రంథమున తన భాషతో వ్యాస
గీతా సమావేశము గావించెను. ఒకానొక హేతువుచే భార
మున పదునెన్మిది పర్వము లుంప బడినవి. ఈ యష్టాదశ భావ
మితిహాసమర్యాదకు చెందియున్నది. అయ్యది రాబోవు సంఖ్యా
రహస్యమున జూలెము. ఆ మర్యాదను రక్షించు వ్యాసుడు
పరోక్ష ప్రియతచే నితిహాస దృష్టిని ప్రధానముగా బెట్టికొని
గీతనుగూడ పదునెన్మిది భాగములు గావించెను. గీతయొక్క
విద్యాతత్త్వము మరుగువడుట కైతిహ్య భావ మొక కార
ణము రెండవది వ్యాఖ్యాతల సంకుచిత బుద్ధి. వారదివరకు
నిశ్చయించుకొన్న భావముం బట్టియే దీనికి వ్యాఖ్యానము
గావింపుచు వచ్చిరి. గీత యేమి చెప్పును? అన్నది వీరికి ప్రధా
నము కాదు. "మా యభిప్రాయము గీతయం దున్నదా లేదా?"
అనియే వారికి గావలసినది. అదియే దాని వ్యాఖ్యానము. ఈ
కారణమువల్లనే నేటి గీతావ్యాఖ్యలన్నియు (అభినవగుప్తవ్యాఖ్య
తప్ప) నీ యైతిహాసిక దృష్టిమూలమగు దార్శనిక వర్ణ శబళిత
ములై యున్నవి. అందువలన గీతా విజ్ఞాన రహస్యము మాటు
వడిపోయినది, పోవుచున్నది.

గీత యితిహాసమం దుద్ధరింపబడినదైనను ఆ దృష్టితో పదునెన్మిది యధ్యాయము లుండుట న్యాయసంగతమైనను, ఏతావన్మాత్రమున దానిని విద్యామర్యాదనుండి వేరుచేయ జాలము. విద్యకు తత్త్వదర్శులగు విద్వద్గురు - శిష్య సంప్రదాయ సంబంధముండును. "శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్" "ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః" అని గీత స్వయముగా విద్యాసంబంధము కల్గియున్నట్లు చెప్పికొనుచున్నది. ఇట్టిస్థితిలో గీత కేవల మైతిహ్య గ్రంథ మనలేము. చివరకు - ఒకవిధముగ 18 అధ్యాయములతో మూడు కాండల తో నితిహాస మర్యాదాక్రాంతమగు దార్శనిక గ్రంథమయ్యె నింకొక విధముగ చతుర్విధ బుద్ధియోగముల యొక్కయు, చతుర్విధ విద్యలయొక్కయు, నిరూపణ చేయుచుండుటచే గీత విజ్ఞానశాస్త్రముగూడ నైయున్నది. ఇట్లు గీతయందు రెండు దృష్టు లేర్పడగా రెండవదృష్టితో జూచినవారికి గీతయొక్క యపూర్వత మొదలగు లక్షణములు గోచరించును. అదియే తత్త్వదృష్టి. మొదటిదృష్టి కే విలక్షణతయు గోచరింపదు. రెండవ దృష్టి మొదటిదృష్టిని లెక్కసేయదు.

గీతకంటెముందు గీతాచార్యుడగు కృష్ణుని జూతము. అతడార్యజాతికి పరమోపాస్య దైవము. కాని, యితని యుపాసన రెండువిధములైనది. ఇది చిరకాలమునుండి వచ్చుచున్నదే. ఇందుకు కారణ మతడు రెండు తెఱగుల వాడగుటయే. అతని

జీవితమున మనుష్య భావము - ఈశ్వర భావమునని రెండుభావములు కలవు. (1) బాల సులభమగు సాధారణ చరిత్ర. మిత్రగోష్ఠి, యుద్ధప్రసంగములందు సహాయుడగుట, దూతభావము, వివాహము, పుత్రకళత్రసంగతి ఇత్యాదులు మనుష్యభావ నిదర్శనములు. (2) విరాడ్రూప ప్రదర్శనము, అసంగత - పరమైశ్వర్యము, పరమ వైరాగ్యము, జ్ఞానోదయము, ధర్మోదయము ఇత్యాదు లీశ్వర భావనిదర్శనములు. లోక కల్యాణముకొరకు కాధికారికజీవుడుగ నవతారమెత్తిన వాడతడు. లోక సామాన్య, భావ, విశేష భావములచే రెండు విధముల వాడయ్యెను. భగవంతు డుభయలోక కల్యాణ కాంక్షిగనుక నట్లుగావలసి యుండెను. అతడు తన మనుజ రూపమున బాలురను, స్త్రీలను సామాన్య మానవులను ఉద్ధరించెను. తన యీశ్వరభావమున యోగిజనోపాసనా భూమి యయ్యెను.

భగవానుని యీ రెండు రూపములందు నొకదానినైతిహాసిక మనియు, నొకదానిని వైజ్ఞానికమనియు ననవచ్చును. మొదటి దృష్టితో జూచిన:— భగవంతు డొకచో జనించెను. తన యలౌకిక గుణములయొక్కయు, నతులిత శక్తులయొక్కయు నాధారమున దుష్ట శిక్షణ గావించెను. విజ్ఞాన దృష్టితో జూచినచో నతడసంపూర్ణ విశ్వమున కాత్మగ నుండెను. స్వాయముగ నందదంపతులుగూడ సర్వదా విరుద్ధములగు, నతని యీ రెండు రూపములను జూచి యప్పుడప్పుడు వ్యామోహితు లగు చుం

డిరి. సామాన్యముగా నా దంపతు లీయనను తమ ప్రియబాలకు డనుకొనిరి. భగవంతుడును యోగమాయద్వారా వారి వాత్స ల్య భావమును సురక్షితము గావించుచుండెను. కాని యితని సామాన్య రూపముం జూచిన వారితని యమానుష చర్యలం గాచినప్పుడు నిశ్చేష్టు లగుచుండిరి. కొంత సేపటివరకు తమ స్నేహ భావమును మరచుచుండిరి. కాని, వెంటనే యతడు వారిని యోగ మాయచే విస్మృతి గర్భమున బడవేయు చుండెను.

భగవంతుని యీ రెండు రూపములును మన దృష్టితో "నంద నందన" "వసుదేవ నందన" అని వ్యవహరింతము. ఒకటి మనుష్య విధము, నైతిహాసికమును. రెండవది యీశ్వర విధము వైజ్ఞానికమును. కనుకనే నంద నందనుడుగ నున్నంత కాలము, మనుష్యభావ ప్రాధాన్యముండెను. గోకులమునుండి తిరిగి వచ్చి వసుదేవ నందనాభినయ మారంభించినది మొదలాయన జీవన మొక గంభీర భావమున బరిణతి నొందెను. ఈ రెండు రూప ములందును మొదటి రూపము నుపాసించువారు చాలమంది గలరు. గాని రెండవరూపము నుపాసించువారు మిక్కిలితక్కువ. నంద నందను నంద రెరుంగుదురు. అతని బాలభావ మందరకు ప్రియము. వసుదేవ కృష్ణరూప విజ్ఞానము గలవారు దుర్లభులే కాదు సుదుర్లభులు. "వాసుదేవః సర్వమితి స మహాత్మా సు దుర్లభః" అని స్వయముగా దన వాసుదేవరూపము క్వాచిత్క మని చూపియున్నాడు.

ఇంతకును జెప్పవచ్చిన దేమనగా:— ఏ సంప్రదాయికుల దృష్టి కృష్ణుని నైతిహాసిక మానుష రూపముపై నున్నదో అనగా నెవరు నంద నందనోపాసకులో వారు తప్పక గీత కితిహాస సంబద్ధమగు నధ్యాయ విభాగ మాశ్రయముగా గొని కేవల మక్షరార్థములద్వారా లేదా గీతాపారాయణమాత్రము సంతోషింతురు గాక! కృష్ణుని వైజ్ఞానికేశ్వర భావమున దృష్టి గలట్టియు, వసుదేవ కృష్ణవ్యాపకత్వ మెరింగినట్టియు వారికి విజ్ఞానభావమే సంతుష్టి నీయగలదు. అట్టివారికే గీతయొక్క అపూర్వత - పూర్ణత - విలక్షణత గోచరించును. అది యెట్టిదో చూతము:—

ఆత్మతత్త్వము స్వస్వరూపమున సర్వదా ఆనంద ఘనము. ఇందుకు ప్రత్యక్ష ప్రమాణ మేమనగా:- ఆత్మ యెన్నడును మఱచియైన దుఃఖముం గోరదు కదా! అయినను, సంస్కార విశేషమున దుఃఖము నొందుచున్నది. ఈ సంస్కార విశేషమే జన్మప్రవృత్తి మూలము. యోగ మాయా బంధనమున పారతంత్ర్యమునొంది స్వరూప విస్మృతిచే దుఃఖించు జీవుని సాంసారిక దుఃఖ పుంజమును సహేతుకముగా దొలగించి స్వకీయానందాధికారము నొనగూర్చుటకే గీతాశాస్త్రము ప్రవృత్తమయినది. తన్ను దా నెరుంగుట లేదా ఆత్మ యథార్థ రూపము నెరుంగుటయే జీవుని పరమపురుషార్థము. అదియే మోహనివృత్తి కైకాంతిక సాధనము. అందువలన త్రివిధ దుఃఖాత్యంతిక నివృత్తి లభించును. ఇంకొక మార్గము లేదు.

"తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి నాన్యఃపంథా విద్యతేఽయనాయ" అనియే శ్రుతి చెప్పును.

"సర్వం చతురస్రమ్" అన్నట్లు సర్వతయు పూర్ణతయు చతుస్రక్లిప్తి నాధారపడియుండును. లోకమందుగూడ సర్వత-పూర్ణత - తెలియ బరచుటకు "నలువైపు లాక్రమించెను" ఇత్యాదులు వాడుకలో నున్నవి: అనగా అంతయు నాక్రమించెనని యర్థము. ఈ యాధారమునవే వేదమునందు "చతుష్టయం వా ఇదం సర్వం" అని యున్నది. "పూర్ణమదః పూర్ణమిదం" అని యాత్మ పూర్ణమందురు. పూర్ణత చతుస్రక్లిప్తి నాధారపడి యున్నది:

ఆత్మకు బూర్ణతగూర్చు నా నాల్గు ప్రకృతులు నేమి? మహర్షుల ప్రత్యుత్తరమిది:- ఆత్మయందు విద్యాబుద్ధి సంబంధమున మొదటినుండియునున్న (1) వైరాగ్య, (2) జ్ఞాన, (3) ఐశ్వర్య, (4) ధర్మములను నాల్గు విద్యా సంపత్తుల సమ్యక్ జ్ఞానానుష్ఠానములవలన నాత్మకు బూర్ణత యేర్పడును.

ఏలయన నీ నాల్గు విద్యాబుద్ధులవలనను, ఆత్మయొక్క వైరాగ్యాది విద్యల వికాసము కల్గును. కనుక సాధన రూపములగు నీ విద్యాబుద్ధుల నాత్మ విద్యలనియే యందుము. ఈ నాల్గు విద్యలే నాల్గు విద్యాబుద్ధులకు మూలము. ఆత్మవిద్య జ్ఞానప్రధానము, బుద్ధియోగము కర్మ ప్రధానము. జ్ఞాన కర్మలు రెండును ఆత్మకు ప్రాతిస్వికసంపత్తులు. ఇంకు ఆత్మవిద్య

ఆత్మయొక్క జ్ఞానభాగమును, బుద్ధియోగ మాత్మయొక్క కర్మభాగమును పూర్ణముగ వికసింప జేయును. ఈ విధముగ ఆత్మవిద్యా లక్షణ విద్యయు, బుద్ధియోగ లక్షణయాగమును, అను నీ రెండుపాయములును, జ్ఞాన కర్మమయమగు నాత్మను నిర్మలము గావింపగా నాత్మ కన్ని భౌతిక పదార్థముల కంటె అపూర్వత, పూర్ణత - విలక్షణత సిద్ధించును. ఆ పని గీతా శాస్త్రము సొత్తు.

మన గీతా శాస్త్రము క్రమముగ 6-2-4-6 అధ్యాయములచే ఆత్మవిద్యా రహస్య ప్రతిపాదకములగు (1) రాజర్షి విద్యా, (2)సిద్ధవిద్యా, (3) రాజవిద్యా, (4) ఆర్ష విద్యా అను నాల్గు ఆత్మవిద్యల పరిజ్ఞానమును, అనుష్ఠానోపాయమును జూపుచున్నది. మరియు నీగీతాశాస్త్రమే యిదే క్రమమున నా యధ్యాయముల వలననే క్రమముగ (1) వైరాగ్య బుద్ధియోగము, (2) జ్ఞాన బుద్ధియోగము, (3) ఐశ్వర్య బుద్ధియోగము, (4) ధర్మ బుద్ధియోగము అను నాత్మ కర్మల సమ్యక్ పరిజ్ఞానము కలిగించుచు వీని యనుష్ఠానోపాయముం జూపుచున్నది. ఇట్లు గీతాశాస్త్రము మనకు బూర్ణ సంపత్తి నిచ్చుచున్నది. మన కర్మాత్మకు బూర్ణత గల్గించుచున్నది. కనుక నీ శాస్త్రమునకు ఇతర శాస్త్రములకంటె పూర్ణతాదులు కలవు.

తక్కిన వైశేషిక-ప్రాధానిక-శారీరకాదులగు దర్శనములన్నియు నాంశికముగ సఫలతనొందినవనునది యాత్మపరీక్షా

ప్రకరణమున జూతము. కాని, ప్రకరణసంగతికొఱకు ప్రస్తుత మీమాంసామాత్రము తెలిసికొందము. ఏమనగా :-వైశేషికము క్షర తత్త్వమాత్మగా నంగీకరించెను. కనుకనే అయ్యది "ఆత్మద్రవ్య' మని వచించెను. ప్రాధానిక (సాంఖ్య) శాస్త్రదృష్టి యవ్యక్త నామప్రసిద్ధమగు నక్షరతత్త్వముపై గలదు.

ఇట్లే శారీరకదర్శనము క్షరగర్భితాక్షరుని బ్రహ్మ (ఆత్మ) గా నంగీకరించినది. వేదాంతదర్శనబ్రహ్మ శాశ్వతపదా ర్థము కాజాలదు. ఏలయన, బ్రహ్మజిజ్ఞాసాశాంతికి వ్యాసుడు "జన్మాద్యస్యయతః" "తత్తుసమన్వయాత్" అనియెను. "దేని వలన జన్మ స్థితి లయప్రవృత్తి యగుచున్నదో, ఏది సమన్వయ మున జన్మస్థితి లయములకు గారణమగుచున్నదో అదియే బ్రహ్మ" యని యాసూత్రముల తాత్పర్యము. ఈలక్షణము క్షర యుక్తాక్షరునిపైనే చరితార్థమగును. జన్మస్థితిభంగముల సంబం ధముగల యాత్మ ముఖ్యాత్మకాజాలదు. ఉపనిషత్తుల ననుసరిం చిన యాత్మ అజరము, అమరము, అభయము, ద్వంద్వాతీ తము. దాని జన్మస్థితి లయములతో బనియేమి? సంబంధమేమి?

జననమరణప్రవాహరూప సంసారచక్రమున బడుచు బో వుచు అనుకూలప్రతికూల వేదనల ననుభవించునది క్షరాక్షరా త్మయే. యెల్లశాస్త్రముల విచారణలకును విశ్రాంతిస్థానము. కాని, దానిని ముఖ్యాత్మయనక యూరెంటికి భిన్నమును, విద్యా కర్మమయమునగు నవ్యయతత్త్వమే యాత్మయందుము. దాని

పరిజ్ఞానమే జీవన్ముక్తి. క్షరాక్షరములు రెండు నవ్యయాత్మకు ప్రకృతులు. క్షరమపరాప్రకృతి, అక్షరము పరాప్రకృతి. పురుష శబ్దవాచ్యు డవ్యయుడొకడే. ప్రకృతి రూపక్షరాక్షరు లతని స్వభావములుఅని గీతయన్నది. కనుకనే గీత "ద్వావిమౌపురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ" అని గౌణదృష్టితో పురుషులన్నది.

ఈయవ్యయాత్మ స్వరూపమింత స్పష్టముగా గీతయే కాని మరేశాస్త్రమును జెప్పక తటస్థములైనవి. అవ్యయుడే పురుషుడు, పూర్ణుడును. ఇతరాత్మలకంటె నపూర్వుడు (అనాది-సర్వాది)గ సర్వత్ర వ్యాప్తుడయ్యు లిప్తుడుగామిచే సర్వపదార్థ విలక్షణుడై యున్నాడు. అట్టి వానిని స్పష్టముచేసిన గీతకా యపూర్వతాదిలక్షణములు కలవనియు, నియ్యదియే అవ్యయ విద్య-లేక బ్రహ్మవిద్యా శాస్త్రమనియు నంకుము.

విద్యా (విద్యాత్మకావ్యయ) దృష్టితో గీతయొక్క-అపూర్వత దెలిసికొంటిమి. ఇక యోగ (కర్మ) దృష్టితోగల విశేషతంగూడ బరిశీలింతము. అందును ఇతరశాస్త్రముల పూర్ణములే, ఎట్లన :-కర్తవ్యభాగము కర్మయనియు నది గీతకు ప్రాచీనమతమున (1) జ్ఞాన, (2) భక్తి, (3) కర్మయని మూడు భాగములని చెప్పితిమి. ఈమూడును (1) జ్ఞానాసక్తి, (2) ఈశ్వరాసక్తి, (3) కర్మాసక్తి కలవై కామనామయములై యున్నవి. కామనవలన సంస్కారలేపము, దానివలన బంధనము, అందువలన ఆత్మకు అపూర్ణత తప్పవు. కనుక ప్రాచీనమతము

లపూర్ణములు. గీతాదృష్టితోనివి అయోగములు, భ్రష్టయోగములునై యున్నవి.

దేహధారి కేకాంతతః కర్మసన్న్యాస మసంభవము. కనుక ప్రాచీనుల (జ్ఞాన) సాంఖ్యనిష్ఠకు విలువలేదు. కర్మప్రవృత్తి యాసక్తి మూలకమై ఆత్మదృష్టిచే విలువలేని దగును. భక్తి నిష్ఠకూడ ఈశ్వరానుగ్రహారూపఫలాను గామియగుచు నాసక్తి గలదే కదా!

అపూర్ణత విషమతకు జనని. సమత్వాభావమున మును పటినుండి నేటివరకు నీయోగనిష్ఠుల పరస్పరకలహములు, ఆక్షేపణలు, ఖండనమండనములు నిందుకు నిదర్శనములు. చిత్ర మేమన :- నేడీ మూ డపూర్ణయోగములైనను స్వస్వరూపము లతో సురక్షితములుగ లేవు. నామమాత్రమునకు జ్ఞానము, భక్తియు తమతమ ప్రభుత్వమును స్థాపించుకొని యున్నవి. కర్తవ్యకర్మలం దసమర్థమగు భారతవర్షము తనసోమరితనము వీని నెపమున గప్పిపుచ్చ బాటుపడుచున్నది. వర్ణాశ్రమధర్మము లకు నేడు గడ్డిపరక విలువయు లేదు.

శాస్త్రములందు సత్యమే యున్నచో "స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః" "స దోషమపి న త్యజేత్" "స్వధర్మే నిధనం శ్రేయః" "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" ఇత్యాది భగవదాదేశములకు విలువ యున్నచో శాస్త్రప్రతిషిద్ధములగు నేటి జ్ఞానభక్తుల కేమియు

విలువ లేదన గలము: ఏ కొంచెమో తెలిసిన ట్లున్నంత మాత్ర మునను, కేవలము భగవ చ్ఛరణాగతి మాత్రమునను, కృతా కృత నాశము కలుగదు. అవశ్య మనుభవించియే తీరవలెను. వట్టి యాడంబరములకు భగవంతు డసాధ్యుడు.

ఉత్పథగాములగు నిట్టి మహానుభావులు, భగవానుని పవిత్ర నామము సడ్డముగా బెట్టుకొని యమాయక ప్రజలను మోహా సాగరమున ముంచుచు తమ వాసనను మరింత యుత్తే జము గావించుచున్నారు. భక్తి యేకాంత వస్తువే గాని బజారు వస్తువు కాదు. సర్వశ్రీ జ్ఞానేశ్వర, తుకారామ్, రామదాసు మొదలగు మహా పురుషుల యుదాహరణములు సంసారుల మగు మన కనుకరణీయములు కావు. వారి చరిత్రల చాటున మనము భక్తి నభినయించుట కధికారము లేదు. అట్లయినచో లోక - శాస్త్ర మర్యాదావ హేళనమే యగును. భగవత్ సంపత్తియుక్త మహా పురుషుల యాదేశమే మనకు హితకరము గాని వారి ఆచరణ ప్రమాణము గాదు: వారైన నెందును ధర్మ వ్యతిక్రమ ముపదేశించినట్లు లేదు, చూడుడు.

"ధర్మ వ్యతిక్రమోదృష్టః ఈశ్వరాణాంచ సాహసం,
తేజీయసాం న దోషాయ. వహ్నేః సర్వభుజో యథా.
నై తత్సమాచరే జ్జాతు, మనసా పి హ్యనీశ్వరః
వినశ్యత్యాచరన్ మౌఢ్యాత్ యథా రుద్రోఽబ్ధిజం విషం.
ఈశ్వరాణాం వచస్సత్యం తథైవాచరితం క్వచిత్
తేషాం యత్ స్వ వచో యుక్తం బుద్ధిమాం స్తత్తదాచరేత్."

భాగ 10, పూ.

ఇక "యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః" అను భగవద్వచనము లోకసామాన్య బుద్ధ్యనువాద మాత్రము. అనీశ్వరున కది చెల్లదని పై శ్లోకము లందలి రెండవ శ్లోకము చెప్పుచున్నది:—

ఇంతకును జెప్పవచ్చిన దేమనగా:- శాస్త్రాంతరములందు నిరూపితములగు జ్ఞాన, కర్మ, భక్తి నిష్ఠ లుక్తవిధమున నపూర్ణములు. ఇక మన గీతాశాస్త్ర మీ మూటి మర్యాదలను గాపాడుచు, ఈ మూటి సమష్టి రూపమును, మూటికంటె నపూర్వము నగు బుద్ధియోగ ముపదేశించినది.

భగవంతుడు :—

"న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్యసనా దేవ సిద్ధిం సమధి గచ్ఛతి."
"కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"
"నియతం కురు కర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః."

ఇత్యాది రూపమున, పట్టుదలతో ప్రాచీనాభిమత, సర్వ కర్మాత్యంత సన్యాస లక్షణ, జ్ఞాననిష్ఠను ఖండింపుచు, "త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున" "కామాత్మానః స్వర్గ పరాః" "భోగైశ్వర్య ప్రసక్తానాం" "స శాంతి మాప్నోతి న కామ కామీ" ఇత్యాది రూపమున ప్రవృత్తి ప్రధాన వైదిక కర్మమయ కర్మయోగమును నిరసింపుచు, భక్తియోగ నిష్ఠ యొక్క ఫలాసక్తి నేకాంతతః నిరోధింపుచు: నిందు జ్ఞాన

వైరాగ్య సమావేశము గావించి బుద్ధియోగనిష్ఠ నిట్లుపదేశించు చున్నాడు.

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన
మా కర్మ ఫల హేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి"
"దూరేణహ్యవరం కర్మ బుద్ధి యోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః."
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే"
కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్"
యదా తే మోహ కలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ."

ఈ విధముగ గీతాశాస్త్రము బ్రహ్మత్రయము నుండి యవ్యయ బ్రహ్మను, యోగత్రయముకంటె విలక్షణము, నపూర్వమునగు బుద్ధియోగమును నిరూపించుచు, నపూర్వత, పూర్ణత - విలక్షణత కలదై యున్నది.

ఇచ్చట నొక ఆక్షేప ముండవచ్చును:— "గీతాశాస్త్రము పూర్వము, విలక్షణము గావచ్చును కాని పూర్ణము కాదు. ఏలయన :— యితర శాస్త్రములందు వర్ణింపబడిన క్షరాక్షరుల విచారణ యిందు లేదు గదా!"

సమాధానము : గీతాదృష్టియం దీయాక్షేపమునకు విలువ లేదు. ఏల యన ప్రధానమగు నవ్యయాత్మను, ప్రధానమగు బుద్ధియోగమును నిరూపించిన గీతయందిక నిరూపింప

దగిన శేషమే లేదు కదా! ఎట్లన :— క్షరాక్షరాదులగు నితర ఖండాత్మలకు మూలప్రతిష్ఠ పరమాత్మ, యవ్యయుడే యని గీత చెప్పుచున్నది:

"మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ."
"మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః."
"గతి ర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్.
ప్రభవః ప్రళయస్థానం నిధానం బీజమవ్యయమ్."
"యో లోక త్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః."
"భవన్తి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః,
"మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరా చరం."
"అహం సర్వస్య ప్రభవః మత్తః సర్వం ప్రవర్తతే."

ఇత్యాదులు. వస్తుతః కోశాత్మకుడగు అవ్యయ బ్రహ్మయే సర్వాలంబనము. అతనికి ఆనంద - విజ్ఞాన - మనః - ప్రాణ - వాక్కు (దీనినే అన్నమయ కోశమనియు నందురు) లు పంచ కోశములు (తై. ఉ.) పంచ కళలు గల యక్షరుడును, పంచ కళలుగల క్షరుడును, అతనిపై నాధారపడియే యున్నారు. బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోము - అనునవి యక్షర పంచ కళలు. ప్రాణ - ఆప - వాక్ - అన్న - అన్నాద అనునవి క్షర పంచ కళలు. ఇవి అవ్యయు నెట్లాశ్రయించునది క్రింది చక్రముం జూడుడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అవ్యయుని | ఆనంద | విజ్ఞాన | మనః | ప్రాణ | వాక్కు |
| అక్షరుని | బ్రహ్మ | విష్ణు | ఇంద్ర | అగ్ని | సోమ |
| క్షరుని | ప్రాణ | ఆపః | వాక్కు | అన్న | అన్నాద |

సర్వాలంబనుడగు నిట్టి యవ్యయునిం బట్టుకొన్నచో నిక శేషమెట్లుండును ? శ్రుతియు నిట్లు చెప్పుచున్నది :-

"ఏతదాలంబనం శ్రేష్ఠమేతదాలంబనం పరం
ఏతదాలంబనం జ్ఞాత్వాయోయదిచ్ఛతి తస్యతత్" (కఠ)

మరియు :-ఆత్మకు అమృత[1]-బ్రహ్మ[2]-శుక్ర[3] యని మూడు వివర్తము లంగీకరింపబడినవి. (1) వాక్కు, (2) ఆపః, (3) అగ్ని ఈమూడును శుక్రములు. ఈమూటి సమష్టియే భూతాత్మ[1]. (1) ప్రాణః, (2) ఆపః, (3) వాక్, (4) అన్న, (5) అన్నాద అను పంచబహిరంగప్రకృతుల సమష్టియు, బ్రహ్మ[2]. ఇవి క్రమముగ, (1) అవ్యక్తాత్మ, (2) మహానాత్మా, (3) విజ్ఞానాత్మా, (4) ప్రజ్ఞానాత్మా, (5) ప్రాణాత్మా, (కర్మాత్మా-జీవ-శారీరక) అనబడును. (1) అవ్యయ, (2) అక్షర, (3) క్షర సమష్టి అమృతము[3]. ఇదే పురుషాత్మ లేక పురుషుడు, బ్రహ్మాత్మయే ప్రాకృతాత్మ లేక ప్రకృతి. శుక్రాత్మయే వైకారికాత్మ లేక వికృతి. దీని కాధారము అమృతాత్మయొక్క క్షర భాగము. "క్షరస్సర్వాణి భూతాని" బ్రహ్మరూప పంచప్రాకృ

తాత్మల కాధార మమృతాత్మయొక్క- అక్షరభాగము. "అక్ష రం బ్రహ్మపరమం" అమృతాత్మ స్వాయముగా నవ్యయప్రధా నము. ఆనందవిజ్ఞానమనోమూ ర్తియు జ్ఞానాత్మయు నగు నాయవ్యయము తనకుదానే యాధారము. "స్వేమహిమ్ని ప్రతిష్ఠితః" ఈ జ్ఞానాత్మక-అవ్యయునితోఁగూడిన ప్రాణమూ ర్తి యగు నవ్యయుడు అక్షరునకు ప్రవ ర్తకుడు. ఇట్లే వాఙ్మూ ర్తి అవ్యయుడు క్షరునకు ప్రవ ర్తకుడు. ఈవిధముగ జీవరకు ఇతడే (అవ్యయుడే) అమృతము, బ్రహ్మ, శుక్రమునై యున్నాడు. సర్వము నితనియం దంతర్భూతము. ఇక అవ్యయు నెరింగిన నంతయు నెరుకపడును. అవ్యయుని యీపూర్ణత కఠోపనిషత్తు ఇట్లు చెప్పెను.

> ఊర్ధ్వమూలోఽవాక్శాఖ ఏషోఽశ్వత్థః సనాతనః
> తదేవశుక్రం తద్బ్రహ్మతదేవామృతముచ్యతే
> తస్మిన్‌లోకాః శ్రితాః సర్వేతదునాత్యేతి కశ్చన.

పురుషఏవేదమ్ సర్వమ్.



| అక్షరవివర్తబ్రహ్మ<br>ప్రాకృతాత్మా<br>ప్రకృతి | | | | క్షరవివర్తము<br>శుక్రాత్మా<br>భూతాత్మావికృతి | |
|---|---|---|---|---|---|
| (1) అవ్యక్తాత్మా | ప్రాణః | పురుషాన్నపరంకిచిత్<br>సాకాష్ఠాపాపరాగతిః | వాక్ | ఆకాశః | 1 |
| (2) మహానాత్మా | అపః | | అపః | వాయు | 2 |
| (3) విజ్ఞానాత్మా | వాక్ | | అగ్ని | తేజః | 3 |
| (4) ప్రజ్ఞానాత్మా | అన్న | | అగ్ని | | |
| (5) ప్రాణాత్మా | అన్నాద | | అపః | జలమ్ | 4 |
| | | | వాక్ | పృధివి | 5 |

మరియు: అవ్యయుని రూపకమగు గీతాశాస్త్రము "ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ" "ఇంద్రియేభ్యః పరం మనః, మనసస్తు పరాబుద్ధి" యిత్యాది రూపమున స్పష్టముగా నితరము లగు ఖండాత్మలనుగూడ చక్కగా వివరించుచునే యున్నది. బుద్ధి యోగమునకు గూడ నిదే స్థితి. భగవంతుడు జ్ఞాన, భక్తి, కర్మయోగములను నిరూపించుచు ఆ మాటిని సంశోధన గావించి బుద్ధియోగ రూప మిచ్చియున్నాడు. ఇవి మూడును వేరై జ్ఞాన కర్మల విషమతవలన శ్రేయోభావమునకు బదులు ప్రేయోభావమునకు గారణములై సమత్వమూలక శాంతిభావమునకు విరోధములై పోయినవని చూచియే అతడీ సమన్వయరూపా పూర్వయోగమును మన యెదుట బెట్టెను.

"యదే వేహ తదముత్ర యదముత్ర తదన్విహ."

ఈ విధముగ ఆత్మలం దవ్యయాత్మను, యోగములందు బుద్ధియోగమును, తన ప్రధాన లక్ష్యముగా బెట్టుకొని గీతా శాస్త్ర మన్యశాస్త్ర ప్రతిపాదితాత్మయోగ సంగ్రహము గావించుచు పూర్ణశాస్త్ర మగుచున్నది.

ఆత్మవిద్య బ్రహ్మవిద్య; ఇదే జ్ఞాన సంపత్తు; బుద్ధియోగము యోగము, ఇదే కర్మ సంపత్తు. చతుర్విధాత్మ విద్యా దృష్టిచే గీత బ్రహ్మవిద్యా శాస్త్రము. చతుర్విధ బుద్ధి యోగ దృష్టితో గీత యోగశాస్త్రము. ఇట్లు రెంటిని నిరూపణ జేయుచున్నది. కనుక నధ్యాయోప సంహారమునందు: "ఇతి భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే" అని యున్న వచనానుసారము దీని కితర శాస్త్రములకంటె గలిగిన యపూర్వత - పూర్ణత - విలక్షణత - విశద మగుచున్నవి.

ఇతి శ్రీ........తృతీయ ప్రసంగస్య ప్రథమోద్దేశః.

## వి ష య వి భా గ ప్ర ద ర్శ న ము.

### తృతీయ ప్రసంగ - ద్వితీయోద్దేశము.

పూర్వ ప్రకరణమందు ఆత్మశాస్త్రములను వైశేషిక - ప్రాధానిక - శారీరకములని మూడు భాగములుగ జెప్పియుంటిమి; వస్తుతః శారీరకమే ఆత్మశాస్త్రము. ఏలయన:— (1) వైశేషికము క్షరాత్మను, (2) ప్రాధానికము క్షరవిశిష్ట అక్షరాత్మను నిరూపించును. ఇందు మొదటిదాని నేదృష్టితోడను

ముఖ్యాత్మయన నొప్పను. ఇక రెండవదియు ప్రకృతిభావమేమై వ్యాపకత్వము లేకుండును. గనుకనే సాంఖ్యులు 'ఆత్మలు ప్రతి శరీర భిన్నము'లని యంగీకరించిరి - క్షరయుక్తాక్షరమే ప్రతి శరీర భిన్నము. ఇదే శరీరాభిమానియగు నాత్మ. ఈ దృష్టితో వారి నానాత్మవాదము సువ్యవస్థితమే. ఈ యాత్మయే సుఖ దుఃఖాది ద్వంద్వముల కధికారి. ఈ శారీరకాత్మతోడనే ప్రత్య గాత్మ సంబద్ధుడై యుండును. అది యంతటను సమాన రూపము, ఏక రూపము. దీనినే సాక్షి యందురు. సాంఖ్యము నకు క్షరాత్మ (భూతాత్మ) యుద్దేశ్యము. అక్షరాత్మ (శారీర కాత్మ) విధేయము. ఇక శారీరక తంత్రమున కీ శారీరకాత్మ యుద్దేశ్యము. పైనచెప్పిన ప్రత్యగాత్మ విధేయము.

పదార్థము లందలి పరస్పర భేదము విశేషము. విశేష మునకుగారణ మణుభేదము. కణాదదర్శన మీ విశేషభావ ప్రవ ర్తకమగునను వాదనిరూపణ సేయును. గనుక వైశేషికశాస్త్ర మని పిలువబడును. క్షరకూటమే విశేషము. దీని కధ్యక్షు డక్షరుడు. పరమాణువుల నొక సూత్రబద్ధముగ పిండ రూప మొందించుట యక్షరుని పని. ప్రత్యేక పదార్థ కేంద్రస్థుడగు నీ యక్షరుడు తన ప్రాణశక్తిచే నా యా పదార్థక్షరకూట నియ మనము గావింపుచుండును. కనుక విధర్తయగు నితనిని అంత ర్యామి యందురు. "తస్య వా ఏతస్యాక్షరస్య ప్రశాసనే గార్గి! సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" అని శ్రుతి (బృహ) ఈ

కూటస్థతవలన "కూటస్థోఽక్షర ఉచ్యతే" అని గీత. ఇతడే విశ్వ మునకు గారణము, క్షరకూటము కార్యము. "అవ్యక్తా ద్వ్య క్తయః సర్వాః ప్రభవ న్త్యహ రాగమే" అని గీత. ఈ కారణ సూచనార్థమే (కృతేః ప్రాక్ = కార్య పూర్వావస్థ) ప్రకృతి యనిరి. విశ్వ రచనకు ప్రధాన మిదియే. కనుక ప్రధాన మనిరి. అక్షర - అవ్యక్త - ప్రకృతి - ప్రధాన శబ్దములు సమానార్థక ములు. ఇదే పరా ప్రకృతి. "జీవభూతాం మహాబాహో. య యేదం ధార్యతే జగత్" అన్నట్టిదియే ప్రతి శరీర భిన్నము. సాంఖ్యశాస్త్ర లక్ష్యము ప్రకృతి రూపము, లేదా అక్షర రూప మగు నీ జీవాత్మయే. కనుక నది ప్రాధానిక దర్శనము.

అక్షరాలంబన మవ్యయుడు. అతని ప్రతిచ్ఛాయ లేదా ప్రతిబింబమే ఆధ్యాత్మికేశ్వరుడు, ప్రత్యగాత్మ. శరీరము నందుం డియు తన విభూతిచే నీత డసంగుడు. ఆధ్యాత్మిక ద్వంద్వ సం బంధ మతనికి లేదు. "అసంగోహ్యయం పురుషో, న సజ్జతే, న వ్యథతే, నరిష్యతి" "న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః అజో నిత్యః శాశ్వ తోఽయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే" ఇత్యాది శ్రుతు లితనిని ద్వంద్వాతీతు డనును. దేహ మందుండియు దేహాభిమాన శూన్యుడు: "ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః" అని గీత. వేదాంత దర్శనమున కుద్దేశ్య మక్ష రుడగు శారీరకుడు. అద్వయ లక్షణుడగు నీ యవ్యయుడు విధే

యుడు. ఏలయన నీ దర్శన ప్రధానోద్దేశ్యము శారీరక జీవకల్యాణము. కనుకనే దీనిని శారీరక దర్శమందురు.

పూర్వ ప్రసంగమున శారీరకము నక్షర ప్రతిపాదకమని యిప్పుడు ప్రత్యగాత్మ లక్షణావ్యయ ప్రతిపాదక మంటిమి. ఇందు విరోధ మెంచవలదు. శారీరక మవ్యయ నిరూపణ చేయును గాని అధ్యాత్మ దృష్టితో జేయును. అధ్యాత్మ కక్షరునితో సంబంధము. "అక్షరధియాం త్వవరోధః సామాన్య తద్భావాభ్యాం ఔపసదవ త్తదుక్తం" (వే. ద. 3. 3. 33) ఇత్యాది శారీరక సిద్ధాంతానుసారము దవ్యయున కక్షరరూప మీయ బడినది. అక్షర సంబంధము లేకుండ శారీరకశాస్త్ర విజిజ్ఞాస్య బ్రహ్మ "జన్మాద్యస్య యతః" అనునట్లు జన్మస్థితి భంగకారణ మెన్నడు గాజాలదు. అక్షర ప్రకృతి విశిష్టుడగు నవ్యయుడే జన్మాది కారణమగును. ఈ ప్రకృతిభావ సూచనార్థమే వ్యాసుడు పిమ్మట "తత్తు సమన్వయాత్" అనియెను. ఏలయన నత డక్షరునిద్వారా అవ్యయాత్మ నిరూపణ గావించెను. కనుక దీని నక్షర శాస్త్రమనవచ్చును. అక్షరునిద్వారా ఈశాస్త్రము తటస్థ బుద్ధితో మన ధ్యానము ప్రత్యగాత్మ లక్షణావ్యయుని వంక కాకర్షించుచున్నది. కనుక దీని నవ్యయ శాస్త్రమనిరి. మొత్తముపై శారీరక దర్శన మవ్యయ యుక్తాక్షర శాస్త్రము. ప్రాధానిక మక్షర శాస్త్రము. వైశేషికము క్షరశాస్త్రము. మూటియందు నవ్యయుడు ముఖ్యాత్మ. గౌణముగానైన శారీరకదర్శన

మవ్యయుని స్పృశించి యుండుటచే దానినే ప్రధానమగు నాత్మశాస్త్ర మందుము.

ఇక నాత్మనిరూపణ గావించు స్మార్త - శ్రౌతోపనిషత్తులు మిగిలియున్నవి. స్మార్తోపనిషత్తు గీత. శ్రౌతోపనిషత్తులు ఈశ, కేనాది వేదాంతిమ భాగములు. మొత్త మాత్మ నిరూపణ సేయునవి :— శారీరకదర్శనము - గీత - ఉపనిషత్తులు, అని మూడే. ఈ మూటియం దొకవిధముగా మధ్యస్థమగు గీతయే ఇత రాత్మ శాస్త్రములకంటె అపూర్వము, పూర్ణము, విలక్షణము నని యుంటిమి.

ఆత్మస్వరూప చరమ సీమం జేరుకొన్న విజ్ఞానులు తద్జ్ఞానము కొరకు (1) జ్యోతి, (2) వీర్య, (3) అన్నము లను మూడు పదార్థములను మన యెదుట బెట్టిరి. ఈ మూటి సంబంధమువలన నొకే యాత్మ యనేకముగ లేదా. మూడు సంస్థలుగ నై పోవును. (1) జ్ఞాన లేక చిత్ తత్త్వమే జ్యోతి, (2) బల - ప్రాణ - క్రియాది వివిధ నామములు గల గతితత్త్వమే వీర్యము, (3) మయా బలానుగ్రహమున నుద్భూతములగు 1. మాయా, 2. కళ, 3. గుణ, 4. వికార, 5. అంజన, 6. ఆవరణములు సమష్టియే అన్నము. ప్రకారాంతరమున:— జ్ఞాన జ్యోతియొక్క వికృతావస్థ గతిరూపమగు వీర్యము. 1. బలరూప వీర్య వికృతావస్థయే మాయా కలాద్యన్నము. 2.

వీనియందు (1) రస లక్షణ జ్యోతి, (2) బలలక్షణ వీర్యము. ఈ రెంటి సమష్టి విశుద్ధఆత్మ; ఈ విశుద్ధాత్మ సర్వదా

నిర్గుణము, పరిగ్రహ శూన్యము కనుక శాస్త్రానధి కృతము. ఇదే ముఖ్యాత్మ. (1) ఇక మూడవదగు అన్నతత్త్వము సర్వదా ఆత్మతత్త్వ మర్యాదా బహిష్కృతము. దీనిని ఆత్మనిత్తము - ఆత్మపరిగ్రహము నందురు. ఏలయన :— ఇది ఆత్మకు భోగ్యము. కనుక అన్నమందుము. అన్నరూపమగు నీ పరిగ్రహము (1) అంతఃపరిగ్రహము, (2) బహిఃపరిగ్రహమని రెండు విధములు. (1) మాయా, కళ, గుణములను మూడు నంతఃపరిగ్రహము లును ఆత్మకు స్వరూప ధర్మము లందురు. (2) వికార - అంజన - ఆవరణములు మూడును బహిఃపరిగ్రహము లాత్మకు నాశ్రిత ధర్మములు. (1) స్వరూప ధర్మయుక్తాత్మ సగుణాత్మ యనియు, (2) ఆశ్రిత ధర్మయుక్తాత్మ సర్వధర్మోపపన్నాత్మ యనియు వ్యవహారము. ఈవిధముగ నన్నరూప పరిగ్రహ ద్వైవిధ్యము వలన సవిశేషము లేక సోపాధికమగు నాత్మకు పై విధముగ రెండు వివర్తములు. కాగా మూడవదగు నొక వివర్తము సర్వదా స్వతంత్రము, నిరుపాధికమై మిగిలి యుండు చున్నది. మొత్తమాత్మకు (1) నిరుపాధికము, (2) సోపాధిక సగుణము (3) సోపాధిక సర్వ ధర్మోపపన్నము నని మూడు సంస్థలగును. ఇందు మొదటిదానియందు శబ్దమునకు గతి లేదు. కనుక శబ్దశాస్త్రమున కది విషయమగుట యసంభవము. కాగా నిక మిగిలినవి రెండు. ఆ రెంటియందు నొకదానినో లేక రెంటిని గూర్చియో నిరూపించునది యాత్మశాస్త్రమని చెప్ప బడును: ఈ పరిలేఖల బరిశీలింప వలయును :—

(1) జ్యోతి-జ్ఞానము (రసము) } నిర్విశేషఆత్మ, పరాత్పర, పరమేశ్వర:
(2) వీర్యము-క్రియ-(బలము) } శబ్దవాచ్యము.
(3) అన్నము, అర్ధము-వికృతి,-సవిశేష-ఆత్మ-విశ్వేశ్వరుడు, ప్రజాపతి.

| | | | |
|---|---|---|---|
| స్వరూప ధర్మములు | 1 మాయ<br>2 కళలు<br>3 గుణములు | అంతఃపరిగ్రహమగు అన్నము<br>అంతర్వృత్తము | షట్కోశికమగు అన్నము |
| ఆశ్రిత ధర్మములు | 1 వికారములు<br>2 ఆవరణములు<br>3 అంజనములు | బహిఃపరిగ్రహాన్నము<br>బహిర్వృత్తము | |

నిర్విశేష —(1) స్వరూపాశ్రిత సర్వవిధధర్మరహితము.నిర్గుణాత్మ-విశ్వాతీతము.

సవిశేష ఆత్మ } (2) అంతరంగపరిగ్రహాత్మక స్వరూపధర్మావచ్ఛిన్నము-సగుణాత్మ-విశ్వాత్మ
(3) బహిరంగపరిగ్రహాత్మకాశ్రితధర్మావచ్ఛిన్నము సర్వధర్మోపపన్న-విశ్వమూర్తి

పై చెప్పిన యారు పరిగ్రహముల విలక్షణత వలన నాత్మ కారు వివర్తము లగును. అందు నాలుగు ప్రజాపతి వివర్తములు. రెండు పురుష వివర్తములు. మరియు నొక విషయము జ్ఞప్తియం దుంచుకొన వలయును. ఉత్తరోత్తరాత్మ వివర్తము పూర్వ పూర్వాత్మ వివర్తములతో సంబంధము కల్గి యుండును. అనగా ఉత్తర వివర్తము పూర్వ వివర్తమును గర్భమునం దిముడ్చికొని తన స్వరూపమును నిల్పుకొనును. పూర్వ వివర్తము కారణమనియు ఉత్తర వివర్తము కార్యమనియు, కారణసత్తచే కార్యస్వరూపనిష్పత్తి ("తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్") అనియు శ్రుతి సిద్ధాంతము.

(1) రసరూప జ్యోతి, బలరూప వీర్యముయొక్క సమష్టియే నిరుపాధికము, సర్వధర్మబహిష్కృతము నగు <u>పరాత్పరుడు.</u>

(2) ఇతని యత్కించిత్ప్రదేశము మాయయను మొకటి యంతరంగ పరిగ్రహముతో గూడి పురుషుడగును. ఇతడే విశుద్ధావ్యయపురుషుడు. (3) ఈపురుషుడు కళయను రెండవ యంతరంగపరిగ్రహ వశమున షోడశీ పురుషు డగును. అవ్యయ పంచ కళలు, అక్షర పంచకళలు, క్షర పంచకళలు, పరాత్పరకళ యొకటి మొత్తము పదునారు కళల సమష్టియు, షోడశీ. (4) ఇతడే గుణమను మూడవయంతరంగ పరిగ్రహవశమున సత్యప్రజాపతి యగును. (5) ఇతడు వికారమను నాల్గవబహిరంగ పరిగ్రహయుక్తుడై యజ్ఞప్రజాపతియనబడును. (6) ఇతడే ఆవరణనామక పంచమబహిరంగ పరిగ్రహయుక్తిచే విరాట్ప్రజాపతియగును. (7) ఇతడు అంజనమను నారవ బహిరంగ పరిగ్రహవశమున విశ్వప్రజాపతియగును.

ఇందు : పురుష, షోడశీ, సత్యప్రజాపతుల సమష్టియే సగుణఆత్మ. (1) యజ్ఞవిరాట్-విశ్వసమష్టి సర్వధర్మోపపన్నాత్మ. (2) ఇక మూడవది నిరుపాధికము, మాయారహితము నగు విశుద్ధతత్త్వము. అతనితో నీయేడు సంసంస్థలు నతనివే. "ఏతదాత్మ్యమిదం సర్వమ్"

1. ఆత్మయొక్క సప్తసంస్థాపరిలేఖ.

| | | | |
|---|---|---|---|
| | 1 నిర్మాయీ | పరాత్పరః | నిర్గుణాత్మ, విశ్వాతీతః వ్యాపకః, శాస్త్రానధికృతః. |
| 1. | 2 మాయావశాత్ | పురుషః | సగుణాత్మ-విశ్వాత్మ. |
| 2. | 3 కళావశాత్ | షోడశీ | |
| 3. | 4 గుణవశాత్ | సత్యప్రజాపతి | |
| 4. | 5 వికారవశాత్ | యజ్ఞప్రజాపతి | సర్వధర్మోపపన్నము. విశ్వమ్. |
| 5. | 6 ఆవరణవశాత్ | విరాట్ప్రజాపతి | |
| 6. | 7 అంజనవశాత్ | విశ్వప్రజాపతి | |

| | | | |
|---|---|---|---|
| 1. పరాత్పరః | పరాత్పరః | (1) నిర్గుణ, విశ్వాతీతః | ఐతదాత్మ్య మిదం సర్వమ్. (1) |
| 2. పరాత్పరగర్భితః | పురుషః | (2) సగుణాత్మ విశ్వాత్మ | |
| 3. పురుషపరాత్పరగర్భితః | షోడశీ | | |
| 4. షోడశీ, పురుష-పరాత్పరగర్భితః | సత్యప్రజాపతి | | |
| 5. సత్య-షోడశీ, పురుషపరాత్పరగర్భితః | యజ్ఞప్రజాపతి | (3) సర్వధర్మోప పన్నాత్మ విశ్వమ్ | |
| 6. యజ్ఞసత్యషోడశీపురుషపరాత్పరగర్భితః | విరాట్ప్రజాపతి | | |
| 7. విరాడ్యజ్ఞసత్యషోడశీపురుషపరాత్పరగర్భితః | విశ్వప్రజాపతి | | |

పై జెప్పిన యేడు విస్తరములందును మొదటిదానింగూర్చి శబ్దశాస్త్రము కెట్టిసంబంధమును లేనందున నిక మిగిలిన యారు వివరములనుగూర్చియే శాస్త్రములందు చాల విస్తరనిరూపణలు గావింపబడినవి. అట్టిశాస్త్రములే ఆత్మశాస్త్రములని ప్రసిద్ధినందినవి. ఏయాత్మశాస్త్ర మేయాత్మల విషయము నిరూపించెనో చూతము.

చతుర్వేదమంత్రసంహితలును విధియను బ్రాహ్మణములును, ప్రధానముగ బ్రజాపతిలక్షణముగల సర్వధర్మోపపన్నాత్మనుద్దేశ్యముగా నుంచుకొని సగుణాత్మక్షయంతిమపర్వమగు సత్యప్రజాపతిని విధేయము గావింపుచు, యజ్ఞమునుండి విరాట్టును అందుండి విశ్వము నెట్లుత్పన్నములయ్యెనో ఆ విజ్ఞానమును నిరూపించును. ప్రజాపతి యీశాస్త్రమునకు బ్రధానమగుటచే దీనికి బ్రాజాపత్యశాస్త్రమని పేరు పెట్టవచ్చును.

"ప్రజాపతే సత్వదేతాన్యన్యోవిశ్వారూపాణి పరితాబభూవ
యత్కామాస్తేజుహుమః తన్నోఅస్తువయం స్యామపతయోరయీణాం."
(యజు. సం.)

ఆరణ్యకోపనిషత్తులు, సగుణాత్మను ముఖ్యోద్దేశ్యముగా నుంచుకొని, నిర్గుణాత్మను విధేయము గావింపుచు, సత్యప్రజాపతినుండి షోడశీ ప్రజాపతిని అటనుండి పురుషుని జేర్చి విడచుచున్నవి. పిమ్మట పురుషుడు తనంత తాను పరాత్పరునందు లీనమగును. గాని స్వయముగా నుపనిషత్తు పరాత్పరునందు

జేర్పజాలదు. ఏలయన :— పరాత్పరునందు శబ్దమునకు గతి లేదు కదా! పరాత్పర విషయమున శ్రుతి యింతే చెప్పును :—

"నా యమాత్మా బలహీనేన లభ్యః న మేధయా న బహునా శ్రుతేన యమే వైషవృణుతే తేన లభ్యః తస్యైవ వివృణుతే తనూం స్వాం."

ఈ విధముగా వేదమంతయు నాత్మ సంబంధమున నిరూపణీయములగు రెండు విషయములను నిరూపణ సేయగా "సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి" యన్న మనువచనము సార్థకమగు చున్నది. ఇక నితర శాస్త్రముల ప్రయోజనమేమి? యన్నచో వైదిక సాహిత్యోక్తాత్మ స్వరూప సర్వసాధారణ సుగమతకొరకీతర శాస్త్రావతరణము కల్గినది. కనుక వాని నాత్మ పరీక్షా శాస్త్రము లందుము. ఈ యాత్మపరీక్ష 1. జ్ఞాన, 2. విజ్ఞానములను రెండు భాగము లైనది. ఇందు మొదటిదానిని దర్శనమనియు, రెండవది విజ్ఞానమనియు నందురు.

మొదట జ్ఞానమను దర్శన శాస్త్రముం జూతము. ఇయ్యది 1. ఆస్తిక, 2. నాస్తిక భేదములచే రెండు విధములు. ఇందు ఆస్తికదర్శనములు శారీరక, ప్రాధానిక, వైశేషికములని 3. నాస్తిక దర్శనములు, 1. స్యాద్వాద, 2. వైనాశిక, 3. లోకాయతికములని మూడు. మొత్తమారు దర్శనములు. అవియారునివి యారు ననుకొను ప్రాచీన మతమిందే యంతర్భావము నొందును. ఈ విమర్శయంతయు నాత్మ పరీక్షా ప్రసంగము లందు జూచుకొందము. ప్రస్తుతము :—

మూడు విధము లగు నాస్తిక దర్శనము సాంజన-ఆత్మ (విశ్వ) పరీక్ష గావించెను: ఆస్తిక దర్శనములందు (1) వైశేషికము క్షర ప్రధానములగు యజ్ఞ-విరాట్ ప్రజాపతుల పరీక్ష గావించెను. 2. ప్రాధానిక దర్శనము క్షరాక్షర ప్రధానమగు సత్య ప్రజాపతి పరీక్ష గావించెను. 3. శారీరక దర్శనము అవ్యయగర్భిత-అక్షరప్రధానమగు షోడశీపరీక్ష గావించెను. ఈ విధముగ దర్శనపరీక్ష షోడశిలో సమాప్త మగుచున్నది. దర్శన మన తత్త్వ పరీక్ష. అది దృష్టిప్రధానము. దానివలన తత్త్వ జ్ఞానము కల్గును. (Theoritical knowledge) కనుక దర్శనమని వ్యవహారము.

ఇక విజ్ఞానశాస్త్రముం జూతము. ఇయ్యది వ్యవహారము (అనుభూతి ఆచరణము) నకు సంబంధించినది. (Practical knowledge) ఆ యర్థమునందే మీమాంసాశబ్దము వర్తించును. దర్శనము జ్ఞానప్రధాన మన్నచో నిది విజ్ఞానప్రధానము. అది (Philosophy). ఇది (Science). సుప్రసిద్ధమగు పూర్వ మీమాంసా శాస్త్రము 12 అధ్యాయములం దాత్మను విజ్ఞాన దృష్టితో బరీక్షించినది. కనుక దీనిని విజ్ఞానయుక్తాత్మ పరీక్షా శాస్త్ర మనవచ్చును.

ఇక మన గీతాశాస్త్రముం జూతము. సర్వమూలభూతు డగు నవ్యయ పురుషుని గురించి యే యాత్మశాస్త్రమునందును విశేషించి చెప్పబడలేదు. ఇయ్యది అతనిని ప్రధాన లక్ష్యముగా

గొన్నది. మరియొక గొప్ప మహత్త్వ మేమన శాస్త్రములం దన్నిటియందును వివరింపబడిన యాత్మలన్నిటిని తనయందు సమావేశము గావించుకొన్నది. కనుకనే వేదమువలె దీనిని సర్వశాస్త్రమనియు నుపనిషత్తనియు ననిరి. ఈ క్రింది శ్లోకములందు దృష్టి నిల్పుచు దీని యశస్సును కీర్తింపుడు:

1. విశ్వప్రజాపతి :—

(1) మయా తత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా.
మత్ స్థాని సర్వభూతాని న వా హం తే ష్వవస్థితః.

(2) భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

2. విరాట్ ప్రజాపతి :—

(1) ఏవ మేత ద్యథా త్థత్వం ఆత్మానం పరమేశ్వర।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ।

(2) ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య స చరాచరం.
మమ దేహే గుడాకేశ యచ్చాన్యత్ ద్రష్టుమిచ్ఛసి.

3. యజ్ఞ ప్రజాపతి :—

(1) సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురో వా చ ప్రజాపతిః.
అనేన ప్రసవిష్యధ్వం ఏషవోఽస్త్విష్ట కామధుక్.

(2) కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం.
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితం.

4. సత్య ప్రజాపతి :—

(1) ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురా సురాః,
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే.

(2) అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్,
అపరస్పర సంభూతం కి మన్య త్కామ హైతుకమ్.

5. షోడశీ :—

(1) ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ,
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.

(2) ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః,
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః.

6. అవ్యయ పురుషః —

(1) గతి ర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసః శరణం సుహృత్,
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్.

(2) ఉపద్రష్టా నుమంతా చ, భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చా ప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః.

దర్శన శాస్త్రముల జ్ఞానదృష్టియు, మీమాంసయొక్క విజ్ఞానదృష్టియు, గీతయందు పూర్ణీభవించి యున్నవి. కనుకనే భగవంతు డనుచున్నాడు.

"జ్ఞానం తేఽహం స విజ్ఞానం ఇదం వక్ష్యా మ్యశేషతః,
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవ శిష్యతే."

ఈ విధముగ వేద - వేదాంత - దర్శన - మీమాంసా - గీత లను భేదమున బ్రవర్తిల్లు నాత్మశాస్త్ర పంచక మందును.

ఆత్మ పరీక్షా శాస్త్రములందును గీతకు సర్వోత్కృష్టతయు, సర్వశాస్త్రత్వమును సిద్ధించుచున్నవి.

సర్వ శాస్త్రమయీ గీతా సర్వదేవమయో హరిః,
సర్వ తీర్థమయీ గంగా సర్వ వేదమయో మనుః." (భార. భీ.)

మహాభారతనామక సుప్రసిద్ధేతిహాస గ్రంథమునుండి వేరు గావింపబడినదియు, అర్జునుం గూర్చి కృష్ణోపదిష్టమైనట్టియు ఉపదేశ సంగ్రహాత్మక శబ్ద ప్రపంచము గీతాశాస్త్రము. ఇందేడు వందల శ్లోకములు. రచయిత కృష్ణద్వైపాయనుడు. ఇందైతిహాసిక శ్లోకములను విడచి తక్కిన వైజ్ఞానిక విషయమంతయు భగవంతుడగు కృష్ణుని మౌలిక సంపత్తి. కనుకనే ఇతిహాస మర్యాదా సీమితమయ్యు, శ్లోకసృష్టిచే వ్యాస రచనయయ్యు నియ్యది భగవద్గీతోపనిషన్నామ ప్రసిద్ధి నొంది యున్నది.

మహాభారత యుద్ధోపక్రమమున క్లైబ్య భావాపన్నుడగు నర్జునునకు స్వధర్మ శిక్షణార్థము నూటయిరువది యుపదేశములతో నిరువది నాల్గుపనిషత్తులుగ భగవంతు డుపదేశించిన దానిని వ్యాసుడు తన ప్రాంజల భాషయం దుపబృంహితము గావించెను. పూర్వము గీతా నామ మీమాంసయందు శ్రౌతోపనిషద్బృంహణము గీతయంటిమి. ఇప్పుడు సంక్షిప్త భగవద్గీతకీ వ్యాస రచన ముపబృంహిత రూపమగుటచే దాని కిది గీత యందుము. ఆ నాటి కృష్ణోపదిష్ట సంక్షిప్త గీత నవగాహన

చేసికొనుట కర్జును డొక్కడే యధికారి. నేడా వ్యాసుడిట్లుప బృంహాణ గావింపక యీ సంక్షిప్త గీతనే పునరావృత్తి గావించి యున్నచో నిదియే యిప్పటి కిట్లుండగా నది యెంత జటిల సమస్య యయ్యెడిదో!

కొందరు "ఒకమూల యుద్ధము జరుగ సిద్ధముగనుండగ ఆ రణ ధ్వనుల మధ్య - ఆ యశాంత వాతావరణమున - నీ జ్ఞానోపదేశావసరమా? వ్యాసుడే కృష్ణునిపేర నాత్మవిద్యా శిక్షణార్ధము తన యైతిహాసిక గ్రంథమున దీనిని సమావేశపరచి యుండు" ననుకొనుచుందురు.

ఆర్య సంతతి కీ దృష్టి యంతగ రుచింపదు. ఇందు విలు వయు నుండదు. శ్రీ కృష్ణార్జునులు మనవంటివారే యను కొన్నచో నిది రుచింప వచ్చును. కాని, వారు నర నారాయ ణాంశ సంభూతులని మరువ రాదు. మరియు తన బాల్యమున నారు మాసముల నాడే యోగమాయచే శకటాసుర భంజనము గావించినట్టియు, జన్మసిద్ధ యోగసిద్ధి వశమున గిరివర ధారణ గావించినట్టియు, బ్రహ్మను వ్యామోహాబ్ధిలో ముంచినట్టియు, అధికార్యనురూప విశ్వరూప ప్రదర్శనములు గావించినట్టియు, పదునారు వేల గోపికలతో గూడి నారదు నాశ్చర్య ముగ్ధుని గావించినట్టియు, అకాల సూర్యాస్తమయమున నర్జున ప్రతిజ్ఞను పూర్ణము గావించినట్టియు కృష్ణుని విషయమున నిట్టి కుతర్క ములం జేయుట తన్ను ప్రాయశ్చిత్త యోగ్యునిగ జేసికొను

టయే - అట్టి గురువు! అట్టి శిష్యుడు! యుద్ధావసరమే గీతావతార యోగ్యము. అదే తప్పక జరిగినది.

విశేషించి యీ యుపదేశ మంతయు యోగదృష్టిచే నంతఃకరణ ప్రతిష్ఠితము గావించుకొని తన లోకోత్తర వాణిచే పద్యరూపమున మనకు జేరునట్లనుగ్రహించిన, యార్యసంస్కృతి రక్షకుడగు వ్యాస భగవానునికి మన మనవరతము కృతజ్ఞతా వందనము లర్పించ వలసి యున్నది.

గీత యితిహాసగ్రంథ మధ్యవస్తువు గనుక తన యీ యైతిహ్య మర్యాదను గాపాడుటకు వ్యాసుడు విజ్ఞాన గీత యందు తన సొంతములగు కొన్ని యైతిహాసిక శ్లోకములను గూర్చు టవసర మనుకొనెను. ఈ దృష్టితో గీతయందలి 700 శ్లోకములను 1. ఐతిహాసిక, 2. విజ్ఞాన భేదమున రెండు భాగములుగ జేయవచ్చును. మొదటి 64 శ్లోకము లితిహాసమునకు జెందినవి. తక్కిన 636 శ్లోకములును విజ్ఞానమునకు జెందినవి. ఆరంభమందలి 64 శ్లోకములును గీతావిషయమున కుత్థానిక.

గీతోపదేశ మెందుకు? ఎప్పుడు? ఎవరికి? ఇత్యాది ప్రశ్నలకు సమాధానమునకు మౌలికసంబంధము లేకున్నను, వ్యాసుడు స్వయముగ జేర్చిన యీభాగ మైతిహాసికగీత యనియు, తక్కినదానిని విజ్ఞానగీతయనియు నందుము.

ప్రాచీనుల అధ్యాయవిభాగము మొదలగునవి ఈవరకే తెలిపియుంటిమి. ఇక విజ్ఞానదృష్టితో దీనిని 6-2-4-6 క్రమ

మున 4 కాండ లనుకొనవలయును. 1 రాజర్షివిద్య + వైరాగ్య లక్షణబుద్ధియోగము, 2 సిద్ధవిద్య + జ్ఞానలక్షణ బుద్ధియోగము, 3 రాజవిద్యా + ఐశ్వర్యలక్షణబుద్ధియోగము, 4 ఆర్షవిద్యా + ధర్మలక్షణబుద్ధియోగము.

గీత యొక యుపనిషత్తుకాదు. మరేమన నిం దిరువది నాల్గుపనిషత్తు లున్నవి. కనుకనే "గీతాసు ఉపనిషత్సు" అని బహువచనము. గీతాసు=ప్రోక్తాసు అని యర్థము. కనుకనే,

గీతాః సుగీతాః కర్తవ్యాః కిమన్యైః శాస్త్రవిస్తరైః
యాఃస్వయం పద్మనాభస్యముఖపద్మాద్వివిస్సృతాః."

అన్నారు. ఈ యుపనిషత్సమష్టియంతయు, సంహితా గ్రంథముయొక్క 1131 శాఖాభేదనోపనిషత్సారమై యున్నది కనుకనే,

సర్వోపనిషదోగావోదోగ్ధాగోపాలనందనః
పార్థోవత్సః సుధీర్భోక్తాదుగ్ధం గీతామృతంమహత్.

వీనియొక్క మౌలికరహస్యముల నుపదేశించు నుపదేశ ములు 160 కలవు. ఈ చక్రము నెదుటబెట్టుకొని గీతార్థము విచారించుచో గీతా తాత్పర్యము సులభము కాగలదు :- సటీక మూలపాఠమువలన మరింత చక్కగా బోధపడగలదు.

ఇతిశ్రీ.........తృతీయప్రసంగే ద్వితీయోద్దేశః

| | ప్రకరణములు 8. విద్యాయోగములు 4. | విద్యలందుపనిషత్తులు | ఉపనిషత్తులందుపదేశములు | శ్లోక సంఖ్య | మొత్తము శ్లోక సంఖ్య |
|---|---|---|---|---|---|
| 1. | ఐతిహాసికసందర్భప్రకరణము | .... | .... | 59 | 64 |
| 2. | చతుర్విద్యోపక్రమప్రకరణము | 1 | 2 | 5 | |
| 3. | రాగద్వేషక్లేశనివర్తిక వైరాగ్యబుద్ధియోగలక్షణ రాజర్షివిద్య .... .... (1) | 8 | 1 2 3 4 5 / 7 . 7 . 7 . 3 . 3 / 6 7 8 / 5 . 9 . 9 / మొత్తం (50) | 216 | 614 |
| 4. | సమ్మోహక్లేశనివర్తిక జ్ఞానబుద్ధియోగలక్షణ సిద్ధవిద్య (2) | 2 | $\frac{1}{10}$ — $\frac{2}{9}$ మొత్తం (19) | 58 | |
| 5. | అస్మితాక్లేశనివర్తిక ఐశ్వర్యబుద్ధియోగలక్షణ రాజవిద్యా (3) | 3 | $\frac{1}{11}$ $\frac{2}{15}$ $\frac{3}{6}$ మొత్తం (32) | 151 | |
| 6. | అభినివేశక్లేశనివర్తిక ధర్మబుద్ధియోగలక్షణ ఆర్షవిద్య (4) | 7 | $\frac{1}{9}$ $\frac{2}{5}$ $\frac{3}{7}$ $\frac{4}{4}$ $\frac{5}{20}$ $\frac{6}{2}$ $\frac{7}{2}$ (49) | 189 | 22 |
| 7. | చతుర్విద్యోపసంహారము | 3 | $\frac{1}{4}$ $\frac{2}{2}$ $\frac{3}{2}$ (8) | 14 | |
| 8. | ఐతిహాసికసందర్భము | .... | .... | 5 | 636 |
| | | 24 | 160 | 700 | 636 |

# సంఖ్యారహస్యము

## తృతీయప్రసంగము - తృతీయోద్దేశము

"నా కారణం హి శాస్త్రేఽస్తి ధర్మః సూక్ష్మోఽపి జా జలే,"

అన్నట్లు కారణము లేకుండ నేదియు నుండదు. దార్శనిక మర్యాదకు కారణతావాదము సమ్మతము కాకుండుగాక. విజ్ఞాన మర్యాద కది యాశ్రయముగ గ్రహింపక తప్పదు. విజ్ఞాన ప్రధాన గీతాశాస్త్రము యొక్క 700 శ్లోక సంఖ్యాకాక గుప్తరహస్య మవశ్యముగ నుండియుండును :

సంఖ్యా విజ్ఞానము భారత వర్షమునకొక పురాతన నిధానము. బ్రాహ్మణములందు మాటిమాటికి సంఖ్యానాశ్రయించియే సంపత్తి గ్రహణము గావింపబడినది. ఉదాహరణమునకు గొన్ని యంకెలం జూతము :—

(1) మొదట 'అశీతి' శబ్దముం జూడుడు. దీనికి 80 అని యర్థము. భోజనము (అన్నము) నకు నిదియే యర్థము. భోజనార్థకమగు 'అశ' ధాతువునుండి దీని యుత్పత్తి. ఇక :- హృదయస్థ మనోఽవచ్ఛిన్నేంద్రునే (ప్రజాప్రాణాత్మక మగు సర్వేంద్రియ మనస్సు) ఆత్మ (ప్రజ్ఞానాత్మ) యందురు. "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా। తం మాం ఆయు రమృత మిత్యుపాస్స్వ" అని శ్రుతి. ఈ యాత్మేంద్రుని వలన నంగ ప్రాణ రూపేంద్రియ వికాసమగును గనుక చక్షుః శ్రోత్రాదుల కింద్రియములని పేరు.

ఒక మూలనుండి బయల్వెడలు ప్రాణ మర్క యనియు

మూలము నుక్థమనియు నందురు. చక్షురా దీంద్రియములు రూపాద్యర్థ ప్రవర్తకము లగుటచే నుక్థము లనిపించుకొన్నను వీని యన్నిటికి మూలమగు ప్రజ్ఞానాత్మ మహదుక్థ మందురు. "ఆత్మా మహదుక్థమ్" అని శ్రుతి.

ఇట్లు మహదుక్థమును, ఇంద్రాత్మకము, మనోమయము నగు నాత్మ "అన్నమయం హి సోమ్య మనః" అన్నట్లు అన్నముపై నాధారపడి యుండును. కనుకనే "అశీతిభిర్హి మహదుక్థ మాప్యతే" అని శ్రుతి చెప్పెను. ఇంతకును :- మనోమయ (ప్రజ్ఞామయ) ఇంద్ర తృప్తికి సాధన మన్న మని (అశీతి) ఫలితార్థము.

మరి : ఇంతమాత్రమున కింత కఠిన శబ్ద ప్రయోగ మేల? అన్న మని చెప్పరాదా ? యన్నచో పరోక్షప్రియులు మహర్షులు ఇంద్రునంతటి వానిని "మీకు అన్నము పెట్టెద" మనుట తగదని యింద్రున కాహుతి యొసగు నా మంత్రమున కెనుబది యక్షరము లుంచియు, తత్సూక్తమున కెనుబది మంత్రము లుంచియు అశీతి యన్నారు. వారిదృష్టి యన్నముపైన, వాక్కు 80 సంఖ్యపైన. యిదియే అశీతిరహస్యము:

(2) మానుషాత్మను దైవాత్మగ జేయునట్టియు, అట్టి ప్రజనన కర్మసంపత్తికి మూలమగు దశాక్షర విరాట్ఛందో విజ్ఞాన గర్భితమైనట్టియు, యజ్ఞమందు, 10 పాత్రలను మిథున

పంచకముగ నుంచు నీ దశ సంఖ్యా విజ్ఞానముం జూడుడు. (పౌర్ణమాస్యేష్టి) (శతపథం)

"ద్వంద్వంపాత్రాణ్యుదాహరతి - శూర్పంచాగ్నిహోత్రహవణీంచ (1) స్ఫ్యంచకపాలానిచ (2) శమ్యాంచకృష్ణాజినంచ (3) ఉలూఖల ముసలే (4) దృషదుపలే (5) తద్దశ. దశాక్షరావై విరాట్ । విరాడ్వై యజ్ఞః । తద్విరాజమేవైతద్యజ్ఞమభిసంపాదయతి । అథయత్ద్వంద్వం. ద్వంద్వంవై వీర్యం. యదావై ద్వౌసంరభేతే. అథతద్వీర్యంభవతి. ద్వంద్వంవై మిథునం ప్రజననం. మిథునమేవైతత్. ప్రజననంక్రియతే."

(3) సంవత్సరప్రజాపతియొక్క యీషోడశకలావిజ్ఞానముం జూడుడు.

"సఏషసంవత్సరప్రజాపతిః షోడశకళః. తస్యరాత్రయ ఏవపంచదశకలాః, ధ్రువైవాస్యషోడశీకలా. సోఽమావాస్యాం రాత్రిమేతయాషోడశ్యాకలయా. సర్వమిదం ప్రాణభృదనుప్రవిశ్యప్రాతర్జాయతే"(శత)

(4) ప్రాజాపత్యసంపత్తికొరకు చయనయజ్ఞసంబంధమగు కర్మవిశేషమునందు సప్తదశసామిధేనీ గ్రహణావసరమున నీ 17 సంఖ్యయొక్క విజ్ఞానముం జూడుడు :—

"తస్యసప్తదశసామిధేన్యః । సప్తదశోవైసంవత్సరః । ద్వాదశమాసాః పంచర్తవః । సంవత్సరప్రజాపతిః । ప్రజాపతిరగ్నిః । యావానగ్నిర్యావత్యస్యమాత్రాతావతైవైనమేతత్ సమిన్ధే। యద్వేవసప్తదశ। సప్తదశోవై పురుషః । దశప్రాణాః । చత్వార్యంగాని. ఆత్మాపంచదశః, గ్రీవాషోడశ్యః, శిరఃసప్తదశం, పురుషః ప్రజాపతిః ప్రజాపతిరగ్నిః । యావానగ్నిర్యావత్యస్యమాత్రా । తావతైవైనమేతత్సమిన్ధే." (శత)

సంజ్ఞామాత్రముననే యనేకరహస్యములను దెలియ పరచు గృతబుద్ధులగు మహర్షుల సంఖ్యాక్రమమునం దేదో రహస్యముండునని పాఠకు లీమాత్ర నిదర్శనములకే గ్రహించి యుందురు. వైదిక, ఛందో విజ్ఞానముల ప్రతిష్ఠ సంఖ్యావిజ్ఞానమే. గీతయు వేదసమకక్షను జెందినది. కనుక నిందలి యేడు వందల శ్లోకసంఖ్యకును రహస్యముండకపోదు. ఇంతయేల? వ్యాసుడు స్వయముగా భారతమున సంఖ్యావిజ్ఞానము ప్రధానముగా గొనెను. చూడుడు :

"నారాయణం నమస్కృత్యనరంచైవనరోత్తమం
దేవీంసరస్వతీంచైవ తతోజయముదీరయేత్."

భారతము జయ గ్రంథము పాండవ జయమునకు సంబంధించినది కదా! అగు గాక! జయశబ్ద మింతటితో నాగదు. క - ట - ప యాది క్రమమున "అంకానాం వామతో గతిః" యను సిద్ధాంతము ననుసరించి 18 భారత పర్వ సూచకము. "జయ ముదీరయేత్" అనగా పదునెన్మిది పర్వముల భారతము జదువవలయునని యర్థమగును.

ప్రాచీనుల యైతిహాసికమర్యాద ననుసరించి గీతకు 18 అధ్యాయములు. ఆర్యసాహిత్యమునందీ పదునెన్మిదికి గొప్పతన మున్నది. 18 పురాణములు, 18 యుపపురాణములు. పౌరాణిక విషయములు 18. శ్రుత్యుక్తావరకర్మలు 18. ఆత్మవివర్తములు 18. ఇట్టి వనేకములు కలవు. దీనికి చాల యుపపత్తులు కలవు.

1 2

ఇతిహాస పురాణములు సమానమర్యాదగలవి. రెంటి యందలి భేదమేమన -మనుష్యచరిత్ర గౌణము సృష్టియొక్క ఇతిహాసము ప్రధానము నైనచో పురాణము (1) సృష్టిచరిత్ర గౌణము మనుష్యచరిత్ర ప్రధానమునైనచో నితిహాసము, (2) రెంటియందు రెండు నుండును గాని గౌణతాముఖ్యతలే భేదము. దేనిపేర దేనిని పిల్చినను బాధలేదు. రెండును వేదార్థ వివరణ ప్రధానములే. కనుక "ఇతిహాసపురాణాభ్యాం వేదార్థ ముపబృంహయేత్" చరితార్థమగును.

పురాణ శాస్త్రము ప్రధానముగ 1. సృష్టి, 2. ప్రతి సృష్టి, 3. వంశ, 4. వంశానుచరిత, 5. మన్వంతర, 6. ఆఖ్యాన, 7. ఉపాఖ్యాన, 8. గాథా, 9. కల్పశుద్ధి, 10. సిద్ధాంత, 11. సంహిత, 12. డామర, 13. యామల, 14. తంత్ర, 15. జ్యోతి శ్చక్ర, 16. భువనకోశ, 17. వేద, 18. పురాణ ములను పదు నెన్మిది విషయములను నిరూపించును గనుక ఈ రహస్య సూచ నార్థము వ్యాసు డీ శాస్త్రమును 18 భాగములుగను, దాని సమకక్షను జెంది మనుష్య చరిత్రను జెప్పు భారతమును గూడ 18 పర్వములుగను రచించెను. గీతకూడ నీ యితిహాస మర్యా దాక్రాంతమే యైనది. కనుక దీనికి 18 అధ్యాయములే.

మరియు 18 సంఖ్య విజయభావ సంబంధము కలది. గీతోపదేశము లేకున్నచో పాండవ విజయ మసంభవమే. దాని కిదే కారణము. ఈ జయభావ సూచనకు 18 అధ్యాయము

లుంచుట న్యాయము. ఇంతకు జెప్పవచ్చినది శాస్త్రము లందలి సంఖ్యాక్రమమునకు రహస్య ముండుననియే.

## 1. శ్లోకసంఖ్యా రహస్యము

గీత మన కాత్మను దెలుపుచు, విశ్వమును వివరించును. వైరాగ్యము, జ్ఞానము, ఐశ్వర్యము, ధర్మము అనునవి ఆత్మ విభూతులు. రాగద్వేషములు, అవిద్య, అస్మితా, అభినివేశము అను నివి విశ్వభూతులు. అది శాంతి భూమి, ఇది యుద్ధ క్షేత్రము. అది దైవ సంపత్తు - ఇది యాసుర సంపత్తు. చిర కాల ప్రారబ్ధ మీ దైవాసుర సంగ్రామము. నేడిట్లు, రేపట్లును జరుగును, జరుగుచున్నది. ఇత్యాదికమే (ఇతి - హ - ఆస) (ఇట్లే అయ్యెను) క్లేశాత్మకమగు విశ్వరూపము. ఇదే ఇతి హాసము. విషమములగు సాంసారిక భావముల నుపేక్షించి సర్వదా ఏకరసముగ నుండుట విజ్ఞాన భావము. ఇదే యాత్మ విభూతి. గీత రెంటిని వివరించును గనుక ఇతిహాసమున కిరువది నాల్గు, విజ్ఞానమున కారువందల ముప్పదియారు శ్లోకములు. ఇతిహాస భాగము క్లేశాత్మక విశ్వమందు సహజ సిద్ధము లు నశాంతిరూప శోకమును నిరూపించును. విజ్ఞాన భాగము, సహజసిద్ధ భగసంపత్తి రహస్యము నుద్ఘాటించుచు శోక నివృత్త్యుపాయములను జూపును.

మాటవరుసకు విశ్వ స్వరూపము విశాలమేకాని,

మహాతోమహీయమగు నాత్మ విభూతియందలి నాల్గు పాదము లం దిది యొకపాదము మాత్రమే: "పాదోఽస్య విశ్వాభూతాని" "ఏకాంశే న జగత్సర్వం" ఈ రహస్యమే 64+636 శ్లోక విభాగము. ఇక వీని రహస్యము :

ఊనము పూర్ణమనియు, పూర్ణమూన మనియు నిది వరకు దెలిసికొంటిమి. విశ్వము పూర్ణము: ఆత్మ ఊనము. విశ్వమునకైన వికాసమేమో అయినది. ఇక వికాసావకాశము లేదు, ఉండదు. ఆత్మకు వికాసావకాశ మెంతయో కలదు. "క్షరః సర్వాణి భూతాని" అన్నట్లు భౌతిక విశ్వము "గుణ కూటో ద్రవ్యం" అను సిద్ధాంతమున గుణ కూటమగు ద్రవ్యము. క్రియ నాస్తి - అస్తి - నాస్తి సంబంధమున నాస్తి సారము. కనుక శూన్యము, మృత్యువు : కనుకనే నాస్తిక దర్శనము విశ్వ ప్రధానము గావున శూన్యము - క్షణికము - దుఃఖమునని విశ్రమించినది. ఆ యా కారణములచే విశ్వము శూన్యము. ఇక దీని కెదుగుబొదుగులు లేవు. ఎప్పుడు నింతే. "ధాతా యథా పూర్వ మకల్పయత్" ఇదే స్థితి 10 సంఖ్యకును. కనుక 6+4=64 విశ్వరూపముగా సూచించును.

ఇక "న్యూనాద్వై ప్రజాః ప్రజాయన్తే" అను సిద్ధాంతానుసారము వికాసము (ప్రజననకర్మ) న్యూనభావసంబంధము కలది. వికాసమునకు మూల మాత్మగదా : తత్సూచనార్థము 6, 3, 6=636 సంఖ్య.

ఇందు మధ్యదగు 3 ప్రధానము. ఎట్లన :-భౌతికము, నఘూర్ణము నగు నీవిశ్వమునం దంతర్నిగూఢమై గూఢోత్మా యనబడు నాత్మ మనఃప్రాణవాక్కలా త్రయయుక్తము. "సవా ఏషఆత్మా వాఙ్మయః ప్రాణమయోమనోమయః" అమూడే యీమూడు. ఇక విశ్వరూపము మాయాకలాది షట్పరిగ్రహ సంపన్నము. షట్కోశకమని పూర్వప్రకరణమునందు వివరింప బడినది. ఆత్మ కిరువైపుల నాపరిగ్రహషట్కమే. మూటి కిరువైపుల నారులు. 636 సంఖ్యావిజ్ఞానమంతయు గలిపి సర్వమ్:

నామరహస్యమునందు 9 యక్షరముల ప్రభావమువలన భగవద్గీతోపనిషత్తు పూర్ణమంటిమి. ఇపుడు 636 ప్రభావము వలన గీతాశాస్త్రము సర్వశాస్త్రమంటిమి.

(2) మరియొకవిధముగా నీసంఖ్యావిజ్ఞానమును సమన్వయితము. "పూర్ణమన్యత్ స్థానం శూన్యమన్యత్ స్థానం" అను శ్రౌతసిద్ధాంతానుసారము పూర్ణశూన్యములని రెండు స్థానములు. ఆత్మ రసలక్షణజ్యోతిర్దృష్టిచే పూర్ణమును, వీర్యలక్షణ బలదృష్టిచే శూన్యమునై యున్నది. ఒకటి యమృతము. రెండవది మృత్యువు. "అంతరం మృత్యోరమృతం మృత్యావమృతమాహితం" అనునట్లు అంతరాంతరీ భావసంబంధమున నీరెండు నోతప్రోతములై ఈరెండు నొకే బిందువునందు బ్రతిష్ఠితములై యున్నవి. కనుకనే జ్యోతిశ్శాస్త్రము శూన్యమును పూర్ణమనెను. శ్రుతియు పూర్ణలక్షణబ్రహ్మను "నేతి నేతి"

అనెను. కనుక మనము చూచిన, చూచు, చూడబోవునదెల్ల శూన్యపూర్ణముల విజృంభణమే.

6+4=10 ఇదియే 'దశాక్షరావై విరాట్' అన్నట్లు పూర్ణవిరాట్టు. ఇతడు అంజనమను చివరి పరిగ్రహముచే విశ్వప్రజాపతి కుపాదానమగుచున్నాడు. అనగా:—వికారపరిగ్రహయుక్త యజ్ఞప్రజాపతిపై బ్రతిష్ఠితుడగు నావరణపరిగ్రహయుక్తవిరాట్ ప్రజాపతియే అంజనపరిగ్రమున విశ్వరూప పరిణతి నొందుచున్నాడు. (పూర్వప్రకరణమున జూడవలయును.)

10 సంఖ్యను 9 . 0 ఇట్లు రెండు విభాగములు చేయుడు. ఇందు 9 పూర్ణభావము, 0 ఇది శూన్యభావము. శూన్యభావమే యోగమాయయొక్క ప్రాతిస్వికస్వరూపము. దీనిచేతనే సీమితమై సంఖ్యాతీతమగు నాత్మతత్త్వము. 9 గా బరిణతి నొందుచు విశ్వమూర్తి యగుచున్నది. విశ్వజీవనమునకు యోగమాయయే ఆధారము. తదవచ్ఛిన్న నవసంఖ్యాత్మక విశ్వమే సుప్రసిద్ధమగు దశమహావిద్య. (పది ప్రకారములగు సృష్టివిద్య అది మరొకచో నిరూపితమైనది.)

బిందువు (0) నాధారముగ గొని 1, 2 ఇట్లు అంకెల నుంచుచుబోగా 9 తో సమాప్తమై బిందువు ముందుకువచ్చి 10 యగును. ఎంతగ ప్రస్తరించిన నింతే కనుక ఈ 9 యే నూతనభావ మొందుచుండుటచే నవ యనిరి: ఋషులును "నవోనవోభవతి జాయమానః" అనిరి. సాగినకొలదియు నవీనతయు, వెనువెంటనే పూర్ణతయు, ఇదియే ఈసంఖ్యయొక్క

పూర్ణత. కనుక ఋషులు న్యూనమునే పూర్ణమనిరి. మరియు తొమ్మిది నెట్లు ప్రస్తరించినను 9 యే వచ్చుచుండునుగదా?

ఇతిహాస ప్రతిపాదకమగు మహాభారతము జయగ్రంథమని మున్ననుకొంటిమి. పాండవ విజయమే జయశబ్ద లక్ష్యము. విశ్వసంపత్తి దశాక్షర సంబంధి, న్యూనభావగర్భిత పూర్ణతయై యున్నది. ఈ యైతిహ్య పూర్ణతా సూచనార్థము 6+4=10 ఈ క్రమమున 64 శ్లోక సంఖ్య. షట్కోశిక విశ్వము+పాద చతుష్టయమగు నాత్మ=ఇతిహాసము. లేదా: "యోగమాయా నుగ్రహముననే నవాక్షరవిరాట్టు జన్మించెను. శూన్యపూర్ణతలను ప్రవర్తిల్లజేయు యోగమాయయే రాజ్య వైభవమునకు జనని" యను రహస్యము సూచించుటకే 6+4 యొక్క సంకలన రూప దశాక్షర విరాట్టు ప్రదర్శింపబడినది.

మహా భారతవేత్తల కిది విదితమే. ఏమనః— గీతాగ్రంథ మారంభింపబడిన భీష్మపర్వము 25 అధ్యాయమునకు పూర్వాధ్యాయము సంజయ ధృతరాష్ట్ర సంవాదము. దానికి పూర్వపు దగు 23 వ యధ్యాయము నందు దుర్గాస్తోత్ర నిరూపణ గలదు. యుద్ధసన్నద్ధుడు, రథారూఢుడు నగు నర్జుననకు కృష్ణు డాదేశించుచున్నాడు.

"శుచిర్భూత్వా మహాబాహో. సంగ్రా మాభిముఖే స్థితః,
పరా జయాయ శత్రూణాం దుర్గాస్తోత్ర ముదీరయ."

సంజయ ఉవాచ :—

"ఏవ ముక్తో౽ర్జున స్సంఖ్యే వాసుదేవేన ధీమతా,
అవతీర్య రథా త్పార్థః స్తోత్రమాహ కృతాంజలిః."

ఇంతకు జెప్పవచ్చినదేమన :— యుద్ధారంభ పూర్వము విశ్వసంప దధిష్ఠాత్రియు యోగమాయా రూపిణియు నగు జగ న్మాత - దుర్గయొక్క స్తుతి యవసరమని యెంచెననియు, వ్యాసుడుకూడ నర్జునుడు గోరు విరాట్సంపత్తికి మూల ప్రతిష్ఠ యోగమాయయే యని సూచించెననియు, భగవదాదేశ మర్జు నుడు శిరసావహించి చేసెననియు ఫలితార్థము.

పిమ్మట యోగమాయా వర ప్రాప్త్యనంతరము సంజయ ధృతరాష్ట్ర సంవాదాధ్యాయా వ్యవహితోత్తర మందే "ధర్మ క్షేత్రే కురుక్షేత్రే" ఇత్యాదిగ నరువది నాల్గు శ్లోకముల నైతి హాసిక గీతారంభ మగుచున్నది. ఇందువలన "భారత యుద్ధము నందు గీతోపదేశ ప్రభావమున నర్జునునకు విరాట్సంపత్తి లభించినది ; భవిష్యత్తునందు కూడ నేవ్యక్తి ఈ యుపదేశము ననుగమించునో యతడు విరాట్సంపత్తి నొంద సమర్థుడగు"నని తేలును. ఇది 64 శ్లోకముల నైతిహాసిక గీతోపపత్తి.

ఇక విజ్ఞాన గీతం జూతము. ఇందు 636 శ్లోకములు. ఈ సంఖ్య జ్ఞాన విజ్ఞాన సమన్వయమును సూచించును. (1)జ్ఞానము ప్రతి సంచరభావ సంబంధము గలదియు, నాత్మమయమును, (2) విజ్ఞానము సంచరభావ సంబధము గలదియు, విశ్వమయ మును, రెంటి సమష్టియు సర్వమ్. దీని నిరూపణము గావించు సర్వశాస్త్రము గీత.

1. ఆత్మ - విశ్వము ఈ రెంటియు దాత్మ విశుద్ధ రూప మున మనః ప్రాణ వాఙ్మయత్వమున త్రికలమైయుండి విశ్వ

మూర్తియై షట్కలమగును. సృష్టిదశయందీ సృష్టిసాక్షి యగు త్రికలాత్మయొక్క మనస్సునుండి రూపము, ప్రాణము నుండి కర్మ, వాక్కునుండి నామము వికాసము నొందగా "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అన్నట్లీయాత్మ ఆ నామ రూప కర్మలందు ప్రవేశించి సోపాధిక సృష్టరూపమై మనః ప్రాణ వాక్, నామ రూప కర్మలను నారు కలలు గలదగును. ఇదే విశ్వము. నిరుపాధికాత్మ త్రికలము మూడు. దాని కిరు వైపుల షట్కలసోపాధిక విశ్వము. ఈ విధముగ 636 అగును.

(2) మరియొక విధముగ :—ఆత్మయన విశుద్ధావ్యయ పురుషుడు. అతడు ప్రాతిస్వికరూపమున ఆనందవిజ్ఞానలక్షణ జ్ఞానాత్మ[1] మనోలక్షణ కామాత్మ[2] ప్రాణవాగ్లక్షణ కర్మాత్మ[3] యను భేదమున త్రికలుడు. ఇది నిరుపాధికరూపము. దీనినుండి మూడుమూడు కలలుగల రెండు సోపాధికరూపములు విశ్వ రూపముగ నుద్భవించును. (1) మనఃప్రాణవాఙ్మయము ఇది విశ్వాత్మ. (2) వాగాపోఽగ్నిమయము, ఇది విశ్వము (శరీరము) విశ్వ-విశ్వాత్మలను విశ్వమందుము కనుక మొత్త మారుకళలు. ఈవిశ్వమందానందవిజ్ఞాన మనోమయత్రికలాత్మవ్యాప్తిసూచన 636 అగును.

(3) ఇంకొక విధముగ :—1 మనఃప్రాణవాఙ్మయరూప విశ్వాత్మకును, మనఃప్రాణవాగ్రూపకర్మ నామములను షట్క ళలు కలవు. 2 వాగాపోగ్నిమయ విశ్వమునకును అమృత

మృత్యుభేదమున నారుకళలు కలవు. ఇవియే మూడమృతశుక్రములు. మూడు మర్త్యశుక్రములు మొత్తమారు. ఆనందవిజ్ఞానమనోమయమును, దహరాకాశస్థము నగు త్రికలనిరుపాధికాత్మకీవైపున నారు నావైపున నారు: ఇట్లు 636 అగును.

మరియు మాయాకలాది పరిగ్రహసంబంధమున 636 సంఖ్యోపపత్తి యీవరకే ప్రదర్శింపబడినదిగదా!

ఇంతకు నీసంఖ్యాక్రమము మనకేమి యాదేశించుచున్నది? అనగా:—"ఆత్మజ్ఞానలక్షణ శాశ్వతానందప్రాప్తికి మీరు సంసారపరిత్యాగముజేయ బనిలేదు. విశ్వమందుండియే, వర్ణాశ్రమధర్మానుసారము నిష్కామబుద్ధితో కర్మానుష్ఠానప్రవృత్తులై మధ్యస్థమగు నాత్మను లక్ష్యముగ నుంచికొని జీవనము ధన్యము గావించుకొనవచ్చును". అని ఈ సంపూర్ణగీతావిజ్ఞానరహస్యము సూచించుటకే 6 విశ్వము, 3 ఆత్మ, 6 విశ్వము, ఈవిధముగ పరోక్షప్రియుడగు వ్యాసమహర్షి 636 శ్లోకములతో విజ్ఞానగీత మనయెదుట నుంచెను.

"అచతుర్వదనో బ్రహ్మా-ద్విబాహురపరో హరిః
అఫాలలోచనః శంభుః భగవాన్ బాదరాయణః"

## ఉపనిషత్సంఖ్యారహస్యము

636 శ్లోకములుగల విజ్ఞానగీత 6 ప్రకరణములు. వాని యందలి యుపనిషత్తులును మొత్తమును ఈక్రింది విధముగ జూడదగును.

| ప్రకరణము : | | ఉపనిషత్తులు : |
|---|---|---|
| 1. చాతుర్విద్యోపక్రమము | ... | 1 |
| 2. రాజర్షి విద్య | ... | 8 |
| 3. సిద్ధవిద్య | ... | 2 |
| 4. రాజవిద్య | ... | 3 |
| 5. ఆర్ష విద్య | ... | 7 |
| 6. చాతుర్విద్యోపసంహారము | ... | 3 |
| | మొత్తము | 24 |

1. ప్రకరణము:—మొదట వ్యష్టిరూపమున నీయుపనిషత్సంఖ్యను చూతము :—

గీత ఆత్మనిరూపణమువలన బ్రహ్మవిద్యయు, విశ్వనిరూపణమువలన యోగశాస్త్రమునై యున్నది. అవ్యయుడును, భగచతుష్టయమున చతుష్పాత్తు విశ్వమును, బుద్ధియోగము వలన చతుష్పాత్తు. ఈరెండు నొక త్రికలాత్మ వివర్తములే. "ఏకంవాఇదం విబభూవసర్వమ్" కనుక యుపక్రమమున

నొకటే యుపనిషత్తు. ఈ యాత్మోపనిషత్తే తక్కిన 23 ఉపని
షత్తులకు మూలము.

2. ప్రకరణము :—గీత ముఖ్యలక్ష్య మవ్యయుడు, బుద్ధి
యోగమును. ఇందు నాల్గువిధముల బ్రహ్మవిద్యయు, నాల్గు
విధముల బుద్ధియోగములు నున్నను, ఇందు రాజర్షి విద్యయను
నాత్మవిద్యయు, వైరాగ్యబుద్ధియోగ నామక బుద్ధియోగమును,
ప్రధానములు. తక్కిన మూడాత్మవిద్యలును, మూడు బుద్ధి
యోగములును ఇతరమతములకు జెందినవి. "యేమేమతమిదం
నిత్యం" "ఇమంవివస్వతేయోగం" ఇత్యాదులచే నీప్రకరణార్థ
ములగు రాజర్షి విద్యయు వైరాగ్యబుద్ధియోగమును భగవం
తుడు తనమతమని స్పష్టపరచెను.

సాంఖ్యనిష్ఠయగు జ్ఞాననిష్ఠ కాపిలనిష్ఠ, (1) ఐశ్వర్యనిష్ఠ
యగు భక్తినిష్ఠ రాజసిష్ఠ, (2) కర్మనిష్ఠయగు ధర్మనిష్ఠ
హిరణ్యగర్భనిష్ఠ, (3) ఇవియే లోకప్రసిద్ధములగు జ్ఞాన-భక్తి-
కర్మయోగములు. వీనిని సంశోధన గావించి భగవంతుడు బుద్ధి
యోగ ముద్రవైచి గీతయందు సమావేశము గావించెను.

భగవన్మతమగు రాజర్షివిద్యా బుద్ధియోగములే ఎని
మిది విధములుగ వితానమందెను. కనుక నివిగల యధ్యాయము
లారిటియందును జ్ఞాన, కర్మ, భక్తి నిష్ఠలకు సంబంధించిన వచ
నము లగపడుచుండును చూడుడు :-

జ్ఞానబుద్ధియోగము : "ఏషాతేఽభిహితాసాంఖ్యే" సాంఖ్యనిష్ఠ.

ఐశ్వర్యబుద్ధియోగము : "శ్రద్ధావాన్ భజతేయోమాం" భక్తినిష్ఠ.
ధర్మబుద్ధియోగము : "కర్మణైవహిసంసిద్ధి" కర్మనిష్ఠ.

ఇట్లు వీనితో నెనిమిది విధములగు నీభగవన్మతమున కెనిమిది యుపనిషత్తులు. ఇవి గాయత్రీ సంపత్తినిగూడ సూచించు: "అష్టాక్షరావై గాయత్రీ" అని శ్రుతి.

3. ప్రకరణము :—బుద్ధియోగ ప్రవర్తికయగు సిద్ధవిద్య తృతీయప్రకరణార్థము. ఇయ్యది సాంఖ్యనిష్ఠకు సంశోధిత రూపము. ఇందు ప్రకృతిపురుషులు మూలతత్త్వములు. పురుషుడు నిర్లేపుడు. సృష్టిరచన ప్రకృతివలననే యగును. "ప్రకృతిః కర్త్రీ, పురుషస్తు పుష్కరపలాశవన్నిర్లేపః, కింతుచేతనః" తత్త్వసంఖ్యానమే ప్రకృతిపరిజ్ఞానము. దానివలననే పురుషపరిజ్ఞానము నగును. "సంఖ్యాతః సిద్ధం జ్ఞానం" కనుక సాంఖ్యము. దీని మూలతత్త్వసూచనకు 2 ఉపనిషత్తులు.

4. ప్రకరణము :—ఐశ్వర్య బుద్ధియోగ ప్రవర్తికయగు రాజవిద్య యీ ప్రకరణార్థము : ఇది భక్తియోగ నిష్ఠకు సంశోధిత రూపము. భక్తితత్త్వ మెప్పుడును త్రికలముగా నుండును. (1) ఉపాసకుడు, (2) ఉపాస్యము, (3) ఉపాసన అని మూడు విభాగము లుండవలయును గదా! యోగాభ్యాసము, ఈశ్వరప్రణిధానము, పరానురక్తి మొదలగునవి ఇందుకు సాధనములు. వీని వలన నుపాసకు డుపాస్య భాగముగనై ఈశ్వర భావము (ఐశ్వర్యము) నొంది భక్తి (భాగ) నిష్ఠుడగును.

ఉపాస్యుడగు నీశ్వరు డధిదైవతము. ఉపాసనా సాధన మధిభూతము, ఉపాసకు డధ్యాత్మము. ఇట్లు అధిభూత ద్వారమున నధ్యాత్మ కధిదైవత సంబంధము గలిగించుటయే యుపాసన లేక భక్తి. తన కాయిక - వాచిక - మానస భావములకు ధారణా, ధ్యాన - సమాధుల ద్వారా అప్రత్యక్షరుడగు నీశ్వరు నితో సంబంధము కల్గించినప్పుడే యుపాస్యుని యుపాసన సిద్ధమగును. ఇందన్నియు త్రికలములే కనుక నీ విద్యకు మూడుపనిషత్తులు:

5. ప్రకరణము :— ధర్మబుద్ధి యోగ ప్రవర్తకయగు నార్షవిద్య యీ ప్రకరణార్థము. కర్మనిష్ఠ కిది సంశోధిత రూపము. జడ చేతనాత్మక ప్రపంచమంతయు, స్వకర్మ నియతము. ఈ నియత ప్రాకృతిక కర్మలనే ధర్మమనిరి. కర్మయే పదార్థధర్మము. అదియే పదార్థమును ధరించి యుండును. కర్మశూన్యమగు నేవస్తువు గానీ స్వరూపముననుండక నశించును. కనుకనే "ధారణా ద్ధర్మమిత్యాహుః" అనిరి.

విశ్వమంతయు గర్మప్రధాన మగుచు ధర్మప్రధాన మగుచున్నది. ఆత్మ జ్యోతిర్లక్షణ మగుచు జ్ఞానప్రధానమై యున్నది. విశ్వము వీర్య లక్షణమగుచు కర్మప్రధానమై యున్నది. కర్మయే విశ్వోపాదానము. ఉపాదానము కార్యాభిన్నము. కనుక కర్మయే విశ్వము. సత్యమూర్తియు - జ్ఞానమూర్తియు నగు విశ్వాత్మయొక్క వైభవము, విభూతి, మహిమ, యశస్సు. ఈ విభూతి భూః భువః సువః మహః జనః తపః సత్యమ్ అను

భేదమున నేడు భాగములు. ఇవియే సప్త వితస్తులు. ఈ సప్త వితస్తి సంబంధమున నా సత్య సర్వ భూతాంతరాత్మ యగు నీశ్వరుని "సప్తవితస్తి కాయు" డందురు. సమష్టి ధర్మ మీ యేడు లోక పర్వము లందును ప్రతిష్ఠితమై యున్నది. కనుక నీ విద్యయం దేడుపనిషత్తులు.

6. ప్రకరణము :— ఇందు చాతుర్విద్యోప సంహారము గావింపబడుచున్నది. మూల బ్రహ్మ (ఆత్మ) ఒకటియే, తూల రూపమున సర్వమ్ అయినదని యీ వరకే తెలిసికొంటిమి. సృష్టిదశయం దాకే యాత్మ మూడగు చున్నది. ముక్తి దశ యందు మూడగు నాత్మ యొకటి యగుచున్నది. "ఆత్మాఉ ఏకః సన్ ఏతత్త్రయం" "త్రయం స దేకమయత్మా" అని బృహదారణ్యకము, తూలాత్మవగు నాసోపాధిక వివర్తములు మూడును, క్రమముగ [1] ఆత్మ, [2] పదము, [3] పునః పదము లందురు.

ప్రతి పదార్థమునందు నీ మూడు నిట్లు చూడనగును. అధ్యాత్మ సంస్థయందు - హృదయమం దాత్మ, శరీరము పదము. ఎట్లన :— శరీరమునందు హృద్స్థమై యుక్థరూపమగు నాత్మ అర్క రూపమున ప్రపన్న మగును. కనుక నీ ప్రపత్తి ననుసరించి శరీరమును పదమందురు. ఈ స్థూల శరీరము కేంద్ర ముగా మహిమ యను పేర ప్రాణమండలము నలువైపుల నుం డును. కనుక నీ మహిమా మండలమును పునః పదమందురు. ఇది పదమగు శరీరమునుండి మరల బయలు వెడలినది గదా!

ఈమూడు వివర్తములకు నాత్మయొక్క మూడు కళలే కారణము. ఎట్లన :-స్వయముగా నాత్మమనః ప్రధానమై హృదయస్థమగుచు నాత్మ యనబడును. ప్రాణప్రధానమగు నాత్మ పద మనబడును. వాక్ప్రధానమగు నాత్మ పునఃపదమనబడును. ఇవే యాత్మయొక్క మూడు తూలరూపములు. ఇంకను ఇవి యిట్లూహింపవలయును.

| | ఆత్మ: | పదము: | పునఃపదము: |
|---|---|---|---|
| పృష్ఠవిద్యానుసారము | హృత్పృష్ఠము | అంతఃపృష్ఠము | బహిఃపృష్ఠము |
| వేదవిద్యానుసారము | బ్రహ్మమయము | యజుర్మయము | శివమయము |
| అక్షరవిద్యానుసారము | బ్రహ్మమయము | విష్ణుమయము | శివమయము |
| ప్రాణవిద్యానుసారము | అకారము | ఉకారము | మకారము |

ఇట్లు మృత్యురూపాత్మ వివర్తాతిరిక్తమగు నాలవ (తురీయ) విశుద్ధాత్మ అర్ధమాత్ర లేక అమాత్రయందురు.

ఇట్టియాత్మ విభూతివలన దెలియదగిన దేమనగా :— జ్ఞానదశయందాత్మవివర్తములు మూడు నేక మగును. విజ్ఞానదశయందొకేయాత్మ మూడు రూపము ధరించును. అది ముక్తిదశ, యిది సృష్టిదశ అనియు, విశుద్ధవిజ్ఞానము విశ్వబంధన కారణము. విశుద్ధజ్ఞానము విశ్వసంపత్తి శత్రువు. కనుక రెండు పక్షములు అపూర్ణములు. మనకు గావలసినది విశ్వవైభవ ముండవలయును కాని, బంధమున బడరాదు. ఇది యెట్లు సాధ్యము? జ్ఞానమును మూలమందుంచుకొని విజ్ఞానమయవిశ్వమున బ్రవృత్తులము గావలయును. గీత "జ్ఞానంతేహంసవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః" అని చెప్పుచు ఈ విష

యమున మనకొక యపూర్వమార్గము జూపుచున్నది. మన విజ్ఞానగీతోపక్రమోపసంహారములచే భగవంతుడిదే సిద్ధాంతము గావించెను. ఒకటి మూలమందుంచుకొని త్రికలలందు ప్రవృత్తులము గావలయుననియు దేలినది. కనుక నిందు మూడుపనిషత్తులు.

## యిరువదినాల్గుపనిషత్తుల సమష్టిరహస్యము

ఇరువదినాల్గు సంఖ్యచే ఆత్మ-విశ్వము (జ్ఞానము-విజ్ఞానము) రెండును గ్రహింపబడినవి. సృష్టివిజ్ఞానానుసారము విశ్వమునకు మూలప్రతిష్ఠ గాయత్రి (గాయత్రీవా ఇదం సర్వం) ఏలయన:—వాక్తత్త్వమున కుపనిషత్తు అగ్ని. అది గాయత్రీ ఛందస్సు (అగ్నిః దేవతా గాయత్రీఛందః) చే ఛందితము. అగ్నియందు సోమాహుతివలన జగన్నిర్మాణమైనది. "అగ్నిషోమాత్మకంజగత్" వాఙ్మయి లేక అగ్నిమయి గాయత్రి 24 అవయవములు గలది. కనుక నాతత్త్వముం బ్రతిపాదించు గాయత్రి కిరువదినాల్గు అక్షరము లుంచబడినవి. ఈయక్షర గాయత్రిచే నభినీయమానమగు గాయత్రియే. యీాయంతయు నైనది. ఈశ్రుతిం జూడుడు:—

"గాయత్రీవాఇదం సర్వం, భూతం, యదిదంకించ। వాగ్వై గాయత్రీ. వాగ్వాఇదం సర్వం భూతం, గాయతిచ, త్రాయతేచ.

అగ్ని తత్త్వము గాయత్రి. అది సోమ గర్భితమై యుండును. అటు గానిచో దాని ప్రతిష్ఠ నిలువదు. కనుక గాయత్రి

సోమగర్భితాగ్ని యందుము. చివరకు గాయత్రీ మర్యాదచే యగ్ని - సోముల సమావేశము సిద్ధమగును. ఈ రెండు తత్త్వములచేతనే సూర్యచంద్రుల వికాసము. సూర్యు డగ్ని ప్రధానుడు. చంద్రుడు సోమ ప్రధానుడు. సూర్యుడు బుద్ధి, చంద్రుడు మనస్సు - బుద్ధి జ్ఞానప్రధానము. మనస్సు కర్మ ప్రధానము. కనుకనే మనోమయ ప్రజ్ఞానాత్మను కర్తయనియు, విజ్ఞానాత్మను కారయిత యనియు నందురు. జ్ఞానము కర్మప్రవృత్తి హేతువు. ఆత్మయు, అగ్నిప్రధానమునై యున్నది : కర్మ సోమ ప్రధానమును, విశ్వమునై యున్నది. రెంటి సమష్టియు సర్వమే. ఇదే చతుర్వింశ త్యక్షరా గాయత్రి. విజ్ఞానగీత యీ రెంటిని రూపణ చేయుచు సర్వశాస్త్రమై యున్నది. కనుక మొత్తము 24 ఉపనిషత్తులు.

సంఖ్యావిజ్ఞాన మింతటితో సమాప్తము కాదు. ఉపనిషత్తులం దుపదేశములు, ఉపదేశములం దవాంతర ప్రకరణములు. అందలి శ్లోకములు, అందలి వాక్యములు, అందలి పదములు, పదము లందలి యక్షరములు, అందలి వర్ణములు మొదలగు ప్రతియొక సంఖ్యకు కొలదియో గొప్పయో మౌలిక రహస్యమున్నది. మూలభాష్యమున నందందు జూపవలయునని యున్నది. కాని స్వయముగా బాఠకులుకూడ దమ బుద్ధియోగ ముపయోగింప వలయునని కోరిక.

ఇతిశ్రీ......ఇతి ఉద్దేశత్రయ గర్భిత, తృతీయః ప్రసంగః.

# చతుర్థప్రసంగము

## గీతాప్రతిపాదిత విద్యా-యోగ-విభూతులు

### ఆత్మవిద్య

గీతాశాస్త్రము క్లేశనివృత్తిగావించి శాశ్వతానందముం గూర్ప బ్రవర్తిల్లినది. ఎవరికి? ఆత్మకు: దాని స్వరూపమేమి? దానికి క్లేశమేమి? "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" "నేహనానాస్తికించన" అన్నట్లు ఆత్మ సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యము. ఏకరసము, నిర్లేపము, నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావము, కర్తృత్వభోక్తృత్వములు లేనిది. హృదయముండినచో మనస్సు, అదియుండినచో గామన, దానివలన విశ్వప్రవృత్తియు నుండును. ఆత్మకిందులో నేదియు లేదుగదా! దానికి క్లేశ సంపర్కమెట్లు?

నిజముగ నిది యొక జటిలసమస్యయే. పై వాదమునకు విరుద్ధముగ నాయుపనిషత్తే "ఐతదాత్మ్యమిదం సర్వం" "బ్రహ్మైవేదం సర్వం" అనుచున్నది. వేదముగూడ "యస్య యదుక్తంసత్ బ్రహ్మసత్ సామస్యాత్ సతస్యాత్మా" అని యాత్మనే ప్రభవప్రతిష్ఠాపరాయణముగా జెప్పినది. లోతుగా జూచినచో నుపనిషత్తులందే యనేకశంకలు దోచును.

అవును:—బాహ్యదృష్టితో జూచిన నిట్టివెన్నో శంకలు వచ్చుచునే యుండును. విజ్ఞానాశ్రయమున నంతర్దృష్టిం జూచి

నచో నేశంకయు నుండదు. ఆయా విరోధపరిహారము అశ్వత్థాత్మ నిరూపణద్వారా గీతాశాస్త్రము గావించి నశ్లేశాస్త్రమును గావించియుండలేదు. చూతము.

## ప్రథమ వర్ణకము.

1. ఆత్మ విశుద్ధరసమూర్తి (జ్ఞానమూర్తి) యే యైయున్నచో విరోధము తప్పనిదే యగును. కాని, గీత ఆత్మ యుభయ యుక్తమని చెప్పి సర్వ సంశయ నివృత్తి గావించెను. ఆత్మయొక్క ఆ రెండు పర్వములే పలుచోటుల : రస+బల, ఆభు+అభ్వ, జ్యోతి+వీర్య, అమృత+మృత్యు, జ్ఞాన+కర్మ, బ్రహ్మ+మాయా, పురుష+ప్రకృతి, సత్+అసత్ అని వేర్వేరుపేరుల బిలువబడినవి. భాతియందు రెండు (ద్వైతము) సత్తయం దొకటే (అద్వైతము) కనుక సత్తాభేద మూలకమగు ద్వైతాపత్తి లేదు. (1) రసము, నిత్యము, నిష్క్రియము, నిర్లేపము, పూర్ణము, ఏకము. (2) బలము, నిత్యకుర్వద్రూపము, క్షణికము, సలేపము, శూన్యము, నానాభావాపన్నము, రసదృష్టిచే బ్రహ్మ "ఏకమేవా ద్వితీయం బహ్మ" బలదృష్టిచే "బ్రహ్మైవేదం సర్వమ్" రస బల వివేకమే ఆత్మజ్ఞానము, మోహనాకాశ కారణము. తత్కారణ ప్రతిపాదనమే గీతాశాస్త్ర ముఖ్య విషయము.

అశ్వత్థ విద్యను మూలమందుంచికొని గీత యాత్మ విష

యమున మూడు సంస్థలకు ప్రాధాన్య మిచ్చినది. ఉదాహరణము :— ఒక వ్యక్తిని చూచినపుడు మూడు దృష్టులు. (1) దేవదత్తుడు వచ్చెను : ఇందు వస్త్ర శరీరములకు పార్థక్యము లేదు. (2) వస్త్రయుక్త దేవదత్తుడు వచ్చెను. ఇందు వస్త్ర శరీర పార్థక్యదృష్టి కలదు. (3) వస్త్ర రహిత శరీరియే దేవదత్తుడు- ఇందు వస్త్రదృష్టి లేదు.

ఆత్మ వివర్తక్రమము నింతే. (1) శరీరాత్మలకు పార్థక్యము సేయక ఆత్మ యనుట, (2) శరీరమున్నను ఆత్మనాత్మ యనుకొనుట, (3) శరీరదృష్టి వదలి యాత్మ నాత్మ యనుకొనుట.

ఇందు (1) శుక్రాత్మ సంస్థ - అన్నప్రధానము. ఇదే అన్న బ్రహ్మ. (2) బ్రహ్మాత్మ సంస్థ - వీర్య ప్రధాన మిదియే వీర్యబ్రహ్మ (3) అమృతాత్మ సంస్థ - జ్యోతిప్రధానము. ఇది జ్యోతిర్బ్రహ్మ - ఒకే బ్రహ్మ మాయాబలానుగ్రహమున (1) అమృతము, (2) బ్రహ్మ, (3)శుక్రము. రసదృష్టిచే మూడు నభిన్నములు. బల దృష్టిచే మూడును భిన్నములు. ఈ మూటి సమష్టియు, నశ్వత్థాత్మ. కఠమహర్షి యీ విజ్ఞానమిట్లు చెప్పుచున్నాడు:

"ఊర్ధ్వమూలోఽవాక్శాఖః, ఏషోఽశ్వత్థః సనాతనః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే
తస్మిన్ లోకాః శ్రితాః సర్వేతదు నాత్యేతి కశ్చన. ఏతద్వై తత్"

ఈ మూడు సంస్థలను లక్ష్యమం దుంచికొని, విరుద్ధముల వలె దోచియు నంతర్దృష్టిచే నవిరుద్ధము లగు నీ వచనముం జూడదగును :

| | | |
|---|---|---|
| 1. "అసంగోహ్యయమాత్మానసజ్జతే, నవ్యథతే, నరిష్యతి," | అమృతమ్. | ఐతదాత్మ్యమిదం సర్వమ్ |
| 2. "సవాఅయంపురుషః జాయమానః శరీరమభిసంపద్యమానః, పాప్మభిః సంసృజ్యతే సఉత్క్రామన్ మ్రియమాణః, పాప్మనోవిజహాతి" | బ్రహ్మ. | |
| 3. "ఆత్మావై తనూః................" | శుక్రమ్. | |

## ద్వితీయ వర్ణకము.

2. ప్రకారాంతరమున జాతము:— సర్వ బల గర్భితము, విశుద్ధమునగు రసము వ్యాపకమగు నాత్మ. అదియే మాయా పరిగ్రహమున నాభి (హృదయ) ప్రధి (పరిధి) యను రెండు ధర్మముల నొంది అశనాయా (కామన) యుక్తమై సృష్టిప్రవృత్తి కారణ మగుచున్నది. ఇది మాయావచ్ఛిన్న పురుషుడు. ఇతని యందు బలము గ్రంధిరూప మొందనంత వరకు నితడు తన జ్యోతిర్లక్షణ రసాపేక్షచే విశుద్ధానంద మూర్తిగ నుండును. పిమ్మట బలముల యంతశ్చితి వలన ఆ యానందమే విజ్ఞానము గను, ఆ విజ్ఞానము మనోరూపముగను పరిణమించును. అందు వలన: రసబలముల ప్రధానతా ప్రధానతల ననుసరించి యీ యానంద, విజ్ఞాన, మనస్సులు మూడును రెండేసి రూపము లొందును.

### 1. ఆనందము - ఆనందాత్మ.

(1) రస ప్రధానము (బల గౌణము) అగు నానందము నిరుపాధి (నిర్విషయి) కాత్మకు వికాస భూమి. ఇదే శాంతి. విషయశూన్యమగు నాత్మానందము లేక శాంతానందముననిత్యము.

(2) బల ప్రధానము (రసగౌణము) నగు నానందము. సోపాధి (వైషయి,) కాత్మకు ప్రతిష్ఠ. ఇదే సమృద్ధి. విశ్వా

నందము. క్షోభ మూలము, క్షణికము.

2. విజ్ఞానము - విజ్ఞానాత్మ.

ఇది ప్రకృతి సంస్థయందలి వాఙ్మయి యగు బుద్ధితో గూడి, బుద్ధియనుపేర నొప్పుచున్నది. (ఈ విషయము ముందు ప్రకరణమున విశదమగును). ఇది అనగా బుద్ధియుక్త విజ్ఞానాత్మ 1. భగ, 2. మోహ నామక విభూతిద్వయ యుక్త మగును. 1 భగ ముగ్ర జ్యోతి - రస ప్రధానము. ఇదే నిత్యవిజ్ఞానము - ఆత్మ విజ్ఞానమును. దీని యుదయమున నాత్మయందు స్వరూప లక్షణ భూతమును, ముక్తిహేతు భూతము నగు శాంతానంద ముదయించును.

(2) మోహము మలిన జ్యోతి బల ప్రధానము. ఇది క్షణిక విజ్ఞానము, విశ్వ విజ్ఞానమును. దీని నుపాసించుటచే నాత్మయందు స్వరూప ధర్మ విఘాత లక్షణమును, బంధన హేతుభూతము నగు క్షణిక సమృద్ధానంద ముదయించును.

3. మనస్సు - మనో మయాత్మ.

విజ్ఞానమునకు వాక్ప్రకృతిక బుద్ధిసంబంధ మున్నట్లు ఈ యాత్మ వివర్తమగు. మనస్సునకు అన్నమయ ప్రజ్ఞానము (సర్వేంద్రియ మనస్సు) తో సంబంధము కలదు. కనుక దీనిని ప్రజ్ఞానాత్మ యనియు నందురు. ఇది అంత ర్బహి ర్భేదములచే రెండు విధములు. 1 అంతర్మనస్సు - రస ప్రధానము. ఇది ఆత్మ యొక్క రసప్రధానములును - భగలక్షణములు నగు నిత్యానంద నిత్యవిజ్ఞానముల కుపకారము. 2 బహిర్మనస్సు - బల ప్రధానము ఇది ఆత్మయొక్క బల ప్రధానములును, మోహ లక్షణములు

నగు క్షణికానంద, క్షణిక విజ్ఞానముల కుపకారకము.

ఇంత వరకు తేలిన నిష్కర్ష:— రసము పై బలచితివలన నొకే యాత్మకు, (రసఘనము) ఆనంద, విజ్ఞాన, మనస్సు లను మూడు వివర్తము లగును. ఈ మూటియందును ఆనందము రసప్రధానమును, విజ్ఞానము రస బల సామ్యావస్థయును, మనస్సు బలప్రధానమునై యుండి మరల నిందును, శాంతానందము రస ప్రధానమును, సమృద్ధానందము బల ప్రధానమును నిత్య విజ్ఞానము రసప్రధానమును, క్షణిక విజ్ఞానము బలప్రధానమును, అంతర్మనము రస ప్రధానమును, బహిర్మనము బల ప్రధానమునై యున్నను, ముందు రాబోవు నాత్మ వివర్తముల కంటె ఈ యానంద, విజ్ఞాన - మనస్సులు మూడును రస ప్రధానము లగుటవలన నీమూటి సమష్టిని రసాత్మ లేదా జ్ఞానాత్మ యనియే యందుము. అనగా — అంతర్మనస్సు వరకు నీ జ్ఞానాత్మయందే యంతర్భావమని యెంచవలయును - ఈ జ్ఞానాత్మ ముక్తి సాక్షి - (1)

ఇక బహిర్మనస్సు ఇది మీాద రాబోవు నాత్మ వివర్తములం దంతర్భావము గావింప వలయును. ఎట్లన:— ఇయ్యది జ్ఞానాత్మకంటె బలప్రధానము. ఇందుండి కామ ముదయించును. రూప ప్రవర్తక మీా మనస్సే. దీనిపై మరియు బలచితి కాగా ప్రాణరూప పరిణామము జెందును. తపస్సునకును కర్మకు నాధారభూమి యీా మనస్సే (అనగా ప్రాణము) దీనిపై మరియు బలచితి కాగా ప్రాణరూపమగు నియ్యది వాగ్రూప పరిణతి నొందును. ఈ వాక్తత్త్వము శ్రమకు నామమునకు

ప్రతిష్ఠ. ఇట్లు రస బల తారతమ్యమున నీ బహిర్మనస్సు మనః ప్రాణ వాగ్రూపమున బరిణమింపగా పై వాని వలె నిందును మనస్సు రస ప్రధానమును, ప్రాణము రస బల సామ్యావస్థయు, వాక్కు బల ప్రధానము నగుచున్నవి. ఇక : మనస్సునందు జ్ఞాన జ్యోతి యుదయించును. దీనిని జ్యోతి యందుము. ప్రాణము నందు క్రియాభావ ముదయించును. దీనిని వీర్య మందుము. వాక్కునం దర్థభావ ముదయించును. దీని నన్న మందుము. ఈ విధముగ మనః ప్రాణ వాఙ్మయ మగు నీ రెండవ వివర్తము మొదటిదగు నాత్మ వివర్తముయొక్క ఆనంద విజ్ఞాన మనోమయమగు జ్ఞానాత్మకంటె బలప్రధానమై యున్నను, ఇందును రస బల తారతమ్యమున, 1, మనస్సు రసప్రధానము - జ్ఞాన మూర్తియును ; 2 ప్రాణము రసబల సమత్వమున క్రియా మూర్తియు, 3 వాక్కు బల ప్రధానత వలన అర్థమయియు నై యున్నను ; ముందు రాబోవు నాత్మ వివర్తము కంటె, నీ మధ్య పతితమగు నాత్మ వివర్తమునకు ఈ వైపున రసానుగ్రహమును, ఆ వైపున (రాబోవు) బలానుగ్రహమును నుండియున్న సామ్యరూపమున దీనిని కామాత్మ యనియే యందుము. ఇది నే సృష్టి సాక్షి. మొదటిదగు జ్ఞానాత్మ ముక్తిసాక్షి యనియే చెప్పియుంటిమి గదా ! (2)

ఇక నీ సృష్టిసాక్షియగు కామాత్మయొక్క వాగ్భాగమునకు రెండు రూపములు. అందు (1) విశుద్ధ రూప యగు వాక్కు కామాత్మయందే అంతర్భూతము. (2) వికార యుక్త

మగు వాక్కు సృష్టి రూపాంతరప్రాప్తముగ నెరుంగ వలయును. దీనిపై మరల బల గ్రంథు లేర్పడును. అందువలన నిది ఆపస్సు రూపమున బరిణమించును. మరియు బలచితికాగా నగ్నిరూప పరిణతి నొందును. [1] విద్యుత్తును, జ్యోతియు వాక్సంబంధము కలవి. [2] వాయువును (శివవాయు - శాంతవాయు) సోమ మును ఆపస్సంబంధము కలవి. [3] వాయువును (ఉగ్ర వాయువు - రుద్రవాయువు) ఆదిత్యుడును అగ్ని సంబంధము కలవి. ఈ మూటియందును మరల త్రైవిధమున 1 వాక్కు రస ప్రధానము. 2 ఆపస్సు రసబల సామ్యావస్థ, 3 అగ్నిబల ప్రధా నము. కాని పూర్వోక్త కామాత్మకంటె నీ మూటి సమష్టి రూప సృష్టి బల ప్రధానము కనుక దీనిని కర్మాత్మ యందుము.

ఈ పై వివరణము వలన కేవలము బలగ్రంథుల యను గ్రహము వలన నొకే యీ విశుద్ధాత్మ త్రివృద్భావాపన్నము (9 కళలు కలది) అగుచు, 1. జ్ఞానాత్మ, 2. కామాత్మ, 3. కర్మాత్మా యని మూడు విధము లగుచున్నది. రస దృష్టిచే మూడు నొకటియే. బలదృష్టిచే మూడును భిన్నములు. ఇందు 1 జ్ఞానాత్మయే అమృతము, 2 కామాత్మయే బ్రహ్మ, 3 కర్మా త్మయే శుక్రము. అదే బ్రహ్మ, అదే శుక్రము, అదే అమృ తము. "ఆత్మాఉ ఏకః సన్ ఏతత్రయం, త్రయం స దేక మయమాత్మా" యను శ్రౌత వచన మీ విషయమును స్పష్ట పరచుచున్నది కదా! ఈ పరి లేఖనమును సావధానముగా నవ గతము గావించుకొన వలయును.

ఆత్మవివర్తపరిలేఖ :-

| | | | |
|---|---|---|---|
| (1) అమృతం<br>సత్యమూర్తి-జ్ఞానాత్మ<br>ముక్తిసాక్షి | 1. నిత్యానందము రసప్రధానము:<br>2. క్షణికానందము బలప్రధానము: | 1<br>ఆత్మానందము<br>రసప్రధానము | 1 శాంతి, నిరుపాధి కాత్మవికాసము<br>2 సమృద్ధివైషయి కాత్మవికాసము |
| | 1. నిత్యవిజ్ఞానము రసప్ర॥<br>2. క్షణికవిజ్ఞానము బలప్ర॥ | 2<br>విజ్ఞానాత్మ (బుద్ధి)<br>రసబలముల సామ్యా<br>(3) వస్థ | 1 భగము. ఉగ్రజ్యోతి<br>2 మోహము. మలిన జ్యోతి |
| | 1. అంతర్మనస్సు రసప్రధానము: | ప్రజ్ఞానము, మనస్సు బలప్రధానము | ప్రసాదము, శుద్ధ సత్త్వ వికాసము |
| (2) బ్రహ్మ<br>త్రిగుణమూర్తి, కామాత్మ,<br>ఉభయప్రధానము, సృష్టిసాక్షి<br>1/2. | బహిర్మనస్సు బలప్రధానము రసప్రధానము | 1 మనస్సు-జ్యోతి, కామ, రూపము రసప్ర॥ | కామము-మలినసత్వ వికాసము |
| | | 2 ప్రాణము-వీర్యము, తపస్సు, కర్మ | విక్షేపము-రజోగుణ వికాసము |
| 2. | విశుద్ధవాక్ బలప్రయోగము | 3 వాక్కు, అన్నము, శ్రమ, నామ | ఆవరణము, తమో వికాసము |
| (3) శుక్రం<br>తమోమూర్తి, కర్మాత్మ,<br>బలప్రధానము, సృష్టి<br>1/3. | వైకారికీవాక్ | 1 వాక్కు-వాక్కు, విద్యుత్, జ్యోతి రసోద్రేకము | సర్వధర్మోపపన్న ఆత్మా బ్రహ్మైవేదం సర్వమ్ |
| 2. | | 2 ఆపః, ఆపస్సు వాయు (శివ) సోమః (ఉభయోద్రేకము) | |
| 3. | | 3 అగ్ని-అగ్ని, వాయు (రుద్ర) ఆదిత్యః, బలోద్రేకము | |

"తదేవశుక్రమ్ తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే"

## తృతీయ వర్ణకము

3. దీనినే మరియొక విధమున జూతము :—అవ్యయ, అక్షర, క్షర, సమష్టియమృతాత్మ. (1) ప్రాణ-ఆప-వాక్-అన్న-అన్నాద-అను పంచవికారక్షరసమష్టి బ్రహ్మాత్మ. (2)వాక్-ఆప-అగ్ని అను మూడు వికారముల సమష్టియు శుక్రాత్మ. (3) పూర్వప్రదర్శితమగు నమృతాత్మ సంస్థయందలి యానందముతో నవ్యయునకును, విజ్ఞానముతో నక్షరునకును, మనస్సుతో క్షరునకును సంబంధమున్నది. మనఃప్రాణవాఙ్మయియగు బ్రహ్మాత్మ సంస్థయొక్క మనోభాగముతో ప్రాణ-ఆపస్సులకును, ప్రాణభాగముతో వాక్కునకును, వాగ్భాగముతో అన్న-అన్నాదములకును సంబంధముకలదు. మూడవసంస్థతో సమానతయే కలదు. ఈపరిలేఖ గమనింపవలయును.

| | | |
|---|---|---|
| 1. ఆనందము—అవ్యయప్రధాన<br>2. విజ్ఞానము—అక్షరప్రధానము<br>3. మనస్సు—ఆత్మక్షరప్రధానము | 1 అమృతాత్మ-జ్ఞానాత్మ.<br>*<br>(అవ్యయ. రసమూర్తి) | జ్ఞానము. |
| 1. మనస్సు—ప్రాణము-ఆపస్సు<br>2. ప్రాణము—వాక్కు<br>3. వాక్కు—అన్నము. అన్నాదము | 2 బ్రహ్మాత్మ. కామాత్మ.<br>*<br>(అక్షర ఉభయమూర్తి) | క్రియ. |
| 1. వాక్కు—వాక్కు<br>2. ఆపస్సు—ఆపస్సు<br>3. అగ్ని—అగ్ని | 3 శుక్రాత్మ-కర్మాత్మ. అర్థము.<br>*<br>(క్షర బలమూర్తి. అర్థమూర్తి) | |

* ఈ విధముగ గూడ నొక విభాగము జేయవచ్చును.

సూచన :—ప్రసంగాగతముగ నివికూడ నెరుంగుట మంచిది : అవ్యయునితో [1]బ్రహ్మాక్షరునకును, అతనితో [2]విష్ణువు

నకును, కురునితో ఇంద్రాగ్నిసోమమూర్తియగు [3]శివునకును సంబంధములు కలవు. (1) జ్ఞానమయుడగు బ్రహ్మచిత్పతి, (2) క్రియామయుడగు విష్ణువు దేవపతి, (3) అర్థమయుడగు శివుడు భూతపతి. అధ్యాత్మసంస్థయందు, బ్రహ్మస్థానము శిరో గుహ, ఇదియే జ్ఞానతంత్రము. హృదయము విష్ణుస్థానము, ఇదియే క్రియాతంత్రము. మూలగ్రంధి శివస్థానము, ఇదే అర్థ తంత్రము. బ్రహ్మరంధ్రమందలి బ్రహ్మ సుషుమ్నద్వారా శివునితో గ్రంథిబంధన గావించును కనుక మూలస్థానమును బ్రహ్మగ్రంధి యందురు. ఇచ్చటికి వచ్చి జ్ఞానపతియగు బ్రహ్మ భూతచాలనమున సృష్టికర్త యగుచున్నాడు. ఇట్లే యదే మార్గమున నర్థపతి శివుడు బ్రహ్మరంధ్రరూపమగు స్వచ్ఛాకాశముంజేరి విహరింపుచు జ్ఞానచాలనము గావింపుచు జ్ఞానమూర్తి యనబడును. "జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్" ఈయిరువురకును హృదయమున యజనమగుచున్నది. అదే యజ్ఞము. యజ్ఞమే విష్ణువు. ఇతడే వామనుడు. "మధ్యేవామన మాసీనం సర్వేదేవా ఉపాసతే" అన్నట్లు జగత్పాలకుడై యున్నాడు. సంధ్యావిజ్ఞానము ననుసరించి లలాటము శివస్థానమనియు, హృదయము బ్రహ్మస్థానమనియు, నాభి విష్ణుస్థానమనియు నెంచబడినది. అది మరియొకచో వ్యాఖ్యాతము. యిక ప్రస్తుతము చూచుకొందము.

ప్రకరణారంభమునందే ఉక్థ (ప్రభవ) బ్రహ్మ (ప్రతిష్ఠ)

సామ (పరాయణ) భావమయతత్త్వ మాత్మయనుకొంటిమి. ఈలక్షణానుసారము అక్షరున కవ్యయుడు, క్షరున కక్షరుడు, వికారక్షర సంఘమున కాత్మక్షరుడు, వికారసంఘరూపమగు విశ్వమునకు వికారక్షరము. అస్మదాదిసత్త్వములకు విశ్వము. ఇట్లు 1 అవ్యయ, 2 అక్షర, 3 ఆత్మక్షర, 4 వికారక్షర 5 విశ్వములనైదిటిని ఆత్మలనవచ్చును. ఇందు:

1. 'ఆత్మనిర్లేపము. నిష్క్రియము. ఏకమేవాద్వితీయం' ఇది యవ్యయదృష్టి.
2. ఆత్మనిర్లేపమేకాని విశ్వసాక్షి-విశ్వకర్త-ఇది యక్షరదృష్టి.
3. ఆత్మయే విశ్వమున కారంభకము (ఉపాదానము) ఇది యాత్మక్షరదృష్టి.
4. ఆత్మ విశ్వమునకు ప్రభవప్రతిష్ఠాపరాయణము. ఇది వికారక్షరదృష్టి.
5. ఆత్మయే విశ్వము.......................................ఇది వికారసంఘదృష్టి.

ఇట్లు అయిదు విధముల వ్యవహార ముండవచ్చును. ఇందెంకును విరోధావసరములేదు. ఇందు మొదటి మూడును అమృతాత్మ. తరువాతి రెండును బ్రహ్మ-శుక్రములగును. మన కాత్మ విశ్వము. శుక్రరూపమగు నీవిశ్వమున కాత్మ వికారక్షరము. వికారక్షరరూప (పంచప్రకృతి) బ్రహ్మకాత్మ అవ్యయాక్షర క్షరమూర్తి షోడశీ, పురుషుడు, "ఐతదాత్మ్యమిదం సర్వమ్".

ఇంతయైనపిదప నొకప్రశ్న:-ఈయాత్మలందే యాత్మ గీతయందు నిరూపింపబడినది? ఇందుకు సమాధానము:-గీత యవ్యయాత్మను ప్రధానలక్ష్యముగా బెట్టుకొని ఈయన్ని ఆత్మలను స్పష్టముగ నిరూపించినది. ఆత్మసంబంధమగు నేప్రశ్నను

గాని గీత విడువలేదు. కనుకనే యది యితరశాస్త్రములకంటె నపూర్వము, విలక్షణము పూర్ణము ననుకొంటిమి.

విషయ జటిలతంబట్టి కావించు పునరావృత్తికి కొంచెము సహించుకొనుచు పూర్వ ప్రసంగమున మాయా కళాది పరిగ్రహవశమున నాత్మ వివర్తమునొందునట్లు చెప్పిన విషయము జ్ఞప్తి యందుంచుకొని :— ప్రస్తుత మీయాత్మ విచార సందర్భమున 1. నిర్ధర్మకము, 2. సర్వ ధర్మోపపన్నమునను నాత్మ వివర్తముల రెంటి నెదుట బెట్టుకొందము :— ఇందు మొదటిదాత్మ యనుటకే తగదు. ఏల యన : ఆత్మ యనుట తోడనే ఎవరియొక్క? అని ప్రశ్న యుదయించును. ఆ ప్రశ్న శరీర - పరిగ్రహ సాపేక్షము, సీమాభావ సంబంధము కలదియును గదా! అదియో (నిర్ధర్మకము) విశుద్ధ రస రూపము, నిర్గుణము, నిర్విశేషము. తత్త్వమాయాది పరిగ్రహ బహిష్కృతము సీమాభావశూన్యము నై యున్నది. కనుక శాస్త్రానధికృతము. అవాఙ్మనస గోచరము. నేతి నేతీతి వాక్య సిద్ధారితము, దాని నెవరు చర్చింతురు? దాని నెరుగ కుండుటయే యెరుంగుట యగును. "యస్యామతం తస్య మతం, మతం యస్య న వేదసః."

ఇక రెండవది :— ధర్మ శబ్దముచే బలతత్త్వ మభిప్రేతము. దాని కాత్మతో సంబధము రెండు విధములు. 1. బలము పూర్ణముగ నుండియు నంటకుండునట్టి స్థితి యొకటి. 2. రెండవది కొంత బలభాగ మాత్మ సంబద్ధమగు స్థితి యొకటి. ఈ

రెండు స్థితుల వలనను ఆ సర్వ ధర్మోపపన్నమను రెండవ యాత్మ వివర్తము రెండవాంతర భేదము లొందును. 1. సర్వ ధర్మవిశిష్టము, 2. సర్వధర్మ యోగ్యము: అని. మరల నిం దును మొదటిది నిర్విశేషము వలె వ్యాపకమే యగును. ఎట్లన: బలము తప్పక ససంగమే యయ్యును, గ్రంధిబంధనము లేకున్నంత వరకు, తానుస్ఫటికని, రసరూపము, అసంగము నగు నాత్మ కేవిధమగు లోపమును గలిగింప జాలదు. ఆ వ్యాపకాత్మయగు రస సముద్రమం దనంత బలములు తరంగములవలె నుచ్చావచ భావమున నిటు నటు దంద్రమ్య మాణము లగుచున్నను, అది అపూర్యమాణము, నచల ప్రతిష్ఠము నగు సముద్రము వలె సర్వదా శాంతముగ నుండును. కనుక నిది సర్వబల విశిష్ట దశ యందును, నిర్విశేషతుల్యమే యంటిమి. కనుకనే వ్యాసమహర్షి "సర్వ ధర్మోపపత్తేశ్చ"యని (2-1-37) సూత్రించెను. ఇందు చకారము నిర్ధర్మకమును లక్ష్యము సేయుచున్నది. "న త్వహం తేషు తే మయి" అన్నట్లు బలములు దీని గర్భమం దున్నను పర తంత్రములే యగుచున్నవి. కనుక వీనివలన వ్యాపక రసము పరతంత్రము కాదు కదా!

అందు వలన నిర్ధర్మకము (నిర్విశేషము) వలెనే ఈ సర్వ బల విశిష్ట పరాత్పరా భయాత్మ తత్త్వమును శాస్త్రానధికృత మంటిమి. ఏలయన:- విధి నిషేధ శూన్యమగు చోటున శాస్త్ర ప్రవృత్తి తటస్థ మగునుగదా! "అన్నియు దానియందు, నన్నిటి యందు నది" యన్న తత్త్వమునందు విధి యెట్లు నిషేధమెట్లు?

ఇక మీమాంససేయదగినది మిగిలిన సర్వధర్మయోగ్య-ఆత్మ. ధర్మమే పరిగ్రహము, ఇయ్యది స్వరూపధర్మము, ఆశ్రితధర్మమునని రెండు విధములని ఏవ ప్రసంగము ద్వితీయోద్దేశమున నిరూపితము. స్వరూపధర్మయోగ్యమగునది షోడశియనియు, ఆశ్రితధర్మయోగ్యమగునది ప్రజాపతియనియు నంటిమి. ప్రాణాదిపంచప్రకృతియొక్కయు వాగాదిశుక్రత్రయము యొక్కయు సమష్టియే ప్రజాపతి. దీనితోఁగూడిన షోడశియే. సర్వమును అవ్యాపకాత్మయే, పరిగ్రహవశమున నధ్యాత్మ సంస్థయందు ప్రవిష్టమై ద్వైతలక్షణము, గుణ, వికార, ఆవరణ, అంజనయుక్తమునై సవిశేషనామమున జీవు డనబడును. ఇతడు పాప్మానుగ్రహమున జ్యోతిరూపానందాకృతి నొంది దుఃఖమనుభవించుచుండును. విశ్వవ్యాపియగు నావ్యాపకాత్మ కేదోషము, దుఃఖమును లేదు. తదంశభూతుడగు జీవుడు నట్లుండవలసినదే కాని, అట్లుండుచున్నాడా ? చూతము :-

త్రైలోక్యవ్యాప్తమగు సౌరజ్యోతిః ప్రకాశ మంశరూపమున నధ్యాత్మసంస్థయందలి చక్షుఃస్వరూపసమర్పకమయ్యును, చక్షుర్గోళరూపయోగ మాయావరణమున తనవ్యాపకరూపవిస్మృతినొంది, కంటికిని సూర్యునకును మధ్య మేఘశకలము వచ్చినంతలో భ్రాంతివశమున "మేఘము సూర్యుని గప్పెను" వ్యవహారమున బడుచున్నది. వృష్టివిజ్ఞానానుసారముగ నెంత పెద్దమేఘఖండమైనను పంద్రెండు క్రోశములు వ్యాప్తికిమించదు.

సూర్యుడన్ననో, త్రిలోకవ్యాప్తుడు. అట్టి వ్యాపకప్రకాశము నీచిన్న మేఘశకల మావరింపగలదా? వట్టిమాట, చక్షువు నుండి తదవచ్ఛిన్నమగు సౌరజ్యోతి యావృతమగుచుండగా నావ్యాపక ప్రకాశవంచితులమై మనము తమోగుణరూప దుఃఖ మనుభవించుచున్నాము.

ఆత్మజ్యోతి విషయమునను సరిగ నిదియేస్థితి. మహా మాయావచ్ఛిన్నమగు నాత్మ విశ్వవ్యాపకము. మనము తదంశ భూతులము. అది దర్శయిత, మనము ద్రష్టలము. యిరువురి మధ్యను యోగామాయావరణము. దానివలన ఆత్మ యావృత మనుకొందుము. ఆవరణము మనకు, ఆరోపణ దానికి, కనుకనే 'సూర్యుడు మేఘావృతుడ' న్నట్లు 'ఆత్మదోషావృతమని' మిథ్యావ్యవహారము, "చక్షుర్దోషాదులూకోఽయం సూర్యజ్యోతి ర్నపశ్యతి" అనుసూక్తి ప్రసిద్ధమేకదా! ఈయావరణ దోష నివారణగావించి మనలను నిత్యానందమూర్తుల గావింపనై యవతరించినది గీత. సర్వధర్మయోగ్యము దానియాత్మ: శాస్త్రాధికృతమదియేకదా! సారాంశమిట్లు చూడవలయును :-

1. నిర్ధర్మకః-అలక్షణః-నిర్విశేషః-నిర్గుణః, విశుద్ధరసమూర్తి-సర్వాతీతః
2. సర్వధర్మవిశిష్టః-విలక్షణః, సర్వబలవిశిష్టరసమూర్తి-విశ్వాతీతః
} శాస్త్రమున అనధికృతులు

3. సర్వధర్మయోగ్యః-ద్వైతలక్షణః, మహామాయావచ్ఛిన్నః-విశ్వాత్మా, శాస్త్రాధికృతః.

1. అవ్యయాక్షరాత్మక్షరకృతమూర్తి, మహామాయా, విశ్వాత్మ (అమృతం) జ్ఞానాత్మ అవ్యయ.

2. పంచప్రకృతి విశిష్టోయోగమాయీ, విశ్వకర్తా (బ్రహ్మ) కామాత్మా, అక్షర.
3. శుక్రత్రయవిశిష్టః-యోగమాయీ, విశ్వారంభకః (శుక్రమ్) కర్మాత్మాక్షర.
4. యోగమాయావచ్ఛిన్నః అంశాత్మకః, జీవః, కర్మాత్మ, సమష్టి సమష్టి.

శాస్త్రోపదేశము లేదా గీతోపదేశము జీవాత్మ యుపకారము కొరకే, కనుక మన ముఖ్యలక్ష్యము జీవాత్మయే.

తత్స్వరూప విజ్ఞానముకొరకు మనము, ఆత్మయొక్క-చిదాత్మ, చిదంశ, చిదాభాస యను మూడు భాగములంజూడవలయును. ఈ మూటి యథార్థ జ్ఞానమునకు ముందు, జ్ఞాన క్రియార్థ ఘనుడగు సూర్యు నెదుట నుంచుకొందము. అతడు త్రైలోక్య వ్యాప్తుడగు స్వజ్యోతి అయ్యును, దర్పణ, స్ఫటికాదు లున్నప్పుడే ప్రతిబింబించును. ఈ గ్రాహక పదార్థములం దతని సంబంధము రెండు విధము లగును. 1. పదార్థ యతనాను సారమగు ప్రతిబింబ రూప మొకటియు, 2. ఆతప రూపమగునది మరియొకటియును. ఇందు మొదటి దంతర్వ్యాపము, రెండవది బహిర్వ్యాపము. ఇట్లు ఒకే సౌరతత్త్వము వ్యాపక సూర్యుడు. 1 పదార్థముతో నసంగ రూపముస (ఆకాశము వలె) సంబద్ధుడగు సూర్యుడు 2 నామమాత్ర ససంగ రూపమున బ్రతిబింబితుడగు సూర్యుడు 3 అను మూడు రూపము లగుచున్నది; ఆత్మవిషయము నిట్లే యెరుంగ వలయును. ఎట్లన :— "యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః" అన్నట్లు సప్తలోకాత్మక - భూః భువః స్వః రూప మహా వ్యాహృత్యవచ్ఛిన్న - విశ్వమందు ఈశ్వరనామ ప్రసిద్ధ

డగు (సూర్యస్థానీయ) షోడశీ ప్రజాపతి సమాన రూపమున వ్యాప్తుడగు చున్నాడు గదా! ఈవిశ్వవ్యాపకుడే చిదాత్మ (1) ఇతడంతటను వ్యాప్తు డయ్యును ఆపః - వాయు - సోమరూప చిద్గ్రాహక పదార్థము లున్నచోటనే ప్రకటమగును. చిద్గ్రాహకపదార్థము లీమూడే గనుక జీవసృష్టియు ఆప్య-వాయవ్య-సౌమ్య - భేదమున మూడు విధములే. ఈ మూటియందును చిదాత్మ 1. జ్యోతి రూపమునను, 2. ప్రతిబింబ రూపమునను బ్రతిష్ఠిత మగును. ఇందు జ్యోతిర్మయ చిదాత్మ యసంగము. ఆకాశమట్లు నిర్లేపమును, ప్రతిబింబిత చిదాత్మ ససంగము, సలేపము నగును. ఈ రెండును చిదంశ, చిదాభాస నామములచే వ్యవహరింప బడును.

అథవా :—ప్రకారాంతరమున నిట్లురుంగ వలయును :— విశ్వ వ్యాపకాత్మ చిదాత్మ 1. శరీర పరిచ్ఛిన్నమగు నదియే చిదంశ, 2. దీనికే అంతర్యామ - బహిర్యామ సంబంధములచే రెండు భేదములు. 1 అంతర్యామ సంబంధావచ్ఛిన్న చిదంశ శారీరకాత్మ యిదే చిదాభాసము. 2. బహిర్యామసంబంధావచ్ఛిన్నచిదంశ, చిదంశ యను ప్రత్యగాత్మ. ఈ రెంటికిని స్థానమొకటే, హృదయము. ఇందు ప్రత్యగాత్మ సాక్షి. 1. శారీరకాత్మ భోక్త (చిదాభాసుడు) (2) సాక్షిభాగము శరీరమందలి యీశ్వరుడు. ఈ శారీరకేశ్వరుం గూర్చియే భగవంతుడు ఇట్లనెను :—

"ఈశ్వరః సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి"
"ఉపద్రష్టా నుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః,
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః."

భోక్తాభాగము జీవుడు. ఇతనింగూర్చి మను విట్లు చెప్పెను.

"జీవ సంజ్ఞో ఽన్తరాత్మాన్యః సహజః సర్వ దేహినాం,
యేన వేదయతే సర్వం సుఖం దుఃఖం చ కర్మ సు."

వేద సంహితయందు చిదంశరూప సాక్షీపరమాత్మను సాక్షీ సుపర్ణుడనియు, చిదంశరూప జీవాత్మను భోక్తాసుపర్ణుడనియు చెప్పబడినది. చూడుడు :—

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలంస్వా ద్వత్త్యనశ్నన్ అన్యో అభిచాకశీతి."
ఋక్ 1/164/20.

ప్రత్యగాత్మ యుక్తుడయ్యును శారీరకాత్మ యింద్రియ సంబంధమున విషయాతురుగాయి యగునంతవరకు నిర్లేపమగు దానిని తానుగా (సస్వరూపముగ) గుర్తింపజాలడు. అంతర్ముఖ మగు విజ్ఞాన చక్షుఃప్రభావమున ధీరుడై హృదయస్థుడు, నీశ్వరుడునగు ప్రత్యగాత్మను దర్శింపగలడు. అదియే దుఃఖాత్యంతక నివృత్తి : ఈ శ్రుతి చూడుడు:—

పరాంచిఖానివ్య తృణ త్స్వయంభూః
తస్మా త్పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్,
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్
అవృత్త చక్షః అమృతత్వ మిచ్ఛన్."

ప్రత్యగాత్మను జ్యోతియనియు శారీరకాత్మ ప్రతిబింబ రూపమనియు జెప్పితిమి. జ్యోతియే రుక్మమని ప్రసిద్ధము. ఇదే ఆత్మ తేజము, ప్రకాశము, వీర్యము. శ్రుతియు :— "ప్రజాపతి స్తేజో వీర్యం రుక్మ" అనుచున్నది : (శత) ఇయ్యది శరీర పరిచ్ఛిన్నమయ్యును తన యసంగ భావము వలన జ్యోతిర్ఘనమగు చిదాత్మవలె వ్యాపకమై యుండుటచే తత్సూచన "రుక్మవై సముద్రః" అని సముద్ర నామమున శ్రుతి కావించినది : ఏనాడు ప్రతిబింబరూప జీవాత్మ రుక్మరూప - రుక్మవర్ణ - ప్రత్యగాత్మను గుర్తించునో ఆనాడు దుఃఖైకాంతిక నివృత్తి యగును. ఈ శ్రుతిం జూడుడు :—

"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయాశోచతిముహ్యమానః,
జుష్టం యదా పశ్యత్యన్యమీశం, అనమహిమాన, మితివీత శోకః."

"యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం,
కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం,
తదా విద్వాన్ పుణ్య పాపే విధూయ,
నిరంజనః పరమం సామ్యముపైతి."

ఇంతకు జెప్పవచ్చిన దేమనగా :— ఆ వ్యాపకాత్మయే కేవల యోగమాయా ప్రభావమున చిదాత్మ - చిదంశ - చిదాభాస రూపముల బరిణతు డగును. ఈ మూటియందును చిదాత్మ యమృతము. [1] చిదంశ, ప్రకృతి భావయుక్త మగుచు బ్రహ్మ [2] (కనుకనే అమృతము బ్రహ్మయోని యనబడినది) చిదాభాస భూతభాగ సంసృష్టమగుచు శుక్రమ్ అగును. 1. జ్ఞాన ప్రధాన

మొకటి రెండవది క్రియా ప్రధానము. (కనుకనే "భ్రామయన్ సర్వ భూతాని" అనుట) మూడవదగు చిదాభాస అర్థ ప్రధానము.

### అధ్యాత్మము - మూడాత్మ వివర్తములు.

1. (సూర్యః) చిదాత్మా: (విశ్వవ్యాపక షోడశీ) విశ్వాత్మ (చిదాత్మ) అమృతం - జ్ఞానాత్మా, 2. (ఆతపః) ప్రత్యగాత్మా - శరీరావచ్ఛిన్నః - నిర్లేపః- పరమాత్మా- చిదంశ, బ్రహ్మ - కామాత్మా - (3) (ప్రతిబింబః) శారీరకాత్మా -పాప్మ యుక్తః - స లేపః, జీవాత్మా- చిదాభాసః, శుక్రమ్ : కర్మాత్మా.

ఇంతవరకు అమృతబ్రహ్మ శుక్రముల కనేక వివర్తములు సూపబడినవి. వీనియందెందును పరస్పర విరోధము లేదు. విరోధాంశము బలమహిమ, అవిరోధాంశము రస మహిమ, రసబల ములు రెండు నాత్మస్వరూప ధర్మములు. కనుక అన్నిటిని అన్నియుగను, అన్నిటిని వేర్వేరుగను జెప్పవచ్చును. ఈ యాధారముననే "సర్వే సర్వార్థవాచకా దాక్షీ పుత్రస్య పాణినేః" అని యాప్త వచన మున్నది. అన్నిటిని అవ్యయ-అక్షర - క్షర - మనః - ప్రాణ - వాక్ - అమృత - బ్రహ్మ - శుక్ర - జ్ఞానాత్మ - కామాత్మ - కర్మాత్మ - అని దేనితోనైన బిలువ వచ్చును. అటొకరూపము, ఇటొకరూపము నియతములుగ నుండును గదా !

సర్వసంగ్రహాత్మపరిలేఖ.

1. { (1) పరాత్పరావచ్ఛిన్నం. పంచకళః. అవ్యయః.
(2) ,, పంచకళః అక్షరః
(3) ,, పంచక ఆత్మక్షరః } (1) షోడశీ-అమృతాత్మ

2. (4) షోడశీపురుషావచ్ఛిన్న పంచప్రకృతులు. వికారక్షరాత్మ- (2) పంచప్రకృతి-బ్రహ్మాత్మా

3. (5) ,, ప్రకృత్యవచ్ఛిన్న శుక్రత్రయము. వైకారికక్షరాత్మ. (3) శుక్రత్రయము-శుక్రాత్మా

గీతయందలి యాత్మసంబంధముగ జెప్పవలసినది సంక్షేపముగ జెప్పబడినది. సవిశేషాత్మ వివర్తములందు అవ్యయాక్షరాత్మరూప త్రిపురుషపురుషాత్మ కైకాత్మయే. గూఢోత్మా యని పూర్వనిరూపణమువలన పాఠకు లెరుంగుదురు. ఇదియే మన ప్రత్యగాత్మయను ముఖ్యాత్మ. ఇయ్యది తనమిత్రమగు శారీరకాత్మతో గూడియున్న యశ్వత్థము. జ్ఞాన (బ్రహ్మ) కర్మ భేదమున (1) బ్రహ్మాశ్వత్థమనియు, (2) కర్మాశ్వత్థమనియు, రెండు విధములు. (1) మహామాయావచ్ఛిన్న-పంచపుండీరాత్మక-మహేశ్వరునితో (వ్యాపకచిదాత్మతో) బ్రహ్మాశ్వత్థమునకు సంబంధము. (2) యోగమాయావచ్ఛిన్న-పంచఖండాత్మక-ప్రత్యగాత్మయుక్తశారీరకాత్మతో కర్మాశ్వత్థమునకు సంబంధము. కర్మసంతానము-పరంపరయే కర్మాశ్వత్థము. ఈకర్మసంతానబలమున జీవాత్మ చావబుట్టును, పుట్టిచచ్చును. బ్రహ్మాశ్వత్థముతో నిత్యసంబద్ధమగు కర్మాశ్వత్థముతో సంబంధము గల మహామాయి యీశ్వరుని ప్రకృతిరూపావిద్యయొక్క-

యాక్రమణమువలన నీజీవాత్మయందు పంచక్లేశములు, షడూర్మలు, షడవస్థలు, కర్మవిపాకాశయాదిదోషములు, సర్వపాపములువచ్చి ప్రవాహరూపమున బరిణతములగుచు పరస్పర మోతప్రోతములగుచుండును.

షోడశీపురుషాంతర్గతావ్యయునందు విద్య—కర్మ—యను రెండు ధాతువులున్నవి. ఆనందవిజ్ఞానమనః పర్వత్రయసమష్టి విద్యావ్యయుడు. (1) ఫలయన :-ఈయాత్మభాగము జ్యోతిః ప్రధానమగుచు అవిద్యాంధకారనాశము గావించు ముక్తిసాక్షి కనుక విద్య యందురు. (2) మనఃప్రాణవాక్సమష్టికర్మావ్యయుడు. ఈకర్మభాగము వీర్యప్రధానముగలదై సృష్టిసాక్షి యగును. కనుక సృష్టిమయకర్మ ననుసరించి యాపర్వత్రయము కర్మయందురు. పరిగ్రహావశమున నాత్మయొక్క యీవిద్యా-కర్మలు రెండును క్రమముగ సమ్యగ్జ్ఞానము-అన్యథాజ్ఞానము-అజ్ఞానము; సుకర్మ-వికర్మ-అకర్మ-అని మూడేసి విధములగును. ఇందు: సమ్యగ్జ్ఞానము-సుకర్మ-ఈరెండును శాంతిలక్షణ-ఆనంద కారణములు. మిగిలిన నాల్గును, క్షోభలక్షణ-దుఃఖకారణములు. ఈవిధముగ పరిగ్రహావశమున సోపాధికాత్మయందు సంక్రమించిన దుఃఖమూలక దోషముల నివృత్తిగావించి విద్యాదిగుణాధానము గావించుటకే మనగీత ప్రవర్తిల్లినది. "గీతాశాస్త్ర మన్నియాత్మలను నిరూపించుచు అవ్యయాత్మను తన ప్రధానలక్ష్యముగా గొన్నదని నిష్కర్ష :-

ఇతి-శ్రీ......ఆత్మవిద్యాప్రకరణమ్.

## గీతా ప్రతిపాదిత బుద్ధి విద్యా.

గీతా శాస్త్రము విద్యాశాస్త్రము. విద్య 1. ఆత్మవిద్య 2. విశ్వవిద్య అని రెండు విధములు. ఇందు ఆత్మవిద్య - పురుషవిద్య, జ్ఞానవిద్య, సాంఖ్యనిష్ఠ - జ్యోతిర్విద్య, పరవిద్య - బ్రహ్మవిద్య - ఇత్యాదిగా వ్యవహరింపబడును. ఇక విశ్వ విద్యయు: ప్రకృతివిద్య - కర్మవిద్య - యోగనిష్ఠ - వీర్యవిద్య - అపర విద్య ఇత్యాదిగా వ్యవహరింప బడును. కనుక గీత బ్రహ్మవిద్యయు యోగశాస్త్రము నగును. అందు: గీతా ప్రతి పాదితాత్మవిద్య పూర్వ ప్రకరణమున నిరూపింపబడినది.

ఇక రెండవదగు ప్రకృతివిద్య లేక కర్మవిద్యాపర పర్యాయక యోగవిద్య. ఇయ్యది: 1. జ్ఞానయోగము, 2. భక్తి యోగము, 3. కర్మయోగము నని మూడు భాగములు. ఆత్మ విద్యయు అవ్య అక్షర క్షరభేదమున మూడు విధములే గదా!

సరి: పై జెప్పిన మూడుయోగ నిష్ఠలందేది గీతయందు నిరూపిత మైనది? చూతము:— గీత యపూర్వ బుద్ధియోగ నిష్ఠ జెప్పునని స్పష్టమే. అయినచో బుద్ధియన నేమి? వాఙ్మయ ప్రకృతి; ఎట్లన:— షోడశ పురుషాత్మక పురుషుని బహిరంగ ప్రకృతి (1) ప్రాణ, (2) ఆప, (3) వాక్, (4) అన్న, (5) అన్నాద భేదమున నైదు విధములు. ఇందుండి క్రమముగ (1) స్వయంభూ, (2) పరమేష్ఠి, (3) సూర్య, (4) చంద్ర, (5) పృథివి అను పంచ పుర వికాసము అగును. ఇవియే అధ్యాత్మ

సంస్థయందు : 1. అవ్యక్త, 2. మహాన్, 3. బుద్ధి, 4 మనః, (5) ప్రాణ నామములం బ్రసిద్ధములైనవి. ఈ స్థితిలో వాఙ్మయియగు మూడవ ప్రకృతియే సూర్యరూపమై బుద్ధియను పేర నొప్పుచున్నట్లు విశదపడును గదా !

సూర్యునకు పైనున్న స్వాయంభూ పరమేష్ఠులం దమృత తత్త్వమును, క్రిందనున్న పృథివీ చంద్రులందు మృత్యుతత్త్వమును ప్రధానములు. మధ్యస్థ సూర్యునందు రెంటి సంబంధము గలను. "నివేశయన్ అమృతం మర్త్యం చ" అని ఈవరకే తెలిసికొంటిమి. ఇంకు 1. అమృతము జ్ఞానము, విద్య 2. మృత్యువు కర్మ - అవిద్య కనుక సౌరమగు బుద్ధియందును ఈ రెండు అనగా విద్యా విద్యలు కలవని తేలుచున్నది. ఈ విద్యా విద్యలు రెండు నొక్కొక్కటి యారేసి భాగములు. 1. విద్య:- 1. జ్ఞానము, 2. ఐశ్వర్యము, 3. వైరాగ్యము, 4. ధర్మము (వీర్యము) 5. యశః, (6) శ్రీ : ఈ మొత్తమునకు భగనామ ప్రసిద్ధి. 2. అవిద్య :- 1. అవిద్య, 2. రాగద్వేషములు, 3. అస్మితా, 4. అభినివేశము, 5. అపయశము, 6. అలక్ష్మి. ఈ మొత్తమునకు మోహామని వ్యవహారము. ఇక :- భగ సంజ్ఞకము లారింటియందు మొదటి నాల్గింటికిని, మోహా సంజ్ఞకము లారింటియందు మొదటి నాల్గింటికిని విద్యా విద్యామయుడగు సూర్యుడే వికాస భూమి. మిగిలిన యశము అపయశము చంద్ర సంబంధము కలవి. లక్ష్మి - అలక్ష్మి ఆపోమయ పర

మేష్ఠి సంబంధము కలవి. అధ్యాత్మ క్రమము ననుసరించి లక్ష్మీ రూప కాంతికి - అలక్ష్మికి: స్థూల శరీరముతోడను - యశము - అపయశము - మనస్సుతోడను; భగ - మోహములకు బుద్ధితోడను సంబంధ మెరుంగవలయును. ఎట్లన :- బుద్ధి కుపాదానము సూర్యుడు, చంద్రుడు మనస్సునకు ప్రభవము. పరమేష్ఠియొక్క ఆపస్సే "అద్భ్యః పృథివీ" అన్నట్లు పృథివిగా నైనది. స్థూలశరీర ప్రభవము పృథివియే కదా! ఈవిధముగ :- భగ మోహములు 4+4, 1+1, 1+1 క్రమమున భాగింప బడినవి: యశః శ్రీల విషయమున ధర్మజ్ఞానాదులు గలవారుగూడ సప యశోభాగు లగుటయు, ఛలఛిద్ర పూర్ణులుగూడ యశోభాగు లగుచుండుటయు బ్రత్యక్షమే గదా!

ఈవిధముగ బుద్ధిభాగములు విద్యావిద్యా భేదమున నెనిమిదికాగా ('అష్టౌబుద్ధయః' సాం. సూ.) భగసంబంధబుద్ధియోగనిష్ఠ ప్రత్యేకముగ నాలువిధములగును. గీత ఆత్మవిద్య (బ్రహ్మవిద్య)తో నీనాలుగు బుద్ధియోగనిష్ఠలను నిరూపించును.

ఈశ్వరుని యోగమాయాప్రభావము చాల విచిత్రము! దుఃఖము, అంధకారము, మాలిన్యము, అప్రయత్నముగ అక్కరలేదని మొరయిడినను లభించును. సుఖము, ప్రకాశము, నైర్మల్యము ప్రయత్నించినను, కోరినను లభించుటరుదు. ఏల యన :- దానికి స్వభావముగ దోషానుగ్రహ మధికము. గుణము నంతదయతో జూడదు. ఇందుకు (ప్రకృతికి) మూలము తమోగుణము కనుక తన్మయవిశ్వము దోషభూయిష్ఠమగుట స్వభావ సిద్ధముగదా!

ఈస్వాభావిక నియమానుసారము మనయందు అవిద్యాదిక్లేశచతుష్టయము ఆక్రమించియుంట స్వాభావికము కాగా, వానిం దొలగించుటకును, విద్యాచతుష్టయము వికసింపజేయుటకును ప్రయాసపడవలసి యున్నది. ఏకారణమున బుద్ధియందేదోషమాక్రమించి దానిని మలినపరచునను విషయమునకు సమాధానమిచ్చుట మానవశక్తి కతీతమైనపనియైనను ("గహనాకర్మణోగతిః" "కార్యానుమేయాసుధియైవమాయా" అన్నట్లు స్వభావసిద్ధ - అనాదికర్మసంస్కారవాసనా పరంపరారూప కర్మాశ్వత్థ గుప్తచిత్రప్రభావమున స్వకీయసహజశాంతిలక్షణానందరూప నిధానవిస్మృతినొంది యింద్రియములద్వారా జడవిషయములం దానందమను భ్రాంతితో దారితప్పి తిరుగు పాంథునివలె పునరావృత్తి గావింపుచు జీవాత్మ వేదన బడుచున్నదని మాత్రము చెప్పగలము. ఇట్టి వేదనామూలములగు నవిద్యాది దోషనివారణార్థము, చతుర్విధబుద్ధియోగములను గీత సోపపత్తికముగ నిరూపించుచున్నది. ఇట్లు (1) ధర్మబుద్ధియోగమువలన అభినివేశక్లేశమును, (2) జ్ఞానబుద్ధియోగమున మోహరూప అవిద్యాక్లేశమును, (3) వైరాగ్యబుద్ధియోగమున రాగద్వేషరూపాసక్తి క్లేశమును, (4) ఐశ్వర్యబుద్ధియోగమున అస్మితాక్లేశమును, నివృత్తికాగా నాత్మావరణముతొలగి శాంతిరూపపరమానందప్రాప్తి లభించును. ఈవిధముగ ఆత్మవిద్యయం దవ్యయునివలె ప్రకృతివిద్యయందు లేదా బుద్ధి

విద్యయందు గీత బుద్ధియోగమును ముఖ్యలక్ష్యముగా గొని యున్నది.

## బుద్ధియోగస్వరూపము

ఏమిది? యిదివరకు ఆత్మతో బుద్ధికి యోగము లేకున్నదా? ఉన్నది. ఆత్మలేకుండ బుద్ధి క్షణమైనను స్వస్వరూపమున నుండజాలదు. దానిక్రమమెట్లన :-(1) ఇంద్రియములకు విషయములతో సంబంధముండును. ఆ యైంద్రియక జ్ఞానమువలననే విషయసాక్షాత్కారము. ఇట్టివిషయ ప్రత్యక్షభూతమగు నైంద్రియక జ్ఞానప్రతిష్ఠయు ప్రభవమును సర్వేంద్రియ మనోనామ ప్రసిద్ధప్రజ్ఞానాత్మయును హృదయస్థమనస్సు. ఈమనోరూపమగు నుక్థమునుండి వెడలు నర్కాలే ఇంద్రియములు. అనగా ఇంద్రియములు మనస్సుతో నిత్యసంబంధములని ఫలితము. 1, 2 మనస్సు చంద్రునుండియు బుద్ధి సూర్యునుండియు జనించెనని యిదివరకే తెలిసికొంటిమి. ఈశ్వరసంస్థయందు చంద్రుడు సూర్యప్రకాశముగొని ప్రకాశించునట్లే, జీవసంస్థయందును బుద్ధి ప్రకాశముం గొనియే మనస్సు ప్రకాశించును. ఇక బుద్ధివలన నింద్రియద్వారములు మూతవడగా స్వప్నావస్థయందు పరిణతమైన మనస్సు, తన సాంసారికమానస విషయములందు క్రీడించి, యాబుద్ధి మహానాత్మతో పురీతతి నాడిలోనికి బోయి జ్యోతిర్ఘనమగు నాత్మయందు లయము కాగా, స్వప్రకాశశూన్యమగు నామనస్సు సుషుప్త్యవస్థయందు

బరిణమించును. చివరకు మనస్సునకు బుద్ధితో ఘనిష్ఠసంబంధము కలదని ఫలితము. 2, 3 ఇక బుద్ధియందలి చిత్ప్రకాశము దాని సొంతముకాదు. ఏలయన, ప్రాకృతికమగుబుద్ధి స్వస్వరూపమున సర్వదా జడము. దీనియందు కర్తృత్వశక్తి యున్నది. నిజమే ఎట్లు? పురుషాత్మయను చిదాత్మ నిష్క్రియుడు, శుద్ధవికాసరూపుడు నగును. ఈయన చిదంశంగానియే బుద్ధియందు జ్ఞానజ్యోతి యుదయించును. "ప్రకృతిః కర్త్రీ పురుషస్తు పుష్కరపలాశవన్నిర్లేపః" అని సాంఖ్యులు. ఇట్టి స్థితిలో బుద్ధి కాత్మతో యోగములేదని యెట్లనవచ్చును? కనుక అవశ్యముగ ఆత్మకు (మహదవచ్ఛిన్న-పురుషాత్మకు) బుద్ధితో సాక్షాత్సంబంధమున్నది. ఇట్లు చివరకు బుద్ధిద్వారా మనస్సుతోడను, దానిద్వారా ఇంద్రియములతోడను, తద్వారా విషయములతోడను సంబంధము కలదు. కనుకనే నేను చూచుచున్నాను. వినుచున్నాను. ఇత్యాది వ్యవహారము సంగతమగుచున్నది. ఈపారస్పరిక సంబంధము భగవంతుడిట్లు సూచించెను.

"ఇంద్రియాణి పరాణ్యాహుః ఇంద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధిః యో బుద్ధేః పరతస్తు సః."

ఇట్టి స్థితిలో ప్రకృతిసిద్ధ బుద్ధియోగ ముండగా నీ క్రొత్త యోగ మెట్టిది? "ప్రకృతిసిద్ధ యోగము విషమత్వ యోగము ఇది సమత్వ యోగమన్న" చో సర్వత్ర సమమగు నాత్మ

బ్రహ్మకు ("నిర్దోషం హి సమం బ్రహ్మ") విషమత్వ మెట్లు? అందుకు గారణమేమి? సావధానముగ వినవలయును.

బ్రహ్మ (ఆత్మ) సమమే, దానితో బుద్ధ్యాదులకు విషమయోగమగుచున్నది. అందుకు గారణము ఆత్మకును, బుద్ధికిని మధ్యవచ్చు నవిద్యావరణమే. ఈవిషమయోగమే ఆత్మను మోహమగ్నము గావింపుచున్నది. ఈస్థితిని భగవంతు డిట్లనుచున్నాడు.

"ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్యదేహినమ్." 3-40

"అవిధినాకృతం అకృతం" అన్నట్లు విషమయోగ మయోగమే, అహితభోజన మభోజనమేకదా! అట్లే అయోగముగల బుద్ధియు బుద్ధికాదు, నామమాత్రమునకు యోగము. బుద్ధికలవందుము కాని నిజమునకది అయోగము. అదియబుద్ధి చూడుము : "నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్తస్యభావనా" ఇంద్రియముల కృపవలనను, సాంస్కారిక కర్మల ప్రభావము వలనను, వచ్చుదోషములు. బుద్ధియొక్క నిజప్రతిభను నాశము గావింపుచు జ్ఞాన-విజ్ఞానములను రెంటి స్వరూపములను నష్టము గావించినవి. కనుక బుద్ధియోగవంచితులమై పోయితిమి. భగవంతు డేమనుచున్నాడో వినుడు.

"తస్మాత్వమింద్రియాణ్యాదౌ నియమ్యభరతర్షభ
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనం — 3-41
ధూమేనావ్రియతేవహ్నిః యథాదర్శోమలేనచ

యథోల్బేనావృతోగర్భః తథాతేనేదమావృతమ్ —3.38
ఆవృతంజ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా —3-39
కామరూపేణకౌంతేయ. దుష్పూరేణానలేనచ."

ఆత్మతో బుద్ధియోగ మెప్పుడు నున్నది: యెట్లు? విషమత్వమున : కనుక నది అయోగము. ఆత్మ నిత్య సమము. దానికి సమత్వ బుద్ధియోగము లేమిచే కథయంతయు తారుమారై అశాంతికి దుఃఖమునకు నాలవాల మగుచున్నది : బుద్ధికీ విషమత్వ మాగంతుకము. దానికి కారణములు నాల్గు కనుక నివారణకును నుపాయములు నాల్గే. ఇక నీనాల్గుపాయములచేతను బుద్ధికి కలుగు నపాయము తొలగగా సహజ సిద్ధమగు బుద్ధియోగము బుద్ధియోగ మగుచున్నది. ఇదియే కావలసినది. గీతోపదేశమందలి అపూర్వత యిదియే.

కాని దుఃఖము (విషమత) ప్రకృతివల్లనేగాని మనము తెచ్చిపెట్టుకొన్నది కాదు. మరి, తొలగించుకొనుట మాత్రము మన వశములోనిదా? అవును. ఇందుకు మరల మనము ప్రకృతినే శరణొందవలయును. అటుగాక ప్రకృతితో విరోధించి తమ కల్పిత కారణములను - ఉపాయములను ఆశ్రయించినచో ఫలముండదు సరిగదా దుఃఖ మధికమగును. ప్రకృతియందు దోషమున్నది, గుణము నున్నది. విషమ ప్రకృతియు ప్రకృతియే, సమ ప్రకృతియు ప్రకృతియే. విషమమును సమముతో దొలగింప వలయును. ప్రకృతికి ప్రకృతియే చికిత్స. "విషస్య విషమౌషధం" కదా! ముంటికి - ముల్లు, చీకటికి- వెలుగు రెండును

ప్రకృతులే. అట్లే విషమ ప్రకృతి రూపములగు నవిద్యా దోష ములను సమ విద్యా ప్రకృతి రూపములగు వైరాగ్యాది గుణ ములచే దొలగింపవలయును. తొలగించుట యననేమి? వెలుగు పుట్టగనే యంధకారము వలెను విద్యోదయమున నవిద్య అదియే లీనమగును.

కాని, నిజమే, మనము ప్రయత్నమునందు స్వతంత్రు లమే. దుఃఖ నివృత్తికే కాదు, దుఃఖ నివృత్తికారణ ప్రకృతిని గూడ వశము గావించుకొనుటకు స్వతంత్రులము. మట్టిపాత్ర మాలిన్యముం బోగొట్టును; కాని బలప్రయోగము (తోముట) యవసరము. ఎంతసేపు? ఎంతగా దోమిన నంతగా శుభ్రత యేర్పడును. అది మీ బలప్రయోగముంబట్టి యుండునుగదా!

అట్లే ఆత్మ సంయమము, అహింస, సత్యము, బ్రహ్మ చర్యము మొదలగు శాస్త్ర ప్రసిద్ధ గుణముల నెంతగా - శీఘ్ర ముగా గూర్చుకొన్న సిద్ధియు నంతగా సమీపించు చుండునని వేరుగ చెప్ప నేల? భగవంతుడు సూచించెను :—

"తత్స్వయం యోగ సంసిద్ధః కాలే నాత్మ నివిందతి."

సమత్వ యోగోప లబ్ధి కెంతకాలము పట్టును? ఎంత బలము వ్యయపరుప వలెనన్నచో అది మన కర్మల నడుగవల సిన మాట. "పిండికొలది రొట్టె" వారి వారి కర్మగ్రంధి తార తమ్యము ననుసరించి యుండును. పరీక్షిత్తున కేడు దినములు పట్టెను. ఏండ్ల తరబడిగ వాచనము గావించు భాగవతాచార్యు లకు రాగ ద్వేషము లెప్పటియట్లయుండుట చూచుచున్నాము

గదా! ఒక దినము చాలును, అనేక జన్మలును చాలక పోవచ్చును.

అయినను పెక్కు జన్మలందు బ్రయాసబడినగాని—ప్రయత్నమొనరించిన గాని సిద్ధి లభింపదనియే యనుకొందము. ఏలయన :— మాయామయము, దోషమూర్తియునగు విశ్వమంను కుతర్కబద్ధుడు మొదట ప్రయత్నమే చేయడు. వేల కొకడు చేసినను, మోహజాల మతనిని లక్ష్యచ్యుతుని గావింప నెదుటకు వచ్చుచుండును. కనుక ప్రయత్నించువారిలో నొకడైనను గట్టెక్కగల ధన్యమూర్తి, భాగ్యవంతు డుండుట కష్టము.

"మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే,
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.
బహూనాం జన్మ నామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే,
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః,
అనేక జన్మ సంసిద్ధః తతో యాతి పరాం గతిం." గీత.

"క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గంపథ స్తత్కవయో వదన్తి."

అయినచో కేవల మీ భయము వలన నీ బుద్ధియోగ నిష్ఠాప్రాప్తి మార్గము విడుచుకొందుమా? ఎన్నటికి గాదు. రూపాయి దొరుకలేదని పావలా విడుచుకొందుమా? పెద్ద యుద్యోగము దొరుకలేదని పనిలేక కూర్చుండి కుటుంబమును కష్టములపాలు సేయుదుమా? "ఓహో! అనేక జన్మలు అనేక భయంకర ప్రతిబంధములు. ఇది మనకు శక్యము గాదు"

అనుకొనుట అకర్మణ్యా వచనము. "శక్యమైనంతవరకు తప్పక చేయుద" మనుకొనుట కర్మవీరుల యుద్ఘోష. ఇదియే సిద్ధికి మూలద్వారము.

"నహి కల్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి.
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్."

ఇంతకును తేలిన నిష్కర్ష యిది :— ఆత్మ విద్యయందు బుద్ధి సమభావమున యోగమొందుట బుద్ధియోగము. ఇది నాల్గువిధములు. గీత ఆత్మవిద్యతో నీ నాల్గు బుద్ధియోగము లను ఉపదేశించు చున్నది. ఇక క్రమముగా వానిం గూర్చి తెలిసికొందము.

1. రాజర్షి విద్యామూలక వైరాగ్య బుద్ధియోగము :— రాగద్వేష లక్షణ క్లేశము వలన నుత్పన్నమగు శోకనివారణ గావించునది వైరాగ్య బుద్ధియోగము. తత్కారణ స్వరూప విజ్ఞానము గలిగించు ప్రక్రియ వైరాగ్యవిద్య. ఇది గీతయందు రాజర్షి విద్యయని పేరొందెను.

పూర్వజన్మకృత కర్మ సంస్కారవశమున నేదో యొక వర్ణమున జన్మింతుము. వ్యాపకాత్మకిది మొదటి పారతంత్ర్యము. ఆ సంస్కారముల వశమున నే "అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః" అన్నట్లు అనైచ్ఛిక దుఃఖభోగ ప్రవృత్తి కలుగుట రెండవ పరతంత్రత. తలిదండ్రుల శుక్ల, శోణితము లందు ఔపపాతిక రూపమున, కర్మవశమున, నుండుట గర్భా

శయతంత్ర నియంత్రితుడగుట యొక్క మహా పరతంత్రత. పుత్ర సంబంధమున దలిదండ్రుల సాంక్రామిక దోషముల కధికారి యగుట యొక్క దుఃఖకారణము. ప్రకృతి మండలమున క్రూర గ్రహములున్న యవసరమున గర్భాశయ ప్రవేశము సేయవలసి వచ్చినపు డాయా గ్రహప్రాణములతో గూడి వాని వాని యను గ్రహ భాజను డగుచుండుటయు, తక్కువ పారతంత్ర్యము కాదు. ఏ దేశమున జన్మింతుమో యా దేశముయొక్క అనుకూల ప్రతికూల పరిస్థితులు గూడ మనలను నిర్లేపులుగా విడచి పెట్టవు. ఆర్థికపరిస్థితి ననుసరించియు, అభ్యాస పరిపాటియందలి లోపములం బట్టియు, తల్లి లే భుక్తములగు నాహారరసము నాభినాళద్వారమున గర్భాశయ మందున్న మన పోషణకు కారణముకాగా తత్తద్గుణ దోషములంగు మన పాలు మన మనుభవింప వలసి యున్నది. ఈ విధముగ :— శుక్రదోష - శోణిత దోష - గ్రహదోష - దేశదోష - నాడీదోష - అన్నదోష - కర్మ దోష-శరీర దోషాది అనేక దోషప్రాకార పరివేష్టితుడగుజీవాత్మ కర్మ ఫలానుభవార్థము భూమియం దవతరించుచున్నాడు. ఇక పిదప :- సహజసిద్ధ సాంస్కారిక కర్మ పారతంత్ర్య వశమున పూర్వోక్త దోషానుభవముగూడ తప్పనిసరి యగుచుండగా తన యింద్రియ దోషలక్షణ ప్రజ్ఞాపరాధమున మరియు మరియు నెన్నో దోషములను ప్రోవుసేయు చున్నాడు. మొదటి వానికే సమాప్తి లేదు. మరికొన్ని సంచితము లగుచున్నవి. ఈ విధముగ సంచితము లగు నవిద్యా దోషములును, వెనుకటి దోష

ములును జీవాత్మయొక్క జ్యోతిర్మయ విద్యాభాగమును సర్వదా ఆవృతము గావింపగా దుఃఖితు డగును. ఇంతకును మూలకారణ మేమి? అని యోచించినచో రాగ ద్వేషములను రెండు విద్యా విభూతులు మన యెదుటికి వచ్చును. చూతము:—

ఇంద్రియములద్వారా మనస్సుచే విషయములందు ప్రవృత్తులమగుటయు, నావిషయములందు గొన్నిటిని ద్వేషించుటయు, ఈరెండు భావములును తత్తద్రూపమున మనమనస్సునఖచితములగుటయు (అనగా మనస్సు తదాకారాకారితమగుట) మన కనుభవసిద్ధమే. అందును మిత్రునికంటె శత్రునే మన మనస్సున బాగుగా నంకితుడగును. ఏలయన :-శాస్త్రమునందు అనుకూలబంధనము రాగమనియు, ప్రతికూలబంధనము ద్వేషమనియు పరిభాషసుఖ-సామ్ముఖ్యాసక్తికంటె పృష్ఠపార్శ్వాసక్తి యధికముకదా! సర్పాదివిషక్రూరప్రాణులకు దూరముగా బరువెత్తెదము కాని వానితో మనోయోగము తప్పదు. కనుకనే చోరుని కట్టున్నను చౌర్యోద్దేశ్యముగలవాని కెక్కువ శిక్ష విధింపబడును. మొత్తముపై నీరెండు నాసక్తి కారణములు లేదా ఆసక్తియే రాగ-ద్వేషభేదమున రెండు విధములు. ఎట్లయిన నొకటే.

ఉపలబ్ధివేదప్రభావమున దృశ్యాకారాకారిత మనోవృత్తియే సంస్కారము. ఇది మనసున వసించుటచే వాసనయనిపించుకొనును. ఈవాసనాసంస్కారమువలన "మరల మరల

తత్తద్వస్త్వనుభవము" కోరుదుము. వాసనవల్లనే స్మృతిజనించును. స్మృతియే, రాగాసక్తిరూపవిషయబంధనజనని. ఇక ఆసక్తి యెప్పుడు పుట్టునో చూతము. మనస్సున కనుధ్యానముండవలయును. అది లేనినాడిదియు నుండదు. అనుధ్యానము మనస్సునకు స్వతంత్రముగ లేదు. ఏలయన అదియొకచో నొక క్షణమైన నుండదు. "చంచలం హి మనఃకృష్ణ ప్రమాథిబలవద్దృఢం" అన్నది మరువకూడదు. అది సంకల్పవికల్పాత్మకము, వృద్ధిక్షయములుగల చంద్రతత్త్వమునకు జెందినదియుగదా! కనుక దానికితోడుగ స్థిరలక్షణమును సౌరతత్త్వము నగు బుద్ధియుండవలయును. అప్పుడది చిరకాలముగ విషయచింతన సేయగలదు. స్నేహలక్షణమగు భార్గవచాంద్రసోమ ప్రధానాన్నతత్త్వనిర్మితమగు మనస్సు తన స్నేహగుణమున తేజోలక్షణ బుద్ధియొక్క స్థిరతను గ్రహించి విషయములం దాసక్తము కాగలదు. ఈయనుధ్యానమే విషయసంగకారణము. అదిలేనినాడాసక్తియు నుండదు.

మనోబుద్ధులసాంగత్యము నిత్యము నుండునదే. ఈశ్రుతిం జూడుడు :-

"కతమఆత్మేతి? యోఽయంవిజ్ఞానమయః ప్రాణేషుహృద్యంతర్జ్యోతిః పురుషః" (బృ. ఆ. 4/3/7) తద్వాఅస్యైతత్ అతిచ్ఛందా అపహతపాప్మాభయంరూపమ్. తద్యథా. ప్రియయాస్త్రియాసం పరిష్వక్తోనబాహ్యంకించనవేద-నాంతరం, ఏవమేవాయంపురుషః (విజ్ఞానాత్మా. చాక్షుషపురుషః) ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః (బృ. ఆ. 4-3-21)

ఇట్లయినచో సర్వదా సర్వవిషయాసక్తి యుండవలసి నదే కాని-అనుభవమున నట్లుండక కొన్నివిషయములం దధికము గను కొన్నింటియందు తక్కువగను, కొన్నిట మొదలేయుండ కుండ నుండుచున్నది. ఇందుకు హేతువు మనోబుద్ధులసంసక్తి తారతమ్యమే యగును. అందువలన బుద్ధి రెండుభాగములుగ నెంచవచ్చును. (1) ఉపేక్ష. (2) అపేక్ష అని ;— [1] బుద్ధి మనస్సున కధీనమైనచో నుపేక్షయు, మనస్సు బుద్ధి కధీనమైనచో నపేక్షయు నగును. ఇం దుపేక్షా బుద్ధి ఉత్థితాకాంక్ష (తనంత తాను బుట్టిన స్వభావేచ్ఛ - ఈశ్వరేచ్ఛ) కు జనని. [2]అపేక్షా బుద్ధి ఉత్థాప్యాకాంక్ష (మానసేచ్ఛ-జీవేచ్ఛ) కు జనని. ఉపేక్షా బుద్ధి కామాసక్తముకాదు. ఏలయన నందు చిరకాలాను ధ్యాన మునకు గావలసిన బుద్ధి మనోఽధీనమై యుండుటవలన స్థిరతా లక్షణమగు నా యనుధ్యాన కర్మ కసమర్థ మగును. కనుకనే, "నీవు నన్నుపేక్షించుచున్నావు" ఇత్యాదులు సంగతములగును. అపేక్షాబుద్ధి యిందుకు వ్యతిరేకము. గనుక నాసక్తి కారణమని వేరుగ జెప్పనక్కర లేదు.

తేజోలక్షణమగు నపేక్షాబుద్ధి స్వయముగ నసంగమగుట వలన విషయాకారాకారితము కాకపోయినను అందుకు గారణ మగు మనస్సు తోడుండుట వలన, సంస్కారముద్ర దృఢము (ఇది బుద్ధి మహిమ) గాబడుట కవకాశము కలదని యూహింప వలయును.

ఇదియునుగాక :-బుద్ధి భగ-క్లేశభేదమున లేదా విద్యా విద్యా భేదమున ద్వివిధమగుననుకొన్నమాట మరువరాదు. ఇచ్చటనొకవిషయము జ్ఞప్తియుంగుంచవలయును. ఏమన:-సంస్కారమును దృఢపరచు పని క్లేశరూపయగు నవిద్యను జెందినది కనుక నవిద్యాబుద్ధియుక్తమనస్సే యాసక్తి కధిష్ఠాతయగును గాని, విద్యాబుద్ధియుక్తమనస్సందుకుపయోగపడదు. ఇందువలన దేలునదేమనగా :-"అవిద్యాసహాకృత మనస్సుయొక్క చికాలికవిషయచింతనమే అనుధ్యానము. (1) లేదా ప్రజ్ఞానమునందు విజ్ఞానము సంశ్లిష్టమగుటయే అనుధ్యాము. (2) లేదా అవిద్యారూపాపేతబుద్ధిద్వారా మనస్సు(ఇంద్రియద్వారమున) గావించిన విషయపరిగ్రహము నట్లే చిరకాలముంచుట యనుధ్యానము. ఇదే యాసక్తికి మూలజనకము. ఇదే సంగము. లేదా రాగము" అని.

ఇక ప్రస్తుతముం జూతము :-రాగము కామమూలకము. ద్వేషము క్రోధమూలకము. రెంటియందును మనోఽనుధ్యానజన్యాసక్తి కలదు :-ఒకదానియందు విడువను రెండవదాని యందు గ్రహింపను, ఒకదానియందు జ్ఞప్తియుంపవలయు ననియు రెండవదానిని మరువవలయుననియు నాసక్తి సమానము ఇదియే యింతవరకు జెప్పిన రాగద్వేషములకు భేదము నొందినది. ఈరెండు నాత్మవినాశకారణములని వేరుగ జెప్పనక్కరలేదు. ఏలయన :-ఇవి రెండును క్షోభమూలములు.

అశాంతికావాసభూములు. ("అశాంతస్యకుతస్సుఖం") జ్యోతి-విద్యాలక్షణమగు నాత్మ నావరించి విషయపరతంత్రము గావించును. ఆసక్తి ప్రవేశించుటతోడనే ఆత్మయొక్క విద్యాభాగము నిర్బలమైపోవును. అది యాత్మవిద్యతో విద్యాబుద్ధియోగము గుదురనీయదు. దాని ప్రసన్నత నుండనీయదు. ఆసక్తిమయబుద్ధిగలవాడెంతపండితుడైన నగుగాక నతని కింద్రియసంయమము శక్యముగాదు. అతని జపతపాదులన్నియు వ్యర్థములు. ఈభగవద్వచనముం జూడుడు.

"యతతోహ్యపికౌంతేయ. పురుషస్యవిపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః"

ఉపనిషత్తులందు దహరాకాశమనియు, దభ్రాకాశమనియు జెప్పబడిన హృదయాకాశమునందలి దహరపుండరీకమాత్మకు నియతమగు ప్రతిష్ఠాభూమిగ నున్నది. హృదయస్థానము పూర్ణప్రతిష్ఠాభావయుక్తమగుటవలనను, విషమత్వప్రవేశమున నవకాశము లేనందువలనను, ఆత్మయందెన్నడు నే విధముగను విషమత్వముండక సమత్వమే భాసించుచుండును. ఇట్టి స్థితిలో, అపేక్షాబుద్ధి సహాకృత మనస్సు మొదలగునవి యాసక్తివశమున విషయరాగము గావించునో ఆత్మకీరువైపులను: కామక్రోధమూలక రాగద్వేషావరణ మండలములను సృజించి దాని స్వరూపతిరోధానము గావించును. పిమ్మట నంతయు క్షోభలక్షణమగు నశాంతి సామ్రాజ్యమే. ఈ పరిలేఖ వంక జూడుడు.

ఇక : నీయాసక్తిని తొలగించుటెట్లు? వైరాగ్యోదయము కావలయును. దానికి ప్రతిద్వంద్వి అదియే. అది లేనినాడెన్ని ప్రయత్నములు గావించినను వ్యర్థమే. బుద్ధిసహాకృత మనస్సునందది యుదయించుటతోడనే యాసక్తి దానంతనదే తొలగిపోవును. పోగా నట్టి వైరాగ్యోపేతబుద్ధి కాత్మవిద్యతో యోగమే వైరాగ్యబుద్ధియోగ మగును. వైరాగ్యమే బుద్ధియోగము కాదు. బుద్ధికి (ఆత్మతో) యోగ మిదివరకే స్వతస్సిద్ధమైయున్నదని మున్నే తెలిసికొంటిమిగదా! అట్టి స్వతస్సిద్ధ బుద్ధియోగ మాసక్తిరూపావరణమున నాత్మజ్యోతి వియుక్తమగుచు విషమతకు గారణమైపోవుచున్నది. ఇక : ననాసక్తిరూప వైరాగ్యోదయమగుటతోటనే ఆవరణము తొలగును. అంతట సమత్వ లక్షణముగల యాత్మతో నదివరకే కూడియుండు బుద్ధి, యాత్మజ్యోతి యోగమున ప్రసన్నభావము నొందును. కనుక వైరాగ్యబుద్ధియోగమనగా, వైరాగ్యహేతుక బుద్ధియోగమని తాత్పర్యముగా నెరుంగవలయును. బుద్ధియోగము సిద్ధము—వైరాగ్యము సాధ్యము. ఈ సాధ్యసిద్ధి కొరకు అనగా వైరాగ్యోదయము కొరకు నేయే యుపాయముల నాశ్రయింపవలయునో ఆ యా యుపాయ సంగ్రహ
వైరాగ్యవిద్య-ఇదే రాజర్షివిద్య. ఈ విద్యయందు ప్రధానవ
అనాసక్తిని భగవంతుడుపదేశించెను. వ్యక్తియొక్క వృత్తి-(
వ్యవహారము) బట్టి దాని సిద్ధిని గుర్తించుకొన
("దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్యవశీకారసంజ్ఞా

యో। సూ) భగవంతుడు దీనిదిగ్దర్శన మిట్లు గావించు చున్నాడు :—

యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వాధనంజయ.
సిద్ధ్యసిద్ధ్యోఃసమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే
ఇహైవతైర్జితఃసర్గః యేషాంసామ్యేస్థితంమనః
నిర్దోషంహిసమంబ్రహ్మ తస్మాద్బ్రహ్మణితేస్థితాః
సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని
ఈక్షతేయోగయుక్తాత్మా సర్వత్రసమదర్శనః
ఆత్మౌపమ్యేనసర్వత్ర. సమంపశ్యతియోర్జున
సుఖం వాయదివాదుఃఖం. సయోగీపరమోమతః.

సయోగీపరమోమతః అనగా :—జ్ఞాన-ఐశ్వర్య-ధర్మబుద్ధి యోగులుకూడ యోగులేకాని వీరందరికంటె సమత్వలక్షణము గల యీవైరాగ్యబుద్ధియోగసిద్ధుడగు యోగియే సర్వశ్రేష్ఠుడని భగవన్మతము. ఇదియే "యేమేమతమిదం" ఇత్యాదిగా తన మతమని భగవంతుడు స్వయముగా సూచించెను. తక్కిన బుద్ధియోగము లితరుల మతములు వానిని సంస్కరించి బుద్ధియోగరూపమునిచ్చి, యాసంశుద్ధరూపమున గీతయందు పొందుపరచెను. ఇది భగవన్మతమగు రాజర్షివిద్యాసిద్ధవైరాగ్య బుద్ధియోగసంక్షేపము.

ఇతి వైరాగ్యబుద్ధియోగ సంక్షేపః.

(2) జ్ఞానబుద్ధియోగము :-రాగద్వేష రూపాసక్తికి వైరాగ్యమువలె మోహమునకు ప్రతిద్వంద్విజ్ఞానము. దార్శనికు లీమోహము నవిద్యయన్నను, విజ్ఞానమర్యాదంబట్టి దీనిని మోహమనుటయే తగును. ఎట్లన :-"అవిద్యాస్మితారాగద్వేషాభినివేశాః పంచక్లేశాః" అను సూత్రమందలి అవిద్యేతరములుకూడ నవిద్యలే యనుకొని యవిద్యను పృథగ్గ్రహణము జేయవలసినచో "మోహాస్మితారాగద్వేషాభినివేశాః పంచక్లేశాః" అనుటయే తగునుగదా!

మనబుద్ధియందు సంస్కారవశమునను, ప్రకృతి యను గ్రహమునను, మోహము సామ్రాజ్యము చేయుచుండును. ఇందువలన బుద్ధి ముగ్ధమగుటయు, సదసద్వివేకము నష్టమగును—పూర్వప్రకరణములందు, ఆత్మజ్ఞానకర్మమయమనియు, పాప్మానుగ్రహమున జ్ఞానము :-1 సమ్యగ్జ్ఞానము, 2 అన్యథా జ్ఞానము, 3 అజ్ఞానము అని మూడు విధములును, కర్మయు, 1 సుకర్మ, 2 వికర్మ, 3 అకర్మయని మూడు విధములు నగునని చెప్పబడినది.

(1) విశుద్ధజ్యోతి సమ్యగ్జ్ఞానము :-దీని కుత్తేజకము లేదా ఉదయహేతువు. సుకర్మ అనగా నివృత్తిలక్షణ నిష్కామకర్మ-దీని ప్రభావమున నిరావరణశుద్ధరూప సమ్యజ్ఞాన ముదయింపగా నట్టివానినే జీవన్ముక్తః, విదేహముక్తః, ముక్తాత్మాయందురు. గీతాపరిభాషానుసారమితడు సిద్ధుడు.

ఈసిద్ధావస్థం గూర్చియే "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాంప్రపద్యతే" "జ్ఞానాన్ముక్తిః" "జ్ఞానాగ్నిసర్వ కర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" "ఉదారాః సర్వఏవైతే జ్ఞానీత్వాత్మైవమేమతం" ఇత్యాది సిద్ధాంతములు ప్రసిద్ధములై యున్నవి ;

(2) అన్యథాజ్ఞానము మలినజ్యోతి :-ఇదే సాధ్యావస్థ. ఈయవస్థయందున్న వ్యక్తిని గీత <u>ఆరురుక్షు</u> డనుచున్నది.

(3) ఆవరణమజ్ఞానము :-ఇది నష్టావస్థ-జ్ఞానాభావము పేర జ్ఞానముకాదు. అజ్ఞానముచే ఆవరింపబడినజ్ఞాన మజ్ఞానము. ఇదే మోహము. "అజ్ఞానేనావృతంజ్ఞానం తేనముహ్యన్తిజంతవః" అని విశదమేకదా ! ఇందు జ్ఞానజ్యోతికి సంపూర్ణపరాభవసిద్ధి కనుక నిది కలవానిని అచేతసః అనియెను. విశుద్ధలౌకికులు ఆహారనిద్రాభయమైథునాది సాంసారికవిషయములే పరమపురుషార్థములని యెంచునట్టి నష్టప్రాయులు నగువారిని "సర్వజ్ఞానవిమూఢాన్స్తాన్ విద్ధి నష్టానచేతసః" అని భగవంతుడు కఠినముగా దిట్టెను. ఇట్టివారికి శాస్త్రోపదేశము "అరణ్యరుదితంకృతం శవశరీరముద్వర్తితం" అగును. ఈవిధముగ జ్ఞాన-కర్మ తారతమ్యములవలన మూడవస్థలు సిద్ధించును.

(1) 1. శుద్ధజ్యోతి (శుద్ధసత్త్వము)-సిద్ధావస్థ-(యుక్తయోగి)-ముక్తాత్మ
2. మలినజ్యోతి.(మలినసత్త్వము)-సాధ్యావస్థ-(యుంజానయోగి)-ఆరురుక్షుడు
3. ఆవరణము. (శుద్ధతమస్సు) లౌకికావస్థ-(అయుక్తుడు)-లక్ష్యచ్యుతుడు.

(2) 1. సమ్యగ్జ్ఞానమ్—సుకర్మ—చికిత్సితః—మోహాత్యంతికనివృత్తి
2. అన్యథాజ్ఞానమ్—వికర్మ—చికిత్స్యః. మోహాంశప్రవేశము.
3. అజ్ఞానమ్.—అకర్మ—అసాధ్యః. మోహాత్యంతికప్రవృత్తి.

ఈ మూడు జ్ఞానపర్వములకును, మూడు కర్మపర్వముల కును సంఘర్షణము జరుగుచుండుట మనకనుభవసిద్ధమే. ఎట్లనః- ఒకపుడు మంచియూహాలు, నొకపుడు చెడ్డయూహాలు నొక పుడు యేమియు దోచని మూఢస్థితియు తత్తత్సమయానుకూల సుకర్మ వికర్మ అకర్మల యాచరణము గలుగుచుండు టెరుంగు దుముకదా! ఇట్టి సంఘర్షణ క్షోభ కారణము. ఎట్లన, ఒక పదార్థమునం దిరువురు కాముకులైనపుడు పరస్పరము క్రోధోద్దీ పితులై కర్తవ్యాకర్తవ్య వివేకశూన్యులగుట చూచుచుందుము. అప్పటి బుద్ధియొక్క స్తబ్ధవృత్తియే మోహము - సమ్మోహ మందురు: "సంగాత్సంజాయతేకామః కామాత్క్రోధోభి జాయతే క్రోధాద్భవతిసమ్మోహః సంమోహాత్స్మృతి విభ్రమః స్మృతిభ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి" అని గీత: వ్యాసుడీ యవస్థనే ముగ్ధావస్థయనెను. "ముగ్ధేర్ధసంపత్తిఃపరిశే షాత్" (శా। సూ॥) ఇందు జాగ్రత్సుషుప్తుల- (విద్యా-విద్యల) యుభయధర్మ సమన్వయముండును. ఇదే చిత్తము (మనస్సు) యొక్క వైచిత్ర్యము. ఈ మోహమువలన బుద్ధియొక్క జ్ఞాన భాగ మావృతమగును. చివరకు కర్తవ్యజ్ఞానము లేక క్షోభ నొందుచుండును. ఇందువలన పదేపదే లక్ష్యచ్యుతి కల్గుచుం డును. ఇక నేనాడు జ్ఞానోదయమున నీ మోహనివృత్తియగునో

యీనాడు నిర్వేదమొందుచున్నాడు. భగవంతుని యీ వచనము జూడుడు.

"యదాతేమోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి.
తదాగన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్యశ్రుతస్యచ॥"

ఇట్లు మోహక్లేశమువలన నుత్పన్నమగు శోకనివృత్తి కొరకు మోహ ప్రతిద్వంద్వియగు జ్ఞానబుద్ధియోగము అనగా జ్ఞానహేతుక బుద్ధియోగ మపేక్షితమై యున్నందున, తదుపాయాది సంగ్రహమే జ్ఞానవిద్య యనియు, నిందువలన సిద్ధావస్థ ప్రాప్తించును గనుక దీనినే సిద్ధవిద్య యనియు నందురు. వైరాగ్యవిద్యకు అనాసక్తి రహస్యమైనట్లు ఈ విద్యకు మూల రహస్యము అంతర్జ్యోతి. వైరాగ్యమువలన నాత్మయందు నానక్తి భావముదయించునట్లు జ్ఞానమువలన నంతర్జ్యోతి యుదయించును.

జ్యోతిస్తత్త్వమంతర్బహిర్భేదమున రెండు విధములు. ఏతద్ జ్ఞానముకొరకు సూర్యచంద్రుల నెదుట బెట్టుకొనుడు. సూర్యుడు జ్యోతిర్ఘనుడు. చంద్రుడు జ్యోతిర్మయుడు. ఇద్దరియందు గొప్ప భేదముకలదు. సూర్యుడు నాల్గువైపులను లోపల వెలుపల బ్రకాశితుడగుచు స్వప్రకాశమున కితరాపేక్షలేక ముల్లోకములు బ్రకాశింపజేయును గనుక స్వజ్యోతి-అంతర్జ్యోతి యనబడును. చంద్రుడత్రిపుత్రుడు. ప్రాణవిజ్ఞానానుసారము అత్రిప్రాణము, పారదర్శకతా ప్రతిబంధకమగు ధామచ్ఛద పదార్థముల కుత్పాదమునై

యున్నది :* వాక్ - ఆపః - అగ్నియను మూడు శుక్రములచే ధామచ్ఛదమగు విశ్వనిర్మాణమైనదని ఆత్మవిద్యాప్రకరణమున జెప్పియుంటిమి. ఈ మూడు శుక్రములును క్రమముగ- అత్రి, భృగు-అంగిరస్ అని యందురు. ఇందు అంగిరోనామక అగ్ని శుక్రము, అగ్ని- యమ-ఆదిత్య-అని మూడువిధములు. భృగు నామక ఆపశ్శుక్రము ఆపః, వాయు, సోమ, అని మూడువిధ ములు, కాగా: అత్రినామక వాక్శుక్రము మూడు భాగములు గాక న+త్రి యను నిర్వచనానుసార మత్రియనబడును.

మరియు సౌరజ్యోతి నిది యారగించివేయును. ఎట్లన పారదర్శకతా ప్రతిబంధకప్రభావమువలన నేప్రాణ మేపదార్థ మున ప్రధానముగ నుండునో దాని యావలివైపు రశ్ముల నడ్డుకొని యావలికి బోనీయదు. ఈప్రాణ మధికముగ నుండుట వలననే రజస్వల నాత్రేయీ యందురు. ఇయ్యది తేజస్సును

---

* ప్రాణవిద్యయే వేదవిద్య. వేదములందీప్రాణముల గొప్పగొప్ప గంభీర రహస్యముల ప్రతిపాదనగలదు. ఇవి ముఖ్యముగ ఐదిజాతులుగలవి. ఇవి యైదై దుగా రెండుతెగలు. ఇవి పరస్పర విరోధముగలవి (1) ఋషిప్రాణము:—మొదటి దియు ముఖ్యమును. దీని విరోధి రాక్షసప్రాణము. రుధిరశోషణ గావించి యేనుగ వంటివానిని గూడ తెల్లని పీనుగవలె సిద్ధముజేయుట దీనిపని. (2) పితృప్రాణము:- దీనికి విరోధి పిశాచప్రాణము. పిశితియనగా మాంసము 'పిశితం-అంచతి' అని మాంసము హరించి యెముకలు మిగుల్చుట దీనిపని. (3) దేవప్రాణము :—దీనికి విరోధి యసురప్రాణము. బుద్ధినాశము గావించుట దీనిపని. (4) మనుష్య ప్రాణము :—దీనికి విరోధి గంధర్వప్రాణము, మరణానంతరము జీవుని యవస్థయే యీ ప్రాణము. (5) గ్రామ్యపశుప్రాణము:— దీనికి విరోధి యారణ్యపశుప్రాణము. వీని విచారణ వివరముగ మరియొకచో జూచుకొనవచ్చును. ప్రస్తుతమునకు జాలి నంత తెలిసికొనుట మంచిదని యీ మాత్రముదహరింపబడినది.—

హరించివేయును. కనుక "అత్తీత్రి-అత్రి" అనియు నందురు. నల్లని చంద్రునియం దీత్రిప్రాణము ప్రధానముగా గలదు. ప్రకారాంతరమున నత్రి ప్రాణాగమనమున ధామచ్ఛదుఁడగు చంద్రుని భూపనిష్పత్తియైనది. కనుక నిత డత్రిపుత్రుడనుట న్యాయమే గదా! ఈయత్రి యనుగ్రహమున జంద్రునిలోనికివచ్చు సౌర ప్రకాశ మావలికిబోక ప్రతిఫలితమై మరల దిరిగిపోవుచున్నది: చంద్రుని ప్రకాశము సూర్యునిదే, కాని అంతర్ముఖము గాక బహిర్ముఖమై యున్నది. కనుక చంద్రుడు పరజ్యోతి-బహిర్జ్యోతి యనబడును.

ఆత్మజ్యోతి విషయమునగూడ ఈరెండు విభాగములనే తెలియనగును. ఇదియు ఆత్మ-ప్రకృతి యని రెండు విధములు. 1 ఆత్మజ్యోతి (అవ్యయజ్యోతి) అంతర్జ్యోతి యిదే జ్ఞానజ్యోతి. 2 ప్రకృతిజ్యోతి బహిర్జ్యోతి యిదే భూతజ్యోతి. సూర్యచంద్ర విద్యుత్తారకాగ్న్యాదు లన్నిటికి నిందే యంతర్భావము. "తమేవ భాంతమనుభాతిసర్వం తస్యభాసాసర్వమిదం విభాతి." అన్నట్లు జ్ఞానజ్యోతి భూతజ్యోతి మూలప్రతిష్ఠ యైనట్లే "పంచజ్యోతిరయం పురుషః" అన్నట్లు భూతజ్యోతి లేనిచో జ్ఞానజ్యోతియు స్వస్వరూపమున వికసిల్లదు. రెంటియందు నుపకారోపకారక సంబంధము కలదు.

సూర్యరూపభూతజ్యోతివలన బుద్ధియు, చంద్రరూప భూతజ్యోతివలన మనస్సును నిర్మితములగుటచే నధ్యాత్మసంస్థ యం దీరెంటిని భూతజ్యోతులనవచ్చును. వీనితో హృదయ

ష్ఠము నంతర్జ్యోతిర్ఘనము నగు నవ్యయాత్మయొక్క సంబంధ ముండును. ఇక నీరెంటిమధ్య మోహానామక క్లేశ మడ్డపడినచో నంతర్జ్యోతి యావృతమగుటయు, బుద్ధి కంతర్జ్యోతి ప్రకాశము లభింపమిచే కేవల భూతజ్యోతియొక్క చక్రమునం దగుల్కొని క్షోభకు గారణమగుచున్నది. ఈస్థితిలో నవ్యయవిద్యయందు బుద్ధివిద్య నేయాటంకము లేకుండ యోగము గావింపవలయు నన్నచో మోహానివృత్తియే కావలయును గనుక నందుల కంత ర్జ్యోతిర్లక్షణజ్ఞాన మపేక్షితమగును. అందువలన పై నను కొన్న సిద్ధి లభించును. ఇదియే జ్ఞానబుద్ధియోగసంక్షేపస్వరూ పము. ఇందు జ్ఞానము ప్రధానద్వారము. కనుక భగవంతుడీ జ్ఞానవిద్య-లేదా సిద్ధవిద్యయందు, జ్ఞానవిజ్ఞానలక్షణమగు నంత ర్జ్యోతిస్వరూపమును, తత్ప్రాప్త్యుపాయములను విశేషించి వివ రించెను. ఈ యోగసఫలతకు సంతుష్టియే గుర్తు. ఈతుష్టి 17 విధములు. వీని వికాసమున్నచోట నీసిద్ధి యున్నదని గ్రహింప నగును. అనగా జ్ఞానయోగనిష్ఠ కుదిరినదని యెంచవలయును.

ఇతి జ్ఞానబుద్ధియోగసంక్షేపః.

(3) ఐశ్వర్యబుద్ధియోగము :– ఆనందవిజ్ఞానగర్భితుడు, మనఃప్రాణవాఙ్మయుడు, అక్షరక్షరులతో నిత్యసంబద్ధుడు, బహి రంగపంచప్రకృతి విశిష్టుడు, శుక్రత్రయావచ్ఛిన్నుడు నగు విశ్వ మూర్తి పేరే ఈశ్వరుడు. ఇతని యాశతయే ఐశ్వర్యము. ఇది జ్ఞాన-కర్మ-అర్థ భేదములచే మూడు విధములుగ నున్నది.

ఈమూడైశ్వర్యములచే నతడన్నిటికి నీశితయై విశ్వమందంత టను విరాజిల్లుచున్నాడు. అతని యంశమే జీవాత్మ. ఇతనియం దతని ధర్మములు స్వతఃసిద్ధములే యగును. జ్ఞానకర్మార్థము లీశ్వరతంత్రములుగ జెప్పిన వేదమున కుపవేదమగు నాయుర్వేద మాజీవుని మూడు కళలను కాల-కర్మ-అర్థములని పేర్కొన్నది. ఈచక్రముం జూడుడు.

స్థానములు :

1. జ్ఞానము—(కాలః) కాలచక్రమ్—శివః—మనః శిరోయంత్రము
2. క్రియా—(కర్మ) కర్మచక్రమ్—బ్రహ్మ—ప్రాణ హృదయయంత్రము
3. అర్థః—(అర్థః) అర్థచక్రమ్—విష్ణుః—వాక్ నాభియంత్రము

ఇట్లధ్యాత్మసంస్థ యం దీమూడు యంత్రములద్వారా సాక్షాదీశ్వరుని యీశ్వరతను దర్శించుచున్నాము.

ఈశ్వరప్రజాపతి జ్ఞానముచే సర్వజ్ఞుడును, క్రియచే సర్వ శక్తియు, అర్థముచే సర్వవిత్‌ను అగుచు సర్వమూర్తి-పూర్ణ మూర్తియై యున్నాడు. తదంశభూతుడగు జీవప్రజాపతియు, "పూర్ణమదః పూర్ణమిదం" "యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ" "యోఽసావసౌ సోఽహమ్-యోఽహం సోఽసౌ" ఇత్యా ద్యనుసారము. ఈశ్వరునికంటె నెందును దక్కువవాడు కాకు న్నను, నేమో! ఆశ్చర్యము! అల్పజ్ఞుడు, అల్పశక్తి, అల్పవిత్‌నై జ్ఞానక్రియార్థలోపములం బ్రదర్శించుకొనుచు నెనోప్నే 'లేదు' ల మధ్య యర్థానుధావనమాచరించుచున్నాడు. దీనికిగాగణమేమి?

అస్మితయనునవిద్యయే యిందుకు గారణము. ఆత్మ యొక్క వాస్తవిక వికాసమునకు, నైశ్వర్యమునకు నడ్డమిదే. "స్మిజ్ - ఈషద్ధసనే," అన్నట్లు వికాసమే స్మితభావము. వికసించిన పుష్పము, నవ్వుమొగము. స్మితభావము గలవి. ముకుళిత పుష్పము, అసిత్మకగుర్తు. ఇది ప్రవేశింపగనే యాత్మవికాసమణగిపోవును. శోకమునకు గారణమగును. మనస్సు వాడుదల వట్టి యశాంతిగలదిగ నుండును. ఇది తొలగుటకు దీనికి ప్రతిద్వంద్వియగు నైశ్వర్యము బుద్ధియందుదయింప వలయును. తమపాయ సంగ్రహమే యైశ్వర్యవిద్య లేదా రాజవిద్య - దీని మౌలికరహస్య మీశ్వరానన్యత్వము. ఈశ్వరునకు మనకు మధ్య నీ యస్మితారూపావిద్యావరణము రాగా మన మన్ని యెడల దదంశభూతులమయ్యు నతని మరచెదము. ఇందుకు మన ప్రస్తుత చరిత్రయే యుదాహరణము (History) "మీ పూర్వులసభ్యులు, చెట్టును పుట్టను పూజించు విజ్ఞాన శూన్యులు." ఇత్యాదులు మనకస్మితాభావ సమృద్ధింగూర్చి స్వరూప విస్మృతిం గలిగించినవి. ఫలితమనుభవమే కదా. మన పని గొఱ్ఱెమందలో పెరిగిన సింగపుబిల్ల మాదిరియైనది. ఇక మన యైశ్వర్యమును మనము గుర్తింపవలయును. వెంటనే అస్మిత మాయమై నూతనబలము మనస్సునందు క్రియయందు నర్ధమందు నావిర్భవించును-ఈశ్వరు డనంతఘనుడు. ఆ యనంత శక్తియందు భాగ స్వాములము కావలయునన్నచో "సాపరాను

రక్తి రీశ్వరే" అన్నట్లు "పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్ హాసలీలానిద్రాదులు చేయుచున్"

మచ్చిత్తామద్గతప్రాణాః బోధయంతః పరస్పరం
కథయంతశ్చమాంనిత్యం తుష్యన్తిచరమన్తిచ."—కావలయును.

క్రొత్తవానిం జూడగనే శిశువు సంకోచభావముగుడగును. తనవానిం జూడగనే ఆయస్మిత విడచి వికాసభావపూర్ణుడగును. అట్లే అస్మితమన బుద్ధికి విజాతీయము. కనుక దానివలన వచ్చు సంకోచభావ రూపాస్మిత సజాతీయేశ్వర బంధుసంసర్గమున దొలగి యైశ్వర్యసిద్ధి యగును కనుకనే భగవంతుడీ యైశ్వర్యవిద్యాపరపర్యాయక రాజవిద్యయందు ప్రధానముగ జ్ఞానవిజ్ఞానయుక్తయు, ఉపాసనాలక్షణయు నగు నీశ్వరానన్యభక్తి ప్రతిపాదన విశేషించి కావించెను. దీనికి ఫలము అవర - పరలక్షణావ్యయ ద్వారమున నైష్కర్మ్యము సిద్ధించుటయే.

అవ్యయ పురుషుడు విద్యా - కామ - కర్మభేదమున మూడు విధములు. (1) ఆనందవిజ్ఞానములు విద్యావ్యయుడు లేదా పరావ్యయుడు. (2) ప్రాణవాక్కులు. కర్మావ్యయుడు, లేదా అవరావ్యయుడు ఈ రెంటినడుమ శ్వోవసీయస నామకమన * స్సున్నది. ఇదియే కామాత్మ. దీనికా యిరువురితోడను

* మనస్తత్త్వము నాల్గు భాగములు : అనగా అధ్యాత్మసంస్థయందు వేర్వేరు నామరూపములుకల నాల్గు మనస్సులున్నవి. (1) సుఖదుఃఖముల ననుభవించునదియు, నియతవిషయమున నింద్రియకోటియం దంతర్భూతమగు సంవేదనీయ

సంబంధముకలదు. ఇది యవరావ్యయుని వైపైనచో సంసారము. పరావ్యయుని వైపైనచో ముక్తి. తనచోటియందే తానున్నచో రెంటి సమన్వయము. ఇట్లు పర-అవర-మనోభేదములచే నవ్యయుడు మూడు భాగములు కాగా నీయాధారముగొని ప్రాచీనుల, జ్ఞాన-భక్తి-కర్మయోగములు వెలసినవి. సాంసారికకర్మ లిప్తకర్మయోగము (1) దీనికిసాక్షి ప్రాణవాఙ్మ

---

మనస్సు మొదటిది. దీనినినే ఇంద్రియమనస్సనియు నందురు. "మనఃషష్ఠానీంద్రియాణి" అని యథర్వవేద మన్నది దీనిగూర్చియే. వాక్ప్రాణచక్షుశ్శ్రోత్రం మనః అనుదానిలోనిదీ వేదనీయమనస్సే. దీనిని బహిర్మనస్సందుము.

(2) పూర్వోక్తసర్వేంద్రియసంచాలకమగునదియు. సర్వేంద్రియ (మనస్సు) అనబడునదియు. ఇంద్రియము కాకుండుటచే అనింద్రియము. అతీంద్రియము నగునది రెండవమనస్సు ఇదే ప్రజ్ఞానమందురు. దీనిని నంతర్మనస్సని వ్యవహరింతుము.

(3) మనస్సు మహదాత్మకము. దీనినే-చిత్తము; మహత్తు-సత్త్వగుణము. ఇత్యాదిగాబిలుతురు. చంద్రస్థానీయప్రజ్ఞానమనస్సు స్వస్వరూపమున ఘోరకృష్ణము. సూర్యస్థానీయవిజ్ఞాన (బుద్ధి) మున నయ్యది ప్రకాశితమగునుగదా! యిక నీవిజ్ఞాన ప్రజ్ఞానములకు సంబంధము గూర్చునది యీమూడవదగు చిత్తాఖ్యసత్వమనస్సు.

(4) దీనికిని మిగిలిన యన్నిటికిని ఆలంబనమగునది యవ్యయమనస్సు ఇదే శ్వోవసీయస మనస్సు. దీనినే చిదాత్మ-చిన్మనస్సు-శ్వోవసీయసబ్రహ్మ ఇత్యాదిగా వ్యవహరింతురు. మొదటి మూడును కరణరూపములు. ఇదియొకటియు నాత్మరూపము. దీనిపై నంతశ్చితి బహిశ్చితి యని రెండు చితులగును. ఆనందవిజ్ఞానముల చితి యంతశ్చితి. ప్రాణవాక్కులచితి బహిశ్చితి. అంతశ్చితి రూపావ్యయుడే పరుడు. ముక్తిసాక్షి జ్ఞానాత్మయును. బహిశ్చితి రూపావ్యయుడే అవరావ్యయుడు. ఇతడే సృష్టిసాక్షి. కర్మాత్మ ఈయిరువురి మధ్యనున్న - ఉభయధర్మావచ్ఛిన్నమనస్సే కామాత్మా. ఇందు ప్రకృతమున నీశ్వరోపాసనయందు చిదాత్మనామక మనస్సునే సిద్ధము గావింపవలయును. ఇదే చయనాధిష్ఠాతయగుచు, శాంతికి గారణమై యున్నది. ఇది లేనినా డచేతనబలనిర్మాణమున నశాంతి పుట్టును.

యుడగు నవరావ్యయుడు. (2) సర్వకర్మపరిత్యాగలక్షణ సన్న్యాసానుగమనము జ్ఞానయోగము. దీనికిసాక్షి ఆనందవిజ్ఞానమయపరావ్యయుడు. (3) ఈశ్వరుని నిమిత్తముగా నన్నికర్మలుజేయుచునుండుట భక్తియోగము, లేదా యుపాసన. దీనికిసాక్షి మధ్యస్థమగు నవ్యయమనస్సు. ఇందు పరావ్యయుని జ్ఞానయోగమును, అవరావ్యయుని కర్మభాగమును గలసియుండును. ఒకవంక కర్మ-వేరొకవంక నీశ్వరానుధ్యానలక్షణజ్ఞానము: ఇట్లు పర-అవర (జ్ఞాన+కర్మ) భాగములు కలదగుటచే నిది భక్తియైనది. ఇంద్రియమనస్సును ప్రజ్ఞానమనస్సుతో సమన్వయముజేయుచు, ప్రకారాంతరముగ :-ఇంద్రియసంయమలక్షణానుష్ఠానము గావించుచు, చిత్తముద్వారా యాత్మ నీపరావరలక్షణభక్తిరూపమనస్సుతో యుక్తముగ జేయుటయే భక్తియోగము. ఇదే భక్తినిష్ఠయొక్క సిద్ధి-కర్మచేయును కాని యూత్మార్థము లేదా యీశ్వరార్థము. కనుకనే యాకర్మ కర్మయయ్యును నైష్కర్మ్యకోటికి జేరిపోవును. ఈయోగసిద్ధి సూచకముగ "ఇది యంతయు భగవదిచ్ఛ" యను నక్షరములు వినిపించుచుండును. కర్మసిద్ధియందు హర్షము, అసిద్ధియందు క్షోభయు గన్పట్టదు. ఇదే నైష్కర్మ్యసిద్ధి.

ఇత్యైశ్వర్యబుద్ధియోగసంక్షేపః.

(4) ధర్మబుద్ధియోగము :—ప్రవృత్తిమూలకములగు జ్ఞానకర్మలు మన యంతర్జగన్నిర్మాణమునకు గారణములు. విజ్ఞానసిద్ధాంతము ననుసరించి మనము యోచించునదియు చూచునదియు మనము నిర్మాణము గావించినదే. సూర్యచంద్రులు, ఆకాశగ్రహనక్షత్ర పశు పక్షి క్రిమికీట మనుష్యాది జడ చేతనము లెల్లను మనము సృజించినవే. ప్రతివ్యక్తియు దాను నిర్మించిన పదార్థములనే తాను చూడనేర్చును, అట్లు చూచుచున్నది. కొందర కిది యెక్కుడిమాట, సూర్యాదులు మన రచనలోనివా? వట్టిదనుకొందురు - చూతము.

జగత్తు అంతర్జగత్తనియు బహిర్జగత్తనియు రెండువిధములు. ప్రతివ్యక్తిని అంతర్జగత్తు సర్వథాభిన్నము నియతమునై యును లు, ఉత్సవ బహిర్జగత్తందరకు నొకటే. జ్ఞానవ్యాప్తిపర్యంత మంతర్జ జ్ఞాసమా? దీనియందనేక పదార్థములున్నవి. ఈ విధముగ బ్రతివ్యక్తి జ్ఞ జగత్తును సర్వథా స్వతంత్రము, ఒక వ్యక్తియొక్క అంతర్జగ చుం త్తును మఱొకవ్యక్తికి జూడశక్యముకాదు. మీ మనసునందలి సంస్కారములు నాకును నా యందలి సంస్కారములు మీకును తెలియవుగదా! ఎవరి జ్ఞానధారాతలమునకు వచ్చిన వస్తువులను వారువారెరుంగనేర్తురు.

ఇట్లే: యీశ్వరుని జ్ఞానవ్యాప్తిగలంతవరకు నతని యంతర్జగత్తు. అదియే యీ విశ్వము, సూర్యచంద్రాదు లా జ్ఞానమండలములోనివి.

సరి : యికమనలో మన మొకరి యంతర్జగత్తు నొక
జాలనపు డీశ్వరుని జ్ఞానజగిత్తును, అందలి పదార్థములగు
రులను, ఎట్లు చూడగలము ? కనుక ఈ ప్రత్యక్ష విజ్ఞాన
నదేమన :—మనము నిర్మించుకొన్నదానినే మనము
న్నామనియే గదా ! ఇక : మన యంతర్జగత్తును బట్టి
మంతర్జగత్తును బహిర్జగత్తే, మరి, యన్యవ్యక్తుల
ను బహిర్జగత్తే.

హిర్జగదాధారమున మన యంతర్జగన్నిర్మాణము జరుగు
యు అదియే మనదృష్టికి విషయమనియు ననుమాట
మేకాని దీనిపై వైజ్ఞానికుల యభిప్రాయమిది: "ఈశ్వ
జగత్తునందలి సూర్యుడు పృథివికంటె పదమూడువేల
పెద్దవాడుగదా ! అంత పెద్దసూర్యుని మన మెన్నడైన
మా ? అసంభవము,- అయినచో ఈశ్వరనిర్మిత సూర్యుని
చుచున్నామను అభిమానము (గర్వము) మన కెందుకు ?
క్కన యీశ్వరనిర్మిత పదార్థ విషయము నింతేయని యెరుగ
వలయును. ఇక వాస్తవ మేమన :—సూర్యప్రతిబింబ భావ
ముతో చక్షుఃపటలమునకు సంబంధము కలదు. కన్ను గ్రహించు
సూర్యప్రతిబింబ మా పెద్దసూర్యునికంటె సర్వథా అపూర్వ
తత్త్వము. ఈ యాకారజనకము కేవలము కన్ను. దానిద్వారా
ప్రతిబింబితుడగు సూర్యునకు ప్రజ్ఞాన మనస్సుతో సంబంధము.
కంటిచే నిర్మితుడై ప్రజ్ఞానమనస్సున కెక్కిన యీతడే సాంస్కా
రిక సూర్యుడు; సంస్కారజనకులము మనము. కనుక సాంస్కా
రిక సూర్యజనకులము మనమే. అతనినే మనము చూచు

చున్నాము. ఏ వస్తువునకు సంస్కార రూపమున నంతఃపటల
గూర్చి యాగతిలేదో, అనగా: మన మనస్సే వస్తువును
చదో దాని జ్ఞానము మనకుండదు. దానిని మనము
జాలము. ఇందువలననే 'తనచావు జగత్ప్రళయము
వదంతి యేర్పడినది"

ఈ సాంస్కారిక జగత్తు జ్ఞాన కర్మభేదమున
ములు. మనము కర్మచేయక యూరక కూర్చుం
నూతన కల్పనలం గావించుచుందుము. ఇవి వ్యర్థ
వీని సంస్కారము మనస్సుపై నంకితమగును. దీనినే
సంస్కారమని యందురు. శాస్త్రములందు దీనిని
యనిరి. కర్మజేయుటచే గూడ నిసుకపై బాదముంచిన
మేర్పడునట్లు సంస్కారమేర్పడును. దీనిని వాసన య
ఈ భావనా వాసనా సంస్కారపుంజమే మన యంతర్జగ
ఈ సంస్కారముల కాధారభూమి బాహ్యజగత్పదార్థములను
కేమియు బాధలేదు. ఎట్లన: మన జ్ఞానజగత్తున నొక యిల్లు
తోట మొదలగు పదార్థములను సృజించి పిమ్మట నాప్రకార
ముగనే ఈశ్వరీయములగు బహిర్జగత్పదార్థముల యాధారమున
నాయాపదార్థములను మనము జ్ఞానమున నిర్మించుకొన్న పదా
ర్థములతో పోల్చి హెచ్చుతగ్గులకు సహింపక సరిగా సృష్టి
గావించుకొనుచున్నాము. ప్రాకృతికములుగాని యిట్టిపదార్థము
లన్నిటియందును జీవేశ్వరుల యుభయశిల్పసమన్వయ ముండును.
ఇట్టి ద్వైతభావన పేరే యభినివేశము.

ది చేసితిమి - అది చేయవలయును - ఇదినాది. అది
నా - ఇది నాయిల్లు ఇత్యాద్యావేశము లన్నియు నభిని
నాహరణములు.

ఈశ్వరీయ జగత్తున కెదుట మనమెంత? మన
ది? ఏ మనోబుద్ధీంద్రియముల బలమున
యంతర్జగ నిర్మాణము గావించుచున్నామో
(సాధనము) లన్నియు ఈశ్వరీయ సూర్యచం
ద్ర భాస్వరసోమ దిక్సోమముల ప్రత్యంశలై
నమనుకొను శరీరములు, మనవారనుకొను పుత్రా
ములు శుక్రశోణితముల మూలభూతములగు నీశ్వ
వనస్పతుల-లేదా పార్థివప్రత్యంశ మాత్రములేగదా!
సంస్థయందలి ప్రతి పరమాణువును ఈశ్వరవిభూతియే
మరేమి? ఇక మనమెంత? మన యంతర్జగత్తు, సంస్కార
లు ఏపాటివి? ఈయభినివేశమున కేమైన విలువగలదా?

ఇదే యభినివేశము మనల నీశ్వరభిన్నులను గావించి
"వసుధైవకుటుంబకమ్." అను నతని విభూతిలేకుండ జేసివైచి
నది. దీనికి స్వరూపమునిచ్చు సంస్కారములకు తల్లి ప్రవృత్తి.
"వాడు వేరు, నేను వేరుగానున్న బాగుండును. ఇది నాకు
న్నచో మంచిది." ఇత్యాదు లీప్రవృత్తికి ఉదాహరణములు.
ఇదే బంధనమూలము. ఇక దీనికి విపరీతభావము నివృత్తి. అనా
వేశము-దీనితో కర్మ చేసినను సంస్కారోదయముకాదు. దీని

కెన్నో దృష్టాంతము లీయవచ్చును. మనమెన్నో చ... ము. విందుము చేయుదుము కాని, సంస్కారము మా... కంటదు. న్యాయాధీశులు, న్యాయవాదులు, ఎం... పూర్వకముగాగూడ నెన్నియో తీర్పులు చే... యోగములను విచారింతురు. కాని త త్త్వసంస్... కంటవుకదా! కర్మ ప్రధానముకాదు. ఉద్దేశ్య... స్పష్టమగుచున్నది.

ఇంతకు మూలరహస్య ముద్దేశ్యము. ... సంస్కారము. ఇదే బంధకారణమని యెరింగియు; ... యుందుము-ఏమి నష్టము?" "మీధర్మపన్నములు ... లేదు." అని ప్రవర్తించుటయే అభినివేశమని స్పష్... మహాభయావహమని శాస్త్రము చెప్పును. "నతుప్ర... మూర్ఖజనచిత్తమారాధయేత్త" ని భర్తృహరి యిట్టివారి... పదశ్లోకములు సమర్పించుకొనెను. ఈయభినివేశ చిక... యసంభవమనియే సాధారణముగ జెప్పుదురు.

కాని, గీతాశాస్త్రము ధర్మబుద్ధియోగముద్వారా దీనికి చికిత్స సూచించి సర్వశాస్త్రమూర్ధన్య మనిపించుకొనెను. ఈశ్వరీయప్రాకృతిక నియమసంఘమే ధర్మము. అనగా ప్రాకృతికకర్మ పేరే ధర్మము. దీనికి విరుద్ధముగ నడచుట యధర్మము. అధర్మసంస్కార మభినివేశజనని. "మన మీశ్వరాంశలము, ఈశ్వరరూపులము, మనకై యేమియు జేయము. అంతయు

నతడే చేయుచున్నాడు. చేయించుచున్నాడు." అనుటయే ధర్మము. 'మనంతవారము మనమే' యను నహంకృతి యధర్మము. మొదటిదానివలన నివృత్తి యుదయించును. రెండవదానివలన ప్రవృత్తి యుదయించును. అందు సంస్కారాభావము. ఇందు సంస్కారబంధము. అట్టి యాధర్మోదయ మెట్లు? ఎప్పుడుదయించునను ప్రశ్నలకు సమాధానమే ధర్మవిద్య-ఆర్షవిద్య యందురు. దీని మౌలికరహస్యము నివృత్తికర్మ. అదే ప్రాకృతికము, సహజము-ధర్మమునై యున్నది. ద్వంద్వములందు బుద్ధిప్రసన్నత-స్వాభావిక సాత్త్విక కర్మప్రవృత్తి. ఏతద్యోగసిద్ధి సూచక...ము.

...ట శంక:—"సంస్కారజనకములగు కర్మలను త్యజించి ...ముగాదా?" ఈయాధారముననే ప్రాచీనులు సర్వకర్మ...గలక్షణ సన్న్యాసము పాదేయమనుకొనిరి. ఈ ప్రశ్నను ...చ్ఛేదము గావించుచు భగవంతు డిట్లనుచున్నాడు.

"నకర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
నచసన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి."

ఇట్లనుటకు హేతువు స్పష్టమే, ఎట్లన:-ఆత్మకు జ్ఞానమువలె గర్మయు స్వరూపధర్మమే కనుక కర్మ విడచుట యాత్మ నాశనము సేయుటయే యగును. మంచిది: ఆత్మకు నాశముగలదా? అదియవినాశి, అనుచ్ఛిత్తిధర్మ గదా, అనగా జీవరకు దీనివలు జ్ఞానకర్మలు రెండు నవినాశులనియే

గదా! జ్ఞాన మాత్మకు వేరుగానట్లే కర్మయు వేరుగాదు. ఇక "మేమంతయు విడచితిమి. మాకు గర్మతో సంబంధములేదు. మేము వీతరాగులము సన్యాసుల" మనుచు గొందఱు ప్రజలను మోసగించుట మహాపాతకముకాదా? వారి యింద్రియములు పనిసేయుటలేదా, వారు తినరా? వారు కర్మవిడుచుటననేమి? వాఙ్మాత్రమేనా? మానసపాపము మరింత భయావహాముకదా? ఈభగవద్వచనముం జూడుడు.

కర్మేంద్రియాణి సంయమ్య యఆస్తే మనసాస్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్సఉచ్యతే.

పేరునకు సన్యాసులు, కర్మలందు గృహస్థు[illegible] మించుచున్నారు. వాహనములు, సేవకులు, ఊరేగింపు[illegible] ములు, శరీరమున బూదిపూత-తలబోడి ఇదియే సన[illegible] దీనినుండియేనా ముక్తినాశించుట? అజ్ఞానము! భ్రమ!

కర్మ విడువ నలవిగాదు. విడువదు. కనుక జేయ[illegible] డియు సంస్కారమంటని మార్గము జూచుకొనవలయును[illegible] ఈశ్రుతిం జూడుడు.

కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేచ్ఛతంసమాః
ఏవం త్వయినాన్యథేతోస్తిన కర్మలిప్యతేనరే భగవంతుడును,
"యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః సవిశిష్యతే.

మన్వాదులు "ప్రవృత్తంచనివృత్తంచ ద్వివిధం కర్మవైదికమ్." ఇత్యాదిగా కర్మ రెండుగా భాగించిరి. ఇందు

ప్రవృత్తి కర్మ సంస్కారముద్వారా యభినివేశజనకమై యున్నది. ఆప్రవృత్తి వదలినచో కర్మ నివృత్తికర్మయై ఇంగువ గింజల గంధమువలె సాంస్కారికమలనాశము గావించి తాను గూడ లీనమగును. ఈకర్మల విషయమున గుణత్రయపరీక్షా పూర్వకముగ భగవంతుడెంతయో విచారణ గావించి యున్నాడు. ఆపరీక్ష కర్మవివేకమున కెంతయో యవసరము.

ఇది ధర్మబుద్ధియోగము.

## గీతాప్రతిపాదిత విద్యా-యోగ-పరిశిష్టవిచారణ

ఇంతవరకు గావించిన విచారణ సారాంశమిది :-గీతా ప్రతిపాదితబుద్ధియోగము వైరాగ్య - జ్ఞాన - ఐశ్వర్య - ధర్మభేదమున నాల్గుభాగములు. ఈనాల్గుయోగముల ప్రాప్త్యుపాయములం జెప్పు విద్యలు నాలుగు : (1) వైరాగ్యవిద్య - యిదే రాజర్షి విద్య. దీని యభ్యాసమున బుద్ధినుండి రాగద్వేషములా లాసక్తి నివృత్తిగొందగా వైరాగ్యబుద్ధియోగోదయమగును. (2) జ్ఞానవిద్య - ఇదే సిద్ధవిద్య - దీని పరిజ్ఞానమువలన బుద్ధి నుండి యవిద్యామూలకమోహము నివృత్తిగొందగా, జ్ఞాన బుద్ధియోగోదయమగును. (3) ఐశ్వర్యవిద్య - ఇదే రాజవిద్య దీని యనన్యతవలన నస్మితామూలకా నైశ్వర్యము బుద్ధినుండి

నివృత్తినొందగా, ఐశ్వర్యబుద్ధియోగోదయమగును. (4) ధర్మ విద్య-ఇదే యార్ష విద్య. దీని యాచరణవలన అభినివేశమూలకా ధర్మము బుద్ధినుండి తొలగగా ధర్మబుద్ధియోగోదయమగును.

ఈనాల్గు విద్యలకు క్రమముగ 1 అనాసక్తి, 2 అంతర్జ్యోతి, 3 ఈశ్వరానన్యత, 4 నివృత్తికర్మ అను నీనాల్గు రహస్యములుగా జెప్పబడినవి. అనగా నిష్కర్షలు: (ఉపనిషత్తులు) ఈనాల్గింటియందు నేయొక్కటి యనుష్ఠించి సఫలతగాంచినను, శారీరకాత్మ (జీవాత్మ) దేహస్థితప్రత్యగాత్మ (అవ్యయాత్మ)తో (సహజసిద్ధబుద్ధియోగముద్వారా) యుక్తమై అవ్యయుని భగ సంపత్తినొందును. ఆస్థితిలో జీవుడు భగవంతుడగును. ఇక నీనాల్గింటి యనుష్ఠానము నున్నచో అదియు జన్మాదినుండియు నున్నచో వేరే చెప్పవలసినదిలేదు. దేవయుగము మొదలు నేటివరకు శ్రేయము కేవలము మన చరిత్రనాయకుడు, గీతోప దేష్ట శ్రీకృష్ణునకే లభించెను. కనుకనే యాయన యీనాల్గు విద్యలకును, నాల్గు యోగములకును ద్రష్టయనబడుచున్నాడు. అప్పటినుండియు వాని యీరహస్యోపనిషత్తు భగవద్గీతోపని షన్నామమున ప్రసిద్ధిగాంచినది.

గీతోపదేశము మహాభారతకాలమందైనదని యందరెరిగినదే కాని గీతోపదిష్టార్థమంతయు సర్వథా అపూర్వము గాదు. అంతకెంతయో పూర్వము దేవయుగమున నీగీతార్థమంతయు విద్యమానమై యుండెను. భగవంతుడు గీతయందాయో

గములను, విద్యల, నొకచో సంశోధన పూర్వకముగ సమన్వ యము మాత్రము గావించెను. ఇది యొక అపూర్వవిషయము మాత్ర మగును. కనుకనే గీత యన్నిశాస్త్రములకు మించిన దంటిమి. ఇక నొక చిన్నవిషయము మిగిలియున్నది. ఏమన :- ఈవిద్యల కీపేరులు రా గారణమేమి? దీని నిందు విమర్శించు కొందము.

## 1. రాజర్షి విద్య (వైరాగ్యబుద్ధియోగ ప్రవర్తిక)

ఇయ్యది యుపనిషదత్త్వవేత్తలగు రాజర్షులయందు మిక్కిలి వాడుకయందుండెను. గీతాకాలమీమాంసయందు మీమాంసితమైన దేవయుగమున నవ్యయుని ద్వారా ఈవిద్య యావిష్కారము గావింపబడెను. ఇతిహాసప్రసిద్ధుడగు వివస్వం తుడు స్వర్గీయదేవత. కృష్ణుడు (శరీరాంతరమున) సర్వప్రథము మున నీయనకీవిద్య యుపదేశించెను. ("ఇమం వివస్వతేయోగం" ఇత్యాది) వివస్వంతుడు సూర్యవంశప్రవర్తకుడగు రాజైనను ఈ విద్యాప్రభావమున ఋషియయ్యెను. ఆత్మ సాక్షాత్కార మందెను. సాక్షాత్కార ఋషియందురు గదా: కనుక నితడు రాజర్షియందురు. ఇతడీవిద్యకు బ్రవర్తకుడయ్యెను. ఈవిద్య ననుగమించి మనువు, ఇక్ష్వాకువు, జనకుడు మొదలగువారు రాజర్షులైరి. ఇట్లు పరంపరగా రాజర్షులందే యీవిద్య ప్రచా రముననుండుటచే నిది రాజర్షివిద్యయని పేరొందెను. వారే దీని విశేషము నెరింగినవారు. భగవంతుడును "ఏవం పరం పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః" అనియెనుగదా!

ఇదియే యోగనామప్రసిద్ధము. భగవద్గీతయందలి యోగశబ్దమున కీవిద్యయే యర్థము. కానిందు రాజర్షిసంబంధమున నిది రాజర్షివిద్య. యోగశాస్త్రపరిభాష ననుసరించి యిదే బుద్ధియోగము లేదా యోగమని వ్యవహారము గాంచెను. పూర్వప్రచలిత-జ్ఞాన-కర్మ భక్తి యోగవిలక్షణమగుటచే నిది కేవలము యోగమనియే పేర్కొందెను. కనుకనే గీత యోగశాస్త్రము.

## 2. సిద్ధవిద్య (జ్ఞానబుద్ధియోగప్రవర్తిక)

స్వాయంభూమనూద్భావిత దేవయుగమున దేవత్రిలోకి 1 పృథివి, 2 అంతరిక్షము, 3 ద్యులోకమని మూడువిధములు. ఆనాటి మానవసమాజమును స్వాయంభూబ్రహ్మ పంచకృష్టి-పంచక్షితి-పంచచర్షణీ-పంచజన-ఇత్యాద్యనేకభాగములుగ శ్రేణిబద్ధము గావించెను. ఇందు :-1 ఋషి, 2 పితృ, 3 దేవ, 4 అసుర, 5 మనుష్య సమష్టి పంచకృష్టి. ఈయైదుగురికి క్రమముగ 1 స్వాయంభూ, 2 యమ, 3 ఇంద్ర, 4 వృషాకపి, 5 వైవస్వతమనువు - అనువారధ్యక్షులు. కృషి వీరి జీవికకు ప్రధానముగ నుండెను గనుక నీసమష్టిని పంచకృష్టి యనిరి. మరియు: 1 గ్రామణి, 2 రాజు, 3 సమ్రాట్టు. 4 స్వరాట్టు. 5 విరాట్టు అను నీసమష్టి పంచక్షితి యందురు. క్షితి కధిపతులుగనుక వీరికి పంచక్షితియని పేరు. 1 నేటి సాధారణ జమీందారువంటి వాడానాడు గ్రామణి. 2 రాజులకు, భోజ-

మహారాజ అని రెండు తరగతులు. 3 సమ్రాట్టులకు, చక్రవర్తి-సార్వభౌమ అని రెండు తరగతులు. 4 స్వరాట్టులకు, ఇంద్ర-మహేంద్రయని రెండు తరగతులు. 5 విరాట్టులకు బ్రహ్మ-విష్ణు అని రెండు తరగతులు. ఇంకను: 1 బ్రహ్మ, 2 ఋషి, 3 దేవ, 4 బ్రాహ్మణ, 5 విప్ర అని నీయైదుగురి సమష్టియు పంచచర్షణి, (చర్షణి-మనుష్యుడు) జ్ఞానవికాసమున్నవాడు మనుష్యుడనబడును. జ్ఞానమున కాశ్రయభూమి బ్రాహ్మణుడు. అతనికే యీపంచభేదములు 1 జన్మతః బ్రాహ్మణుడు విప్రుడు. 2 శాస్త్రజ్ఞుడగు బ్రాహ్మణుడు-బ్రాహ్మణుడు. 3 శాస్త్రజ్ఞానపూర్వక కర్మాచరణముగల బ్రాహ్మణుడు దేవత (భూదేవుడు) 4 ప్రాకృతికతత్త్వపరీక్షకుడగు బ్రాహ్మణుడు ఋషి. 5 సర్వరహస్యముల నెరింగిన సర్వజ్ఞుడు బ్రహ్మ. ఇట్లు విద్యాతారతమ్యమున చర్షణి యైదుభాగములు. ఇక:-పురు, యదు, తుర్వసు, అను, ద్రుహ్యులను పంచభాగసమష్టి పంచజననామ ప్రసిద్ధము.

పై జెప్పిన విభాగములందు మొదటిదగు పంచసృష్టియందలి మూడవభాగమగు దేవతలందు దేవయుగమున, దేవతలు - దేవయోనులునని రెండు తరగతులు కలవు. స్వర్గమందుండువారు దేవతలనియు, శర్యణావత పర్వతము మొదలుకొని హిమాలయ పర్యంతము సంచరించుచు హిమాలయ ద్రోణులందు నివాసము గాంచుజాతి దేవయోనులనియు ప్రసిద్ధ

మైనది. ఇదే దేవయుగమందంతరిక్షలోకము. అందుండు దేవ యోనులు :

"విద్యాధరో,ప్సరో, యక్ష, రక్షో, గంధర్వ, కిన్నరాః,
పిశాచో, గుహ్యక, స్సిద్ధో, భూతోఽ, మీదేవయోనయః" అందురు.

భారతవర్షమందలి మానవ ప్రజలకును, స్వర్గమందలి దేవప్రజకు నీమధ్యస్థ దేవయోనులద్వారా పరస్పర వ్యావహారిక కార్యసంచాలనము సాగుచుండెడిది. ఇందు - సిద్ధజాతిలో సాంఖ్యదర్శనకర్త కపిలుడుదయించెను. ఈ సిద్ధశబ్దము జాతి వాచకమని యెరుంగవలయును. బ్రాహ్మణజాతి యందు మూర్ఖులు విద్వాంసులు నున్నట్లే యిందును మూర్ఖులు విద్వాంసులు గలరు.—ఈ కపిలుడు కర్మవాదముతో విరోధించి శుద్ధ జ్ఞానయోగ స్థాపన గావించెను. అతని కెందరో అనుయాయులైన వారు గూడ కపిలనామమునే పొందగా మొదట వ్యక్తివాచక మయ్యెను బిమ్మట కపిలశబ్దము జాతివాచకమైపోయినది. మొదటి కపిలుడు సిద్ధులలోనివాడు కనుక నీవిద్యకు సిద్ధవిద్య యని పేరువచ్చెను. మహాభారత శాంతిపర్వమున 300 - 305 అధ్యాయములందీ మతవిస్తరమున్నది.

ఇట్లు : మహాభారత కాలీన గీతోపదేశ కాలమున కెంతో పూర్వము దేవయుగ కాలమందలి రాజర్షి విద్యానంతరము అంతరిక్షస్థసిద్ధజాతి నలంకరించిన మహాముని కపిలుడు. సర్వకర్మ సన్న్యాసలక్షణముగల జ్ఞాననిష్ఠ- (సాంఖ్యనిష్ఠ) నవత

రింపజేసెను. ఇదే జ్ఞానయోగము.- రాజర్షి విద్య స్వర్గీయవిద్య- ఇది అంతరిక్ష్యవిద్య-* నిషదపర్వతో త్తరమున నంతరిక్ష లోక సీమను, స్వర్గభూమి కతిసమీపమున కపిలాశ్రమ ముండెను. అతని కృపవలననే సుప్రసిద్ధ భాగీరథి స్వర్గమునుండి భూమి కవతరించవలసిన ఘోరకాండ యచ్చట జరిగెను.

### 3. రాజవిద్య (ఐశ్వర్యబుద్ధియోగప్రవర్తిక)

అంతరిక్షమునకు బిమ్మట భారతవర్షమువంతు వచ్చినది. దేవయుగమునందు భారతవర్షమే పృథ్వీలోక మనబడినది. పురాణములందు దౌష్యంతి భరతునివలన నీ దేశము భారతవర్షమని పేరొందెనందురు గాని వస్తుతః అగ్నిసంబంధమువల్లనే యీ దేశము భారతవర్షమనుట న్యాయమని తోచును. దేవేంద్రుని పంపున భారతవర్షమున కగ్ని శవహోనపాత్రుగా జేయబడెనుగదా! ఈ యగ్ని భారతవర్ష భరణపోషణాధికారియగుటచే భారత నామ ప్రసిద్ధిగాంచినట్లు “అగ్నే మహాఁనసి బ్రాహ్మణ భారతేత్ర” ఇత్యాది మంత్ర వర్ణములచే స్పష్టము. భారతీయులను రక్షించుటయు - వారినుండి హవ్యనొని స్వర్గదేవతలకు బంపుటయు

---

* అసురుల దండయాత్రలకు భయమంది మహారాజు కుత్స డింద్రునికడకు “అసురులు దేవభూమి జలప్లావిత గావించి జలమందు విషముగల్పిరి. వెంటనే దయచేయువలయు”నని వార్తనంపగా నింద్రుడు ‘హర్యశ్వ’ నామకమగు విమానమున మూడు దినములలోపలనే కుత్సునికడకు వచ్చి మొదట నేపర్వతమున విశ్రమించెనో అది “యత్రన్యషీదత్-ఇంద్రః” అను నిర్వచనము చొప్పున నిషధమని ప్రసిద్ధినొందెను. అదే నేడు నిషధయనుచున్నారు.

ఋగ్వే. 1 మం. 140 సూక్తముం జూడుడు.

నితని ముఖ్యకార్యములు. "ఏషహి దేవేభ్యోహవ్యంభరతి" అను వచన మీ విషయము జెప్పును.-

భారతవర్షమునందు మనువుచే వర్ణాశ్రమ వ్యవస్థ గావింపబడెను. అందు, క్షత్రియశ్రేష్ఠులకు పాలనాధికారమీయ బడెను. వీరికి ప్రధానశాస్త్ర స్వయముగనై వస్వతమనువే. అనగా నతడే భారతవర్షసమ్రాట్టు. దేవేంద్రుడు స్వరాట్టు, బ్రహ్మ విష్ణులు విరాట్టులు. నాటి రాజుల ప్రధానప్రవృత్తి యీశ్వరో పాసన. కాశీరాజు ప్రతర్దనుడు, మహారాజు కేకయుడు, మొద లగువారు ప్రసిద్ధోపాసకులు. "కర్మలెల్లనీశ్వరబుద్ధితో జేయ వలయును" నని వారి సిద్ధాంతము కనుక నీ భక్తియోగమనును పాసనాయోగమున జ్ఞాన-కర్మల రెంటి సమన్వయముం గలదు. ఈ యుపాసనద్వారా ఈశ్వరునుండియు తదంశభూతులగు దేవీ - దేవతలనుండియు ఫలాకాంక్ష సేయబడుచుండెడిది. ఇందువలన వారైశ్వర్యయుక్తులగుచుండిరి. నేటికిని గీతామార్గ విరోధి యగు నీ పరిపాటి యంతరింపలేదు.-రాజులందు ప్రచారముగల దగుటచే రాజవిద్య యనియు, నైశ్వర్యదాయకమగుటచే నైశ్వ ర్యవిద్యయనియు; యోగశాస్త్ర మర్యాద ననుసరించి భక్తియోగ మనియు నిది పేరొందెను.

## 4. ఆర్షవిద్య (ధర్మబుద్ధియోగ ప్రవర్తిక)

భారతవర్షమందు రాజులేకాక బ్రాహ్మణ సమాజము కూడ నొక ప్రతిష్ఠితవర్గముగ నుండెను. వారి దృష్టియందు, జ్ఞాన

యోగ, భక్తియోగములకు విలువలేదు. కర్మవాదమునే ప్రధానముగా గొని వారు యజ్ఞతపోదానలక్షణముగలదియు, త్రిగుణభావాపన్నమునగు వైదికకర్మానుష్ఠానము పరమపురుషార్థమనిరి. వీరి మతమున గర్మమే యీశ్వరుడు. కర్మబలమున వీరు స్వర్గాదిఫలములచే జనసమూహమును మోహింపజేసిరి. "యజ్ఞోవై శ్రేష్ఠతమంకర్మ" "జ్యోతిష్టోమేనస్వర్గకామోయజేత" ఇత్యాదులు వీరి ప్రధానలక్ష్యములు.

వర్ణాశ్రమానుసారమగు నియతకర్మయే ధర్మము. దీని యనుష్ఠానమువలననే సర్వము లభించును అని వీరి సిద్ధాంతము. ఇది ఋషులయందు విశేషప్రచారము గలదగుటచే ఆర్షవిద్యయనియు, ధర్మప్రధానమగుటచే ధర్మవిద్యయనియు, యోగశాస్త్రమర్యాద ననుసరించి కర్మయోగమనియు బేరొందెను.

## భగవద్విద్య (జ్యేష్ఠ-శ్రేష్ఠ)

ఈవిధముగ గీతాశాస్త్రమునకు జాలపూర్వమే దేవయుగకాలమునుండియు నీవిద్యల ప్రచారము సాగుచుండెను. గీత యపూర్వము జెప్పకున్నను, చిరకాలప్రచలిత విద్యాపరిష్కారమును మాత్రము గావించెను. ఇందువలన గీత యపూర్వమనవచ్చును. ఈనాల్గు విద్యలందును మొదటిదగు వైరాగ్యవిద్య గొప్పదియు, శ్రేష్ఠమైనదియు నైయున్నది. అదియే

గీతాహృదయ మగుటచే నదిలేనినాడు గీత నిరర్థకమై పోవును. ఆవిషయ మిప్పటి భాష్యములవలన స్పష్టమే. మిగిలిన మూడు యోగములును, చిరకాలమునుండి సాగుచు తత్తదను యాయులయందు మాది శ్రేష్ఠము—మాది మంచిదను తీవ్ర స్పర్ధలకు గారణములై యుండుటయు ననుభవసిద్ధమేకదా !

శ్రీశంకరవిద్యారణ్యాదులు కర్మత్యాగలక్షణ సన్యాస మును శ్రేష్ఠముగ జెప్పిరి. కుమారిలభట్టు - మండనుడు మొద లగువారు ప్రవృత్తిమూలక కర్మయోగమే యారాధ్యముగ నెంచిరి. రామానుజ - వల్లభ - నింబార్క - మధ్వాది సాంప్ర దాయికాచార్యులు భక్తియోగగుణాను వాదము గావించిరి. నిత్యనియతియుక్తుడగు నీశ్వరుడు ఈ భక్తకోటిదృష్టిలో అనంత కల్యాణ గుణాకరుడు, పరమనిర్వ్యాజదయాళువు. వీరి యీ యీశ్వరుడు క్షణములో ఫూత్కారమాత్రమున పాపములం గడిగివేయును. ఇట్లు దేవయుగకాలీన వైరాగ్యవిభూతి విస్మృతి నొంది దౌర్భాగ్య భారతవర్షము ఏతన్నియంత్రణాత్రితయ నియంత్రితమైపోయినది.

ఈ మూడు తెగలవారును తమతమ మతప్రమాణముల కొరకు ప్రస్థానత్రయము నాశ్రయించి స్వాభి మతప్రకారముగ వ్యాఖ్యలను వెలయించిరి. వీనివలన నుపకారాపకారముల మాట యెట్లున్నను, ఈ విరుద్ధార్థముల వలన జనసామాన్యము లక్ష్యచ్యుతమైపోయినదను నొక విషయము నిశ్చితమైనది.

శ్రీ శాంకరభాష్యముం జూడుడు. అందు భక్తి-కర్మలు గౌణములు. అంతటను జ్ఞానమే సామ్రాజ్యము సేయుచుండును. సాంప్రదాయిక భాష్యములు జూడుడు. జ్ఞాన-కర్మలు, భక్తికి సహాయమాత్రములని వచించును. కర్మయోగభాష్యము గీతాశాస్త్రమంతయు "యజ్ఞోదానంతపశ్చైవ నత్యాజ్యం కార్యమేవతత్" ఇత్యాదిగా కర్మనే చెప్పుననును. ఇక:—సాధారణులకు గీతయందున్ననో యన్నివిధముల వాక్యములును లభించును. స్వయముగా గీతయు నీమాటని బ్రతిపాదింపుచు మనలను వ్యామోహపరచుచున్నది. మనలెక్కయేమి? అర్జును నంతవాడే వ్యామోహితుడయ్యెను.

"జ్యాయసీచేత్కర్మణస్తే మతాబుద్ధిర్జనార్దన
తత్కింకర్మణి ఘోరేమాం నియోజయసికేశవ।"
"వ్యామిశ్రేణైవవాక్యేన బుద్ధిం మోహసీవమే
తదేకంవదనిశ్చిత్య యేన శ్రేయోహమాప్నుయాం"
"సంన్యాసం కర్మణాంకృష్ణపునర్యోగంచశంససి
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మేబ్రూహిసునిశ్చితమ్"

నేడు మనము కూడ కొన్ని వచనముల నట్టివాని నేర్చి చూతము. సామాన్యులీవచనములం జూచి యేదియు నిశ్చయించుకొనలేని స్థితిలో బడుదురు. వీనివలన గీత యేమిచెప్పునను ప్రశ్నకు సమాధానము దేలదు. మొదట ప్రాచీనమతానుసారము మూడు యోగములను సమర్థించు వచనములం జూడుడు:

## 1. జ్ఞాన యోగము

1. త్రైగుణ్యవిషయావేదా నిస్త్రైగుణ్యోభవార్జున :
నిర్ద్వంద్వోనిత్యసత్వస్థోనిర్యోగక్షేమఆత్మవాన్.

2. ప్రజహాతియదాకామాన్ సర్వాన్‌పార్థ। మనోగతాన్
ఆత్మన్యేవాత్మనాతుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే.

3. యస్త్వాత్మరతిరేవస్యాదాత్మతృప్తశ్చమానవః
ఆత్మన్యేవచసంతుష్టః తస్యకార్యం నవిద్యతే.

4. వీతరాగ భయ క్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞాన తపసా పూతా మద్భావమాగతాః.

5. బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం – బ్రహ్మ కర్మ సమాధినా.

6. సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణ కర్మాణి చా పరే
ఆత్మ సంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞాన దీపితే.

7. శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థ। జ్ఞానే పరి సమాప్యతే.

8. అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞాన ప్లవేనైవ వృజినం సంతరిష్యసి.

9. యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్కురుతేర్జున :
జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మ సా త్కురుతే తథా।.

10. నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగ సంసిద్ధః కాలే నాత్మని విందతి।.

11. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిం అచిరేణాధి గచ్ఛతి.

12. యోగ సన్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయః.

13. తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత.

14. సర్వకర్మాణి మనసా సన్యస్యాస్తే సుఖం వశీ
నవ ద్వారే పురే దేహీ నైవ కుర్వన్ నకారయన్.

15. నాదత్తే కస్య చిత్పాపం నచైవ సుకృతం విభుః
అజ్ఞానే నావృతం జ్ఞానం, తేన ముహ్యన్తి జంతవః.

16. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.

17. తద్బుద్ధయ స్తదాత్మానః తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛన్త్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూత కల్మషాః.

18. భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వ భూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.

19. ఉదారా స్సర్వఏ వైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్
ఆస్థితః సహి యుక్తాత్మా మా మేవా నుత్తమాం గతిమ్.

20. బహూనాం జన్మనామం తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవః సర్వమితి సమహాత్మా సు దుర్లభః.

21. తేషా మేవానుకం పార్థ మహ మజ్ఞానజం తమః
నాశయామ్యాత్మ భావస్థః జ్ఞానదీపేన భాస్వతా.

22. ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సా ధర్మ్య మాగతాః
సర్గేఽపి నోప జాయన్తే ప్రళయే న వ్యథన్తి చ.

23. ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యతరం మయా
విమృశ్యైతద శేషేణ యథేచ్ఛసి తథా కురు.

24. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సవాద మావయోః
జ్ఞాన యజ్ఞేన తే నాహ మిష్టస్యామి మే మతిః.

ఇత్యాది వచనములవలన భగవంతు డాద్యంతములందు సంపూర్ణముగా సర్వకర్మ పరిత్యాగలక్షణ జ్ఞానయోగమునే ముక్తికి సాధనముగా గీతయందు చూపినట్లు తేలును. మరియు: "అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చభాషసే" అని యుప క్రమించుటవలన గూడ నీవిషయమే స్థిరపడును. ఎట్లన :—జ్ఞాన లోపము వలన నసగా అజ్ఞాన జనితమోహామువలన వివేక నాశముకాగా కర్తవ్యాకర్తవ్య జ్ఞానముండదుగదా, ఈ యవి ద్యామోహా నివృత్తికి జ్ఞానమవసరము. కనుక నది యుద్దేశ్య ముగా నుంచుకొని సాధనరూపమున గౌణముగా కర్మ-భక్తి ప్రతిపాదన గావించి చివర కర్జునముఖమున "నష్టోమోహాః స్మృతిర్లబ్ధాత్వత్ప్రసాదాన్మయాచ్యుత" అనిపించి గీతోద్దేశ్య మును సఫలపరచుకొన్నాడు గదా! కనుగ గీత జ్ఞానప్రతిపాదక మనుటయే సిద్ధమగును.

## 2. భక్తి యోగము

1. సర్వభూతస్థితం యోమాం భజత్యేకత్వమాస్థితః
సర్వథావర్తమానోపి సయోగీమయివర్తతే. 6-31

2. తపస్విభ్యోఽధికోయోగీ జ్ఞానిభ్యోఽపిమతోధికః
కర్మిభ్యశ్చాధికోయోగీ తస్మాద్యోగీ భవార్జున. 6-46
3. యోగినామపిసర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్భజతేయోమాం సమేయుక్తతమోమతః. 6.47

4. చతుర్విధాభజన్తేమాం జనాఃసుకృతినోఽర్జున
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచభరతర్షభ ! 7-16
5. తేషాంజ్ఞానీనిత్యయుక్తః ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహిజ్ఞానినోఽత్యర్థం అహం, సచమమప్రియః. 7-17

6. యోయోయాంయాం తనుంభక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవవిదధామ్యహం. 7-21

7. అంతవత్తుఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం
దేవాన్ దేవయజోయాంతి, మద్భక్తాయాంతి మామపి. 7-23

8. ప్రయాణకాలే మనసాచలేన భక్త్యాయుక్తోయోగబలేనచైవ
భ్రువోర్మధ్యేప్రాణమావేశ్యసమ్యక్ సతంపరంపురుషముపైతి
దివ్యమ్.

9. అనన్యచేతాస్సతతం, యోమాంస్మరతినిత్యశః
తస్యాహం సులభఃపార్థ ! నిత్యయుక్తస్యయోగినః

10. పురుషస్సపరః పార్థ! భక్త్యాలభ్యస్త్వనన్యయా
యస్యాంతస్థానిభూతాని యేనసర్వమిదంతతమ్

11. సతతం కీర్తయన్తోమాం, యతంతశ్చదృఢవ్రతాః
నమస్యంతశ్చమాంభక్త్యా నిత్యయుక్తాఉపాసతే

12. అనన్యాశ్చింతయన్తోమాం, యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమంవహామ్యహం.

13. యేప్యన్యదేవతాభక్తాః యజన్తేశ్రద్ధయాన్వితాః
తేఽపిమామేవకౌన్తేయ, యజన్త్యవిధిపూర్వకమ్.

14. పత్రం పుష్పం ఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతం అశ్నామిప్రయతాత్మనః.

15. అపిచేత్సుదురాచారో భజతేమా మనన్యభాక్
సాధురేవసమంతవ్యః, సమ్యగ్వ్యవసితోహిసః.

16. క్షిప్రంభవతిధర్మాత్మా శశ్వచ్ఛాంతింనిగచ్ఛతి
కౌన్తేయః ప్రతిజానీహి నమేభక్తః ప్రణశ్యతి.

17. మాంహిపార్థవ్యపాశ్రిత్యయేఽపిస్యుః పాపయోనయః
స్త్రియోవైశ్యాః తథాశూద్రాస్తేఽపియాన్తి పరాంగతిం.

18. మన్మనాభవమద్భక్తోమద్యాజీమాం నమస్కురు
మామేవైష్యసియుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః

19. అహంసర్వస్యప్రభవః మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతిమత్వాభజన్తేమాం, బుధాభావసమన్వితాః

20. భక్త్యాత్వనన్యయాశక్యః అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం, ద్రష్టుంచతత్త్వేన-ప్రవేష్టుంచపరంతపః

21. మయ్యావేశ్య మనో యేమాం నిత్య ఉక్తా ఉపాసతే
శ్రద్ధయా పరమోపేతాః తే మే యుక్త తమా మతాః,

22. యేతు సర్వాణి కర్మాణి మయి సన్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే.
23. తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరా త్పార్థః మయ్యావేశిత చేతసామ్.

24. సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢ నిశ్చయః
మయ్యర్పిత మనో బుద్ధిః యో మద్భక్తః సమే ప్రియః.

25. యేతు ధర్మ్యాఽమృత మిదం, యథోక్తం పర్యుపాసతే
శ్రద్ధధానా మత్పరమా, భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

25. మయి చా నన్య యోగేన భక్తిర వ్యభిచారిణీ
వివిక్త దేశ సేవిత్వం అరతిర్జన సంసది.

27. మాం చయోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

28. యో మామేవ మ సమ్మూఢః జానాతి పురుషోత్తమం
స సర్వ విద్భజతి మాం సర్వ భావేన భారత ।

29. బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరాం.

30. భక్త్యా మా మభి జానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం

31. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే.

32. సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ
అహంత్వాసర్వపాపేభ్యోమోక్షయిష్యామిమాశుచ.

33. యఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి
భక్తింమయి పరాంకృత్వామామేవైష్యత్యసంశయః.

ఈ వచనములవలన గీత అర్థమొకలు ఇతివరకును, భక్తిరసాప్లావితమాయనిపించును. ఒకచో తపస్విని - జ్ఞానిని - యోగిని మించినవాడు భక్తుడని యున్నది. జ్ఞాన కర్మ వైరాగ్యములు భక్తికి సాధనములు కావచ్చును. కాని లక్ష్యముభక్తియే. అది యుండుటచేతనే అర్జునుడు విరాడ్రూపము జూడగలిగెను.

అట్టిదాని నెట్టి తపస్వియు - జ్ఞానియు - యోగియు నెన్నడు జూడలేదు. చూడబోడు. భక్తి యింత గొప్పదియు శ్రేష్ఠము గనుకనే 'భక్త్యాత్వనన్యయా శక్యః' అని భగవంతుడుపసంహారమున నదియే సర్వశ్రేష్ఠముగ నంగీకరించెను.

## 3. కర్మయోగము

1. స్వధర్మమపిచావేక్ష్య నవికంపితుమర్హసి
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్యనవిద్యతే.

2. నకర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
నచసన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

3. నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్
కార్యతేహ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః

4. నియతంకురుకర్మత్వం - కర్మ జ్యాయోహ్యకర్మణః
శరీర యాత్రాపిచతే నప్రసిద్ధ్యేదకర్మణః.

5. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసంగః సమాచర.

6. కర్మణైవహిసంసిద్ధి మాస్థితాజనకాదయః
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తు మర్హసి.

7. నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవచకర్మణి.

8. ఏవంజ్ఞాత్వాకృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః.
కురుకర్మైవతస్మాత్త్వం పూర్వైః పూర్వతరంకృతం.

9. త్యాజ్యందోషవదిత్యేకే కర్మప్రాహుర్మనీషిణః
యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యమితి చాపరే.

10. యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం.

11. యతఃప్రవృత్తిర్భూతానాం. యేనసర్వమిదం తతం
స్వకర్మణాతమభ్యర్చ్యసిద్ధిం విందతిమానవః

12. శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషం.

13. సహజం కర్మకౌన్తేయ, సదోషమపినత్యజేత్
సర్వారంభాహిదోషేణ ధూమేనాగ్నిరివావృతాః.

14. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణోమద్వ్యపాశ్రయః
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయం.

15. స్వభావజేనకౌంతేయ నిబద్ధః స్వేనకర్మణా
కర్తుం నేచ్ఛసియన్మోహాత్ కరిష్యస్యవశోపితత్.

ఈ వచనములవలన గీత యావజ్జీవము, స్వవిహిత కర్మాచరణమున నుండవలయునే గాని కర్మ విడువగూడనిది విడువ శక్యము గానిదియునని యన్నట్లైనది. మరియు, గీతోపదేశ మెందుకు చేయవలసివచ్చినది? కులక్షయమునకు శంకించు నర్జుననిచే స్వధర్మోపదేశమున కర్మచేయించుటకా? భక్తుడనో, జ్ఞానివో అయి యుండమని చెప్పుటకా? కనుక కర్మయోగమే గీతోపదేశ ఫలితమని "కరిష్యేవచనంతవ" యను నర్జున వచనమే చెప్పుచున్నది. ఇందువలన జ్ఞానము భక్తియు కర్మకు సహాయ మాత్రము లనవచ్చును. కర్మలేనినాడిం దేదియు నుండదుగాదా!

## 4. ప్రస్తుత సామ్యవాదము

ప్రస్తుత రాజనీతిజ్ఞులు కొందరు, ఈ మూడు యోగములుగాక క్రొత్తదగు నొక సామ్యవాదముం గల్పించి మా వాదము గీతయందున్నదను గర్వముం జూపుచున్నారు. మన మనుకొన్న బుద్ధియోగము గూడ సమత్వమూలకమగుటచే నిదియు మా వాదమునే బలపర్చునని వారందురని యెంచి వారి కల్పితసామ్యవాదమునకును దీనికి నించుకయు సంబంధము లేదని చెప్పుటకే శీర్షికక్రింద కొంచెము ప్రసంగింపవలసి యున్నది. గీతయందలి సామ్యవాదశిక్ష మరొకచో వివరింపదలచియున్నను ప్రస్తుతమునకు గావలసిన ఈ మాత్రము దెలియనగును :-

గీతాసామ్యవాద సంగ్రహము :- "సమంసర్వేషుభూతేషు తిష్ఠంతంపరమేశ్వరం" "శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః" "సమత్వంయోగఉచ్యతే" "నిర్దోషంహిసమం బ్రహ్మ" "సమోహం సర్వభూతేషు" ఇత్యాది వచనములచే సంపూర్ణ విశ్వమందలి చేతనా చేతనములందు సమరూపమున వ్యాప్తమై యున్న యా పరమాత్మ తత్త్వమును లక్ష్యము గావించుకొని తదాధారమున దేనియందును రాగద్వేషములు లేక ద్వంద్వపరిత్యాగమున లోకసంగ్రహము మూలముగాఁగొని యావజ్జీవము నిష్కామభావమున వర్ణాశ్రమానుకూలముగ తమతమ యాధికారిక కర్మ-జ్ఞాన-భక్తియోగములందు ప్రవృత్తులగుచుండుటయే, గీతాసామ్యవాదసిద్ధాంత, ప్రకారాంతరమున:-

"సంపూర్ణ విశ్వమున గాక తంత్రాయియంతర్యామిరూపమున ప్రతిప్రాణిహృదయమందునుండి ఆయాప్రాణులను సంచాలనము సేయుచు "అవిభక్తం విభక్తేషు" అన్నట్లు భిన్నభిన్న పదార్థములందభిన్నరూపమున బ్రతిష్ఠితుడై యున్నాడను నీయీశ్వరానుగతాత్మ సామ్యవాదము లేదా ఆత్మవ్యాపక వాదము నాధారముగాగొని తమతమస్వభావానుకూల కర్మములం బ్రవృత్తిగలిగి యుండుటయే సమత్వలక్షణ బుద్ధియోగము. ఈశ్వర మూలకరాజ తంత్రమే ఈసామ్యవాదమునకు బ్రతిష్ఠ.

ప్రస్తుత కల్పిత సామ్యవాదము :— ప్రస్తుత సామ్యవాదమునకు గీతాగంధముకూడ లేదు. ఎట్లన : వీరుగీతయొక్క శాస్త్రీయ మర్యాదను సర్వదా తిరస్కరించి అనీశ్వరవాద మూలక ప్రజాతంత్రవాదము లేక గణతంత్ర వాదముయొక్క కాల్పనికభిత్తిపై సామ్యవాదావిష్కరణముగావించిరి. దీనికాత్మ సామ్యముతో సంబంధము లేదు. సమదర్శనమునకీ మహానుభావులు "అందరు నన్నికర్మలం జేయ నధికారులే. అందరు వర్ణాశ్రమాచార మర్యాదలనుపీడి (గీతకివి మూలప్రతిష్ఠలు) భేదవ్యవహారముం దొలగింపవలయును. అన్న-పాన-వివాహాది యర్గళములను మూలచ్ఛేదముగావింపవలయును. అందరకును వ్యక్తిత్వ స్వాతంత్రమున్నది. మర్యాదయను (కట్టుబాటు) వస్తువేదియునుండరాదు" ఇదియేవారి సామ్యవాద స్వరూపము. వారి యిచ్ఛానుసారము వారుచ్ఛృంఖలముగా నుండవచ్చును.

అందులకువచ్చు నైహికపారలౌకిక అశాంతికి వారే బాధ్యులైన బాగుండును. కాని గీతపేర నీదుష్ప్రచారము విచారణీయము. దీనివలన మహాభయంకరమగు గొప్ప యపాయమున్నది. భారతీయులు సాధ్యమగునంతవరకు సావధానముగనే యుందురు. కాని శాస్త్రభక్తియను వేషమున నమాయికప్రజలను మోసముగావించు నీవాదమువలన గృహకలహ ముదయించి యది యార్పరాని యగ్నిగ నగునప్పుడేమి చేయవలయును? "ఓభగవంతుడా? దేవయుగకాలీనమగు నేగీతాయోగము నర్జునుని నిమిత్తముగా గొని మహాభారతకాలమున నుద్ధరించితివో యదినేడు కాలదోషమున మరల లుప్తమైపోయినది. స్వార్థపరులు తమ యర్థసిద్ధికొరకు నీయీప్రతిమూర్తిని భిన్నభిన్నము సేయుచున్నారు. ఈ విషమసమయమున మరల నీవు నీవైరాగ్యలక్షణమును, ఈశ్వరమూలకము నగు సమత్వలక్షణ బుద్ధియోగము నుద్ధరించుటకు దయచేసి యావిర్భావము గావలయు"నని ప్రార్థించుటకంటె గత్యంతరములేదు. కానిండు, చెప్పవచ్చినదేమన :-ప్రస్తుతసామ్యవాదము నిష్ఫలము. దీని కొక్క గీతావచనమైన నాధారములేదు. అశాస్త్రీయమగు నిది అయోగము. అప్రామాణికము. ఉపేక్షణీయము. ఇక ప్రస్తుతము చూచుకొందము.

పరస్పరవిరుద్ధములగు జ్ఞానకర్మభక్తియోగములం బ్రతిపాదించు పూర్వోక్తవచనముల తూలనాత్మకసమాలోచనవలన మనమొక నిర్ణయముం జేసికొనవచ్చును. ఏమన "జనసామా

న్యమునందు బ్రచలితములై యున్న పూర్వోక్త యోగత్రయము నకు భగవంతుడు పక్షపాతియు, విరోధియుగూడ నగు చున్నాడు. ఒకవిధముగా నీమూటి నొప్పుకొనుచున్నాడు కాని ప్రాచీనుల దృష్టియందున్న రూపముతో మాత్రముకాదు. కర్మ పరిత్యాగరూపజ్ఞానయోగమున— "కర్మత్యాగమువలదు—కామ నాత్యాగము చాలును, అప్పుడది జ్ఞానయోగమే" యనియు— భక్తి కర్మ యోగములందుగూడ "కామనయే విడువు"మనియు ననుచున్నాడు. కామనాప్రవృత్తులను విడచినచో నతడీ మూటియం దాదరము జూపుచు, లోకసంగ్రహమును సురక్షి తము గావించుచు, తనదిగా అపూర్వవైరాగ్యయోగోపదేశ మొకటి వేరుగా నిచ్చియున్నాడు. దీనినే యతడు తన మత మనియెను." ఇదే గీతాబుద్ధియోగము. దీనినే యోగమని యతని పిలుపు.

ఇయ్యది మొదటి యారధ్యాయములందే ప్రతిపాదింప బడినను, అతడు ఇదియే తన మతమని ప్రధానముగ నెంచి యున్నందున మిగిలిన మూడుయోగములందును (అవి తనవి కాకున్నను) మధ్యమధ్య దీనిని సంబంధింపజేయుట యవసర మనియెంచి అట్లు కావించియున్నాడు. అందువలన నట్లు సంశో ధింపబడిన తక్కిన మూడు యోగములును బుద్ధియోగము లనియే పేరొందినవి. చివరకు గీత :-1 బుద్ధియోగమను-యోగ మును, 2 జ్ఞాన, 3 కర్మ, 4 భక్తియోగములను నిరూపణ

జేయుచున్నదనియు, వీనికన్నిటికిని బుద్ధియోగసంబంధముండుట వలన మొత్తముగీత బుద్ధియోగశాస్త్రమని దేలుచున్నది.

ఆత్మకల్యాణార్థ మీగీత మనయెదుట బెట్టు నీనాల్గువిధముల బుద్ధియోగము సారాంశము లీక్రింద జూతము :-

1. ఆసక్తి రూప రాగద్వేష పరిత్యాగము గావించి యావజ్జీవమనాసక్తభావమున కర్మ సేయవలయును. (వైరాగ్యబుద్ధి యోగము) 1-6 అధ్యా.

2. అవిద్యానామక మోహాముం ద్యజించి శరీరయాత్రానిర్వాహక కర్మ సేయుచు నంతర్జ్యోతి లక్షణజ్ఞానోదయమున బ్రయత్నశీలుడు కావలయును: (జ్ఞానబుద్ధియోగము) (ఇది భగవంతున కంతప్రియము కాదు) 7-8 అధ్యా.

3. అస్మితాపరిత్యాగము గావించి ఫలాకాంక్షారహితముగ "అన్నికర్మలు నీశ్వరుడు చేయుచున్నాడు, చేయించు చున్నాడ"ను భావముతో సంతతభగవచ్చింతన గావించుచు నెల్లకర్మలం జేయవలయును. (ఐశ్వర్యబుద్ధియోగము) 9-10-11-12 అధ్యా.

4. అభినివేశపరిత్యాగము గావించి కేవల కర్తవ్యబుద్ధితో నివృత్తిలక్షణయజ్ఞాదికర్మలను యావజ్జీవము ననుష్ఠింపవలయును. (ధర్మబుద్ధియోగము) చివరి 6 అధ్యా.

ఈనాల్గు బుద్ధియోగములను సమర్థించు వచనముల నెదుట నుంచికొనినచో గీతాహృదయమేమి? యనునది స్వాయ

ముగనే నిర్ణయించుకొనవచ్చును. మొదటినుండి యారధ్యాయ ముల పర్యంతము సర్వముఖ్యము, సర్వశ్రేష్ఠము. రాగ-ద్వేష పరిత్యాగలక్షణము, సర్వకర్మపరిగ్రహలక్షణము, నగు వైరాగ్య బుద్ధియోగము ప్రధానముగ నిరూపింపబడినది. ముందావచన ములం జూతము.

## 1. వైరాగ్యబుద్ధియోగము

1. మాత్రాస్పర్శాస్తుకౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాన్ స్తాంతితిక్షస్వభారత ।

2. యంహినవ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ ।
సమదుఃఖ సుఖంధీరం సోఽమృతత్వాయకల్పతే

3. అంతవంత ఇమేదేహా నిత్యస్యోక్తా శరీరిణః
అనాశినోఽప్రమేయస్యతస్మాద్యుధ్య స్వభారత ।

4. వేదావినాశినం నిత్యం యఏనమజమవ్యయం
కథంస పురుషఃపార్థకంఘాతయతి హంతికమ్.

5. స్వధర్మమపిచావేక్ష్య నవికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్యనవిద్యతే.

6. సుఖదుఃఖే సమేకృత్వాలాభాలాభౌజయాజయౌ
తతోయుద్ధాయయుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి

7. ఏషాతేఽభి హితాసాంఖ్యే బుద్ధిర్యోగేత్విమాంశ్రుణు.
బుద్ధ్యాయుక్తోయయాపార్థ కర్మబంధం ప్రహాస్యసి.

8. వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహకురు నందన
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽ వ్యవసాయినాం.

9. భోగైశ్వర్య ప్రసక్తానాం తయాప హృతచేతసాం.
వ్యవసాయాత్మికాబుద్ధిః సమాధౌనవిధీయతే.

10. త్రైగుణ్య విషయావేదాః నిస్త్రైగుణ్యోభవార్జున
నిర్ద్వంద్వోనిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

11. కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగోస్త్వకర్మణి.

12. యోగస్థః కురుకర్మాణి సంగంత్యక్త్వాధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్త్వంయోగ ఉచ్యతే

13. దూరేణహ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ ః
బుద్ధౌశరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః.

14. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మ సు కౌశలమ్.

15. కర్మజం బుద్ధియుక్తాహి ఫలంత్యక్త్వా మనీషిణః
జన్మబంధ వినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయం.

16. శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధిః తదా యోగ మవాప్స్యసి.

17. దుఃఖే ష్వనుద్విగ్న మనాః సుఖేషు విగతస్పృహః
వీతరాగ భయ క్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే.

18. యః సర్వత్రా నభిస్నేహః తత్తత్ప్రాప్య శుభాశుభం
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

19. రాగ ద్వేష వియుక్తైస్తు విషయాన్ ఇంద్రియైశ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.

20. నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా
న చా భావ యతః శాంతి రశాంతస్య కుతస్సుఖం.

21. యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతే ఒర్జున
కర్మేంద్రియైః కర్మయోగం అసక్తః స విశిష్యతే.

22. యజ్ఞార్థా త్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః
తదర్థం కర్మ కౌన్తేయ ముక్త సంగః సమాచర ।

23. తస్మాదసక్తః సతతం కార్యం కర్మసమాచర
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః.

24. సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వన్తి భారత!
కుర్యా ద్విద్వాన్ తథాసక్తః చికీర్షు ర్లోక సంగ్రహం.

25. ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్నవశమాగచ్ఛే త్తౌహ్యస్య పరిపంథినౌ.

26. కామఏష క్రోధఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

27. తస్మాత్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనం.

28. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్.

29. ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప.

30. స ఏవాయం మయాతేఽద్య యోగః ప్రోక్త స్సనాతనః
భక్తోఽసి మే సఖాచేతి రహస్యం హ్యేతదుత్తమం.

31. నమాంకర్మాణి లిమ్పన్తి నమేకర్మఫలేస్పృహా
ఇతిమాంయోఽభిజానాతి కర్మభిః ననబధ్యతే

32. కర్మణ్యకర్మయః పశ్యే దకర్మణి చ కర్మయః
సబుద్ధిమా౯ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్

33. త్యక్త్వాకర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభిప్రవృత్తోపి, నైవకించిత్కరోతిసః.

34. యోగసన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం
ఆత్మవంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ।

35. తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః
ఛిత్త్వైవంసంశయం, యోగ మాతిష్ఠోత్తిష్ఠభారత।

36. జ్ఞేయః సనిత్యసన్యాసీ, యోనద్వేష్టిన కాంక్షతి
నిర్ద్వంద్వోహిమహాబాహోసుఖం బంధాత్ప్రముచ్యతే.

37. యత్సాంఖ్యైః ప్రాప్యతేస్థానం తద్యోగైరపిగమ్యతే
ఏకం సాంఖ్యంచయోగం చ యః పశ్యతి సపశ్యతి.

38. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్న పి నలిప్యతే.

39. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా.

40. సర్వకర్మాణి మనసా సన్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురేదేహీ నైవ కుర్వన్నకారయన్.

41. ఇహైవతైర్జితః స్సర్గః యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః.

42. నప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్యచా ప్రియం
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః.

43. శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం సయుక్తః స సుఖీ నరః.

44. యతేంద్రియ మనోబుద్ధిః ముని ర్మోక్ష పరాయణః
విగతేచ్ఛా భయక్రోధః యస్సదాముక్త ఏవ సః.

45. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతియః
సనన్యాసీ చ(స)యోగీ చ ననిరగ్నిర్నచాక్రియః.

46. యంసన్యాస మితిప్రాహుః యోగంతం విద్ధి పాండవ।
నహ్య సన్యస్తసంకల్పో యోగీభవతికశ్చన.

47. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే.

48. తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వ దైహికమ్
యతతే చ తతోభూయః సంసిద్ధౌ కురునందన।

49. తపస్విభ్యోఽధికోయోగీ జ్ఞానిభ్యోఽపిమతోఽధికః
కర్మిభ్యశ్చాధికోయోగీ తస్మాద్యోగీ భవార్జున।

50. యేమేమత మిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యన్తే తేఽపి కర్మభిః.

51. యేత్వే తదభ్యసూయంతో నానుతిష్ఠన్తి మేమతం
సర్వజ్ఞానవిమూఢాన్ స్తాన్ విధినష్టా న చేతసః.

ఇదియే, భగవంతుడు తన మతముగా జెప్పినందున భగ ద్విద్య యనవచ్చును. ప్రస్తుతము మన ముదహరించుకొనిన యీ వచనములు వ్యాసభాష. భగవదభిప్రాయ మిందు గర్భి తము. మహాభారత కాలీనము, అర్జును నుద్దేశించినది. ఆనాటికి జ్ఞాన - భక్తి - కర్మ మార్గములు బాగుగా ప్రచారము నందు న్నవి. అందు సాంఖ్యనిష్ఠయను జ్ఞానయోగమున కత్యంత ప్రాముఖ్యము. వేయేల యితరము లెన్ని యున్నను చివర కది లేనిది ముక్తి లేదనియే సిద్ధాంతము. అందు గర్మ త్యాగము

తప్పనిసరి యైనది. తక్కిన యోగము లా యోగాధికారిని సిద్ధము గావించు సాధనములు మాత్రము. కనుకనే యర్జును డందుకు సంసిద్ధు డయ్యెను. కనుకనే భగవంతుడు ముందుగ తన యభిప్రాయము ననుసరించి జ్ఞాననిష్ఠ యెట్లుండవలయునో అట్లే తదనువాద ప్రారంభముతో తన మతమును వివరించెను. దేవ యుగము నాడింత గొడవ లేదు. నాటి స్థితి ననుసరించి యది సంక్షిప్తరూపమై యుండవచ్చును. ఫలాసక్తి గర్భిత కర్మ యోగము (క్షణిక విజ్ఞానము) ఆనాటి కున్నది. అది యీనాడు నున్నది. మొత్తముపై నాటి యుపదేశ వివరణ రూపమే నేటి యీ గీత. ఇదియే యిప్పటి కింత అయోమయముగ నైనది. ఇక కేవల మానాటి (దేవయుగ కాలీన) గీతయే యున్నచో జెప్పవలయునా? ఇది చాలును. తదుపదేశ వివరణమే యగుటచే దీనిని సనాతన విద్య (యోగః ప్రోక్తః సనాతనః స ఏవ) యనవచ్చును. దేవయుగము నాటినుండియు రాజర్షులందే దీని యనుష్ఠాన మధికముగా నుండె గనుక రాజర్షి విద్య. జనకు డీ విద్యయా దారితేరిన జీవన్ముక్తుడు. కనుక విదేహుడని బిరుదొందెను. జ్ఞాన - కర్మ లింక సమముగా సమన్వయము నొంది యుండుటచే సమత్వ యోగము. తక్కినవి పాక్షికములు, నయోగములు ననుటకు సందేహము లేదు. కనుకనే భారత కాలము నాటికి ప్రచార మందున్న యోగత్రయ విలక్షణముగనున్న తన యీ మతమును బుద్ధియోగమనియు, సంక్షిప్తముగ యోగ మనియు మాత్రమే చెప్పెను. దీనికి బిమ్మట తన మతాను

సారము సంశోధించి, బుద్ధియోగ రూపమిచ్చి, నాటి యోగ త్రయముంగూడ లోక సంగ్రహము సురక్షితము గావించుట కిందు జేర్చెను. బుద్ధియోగ ప్రవర్తకుడు భగవంతుడాధికారిక జీవుడు (అవతార పురుషుడు) తక్కిన యోగప్రవర్తకులు ఆశ్వ త్థికజీవులు (మనుష్యులు). కనుక నీ భగవద్విద్య సర్వశ్రేష్ఠము. సాంఖ్య - యోగములు వేరనుకొనుట పొరపాటని యతని యభి ప్రాయము. ఇక తక్కినవి చూతము :

## 2. జ్ఞాన బుద్ధి యోగము.

### 7 - 8 అధ్యాయములు.

1. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథాజ్ఞాస్యసి తచ్ఛృణు.

2. జ్ఞానంతేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః
యద్ జ్ఞాత్వా నేహభూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే.

3. మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తితత్వతః.

4. త్రిభిర్గుణమయైభావైరేభిః సర్వమిదం తతమ్
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయం.

5. దైవీహ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరన్తితే.

6. నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః
మాయయాపహృతజ్ఞానాః ఆసురం భావమాశ్రితాః.

7. తేషాం జ్ఞానీ నిత్యయుక్తః ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థం అహం సచమమప్రియః.

8. ఉదారాస్సర్వఏవైతే జ్ఞానీత్వాత్మైవమేమతం
ఆస్థితస్సహియుక్తాత్మా మామేవానుత్తమాంగతిం.

9. బహూనాం జన్మ నామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే.
వాసుదేవస్సర్వమితి స మహాత్మాసుదుర్లభః.

10. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః
పరంభావమజానంతో మమావ్యయ మనుత్తమం.

11. నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకోమామజమవ్యయం.

12. జరామరణమోక్షాయ మామాశ్రిత్యయతన్తియే
తే బ్రహ్మ తద్విదుఃకృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలం.

13. సాధిభూతాధిదైవం మాం సాధి యజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేపి చ మాంతే విదుర్యుక్తచేతసః.

14. అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరం
యః ప్రయాతి సమద్భావం, యాతినాస్త్యత్ర సంశయః.

15. అభ్యాస యోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చింతయన్

16. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః.

17. వేదేషు యజ్ఞేషు తపస్సుచైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీపరం స్థానముపైతిచాద్యమ్

ఇవి భగవంతునిచే సంశోధింపబడిన జ్ఞానయోగమను గుఱ్తు మఱువరాదు. జ్ఞానముతో విజ్ఞానమును సమావేశము ప్రధాన సంశోధనము. జ్ఞాన మాత్మకు, విజ్ఞానము విశ్వమునకు జెందినవి. విశ్వకర్మదృష్టిగల్గి యాత్మచింతన గావించుటయే నిజమగు జ్ఞానయోగము. కర్మలకు వెఱచి పరుగిడ బనిలేదు. కర్మ ఈశ్వర (ఆత్మ) విభూతియని యెఱుంగవలయును. నియత కర్మ నుల్లంఘింపలేము కదా! గృహస్థ కర్మలనుమాత్ర మేల విడవవలయును? తటస్థుడుగనుండి చేయరాదా? శ్రీ సమర్థ రామదాసు, శ్రీ జ్ఞానేశ్వరుడు, శ్రీ సంతతుకారామ్ మొదలగు మహాసీయులు నివృత్తికర్మాచరణము గావించుచు, వర్ణాశ్రమానుకూల కర్మలయందు బ్రవృత్తులు గావలయు ననియే యాదేశించిరి.

ఈ విద్యయందు భగవంతున కంత రుచి యున్నట్లు లేదు. కనుకనే సంశోధిత రూపముననైన విస్తరింపలేదు. "యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః," "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" ఇత్యాదులచే నీప్రకరణమందే తన యరుచిని సూచించి, యితర ప్రకరణములందు నేదో యొక విధముగ ఈ యరుచి నగపర్చుచునే యుండెను. ఇందుకు గారణ మొక విధముగ నూహింపవచ్చును. ఎట్లన :— విద్య - జ్ఞానము పర్యాయ పదము లనుకొన్నను, ఇందేదియు నీ యోగమునకు పేరుగా బెట్టుటకు దగదు. సర్వవిశేషాత్మ (జ్ఞానము) అనిర్వాచ్యము, అచింత్యము ఇత్యాదిగా బూర్వ

ప్రకరణములందు విశేషించి చెప్పబడియే యున్నది గదా: అట్టిచో దీనినెట్లు యోగమనియు, నేయోగమనియు నందుము? (విజ్ఞాత మవిజానతాం) అనుభూతి యెట్లు? కనుకనే యీ యోగ భాగమందంతటను భగవంతుడు మయి, మాం, మత్ పదములను సంశోధన రూపమున జేర్చియున్నాడు. ఏలయన:- కేవలమను నీ యోగమందు భగవంతుడు శూన్యప్రాయుడు (అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి ఇత్యాదులు) కనుక నీ బుద్ధి యెందుకు బనికిరానిదియును, తెలిసిన మాత్రనే ప్రయోజనము లేనిదియు నై యున్నది.

అట్లయినచో శ్రుత్యాదేశము వ్యర్థమా? కాదు. సత్యము నన్నృతమునగు నీ విశ్వమానిర్విశేషతత్త్వ విభూతియని యెరింగిన పుడీ ప్రశ్నయు నా సంశయము నంతరించునుగదా! అప్పుడు ఈశ్వరుడు (ఆత్మ) విశ్వము నొకటేయై (సర్వఖల్విదంబ్రహ్మ) విశ్వకర్మచే యీశ్వరుడుపాస్యుడును, విశ్వకర్మకు మూల మీశ్వరుడు నగునుగదా! ప్రాచీనజ్ఞానమునం దీశ్వరుడు విశ్వము వేరై పోగా భగవంతుడీ విధముగ సంశోధన గావించి దానికి స్వాశ్రయ మిచ్చియున్నాడు. తెలిసియో తెలియకో యెట్లో యొక విధము తన విభూతియగు విశ్వకర్మయందు తనాశ్రయించి ప్రవర్తించువాడు భగవంతుని కిష్టుడుగాని కేవలాత్మ జ్ఞానియై తద్విభూతి కసహ్యపడువాడతని కిష్టుడుగాడు. అట్లుండుటయు నసంభవము. అట్టి యసంభవపు పని కెత్తుకొనుట యతని

కరుచి కారణముగాదా! విశ్వరూపియగు తన్నే పరమగతిగ నెంచి యోగయుక్తుడైన వానినే యతడు నీవే నేననుచున్నాడని సావధానముగా నీ ప్రకరణమందలి యీ శ్లోకముం జూచిన తెలియును.

"ఉదారాః సర్వఏవైతే-జ్ఞానీత్వాత్మైవ మేమతం
ఆస్థితఃసహి యుక్తాత్మా మామేవానుత్తమాంగతిం."

కనుకనే "సాధిభూతాధిదైవ" మిత్యాదులచే తన్నెరుంగవలసిన రీతులుగూడ నుపదేశించి చివరకు "అంతకాలేచ" ఇత్యాదిగా తన స్మరణమే పరమావధిగా జూపుచున్నాడు. ఇట్లే ఈ యోగమందంతటను తన యాశ్రయమిచ్చి యీజ్ఞానుల నయోమయమున బడకుండ గాపాడి యీ యోగమును సంస్కరించి యుపనిషదర్థములు వెల్లడిగావించెను:

"వరమిమముపదేశమాద్రియధ్వం
నిగమవనేషు నితాంతచారఖిన్నాః
విచినుతభవనేషు వల్లవీనాం
ఉపనిషదర్థ ములూఖలేనిబద్ధం."

ఈ యోగమునకు మూలప్రవర్తకుడు సిద్ధజాతియందవతరించిన కపిలుడు కనుక దీనిని సిద్ధవిద్యయనియు, తత్త్వసంఖ్యాన సంబంధమున సాంఖ్యనిష్ఠయనియు నందురు. దీనిని జ్ఞానబుద్ధియోగముగ సంస్కరించి భగవంతుడు గీతయందు జేర్చెను. ఇందువలన బుద్ధియందు మోహరూపావిద్య నాశముకాగా నది

యాత్మతో యోగమునొందును. ప్రస్తుతకాలమందనధికారులై కర్మభ్రష్టులు కర్మ భ్రష్టులునై - నియతియు, నీతియు విడచి జ్ఞానులమనుకొను సన్యాసులీ భగవత్సంస్కృత జ్ఞానబుద్ధియోగము నేగురువునొద్దనైన జక్కగా దెలిసికొని భక్తియోగమున బ్రవేశించి తరించిన మేలుగనుండును. అది యింతకంటె మిక్కిలి సరళమైనది. కనుకనే భగవంతుడు దానిని నాలుగధ్యాయములందు వివరించెను.

"క్షురస్యధారానిశితా దురత్యయాదుర్గం పథస్తత్కవయోవదన్తి
అవిదిత్వా ఋషింఛందః, దైవతం యోగమేవచ
యోఽధ్యాపయేజ్జపేద్వాపి పాపీయాన్ జాయతేతుసః" (స్మృతి)

ఆర్షేయబ్రాహ్మణే :-"యోహవా అవిదాతార్షేయచ్ఛందో దైవతబ్రాహ్మణేన మంత్రేణ యాజయతి వాధ్యాపయతి వాస్థాణుంవర్చ్ఛతి గర్తంవా ప్రతిపద్యతే.

## ఐశ్వర్యబుద్ధియోగము
(9-10-11-12 అధ్యాయములు)

1. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయావే
జ్ఞానం విజ్ఞాన సహితం, యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమం,
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్.

3. మత్ స్థాని సర్వ భూతాని నచాహంతేష్వవస్థితః
న చ మత్ స్థాని భూతాని పశ్యమే యోగ మైశ్వరం.

4. అవజానన్తి మాం మూఢాః మానుషీం తను మాశ్రితం
పరం భావమజానంతః మమ భూత మహేశ్వరం.

5. మహాత్మానస్తు మాంపార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః
భజన్త్యనన్య మనసః జ్ఞాత్వా భూతాది మవ్యయం.

6. సతతం కీర్తి యన్తోమాం యతంతశ్చదృఢ వ్రతాః
నమస్యంతశ్చమాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.

7. జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖం.

8. తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ
అమృతం చైవమృత్యుశ్చ సదసచ్చాహ మర్జున.

9. అనన్యాశ్చింత యతోమాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం.

10. శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మ బంధనైః
సన్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి.

11. సమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోస్తి కశ్చన
యే భజన్తితుమాంభక్త్యా మయితే తేషు చాప్యహం.

12. అపిచేత్సు దురాచారో భజతే మామ నన్యభాక్
సాధురేవసమంతవ్యః సమ్యగ్వ్య వహితోహిసః.

13. క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతింనిగచ్ఛతి
కౌన్తేయ ప్రతి జానీహి, నమేభక్తః ప్రణశ్యతి.

14. మాంహి పార్థవ్య పాశ్రిత్య యేఽపిస్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాః తథాశూద్రా స్తేఽపియాంతి పరాంగతిమ్.

15. కింపు నర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తారాజర్ష యస్తథా
అనిత్యమసుఖం లోకం ఇమం ప్రాప్యభజస్వమాం.

16. మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు.
మామే వైష్యసి యుక్త్వైవం ఆత్మానం మత్పరాయణః.

17, అహం సర్వస్య ప్రభవః మత్తః సర్వం ప్రవర్తతే
ఇతిమత్వా భజన్తేమాం బుధా భావసమన్వితాః.

18. మచ్చిత్తామద్గత ప్రాణాః బోధయంతః పరస్పరం,
కథ యంతశ్చమాం నిత్యం, తుష్యన్తిచరమన్తిచ.

19. నతుమాంశక్యసే ద్రష్టు మనే నైవస్వచక్షుషా
దివ్యందదామితే చక్షుః పశ్యమే యోగ మైశ్వరం.

20. భక్త్యాత్వనన్యయాశక్యః అహమేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప.

21. యేతుధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానామత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః.

లోకమందు ప్రచారమందున్న భక్తి నిష్టకర్థము "భగవంతు డెంతో దయాళుడు. మనము పాపనివృత్తికతని నారాధింప వలయును. అతడు మన పాపము లన్నింటిని క్షమించి వేయును. మన కోరికలను సఫలము గావించును." అనుకొని సత్త్వరజస్తమస్సులను, వారివారి గుణానుసారము, బ్రహ్మ విష్ణు రుద్ర కాళీ భైరవ, రామకృష్ణ హనుమదాది భిన్నభిన్న దేవతల నుపాసించుచున్నారు. కొంచెమాపద వచ్చినను వారివారి ప్రసాదము నాకాంక్షించి తత్తద్విపన్నివృత్తికి బిస్మాట యుత్సవ

ములు సేయుచుందురు. ఇట్లు ఆద్యంతములందు వీరియుపాసన, కామనచే నోత ప్రోతమై యుండును. ఒకప్పుడు ఆ కామన ఫలించి క్షణికసుఖ కారణమైనను శాశ్వతానందము చ్యుతమగు చున్నది. ఇందు పరాశ్రయము తప్పనిసరి. పదేపదేభయము. ఆత్మయొక్క స్వాభావికైశ్వర్య మణగి మణగి యుండును. ప్రతి కార్యమునకు దేవతల నడిగికొనుట తప్పదు.

దీనిని (భక్తియోగము) శోధించి భగవంతుడు చెప్పు చున్నాడు. "నీవే దేవతనైన నుపాసింపుము. కాని ద్వైతబుద్ధి విడువుము. అది నీకంటె నన్యము కాదని యెంచుము. ఇదియే అనన్యోపాసన. దాని యంశమగు నీవు తదభిన్నుడవు. అందరు దేవతలు నీవే నిష్కామముగా నాత్మబుద్ధితో నుపాసింపుము. అది కర్తవ్యము (నిత్యకర్మ) అనుకొనుము. "వ్యాపకశక్తి యందు మనము భాగస్వాములము గావలయు" ననుకొనుము. ఉపాస్యము నేమికోరుదువు? నీ కీయదగినదంతయు నది నీ కిచ్చియే యుండెను. నీకును దానికిని (ఉపాస్యమునకు) మధ్య నస్మితావరణము వచ్చిపడినది. ఐశ్వర్యయోగలక్షణ భక్తియోగ మున దానిం దొలగించుకొనుము. అందుకొరకుపాస్యముపై సంతతదృష్టియుంపుము అంతేచాలును. కావలసినదంతయు నదే యగును. ఉపాస్యము నన్యముగాదలచి తనకంటె నది సమృద్ధ మని యెంచి కామ్యదృష్టితో నుపాసించువాని కుపాసన యన నేమో తెలియదు. నీవు సూర్యుడవు, మనువువు, అగ్నివి.

అన్నియు యంతయు నీవే. ఇదే యుపాసనకు మూలమంత్రము. ఈ మంత్రములం జూడుము:—

1. అహం మనురభవం, సూర్యశ్చాహం, కక్షీవాన్ ఋషిరస్మి విప్రః
అహం కుత్సమార్జునేయం, న్యృంజేఽహం కవి రుశనాపశ్యతామా
అహం భూమిమద దార్యాయా, హం, వృష్టిందాశుషేమర్త్యాయ
అహామపోఅనయం, వావశానామమదేవాసోఅనుకేతమాయన్ (ఋక్)

2. ఆత్మైవాధస్తా దాత్మోపరిష్టాత్ ఆత్మాపశ్చాత్ ఆత్మాపురస్తాత్ ఆత్మా దక్షిణతః ఆత్మోత్తరతః-ఆత్మైవేదం సర్వమితి, సవాఏష ఏవం పశ్యన్ ఏవం మన్వానః ఏవం విజానన్ ఆత్మరతి రాత్మక్రీడః ఆత్మ మిథున ఆత్మానందః సఃస్వరాడ్భవతి, తస్యసర్వేషులోకేషు కామ చారో భవతి-అథయోఽన్యథాతో విదురన్యరాజానస్తే క్షయ్యలోకాః భవన్తితేషాం సర్వేషులోకేష్వకామచారోభవతి. (ఛాందో)

3. తాన్యస్యైతాని కర్మనామాన్యేవ । సయోఽతఏకైకముపాస్తే-ననవేద అకృత్స్నోహ్యేషోఽత ఏకైకేనభవతి । ఆత్మేత్యేవోపాసీత । అత హ్యేతేసర్వఏకంభవతి. అనేనహేతత్ సర్వంవేద (బృహదారణ్యక)

భగవత్సంశోధిత భక్తియోగమువలన నైశ్వర్యోదయము. అస్మితానాశము నగును. విశ్వమందీశ్వరుడు తొమ్మిది విధములుగా వ్యాప్తుడగుచున్నాడు కనుక నతనితో ననన్యత తొమ్మిది విధములుగ స్థాపించుకొనవచ్చును ఇదియే నవధాభక్తి యందురు. అది మరియొకచో జూచుకొందము. ఈ యోగము రాజులందు విశేష ప్రచారము గలదగుటచే రాజవిద్య యనబడినది.

# ధర్మ బుద్ధి యోగము
(చివరి యారధ్యాయములు)

1. ఋషిభిః బహుధాగీతం ఛందోభిర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదైశ్చైవ-హేతుమద్భిర్వినిశ్చితైః.
2. అమానిత్వ మదంభిత్వ మహింసాక్షాంతిరార్జవం
ఆచార్యోపాసనం శౌచం, స్థైర్యమాత్మవినిగ్రహః.
3. కార్యకారణకర్తృత్వేహేతుః ప్రకృతి రుచ్యతే
పురుషః సుఖదుఃఖానాం భోక్తృత్వేహేతురుచ్యతే.
4. పురుషః ప్రకృతిస్థోహి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు.
5. యఏవం వేత్తిపురుషం ప్రకృతించ గుణైః సహ
సర్వధావర్తమానోఽపి సయోగీమయివర్తతే.
6. అన్యేత్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్యఉపాసతే
తేపిచాతి తరన్త్యేవ మృత్యుంశ్రుతి పరాయణాః.
7. ప్రకృత్యైవతుకర్మాణి క్రియమాణాని సర్వశః
యఃపశ్యతి తథాత్మానం అకర్తారం సపశ్యతి.
8. అనాదిత్వాన్నిర్గుణత్వాత్ పరమాత్మాయమవ్యయః
శరీరస్థోఽపికౌన్తేయ. నకరోతి నలిప్యతే.
9. కర్మణః సుకృతస్యాహుః సాత్వికం విర్మలం ఫలం
రజసస్తుఫలం దుఃఖం, అజ్ఞానం తమసః ఫలం.
10. ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం
ఛందాంసియస్యపర్ణాని యస్తం వేదసవేదవిత్.
11. అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్యశాఖాః గుణః ప్రవృద్ధావిషయప్రవాళాః
అధశ్చమూలాన్యనుసంతతాని కర్మానుబంధీని మనుష్యలోకే.

12. ఏతైః (కామక్రోధలోభైః) విముక్తః కౌన్తేయ. తమోద్వారైస్త్రిభిర్నరః.
ఆచరత్యాత్మనః శ్రేయః తతోయాతిపరాంగతిం.

13. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి.

14. ఓం తత్ సత్ ఇతి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా.

15. తస్మాత్ ఓమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం.

16. తదిత్యనభి సంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దాన క్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్ష కాంక్షిభిః.

17. సద్భావే సాధు భావేచ సదిత్యే తత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తధా సచ్ఛబ్దః పార్ధ యుజ్యతే.

18. యజ్ఞే తపసి దానేచ స్థితిః సదితిచోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే.

19. యజ్ఞ దాన తపః కర్మ నత్యాజ్యం కార్యమేవ తత్
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం.

20. నహి దేహ భృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తు కర్మ ఫల త్యాగీ సత్యాగీ త్యభిధీయతే.

21. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః.

22. స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః
స్వకర్మ నిరతః సిద్ధిం యధా విదంతి తచ్ఛృణు.

23. యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః.

24. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం.

25. సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః.

26. సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణోమ ద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయం.

27. యదహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిః త్వాం నియోక్ష్యతి.

28. స్వభావజేన కౌన్తేయ నిబద్ధః స్వేనకర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్.

త్రిలోకములంకును స్వతంత్ర సంచారముగలట్టియు మంత్రద్రష్టలునగు మహర్షులు అపౌరుషేయ వేదాధారమున శ్రౌతస్మార్తధర్మముల యావిష్కారము గావించిరి. ఈ శాస్త్రీయ ధర్మరూపకర్మలే కర్మయోగమందురు. ఇవి విద్యాసాపేక్షములు విద్యానిరపేక్షములు నని రెండువిధములు: యజ్ఞదాన తపస్సులు మొదటి తరగతివి: (2) ఇష్టాపూర్త దత్తములు రెండవ తరగతివి. యావజ్జీవమీకర్మలు స్వస్వవర్ణానుసారముగ ననుష్టింపవలయునని ఋషుల యాదేశము,-ప్రతిషిద్ధ వికర్మలను అవిహిత ప్రతి షిద్ధములను విడువవలయును. ఇందు ప్రవృత్తిని మాత్రము (కామన) విడచి చేయవలయునని భగవదాదేశము.

ఏలయన :—కర్మచేసినచో ఫలమెన్నడును రాకపోదు. దానిపై దృష్టి యుంచుటవలన నష్టమేమనగా బుద్ధి మనస్సునై పునరు వంగును. క్షణికక్రియకు భంగము కల్గి కర్మచెడును. లేదా ఆసక్తి బలమగును. దానివలన ఆత్మమాలిన్యము నొందును. ఈ యధర్మమును దొలగించుకొనుటకు ధర్మబుద్ధియోగ మవసరము. అందుకు ప్రవృత్తిత్యాగమే కీలకము. ఈ కర్మయోగ మూల ప్రవర్తకులు ఋషులుగనుక నిది యార్షవిద్య యందురు. ధర్మబుద్ధియోగము భగవత్సంస్కృత రూపము. ఈ మత మీా మాత్రము సంస్కారముతో భగవంతుడు పూర్ణముగ నంగీకరించెను.

ఇట్లు చతుర్విధ బుద్ధియోగములును నిరూపింపబడినవి. ఇందు భగవంతుని మతము వైరాగ్యబుద్ధియోగము. కనుక ఇతరయోగములను సంస్కరించు పట్టున తన వైరాగ్యయోగము వానియందచ్చటచ్చట సమావేశము గావింపుచు వచ్చెను. ఈ విషయ మీాక్రింది వచనముల వలన స్పష్టము కాగలదు :—

జ్ఞానబుద్ధియోగమందు :—

1. ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత
సర్వభూతాని సంమోహం సర్గేయాంతి పరంతప.

2. యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్య కర్మణాం
తే ద్వంద్వ మోహ నిర్ముక్తాః భజంతే మాం దృఢ వ్రతాః.

3. అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభఃపార్థ।నిత్యయుక్తస్యయోగినః. } ఇత్యాది.

ఐశ్వర్య బుద్ధియోగమందు :—

1. నచ మాంతాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ।
ఉదాసీన వదాసీనమ్ అసక్తం తేషు కర్మసు.

2. తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే.

3. మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః సంగ వర్జితః
నిర్వైరః సర్వ భూతేషు యః సమామేతి పాండవ.

4. మయ్యావేశ్య మనోయే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాః తేమే యుక్త తమా మతాః.

5. సన్నియమ్యేంద్రియ గ్రామం, సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూత హితే రతాః.

6. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖః క్షమీ. ఇత్యాది.

ధర్మబుద్ధియోగమందు:—ఇందంతటను వైరాగ్య బుద్ధి యోగమే. అయినను రెండు. చూడుము.

1. ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనమ్.

2. చేతసా సర్వ కర్మాణి మయి సన్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ.

ఇంతవరకు విజ్ఞానగీత యనుకొన్న 636 శ్లోకముల భాగము నాల్గు యోగములు—విద్యలుగా భాగించి తత్తదుద్దేశ్యముల నెరింగితిమి. ఇట్టి స్థితిలో ప్రాచీనుల మతప్రకారము మొదటిది కర్మషట్కము రెండవది భక్తిషట్కమనియు మూడవది జ్ఞానషట్కమనియు గావించిన గీతావిభాగము సర్వథా అనుపాదేయమనుట కెట్టి సందేహములేదు.

వారింకను (1) జ్ఞానషట్కము (2) భక్తిషట్కము (3) కర్మషట్క మనుకొన్నను కొంత మేలుగనుండెడిది.

ఇంతటితో నించుమించుగ గీత బహిరంగపరీక్ష ముగిసినదనవచ్చును. కాని యైతిహాసిక గీతగా వేరుపరచిన 64 శ్లోకముల సందర్భ సంగతియు నించుక దెలిసికొని యీ పరీక్ష ముగింతము.

ఇతి శ్రీ......చతుర్థ ప్రసంగః

# పంచమ ప్రసంగః.

## గీత - ఐతిహాసికసందర్భ సంగతి

"ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" (భార) అన్నట్లు పౌరుషేయ వేదశాస్త్ర యథార్థాగ్ర పరిజ్ఞానము కొరకు పురాణేతిహాస మననమెంతో యవసరము. సృష్టీతిహాసమును అనగా :- సృష్టి. ఎప్పుడు, ఎట్లు, ఎవనివలన, ఎందుకు, ఎక్కడనుండి, దేనితో, కావించెను? ఇది యెప్పటివరకుండును? పోవుటెప్పుడు? ఇత్యాది ప్రశ్నలకు విశదముగా సమాధానమిచ్చునదియే పురాణశాస్త్రము. మరియు నిట్లే మానవ వంశేతిహాసము జెప్పునట్టి లేదా, రాజ్యశాసనానుసార భువనకోశ (భూగోళ) స్వరూపము౦ జెప్పునట్టియు, రాజవంశ - దేవవంశ, చాతుర్వర్ణ్య వంశాదీతిహాసములను జెప్పునట్టియు శాస్త్రము ఇతిహాసము.

అనగా పురాణమందితిహాసము. ఇదిహాసమందు పురాణము నుండదనుకొనరాదు. ఒకదానియందొకటి ప్రధానము తక్కినవి గౌణముగా, రెంటియందు రెండు నుండునని యెంచవలెను. ఈ పౌరాణికాఖ్యానములు 1 ఆధిదైవిక, 2 ఆధ్యాత్మిక, 3 ఆధిభౌతిక, 4 ఆధిదైవికాధ్యాత్మిక, 5 ఆధిదైవికాధిభౌతిక, 6 ఆధిభౌతికాధ్యాత్మిక, 7 ఆధిదైవికాధ్యాత్మికాధిభౌతిక, 8 అసదాఖ్యానభేదములచే నెనిమిది విధములని ప్రసి

ద్ధము. ఇది యెఱుంగని పాశ్చాత్త్యులు తదనుయాయులును తదుచ్ఛిష్టానుభోక్తలగు మనవారు నెంతో తెలిసినట్లు (Mytho-logi) యని తమ జ్ఞానసీమాసమాప్తి గావించుకొనుచున్నారు. ఆపదమసదాఖ్యానమునకు మాత్రమే వర్తించునని వారెరుగరు.

పురాణములందు కల్పనకు సంబంధించిన కథలున్నవి. ప్రకృతి సామ్రాజ్యమందలి యలౌకిక రహస్యబోధ సౌకర్యము కొఱకు గ్రహ నక్షత్ర నదీ పర్వతాదుల నాధారముగా గొని నిదానవిద్య ననుసరించి ఋషు లవశ్యముగ గొన్ని కల్పితాఖ్యానములను రచించిరి. కాని వానివలన పాశ్చాత్త్యులెరుంగజాలని వాస్తవికతత్త్వజ్ఞానపరిచయము కల్గుచున్నది. కానిందు మన కది ప్రకృతముకాదు. చెప్పదలచినది పురాణములందు మానవ వంశ నిరూపణమున్నది. కాని అది విజ్ఞానరూపమున నున్నదని గ్రహింపవలెననియే. ఎట్లన: అగస్త్యనక్షత్రము :—అగస్త్య ప్రాణము, జలశోషకము, ఈకథ పురాణములందు మానవ సంబంధమున నున్నది. ఇట్లంతట నెరుంగుచుండవలయును. ఇదే విధముగ నితిహాసములందును సృష్టి ప్రతిపాదింపబడుచుండును. కాని పురాణములందు సృష్టిచరిత్రయు ఇతిహాసములందు మానవ చరిత్రయు ప్రాధాన్యము వహించునని గుర్తించుకొనవలయును.

కొందరు పాశ్చాత్యవిద్వాంసులు "భారతీయులు నిరంతరాత్మచింతాపరులుగాని క్రమబుద్ధేతిహాసము గలవారుకారు. సుసభ్యరాష్ట్రరచనయు, చరిత్ర రచనయు వారావశ్యకములుగ

నెంచలేరని యాక్షేపింతురు.” అది మన సాహిత్యవివేకము వారికి దత్త్వతః లేకుండుటచే దోచినమాట ; ఎవరైనను వారి చరిత్రకొరకు సభ్యతకొరకును మనల నాశ్రయింపవలసియున్నది గాని మనము దేనికిని పరముఖాపేక్షులము గావలసిన పని లేదు.

ఇతిహాసగ్రంథములందు మహాభారతమున కున్నతస్థాన మున్నదన్న దొక గుప్తరహస్యము. వ్యాసుడు, పురాణములు 18 గను, భారతము 18 పర్వములుగను రచించుటవలన 18 సంఖ్యయం దతని కెంతో ప్రేమగలదని తోచును. ఈవిష యము ముందుముందు స్పష్టముకాగలదు.

ఇతి-హ-ఆస = ఈవిధముగ-నే- అయ్యెను (జరిగెను) అను నిర్వచనానుసారము మానవచరిత్ర జరిగినది జరిగినట్లు ప్రతిపాదించు గ్రంథ మితిహాసమందుము. నేటి కైదువేల సంవత్సరములకు బూర్వము కౌరవ-పాండవులందే రాజ్యలిప్స కారణముగా మహాయుద్ధము జరిగెనో, ఏ మహాయుద్ధము భారతలక్ష్మి సర్వనాశమునకు గారణమయ్యెనో ఆ యుద్ధఘట నల నారంభమునుండి యంతము వరకు వర్ణించిన గ్రంథమే మహాభారతము. కనుక దీని నితిహాసమందుము. ఇందు గీతోప దేశమున కవసరమేమి ? ఎప్పుడు ? ఎక్కడ ? ఎవరికి ? అను నైతిహాసిక ప్రశ్నలు పుట్టును. గీత మహాభారత ప్రత్యంశము గదా ! కనుక నైతిహాసిక మర్యాద గీతను విడువదు. అందు వలన 64 శ్లోకము లైతిహాసిక సంబంధము గలవానిని వ్యాసుడు తాను రచించి యిందు జేర్చెను.

మహాభారత మితిహాస గ్రంథమైనను జ్ఞాన విజ్ఞానముల కొక యద్భుతకోశము. 18 పురాణములొకయెత్తు మహాభారత మొకయెత్తు. దీనికి శతపథ బ్రాహ్మణముతో సంబంధము కలదు. శతపథము బ్రాహ్మణములందపూర్వము, జ్ఞాన విజ్ఞానములందిందు లేని విషయములేదు. దీనికి కర్త మహర్షి యాజ్ఞవల్క్యుడు. ఇయ్యది అయన సంపాతము కృత్తికయందుండగా రచింపబడినట్లు "కృత్తికాస్వగ్నీ ఆదధీత ఏతాహవై ప్రాచ్యైదిశోనచ్యవన్తే" అను శతపథవాక్యమువలన దెలియును. క్రీ. శ. 1900 నాటి కయన సంపాతము కృత్తికను విడచి 90 యంశలు జరిగినది. ఒకయంశ జరుగుటకు 75 సం॥లు పట్టుచున్న దంద రెరుంగుదురు. ఈలెక్క ప్రకారము నేటి కైదువేలకు పూర్వము దీని రచనాకాలమై యుండుననుకొన్నచో మహాభారతమున కించుక పూర్వమిది పుట్టియుండును.

మహాభారతమున మొదటినుండి చివరివరకును, ప్రమాణస్థలములం దటనట "ఇతి శాతపథీశ్రుతిః" అని శతపథవచనము లెన్నో యుల్లేఖింపబడినవి. ఒకవిధముగ భారతమంతయు జూచిన నిది శతపథానువాదమాయని తోచును. మరియు జనక యాజ్ఞ్యవల్క్య సంవాదమునందు యాజ్ఞవల్క్యుడు శతపథము తాను రచించినట్లు చెప్పెను. ఈక్రింది వచనముల జూడుడు.

"తతః శతపథం కృత్స్నం మహోత్మ్యంచ స సంగ్రహం
చక్రే సపరిశేషంచ హర్షేణ పరమేణహ

కర్తుం శతపథం చేదం అపూర్వంచకృతం మయా
యథాభిలషితం మార్గం తథాతచ్చోపపాదితమ్. (భార. శాం.)

ఈవిధముగ భారత మితిహాసగ్రంథమే కాక విజ్ఞాన గ్రంథముకూడ నై యున్నది. యిక దీని మహాత్వమునకు రెండవ కారణము భగవద్గీత. అర్జునునికి భగవంతునిచే నుపదేశింప బడిన యపూర్వ జ్ఞానవిజ్ఞానగర్భితా లౌకికబుద్ధియోగమును వ్యాసుడు తన భాషతో 18 అధ్యాయములు గావించి యిందు జేర్చెను. ఇవియెల్ల నటుంచి చూచినను, భారత మన్నిశాస్త్రముల రహస్యార్థములను గరతలామలకము గావించు నపూర్వ జ్ఞానరాశి. మనకేకాదు. విశ్వమంతటికి గావలసిన గీతారత్నము లీభారతసముద్రమునం దెన్నో యున్నవి. వేదబ్రాహ్మణోపనిషత్తుల సారభూత నవనీతమిది. పదునెనిమిది సంఖ్య దీని పూర్ణతకు నిదర్శనము (1+8=9) ఇతిహాసమేగాక తొమ్మిదికళల యీశ్వరనిరూపణయిందు సేయబడినది. ఈవిషయమే భగవద్గీతయం దుపబృంహితమైనది. కృష్ణుని గొప్పతనమును వ్యాసుడు స్వీకరించెను. ఆర్యుడగు ప్రతివ్యక్తియు తనస్వరూప పరిచయము జేసికొనుటకు తనగృహారత్ననిధియగు నీమహాభారత మొకమారైన బఠింపవలయునని మాకోరిక: ఈశ్లోకములం దిలకింపుడు.

1. పురాణసంహితాః పుణ్యాః కథాః ధర్మార్థసంశ్రితాః
ఇతివృత్తం నరేంద్రాణాం, ఋషీణాంచ మహాత్మనాం.

2. ఉవాచసమహాతేజా బ్రహ్మాణం పరమేష్ఠినం
కృతం మయేదం భగవన్ ః కావ్యం పరమపూజితం.

3. బ్రహ్మన్ వేదరహస్యంచ యచ్చాన్యత్ స్థాపితం మయా
సాంగోపనిషదాంచైవ వేదానాం విస్తరక్రియా.

4. ఇతిహాసపురాణానా మున్మేషం నిర్మితం చయత్
భూతం భవ్యం భవిష్యంచ త్రివిధం కాలసంజ్ఞితం.

5. జరామృత్యుభయవ్యాధి భావాభావ విసిశ్చయః
వివిధస్యచ ధర్మస్య హ్యాశ్రమాణాంచ లక్షణం.

6. చాతుర్వర్ణ్యవిధానంచ పురాణానాంచ కృత్స్నశః
తపసో బ్రహ్మచర్యస్య పృధివ్యాశ్చంద్ర సూర్యయోః.

7. గ్రహనక్షత్ర తారాణాం ప్రమాణంచ యుగైస్సహ
ఋచోయజూం షిసామాని వేదాధ్యాత్మం తథైవచ.

8. న్యాయశిక్షా చికిత్సాచ దానం పాశుపతం తథా
హేతునైవసమం జన్మ దివ్యమానుష సంజ్ఞితం.

9. తీర్థానాంచైవ పుణ్యానాం దేశానాంచైవ కీర్తనం
నదీనాం పర్వతానాంచ వనానాం సాగరస్యచ.

10. పురాణాంచైవ దివ్యానాం కల్పానాం యుద్ధకౌశలం
వాక్యజాతి విశేషాశ్చ లోకయంత్రా క్రమశ్చయః.

11. యచ్చాపి సర్వగంవస్తు తచ్చైచ్చవ ప్రతిపాదితమ్
పరం నలేఖకః కశ్చిత్ ఏతస్య భువివిద్యతే
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తినకుత్రచిత్.

12. అర్థశాస్త్రమిదం ప్రోక్తం ధర్మశాస్త్రమిదం మహత్
కామశాస్త్రమిదం ప్రోక్తం వ్యాసేనామితబుద్ధినా.

13. యోవిద్యాచ్చతురో వేదాన్ సాంగోపనిషదో ద్విజః
నచాఖ్యానమిదం విద్యాత్ నైవసస్యాద్విచక్షణః.

మహాభారతము తన యితిహాసము నార్యేతిహాసారంభ కాలమగు దేవయుగమ్మునో ప్రారంభించినది. నాటినుండి తన కాలమువరకు చరిత్ర నిరూపణము దానియుద్దేశ్యము. ఇందది పూర్తిగ సాఫల్యమొందెను.

మన యైతిహాసిక గ్రంథముల యాధారమున ఆర్యరాజ వంశములను సూర్యవంశ-చంద్రవంశ-అగ్నివంశములని మూడు భాగములు సేయవచ్చును. దేవయుగకాలమున దేవలోకమున (స్వర్గమున) ఆదిత్య - సూర్య - ఇత్యాది నామప్రసిద్ధములగు 1 ఇంద్ర, 2 ధాతా, 3 భగ, 4 పూషా, 5 అర్యమా, 6 త్వష్టా, 7 వరుణ, 8 అంశు, 9 వివస్వాన్, 10 సవితా, 11 విష్ణు, 12 మిత్ర. అను 12 దేవజాతులు ప్రసిద్ధములుగ నుండెను. ఇందును వివస్వాన్ నామకజాతి విశేషగౌరవము నందెను. భారతవర్ష సామ్రాజ్య మీజాతివారికే లభించెను. ఇందు ప్రబల ప్రతాపవంతుడు — స్వాయంభూబ్రహ్మ యొక్క-* మానసపుత్రుడు స్వాయంభువుడను వివస్వంతుడు. ఈసూర్య వంశమున కాదిప్రవర్తకుడు. ఇతనికి శ్రద్ధాదేవుడు, యముడునని

* స్వయంభువు దేవయుగ వ్యవస్థాపకుడు, ఇతడు యోగ్యుడగు వ్యక్తిని తన దత్తకునిగ స్వీకరించువాడు. అట్టి దత్తకులే పురాణేతిహాసములందు మానసపుత్రు లని వ్యవహరింపబడిరి.

యిరువురు ఔరసపుత్రులు. "శ్రద్ధాదేవో వై మనుః" అని బ్రాహ్మణములందున్న శ్రద్ధాదేవుడు-వైదికముగ యక్షువనునది పాఠదోషమున చక్షువైనట్లు-పురాణములందు సంశోధకదోషమున శ్రాద్ధదేవు డయ్యెను. ఇతడు పెద్దకొడుకు గనుక స్వాయంభువుయొక్క యనుజ్ఞచే మను పదమొందెను. మనువనునది వ్యక్తి వాచకముగాదు. భారతీయ ప్రజాశాసనము గావించు సమ్రాట్టున కాధికారికసంజ్ఞ. మనుసంబంధమున బ్రజలు మనుష్యులు, మానవులు ననబడుచున్నారని యెరిగినదే గదా! భారతవర్ష సమ్రాట్టును నీశ్రద్ధాదేవుడే వివస్వత్పుత్రుడగుటచే వైవస్వతమనువని పేరొందెను. రాజాయను శబ్దము యొక్క మొదటి యావిష్కార మీవైవస్వతునకే యైనట్లు తోచును. భారతవర్షమున కితడే మొదటి సామ్రాట్టు గదా! ఇతడిట్లు మనుష్యప్రజాధికారి కాగా, వివస్వంతుని రెండవకొడుకు యముడు వైవస్వతుడను పేరుతోడనే పితృప్రజలకు శాసకు డయ్యెను. ఈశ్రుతి వచనముల గమనింపుడు.

> "మనుర్వైవస్వతో రాజేత్యాహ । తస్యమనుష్యావిశః (ప్రజాః) । తఇమఆసతఇత్యశ్రోత్రియా గృహమేధిన ఉపసమేతాభవన్తి। యమోవైవస్వతో రాజేత్యాహ । తస్యపితరో విశః తఇమఆసతఇతి స్థవిరా ఉపసమేతా భవన్తి." (శత)

కాకేశశపర్వతములందు నివాసమేర్పరచుకొన్న స్వాయంభూబ్రహ్మ మానవసమాజవ్యవస్థ సుష్ఠుగా నుండుటకు, వేద-

లోక-ప్రజా-ధర్మములను నాల్గింటి వ్యవస్థ కావించెను. అసుర త్రిలోకితో మనకవసరములేదు. దేవత్రిలోకియందుండు ప్రజల నైదువర్గములుగా జేసెను. వారు 1 ఋషి, 2 పితృ, 3 దేవ, 4 దేవయోని, 5 మనుష్యనామములం బ్రసిద్ధులైరి.

1. ఋషి :—ప్రాకృతిక ప్రాణతత్త్వమును ఋషియందురు. ఇది సృష్టికి మూలప్రవర్తకము. ఇది యనేకవిధములని "విరూపాసఇద్ఋషయః తఇద్గంభీరవేపసః" అను శ్రౌతవచనముచే స్పష్టము. వశిష్ఠ, విశ్వామిత్ర, కశ్యపాది నామములన్నియు ప్రాణాత్మక ఋషులు. సృష్టిప్రవర్తక మూలతత్త్వములు. చిరకాల తపోయోగమున నీప్రాణతత్త్వ మెరింగిన వారు మనుష్యఋషులు, ఏప్రాణముం గనిపెట్టినవారికా ప్రాణము పేరువచ్చును. వారా ప్రాణముద్వారా అపూర్వవిజ్ఞానముల నావిష్కరించుచుండిరి. చివరకు, మనుష్యఋషులు ప్రాణఋషుల ద్రష్టలనియర్థము. వారు త్రిలోకములం దెందైన దిరుగుచుందురు-నివసింతురు వారికి తమ తపోయోగమున లోకకళ్యాణము గావించుటే ముఖ్యకార్యము.

విద్యాతారతమ్యమున నీమనుష్యజులం దైదవాంతర విభాగములు. 1 విప్ర, 2 బ్రాహ్మణ, 3 దేవ, 4 ఋషి, 5 బ్రహ్మ అని. (1) బ్రాహ్మణకులమున జన్మమాత్ర మొందిన జాత్యోపజీవి. (1) విప్రుడు-వీరికి సమాజప్రతిష్ఠ నామమాత్రము. (2) శాస్త్రపరిజ్ఞాతయగుబ్రాహ్మణుడు బ్రాహ్మణుడు వీరు

అధ్యయనాధ్యాపనవృత్తియం దారూఢులై యుండుదురు. (3) ప్రాకృతిక ప్రాణదేవతలయాధారమున దేవయజనరూప యజ్ఞకర్మరతులై తదాధారమున అనావృష్టి-మహామారి ఆది బాధలనుండి ప్రజలం గాపాడువారగు కర్మఠులగువారిని దేవత లనిరి. వీరే భూసురులు-భూదేవులును. (3) ఈసంబంధమున నీవచనములం జూడుడు.

"ద్వయాహ వై దేవాః। దేవాఅహైవదేవాః" (ప్రాకృతిక నిత్యదేవతలు)
"అథయేబ్రాహ్మణా శుశ్రువాన్సః అనూచానాస్తే మనుష్యదేవాః" (శత)
"అథహైతే మనుష్యదేవాః, యేబ్రాహ్మణాః" (షడ్వింం. బ్రా.)
"ఏతేవై దేవా అహుతాదో, యద్బ్రాహ్మణాః" (గో. బ్రా.)

(4) మౌలికప్రాణతత్త్వమొకటియో యింక నెక్కువో పరీక్షించి సాక్షాత్కారము గాంచిన బ్రాహ్మణుడు ఋషి-మంత్రద్రష్ట-'ఋషయోమంత్రద్రష్టారః। సాక్షాత్కృతధర్మాణః ఋషయో బభూవుః.' (5) ఇట్టిఋషు లనేకు లేమహాపురుషుని యధ్యక్షత నీప్రాణపరీక్ష సేయుచుందురో అతడు కులపతి-బ్రహ్మయందురు. దేవయుగమున నిట్టి బ్రహ్మపరిషత్తు లనేకము లుండెను. అందు పది ప్రధానములు. వీనిని లక్షించియే పురాణమున "దశబ్రహ్మాణఇత్యేతే పురాణేనిశ్చయం గతాః" అని చెప్పబడెను. ఈవివరణము ప్రకృతముకాదు. ఈవచనముం జూడుడు.

"ఉద్దాలకో హారుణిః ఉదీచ్యాన్ వృతో ధావయాంచకార తస్యనిష్క ఉపాహిత ఆస । ఏతద్ధస్మవై తత్పూర్వేషాం వృతానాం ధావయతా మేకధనముపాహితం, భవతి । ఉపవల్హాయ, బిభ్యతాన్ తాన్హోదీచ్యానాం బ్రాహ్మణాన్ భీర్వివేద । కౌరుపాంచాలో వా అయం బ్రహ్మపుత్రః." (శత. బ్రా.)

ఈయైదు తరగతులందును 1 బ్రహ్మాపర్షదధ్యక్ష కులపతి బ్రహ్మవర్గమును, 2 ప్రాణపరీక్షక ఋషివర్గమును, సర్వథా స్వతంత్రములు. కేవలము స్వాయంభూశాసనమే వీరిపై సాగుచుండును. వీరిపై భారతీయరాజుల కెట్టి ప్రభుత్వములేదు సరిగదా! వారినే వీరొక విధముగా శాసించుచుండిరి. ఎట్లన :— వారియందు ధర్మనీతి లోపము కనబడినచో వారి నణచివేయుచుండిరి. బ్రహ్మబలమే క్షత్రిబలముం జయించుచుండినది. వేన, నహుషాదుల చరిత్రలిందు కుదాహరణములు. ఇక :—

(3) యజ్ఞకర్మాధిష్ఠాతృదేవ వర్గము. (4) శాస్త్రనిష్ఠ బ్రాహ్మణవర్గము ఈ రెంటిపై చంద్రుని యాధిపత్యముండెను. చంద్రుడత్రి మహర్షి యౌరసపుత్రుడు. జాతిచే బ్రాహ్మణుడు. స్వాయంభువితని నుత్తరదిశకు దిక్పాలునిగను, ఓషధులకు దేవ బ్రాహ్మణులకును, లోకపాలునుగను నియమించెను. కనుక "సోమోఽస్మాకం బ్రాహ్మణానాంరాజా" ఇత్యాదులవలన వీరిపై భారతీయ రాజులకెట్టి ప్రభుత్వములేదు. ఈ నాల్గు వర్గములే శ్రోత్రియ వర్గములు. వీరే వైవస్వతనును శాసనమునకు పృథగ్భూతులు.

ఇక నైదవదగు యథాజాతాశ్రోత్రియ విప్రవర్గమును, క్షత్రియ - వైశ్య, శూద్ర, అవరవర్ణాది - యితర - అశ్రోతియ గృహమేధి మనుష్యులును మనుశాసనమునకు లోబడినవారు. వీరైదుగురే యొక విధముగ భారతవర్షీయ వర్గములుగ నుండిరి.

2. పితరులు :— మౌలిక ప్రాణతత్త్వము ఋషియం టిమి. ఇదియే, యజస్సు..ఇందు యత్—జూ, అని రెండు భాగ ములు. (1) యత్=గతితత్త్వము. ఇదే ప్రాణము. (2) జూ:- స్థితితత్త్వము ఇదే వాక్కు. ప్రాణమగు ఋషియొక్క వ్యాపా రమువలన వాక్కు ద్రుతమై ఆపోరూపమున బరిణతమగును,- ఇదే ఋషి ప్రాణముయొక్క యౌగికావస్థ. అనేక మౌలిక ప్రాణ (ఋషుల) ముల యొక్క రాసాయనిక సంయోగము వలన నుత్పన్నమగు యౌగిక - ఆప్యప్రాణము లేదా సౌమ్య ప్రాణమే పితరులు. "ఋషిభ్యః పితరోజాతాః" (మను.) ఋషి నుండి మొదట నీ సౌమ్యప్రాణరూప పితృవికాస మగును. ఈ పితృప్రాణమే మైథునీసృష్టికి మూలప్రవర్తకము. శుక్రమే దీనికి ప్రతిష్ఠ. ఏడుతరములవరకు నీ పితృప్రాణమునకు వితానముండును. కనుకనే "సాపిండ్యంసప్త పౌరుషం" "సపిండ తాతు పురుషేసప్తమేవినివర్తతే" అని స్మరించబడెను. ఈ పితృ ప్రాణమునకు (1) నాందీముఖ (2) పార్వణ (3) అశ్రుముఖ భేదమున మూడు వర్గములు; వీరికే మరల - అగ్నిష్వాత్తా (2) సోమసద్ (3) బర్హిషత్ (4) ఆజ్యపా (5) సోమపా

(6) హావిర్భుక్ (7) సుకాలీ—ఆదిగా ననేక భేదములు కలవు. వీని వివరణమునకు ప్రత్యేక గ్రంథమవసరమైయున్నది. ఇంతకు జెప్పవచ్చినదేమనగా:—ఏ మనుష్యుల యంతరాత్మయందీ పితృప్రాణ మితర ప్రాణములకంటె నధికముగ గలదో యా మనుష్యులు దేవయుగమున పితరులని పేరొందిరి. ఇదియొక స్వతంత్ర జాతి. ఈ పితృలోకమును నేడు మంగోలియా యనుచున్నాము. ఈ పితృప్రజలపై సాయంభువవివస్వాన్ యొక్క రెండవ కొడుకు వైవస్వత - యముడధికారము గల్గియుండెను.

3. దేవతలు :—ఋషినుండి పితృప్రాణ వికాసము జరిగినది. ఇది స్నేహ-తేజోభేదమున రెండు భాగములు (1) స్నేహతత్త్వము భృగువనియు (2) తేజోతత్త్వమంగిరా యనియు నందురు. భృగువుయొక్క యవస్థావిశేషరూప దాహ్యాసోమ సంబంధమున నంగిరోఽగ్ని ప్రజ్వలితమై సూర్యరూపమున బరిణమించును. ఈ సౌమ్యాగ్ని మయజ్యోతిర్ఘన సౌరప్రాణము పేరే దేవత యయ్యెను. ఈ దేవప్రాణమే మరల 8 వసువులు, 11 రుద్రులు, 12 ఆదిత్యులు 1 ప్రజాపతి 1 వషట్కారము అను భేదములచే 33 విభాగములం బరిణతిగాంచెను. ఈ 33 గురు ప్రాకృతికనిత్య ప్రాణదేవతలందురు. "పితృభ్యో దేవదానవాః" (మనువు) - ఇక :—ఏమనుష్యుల యంతరాత్మయందే దేవతాప్రాణము యొక్క వికాసముండెనో వారా దేవతానామమున బ్రసిద్ధిగొందిరి. ఏయుగమునందు స్వాయంభూ ద్వారా

ఈ యపూర్వాన్వేషణ జరిగి పృథివిపై మనుషులందే దేవ వ్యవస్థ ప్రతిష్ఠితమయ్యెనో ఆ యుగమే దేవయుగమని వ్యవహరింపబడినది. దాని వివరణము పూర్వ ప్రకరణమున (కాలమీమాంసా) గావింపబడినది.

హిమాలయ ద్రోణుల కావలివైపున $47\frac{1}{2}$ మొదలు 90 అక్షాంశల వరకు గల స్థానము స్వర్గలోకమందురని "ఉత్తరే హిమవత్పార్శ్వేపుణ్యే సర్వగుణాన్వితే" ఇత్యాది వచనముల వలన స్పష్టము. ఇందీ దేవజాతి నివసించుచున్నది. 12 గురు దిత్యులలో ఇంద్రనామక ప్రసిద్ధ దేవజాతి వ్యక్తి స్వర్గాధ్యక్షుడగుచుండెను. ఇంద్రశబ్దము జాతివాచకముగాని వ్యక్తివాచకము కాదు. ఈ శబ్దము క్రమముగ స్వర్గాధ్యక్షునందు రూఢమైపోయినది. ఈ యింద్రుడు స్వర్గమునకు స్వరాట్ శాసకుడుగనుండెను.

4. దేవయోనులు :—

1 2 3 4 5 6
"విద్యాధరోప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాః
7 8 9
పిశాచో గుహ్యకస్సిద్ధో భూతోఽమిదేవయోనయః."

ఈ తొమ్మిది జాతులవారు నంతరిక్షలోక నివాసులు. వీరిని తిర్యగ్జాతులనియునందురు. శర్యణావతపర్వతము (శివాలక) నుండి $\frac{\text{రావినది}}{\text{ఇరావతి}}$ పుట్టుచోటి కుత్తరము వైపునను, హిమా

లయమున కిటునటుగల ప్రాంతమంతయు వీరి కావాసభూమి. సుప్రసిద్ధ వందనవనము, వైభ్రాజవనము, కాననవనము, ఉమావనము, స్కందవనము మొదలగు మహావనములు ఈలోకమున గలవు. ఈ ప్రజాశాసకుడు వాయుదేవత.

5. మనుష్యులు :—అశ్రోత్రియ విప్రనామక బ్రాహ్మణులు, త్రివిధక్షత్రియులు, భలందనవంశజులగు వైశ్యులు, సచ్ఛూద్రులు, అంత్యజులు, అంత్యావసాయులు అని మనుష్య ప్రజ ఆరు భాగములుగా జేయబడియుండెను. వీరందరు శ్రద్ధాదేవుడను వైవస్వతమనువు పాలనములోనివారు. మానవధర్మశాస్త్ర మీప్రజాశాసనసూత్రము. ఇయ్యది కేవలము భారతీయ ప్రజానియంత్రణమే చేయగలదు. శ్రోత్రియములును పూర్వోక్తములు నగు నాల్గు బ్రాహ్మణవర్గములును, దేవయోని వర్గమును, ఈ నియంత్రణమునకు బహిర్భూతములు, కనుకనే అంతరిక్షలోకమందు గంధర్వాధ్యక్షుడగు చంద్రుడు గురుపత్నియగు తారతో గావించుకొన్న గాంధర్వవివాహ మనుచితముగ నెంచబడలేదు.

మొత్త మీయైదు విభాగములకు (అనగా పూర్వోక్త ఋషి, పితృ, దేవ, దేవయోని, మనుష్యులకు) శాస్తలు:—

1 విరాట్టనుపేర బ్రసిద్ధుడగు భగవాన్ స్వాయంభూబ్రహ్మయు, ఉత్తరదిశయందు నిరతమున కెదురుగనుండు భద్రగిరి-చంద్రగిరి యను పర్వతముల నడుమ నివసించు భగవంతుడు విష్ణువునై

యుండిరి. భారతీయప్రజల కాపత్తు ఏదైన వచ్చినపుడు వారు రాజును శరణు కోరినచో నతడు దానిం దీర్ప నసమర్థుడగు నెడల నతడును వారు గలిసి దేవతల శరణొందువారు. వారు నసమర్థులైనపుడు వారును వీరును గలసి బ్రహ్మకడకు బోయెడువారు. అతడు విష్ణువుతో పరామర్శగావించి వ్యవహార మంతయు వ్యవస్థిత మొనరించువాడు. ఇది యానాటి శాసన ప్రణాలిక! సుసమృద్ధవైభవము! అపూర్వఅభ్యుదయము! దేవయుగము మొదలు భారతకాలమునుండి ఇంచుమించు పదు నైదువేల సంవత్సరముల పూర్వమువరకు నీవ్యవస్థ చక్కగా సాగిపోయెను. పిమ్మట మనచరిత్ర నాయకుడగు చంద్రుని తారాహరణ సందర్భమున దేవబలము నష్టప్రాయమగుటయు, అసురులచే యజ్ఞసాధక సోమవల్లి భిన్నభిన్నము గావింపబడు టయు నయ్యెను. దేవత్రిలోకి యసురాధిపత్యము క్రిందికి వచ్చెను. ఈచరిత్ర మరియొకచో జూచుకొందము.

ప్రకృతమేమన:—వైవస్వతమనువు (శ్రద్ధాదేవుడు) స్వాయంభువ వివస్వాన్నామక సూర్యపుత్రుడు. ఇతడు భారత వర్ష సమ్రాట్టగాక, భారతవర్షమునం దెన్నడు స్థిరముగా నుండక జీవితపర్యంత ముత్తరకురుక్షేత్ర మనగా స్వర్గలోక-దేవలోక మందె యుండి యిచ్చటి ప్రజాపాలనమునకు దన పుత్రులనే నియమించెను. ఇతనికి: 1 ఇక్ష్వాకు, 2 నృగ, 3 ధృష్ట, 4 శర్యాతి, 5 నరిష్యంత, 6 ప్రాంశు, 7 నాభానేదిష్ఠ,

8 కరుష, 9 పృషధ్ర, 10 సుద్యుమ్ననామకులగు పదిమంది పుత్రులును ఇలా (డా) యను నొక కన్యయు నుండిరి. అందరిలో గూతురే పెద్దది. కానిండు.

మగబిడ్డలు పదిమందియు వివస్వాన్ సూర్యపౌత్రులు, వైవస్వతమను (శ్రద్ధాదేవ) పుత్రులు. వీరి వంశధరులను సూర్యవంశ క్షత్రియులందురు. వైవస్వతమనువు మూలపురుషు డనవచ్చును. భారతవర్షపు మొదటి సమ్రాట్టు ఇక్ష్వాకువు గనుక "ఇక్ష్వాకుకులసంతతేః" (రఘు) అన్నట్లు అతడును సూర్యవంశ ప్రవర్తకు డనవచ్చును. వైవస్వతుడు తన పెద్దకొడుకగు నిక్ష్వాకుని భారతవర్ష మనువుగజేయుచు, "నాయనా నీవును నీతమ్ములును న్యాయపూర్వకముగా భారతవర్షముం బంచికొను"డని యాదేశించెను. అట్లే వైవస్వతుడు దివంగతుడైన పిదప ఇక్ష్వాకువు దాయధర్మానుసారము రాజ్యమును పదిభాగములు గావించెను. ఈవచనము జూడుడు:

"ప్రవిష్టేతుమనౌ తాత! దివాకరతనుం, తదా
దశధాతత్రతత్ క్షేత్రం అకరోత్పృథివీం మనుః."

మను పుత్రులలో బెద్దవాడు సమ్రాట్టు నగుటచే నితడు (ఇక్ష్వాకువు) మనువని ప్రసిద్ధినొందెను. ఇతడట్లు భూలోకమును 10 భాగములుగావించి గంగానదికి దూర్పున అయోధ్య యను రాజధానిని స్థాపించెను. సూర్యవంశీయుల కిది ప్రథమము, ప్రధానము, శ్రేష్ఠమునగు రాజధానియని పేరొందెను.

ఇతని తక్కిన తొంబదియెనమండుగురు సోదరులును దమతమ స్వతంత్ర మాండలిక రాజ్యములు స్థాపించుకొనిరి. ఈవిధముగ సూర్యవంశ మనేకశాఖ లయ్యెను. వీరందరియందు నిక్ష్వాకు వంశజులు చాల ప్రతాపవంతులైరి. అతని కొడుకులందు పెద్ద వాడగు వికుక్షి కయోధ్యారాజ్యము లభించెను. వికుక్షికి సుప్రసిద్ధుడగు కాకుత్థ్సుడు పుట్టెను. ఇతనిపేర నీవంశము కాకుత్థ్సవంశమని పేరొందినట్లు "కాకుత్థ్సమాలోకయతాం నృపాణాం మనోబభూవేందుమతీ నిరాశం" ఇత్యాదులచే దెలియనగును.

ఇక్ష్వాకువుయొక్క కనిష్ఠపుత్రు డితిహాస ప్రసిద్ధుడగు నిమి. ఇతనికి తనయన్నతో నేదో యొకకారణమున వైమనస్య మేర్పడగా నయోధ్యవిడచి మానవ్రతధరుడై వెడలిపోయెను. అప్పటివరకు వారి కులపురోహితుడు వశిష్ఠుడు. కాని నిమి రాజ్యత్యాగము సేయుచు, రహూగణ-గోతముని దనపురో హితుం జేసికొని యతనిని వెంట గొంపోయెను. చివరకు అయోధ్యావైశాలీనగరములమధ్య జలప్లావిత భూప్రదేశము యజ్ఞప్రక్రియచే నెండించి యందతడు తన క్రొత్తరాజ్యము స్థాపించుకొని మానవ్రతమును విడచెను. ఇతని రాజ్యమున కంతిమసీమ సదానీరయనునది. యితడు కోసల విదేహులకు మూలపురుషుడయ్యెను. వసిష్ఠశాపమున నితని శరీరము మండి పోగా మంథనప్రక్రియచే నితడు మరల బ్రతికింపబడెను. అప్పు

డితనికి (మధి) మిధియను పేరువచ్చెను. ఈతని వంశజులను మాధవులందురు. వీరే క్రమముగా మైథిలు లనబడిరి. ఇతని వలన నీనగరమునకు మిథిలయనిపేరు. శతపథ 1-4-1-1 చూ. ఈవంశమున జనకుడు ప్రసిద్ధుడగుటచే ఈవంశమును జనకవంశ మనిరి. ఈవంశమందు జగన్మాత జానకి యావిర్భవించెను. ఆమె నయోధ్యాధిపతియగు దశరథుని జ్యేష్ఠపుత్రుడు భగవాన్ శ్రీరామచంద్రుడు వివాహము చేసికొనెను. ఇచట నొకవిష యము జ్ఞప్తియుంచుకొనవలెను. ఆయుగమున రాజుల హికసంబంధములు పురోహితుల గోత్రములతో న ధి. ఈవివాహమట్లే సంపన్నమైనది. అటుగానిచో ంశజ వికుక్షి శాఖలోని దశరథుడును, అందే నిమి విదేహజనకుడును సగోత్రులగుటచే నీవివాహ త మగునుగదా! అది యుండనిండు.

నిమి వంశమందు సీరధ్వజ-ఉగ్రసేన-జనదేవ-ధర్మ ాదు లనేకులు మహాపురుషులు పుట్టిరి. ఇందు నకుడు యాజ్ఞవల్క్యశిష్యుడు. ఇతని కాలమున బ్రహ్మ ప్రచారము మెండుగ నుండెను. ప్రసంగవశమున నిమి ము జెప్పవలసి వచ్చెను. ఇక వికుక్షి వంశము వంకకు మరలుదము.

వైవస్వతమనువు మొదలు మహాభారత కాలీనుడగు సుమిత్రునివరకు సూర్యవంశ మవిచ్ఛిన్నముగ నుండెను. ఈలో

పల 164 గు రమోధ్యం బాలించిది. ఇతిహాసప్రసిద్ధులగు యువనాశ్వ, మాంధాత, హరిశ్చంద్ర, సగర-అంశుమాన్, భగీరథ, ఋతుపర్ణ, దిలీప-రఘు-అజ-దశరథ-భగవాన్ రామ చంద్ర, కుశ ఆద్యనేకమహాపురుషు లీవంశమునకు పేరుదెచ్చిరి. వివస్వంతున కరువదినాలవ తరమున భగవాన్ శ్రీరామచం ద్రుని యవతారము. సూర్యవంశాంతిమరాజు సుమిత్రుడు భారతయుద్ధమునం దుండెను. ఆనాడు కురువంశము గొప్పది అందువలన సుమిత్రుడుగూడ వారి యనుశాసనానుసారము నడువవలసి వచ్చెను. సుమిత్రుని వంశము వారివలననే లిచ్ఛవి వంశస్థాపన జరిగెను. ఇందు గౌతమబుద్ధు డుదం ఇంతటితో సూర్యవంశము తన యుచ్చాసనమునుండి నొందెను.

చంద్రవంశము :- వైవస్వతమనువున కిక్ష్వాక లగు పదిమంది కొడుకులకంటె పెద్దది ఇలయను క నని చెప్పియుంటిమి. మానవధర్మశాస్త్రానుసారము పత్నిపై గూతున కధికారములేదు. నేడు నదే ధర్మ గదా! (Mulla 1936 Page 38) అయినను తండ్రికి మి ప్రేమపాత్ర యగుటచే నీమెకుగూడ భాగమువెట్టి యారాజ్య భాగ మామె స్త్రీయగుటచే పాలనయం దసమర్థురాలని యెంచి కనిష్టభ్రాతయగు సుద్యుమ్నునిపరముగ నుంచబడియెను.

* భరతఖండ మధ్యస్థమగు సుప్రసిద్ధ సింధునద పశ్చిమమున నేడు బలఖ్ అను బాహ్లీక నగరము, సుద్యుమ్న నివాసముగా నుండెను. ఇలకు దాయాదమునందు లభించిన

* మన యైతిహాసిక పరిజ్ఞానము లేక కొందరీ హిందూదేశమే భారతవర్షమనుకొని విశ్రమించుచున్నారు. మన యైతిహాసిక భౌగోళిక నిరూపణమిట్లున్నదని యెరుంగవలయును :-భారతవర్షపు పూర్వసీమ పీత సముద్రము (చీనా) (Yello sea) దీనినే ప్రశాంత సాగరమనియు నందురు- పశ్చిమసీమ రక్తసముద్రము (Red sea) పౌరాణికదృష్టితో మహీసాగరము (Meditaranian sea) దక్షిణసీమ నిరక్షదేశమగు లంక, నేడిది సముద్ర లీనమైపోయినది. (Cylon) సింహళము లంకకాదు. భారతీయ ద్వీపగణనయందు సింహళద్వీపము వేరుగా జెప్పబడినది. ఈ సింహళము పురాణములందు తామ్రపర్ణమని యున్నది. టాపూరోవెన్ అన్నిది దీని యపభ్రంశరూపము సింహళము అప్పుడప్పుడు రావణునకు విహారస్థలమై యుండవచ్చును. ఉత్తరసీమ ఇరావతీ రావీనదుల జన్మస్థానమును ప్రస్తుతము శివాలక యనబడు శర్యణావత పర్వతము. ఇది నిరక్షదేశమునుండి $37\frac{1}{2}$ అక్షాంశలపై నున్నది. ఈరాను (ఆర్యాయణము) అరబ్బిస్తానము, కాబూలు (కుభా) కంధారము (గాంధారము) బలఖ్ (బాహ్లీకము, ఇది దేవయుగమున వరుణ రాజధాని) బుఖారా (పుష్కరము, బ్రహ్మనివాసభూమి) మొదలగు ప్రాంతము లన్నియు భారతవర్షావయవములు. మన పైతృకసంపత్తులు. ఈశ్లోకములు చూడుడు.

"ఏతత్తు భారతం వర్షం చతుస్సంస్థాన సంజ్ఞితం
దక్షిణాపరతోహ్యస్య పూర్వేణచమహోదధిః
హిమవానుత్తరేణాస్య కార్ముకస్యయథాగుణః (మార్కం)

2. ఆసముద్రాత్తు వై పూర్వాత్ ఆసముద్రాత్తు పశ్చిమాత్
తయోరే వాంతరంగిర్యోః ఆర్యావర్తం ప్రచక్షతే.

ప్రాంతము * ప్రతిష్ఠానపురమని తోచుచున్నది. తద్రాజ్యప్రబంధముకొరకు సుద్యుమ్నుడందే నివసించెను. కనుకనే పురాణములందు ప్రతిష్ఠానమొకచో సుద్యుమ్న రాజధానియనియు, నొకచో నిలా రాజధానియనియు వర్ణింపబడినది.

స్వయంభూబ్రహ్మ కైశ్వర్యసంబంధమున వివస్వాన్ మొదలగు ననేకపుత్రు లున్నట్లే విద్యాసంబంధమునగూడ నితని కనేకులు మానసపుత్రు లుండిరి. ఈవిద్యా పుత్రులందు 1 మరీచి, 2 అంగిరా, 3 అత్రి, 4 పులస్త్య, 5 పులహ, 6 క్రతువులను నీయార్వురును మిగుల ప్రసిద్ధులు: ఈవచనముల జూడుడు.

"బ్రహ్మణో మానసాః పుత్రాః విదితాః షణ్మహర్షయః
మరీచిరంగిరా అత్రిః పులస్త్యః పులహః క్రతుః
అత్రేస్తుబహవః పుత్రాః శ్రూయన్తే మనుజాధిప
సర్వేవేదవిదః సిద్ధాః శాంతాత్మానో మహర్షయః."

ఈయూరువురందును భారతనివాసియగు నత్రి మూడవవాడు. కనుకనే అత్రియను పేరొందెనని "అహం తృతీయ ఇత్యర్థః తస్మాదత్రిః సకీర్త్యతే (బ్రహ్మాండ") అను వచనము చెప్పుచున్నది. ఈయత్రి ప్రాణవిధ అత్రికి ద్రష్ట (పరీక్షకుడు

* కొందరీ ప్రతిష్ఠాన పురము ప్రయాగ సమీపమందుండెననియు, కొందరు హస్తినాపుర సమీప మందుండెననియు, ననుచున్నారు గాని ఆ యీ మతములన్నియు భ్రాంతిమూలకములు. ఇది సింధునదపశ్చిమమున 5 క్రోశముల దూరమున నార్యాయణ నామ పశ్చిమభారతమున నుండెను. ఈ విషయమత్రి చరిత్రయందరయ నగును.

ఆవిష్కర్త) కనుక నితడు నత్రియని పేరొందెను. బ్రహ్మచే నందరికంటె ముందితడే వేదప్రచారమున నియతుడయ్యెను. ఈయత్రి శబ్దము క్రమముగా వంశపరంపరయందు రూఢ మయ్యెను. దేవయుగమందు ఆత్రేయబ్రహ్మపరిషత్తునకు క్రమ ముగా భౌమాత్రి, సాంఖ్యాత్రియను నిరువురత్రులే కులపతు లైరి. ఇందు మొదటివాడగు భౌమాత్రియను కులపతి పార దర్శకతాప్రతిబంధకమును, చంద్రగ్రహణాధిష్ఠాతయు నగునత్రి ప్రాణపరీక్ష చక్కగాజేసి ప్రప్రథమమున గ్రహణవిద్య నావిష్క రించెను. కనుకనే యితడు భౌమాత్రియని పేరొందెను. ఇతని కనసూయాగర్భమున జంద్రు డుదయించెను.

రెండవవాడగు సాంఖ్యాత్రి ఉత్తర ధ్రువమండలస్థనాక్ష త్రికాత్రి ప్రాణపరీక్ష గావించెను. యితని కొడుకు శాంఖాయ నుడు. ఈ కొడుకు చాల దుర్మార్గుడు-అధార్మికుడు. ఇతని కెంతగా సదుపదేశములు చేసినను వ్యర్థము కాగా జేయునది లేక నిరాశతో తండ్రియగు సాంఖ్యాత్రి సింధుదేశమున దేవని కాయమను పర్వతమున (నేటి సులేమాన్ పర్వతమున) నివాస మేర్పర్చుకొనెను. పిమ్మట నతని కొడుకు శాంఖాయనుడు నతని వంశీయులును ధర్మచ్యుతులై యవనవంశము (గ్రీకులకు) నకాది ప్రవర్తకులైరి. ఈ విధముగ సాంఖ్యాత్రివంశ ముచ్ఛిన్న ప్రాయమైపోయినది.

భౌమాత్రి పుత్రుడగు చంద్రుడు సోమవల్లీ రక్షణా ర్థము. గంధర్వరాజుగను, ఉత్తరదిక్పాలకుడుగను, జేయబడెను.

ఉత్క్రామంతం స్థితంవాపి భుంజానం వాగుణాన్వితం
విమూఢానాను పశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః
యతంతో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితం
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః.

(5) గుణత్రయోపాధి భిన్నములను, నానా యోన్యాకారములు నగు మహద్విశేషములను ధరించు నశ్వత్థావ్యయు డొకనికే విభిన్న నామ రూప గుణ కర్మ గ్రాహిత్వము.

యదాదిత్య గతం తేజో జగ ద్భాసయతేఽఖిలం
యచ్చాంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకం
గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః
అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం

(6) అశ్వత్థావ్యయు డొక్కనికే ప్రతిజీవ శరీర భిన్నత్వమున నుపలబ్ధి యున్నను, ఔపాధిక భేదము తుచ్ఛమగుటచే జీవావ్యయు లెల్ల రకు పరమావ్యయా నతిరేకమున నైకాత్మ్యము.

సర్వస్య చాహం హృది సన్నివిష్టః
మత్తః స్మృతి జ్ఞాన మపోహనం చ
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః
వేదాంత కృద్వేదవిదే వచాహం

(7) అశ్వత్థ పరమావ్యయు డొకనికే ప్రత్యర్థమందును క్షరాక్షర సంజ్ఞలు గలట్టియు, కర్మభేద ప్రయోజక గుణత్రయోపాధి భిన్నములను

నగు మహత్ప్రకృతి రూపములచే భేదోపచారోపపత్తి.

ద్వా విమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్ క్షర మతీతోఽహం, అక్షరాదపి చోత్తమః
అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః
యో మామేవ మసమ్మూఢః జానాతి పురుషోత్తమం
స సర్వవిద్భజతి మాం సర్వ భావేన భారత
ఇతి గుహ్యతమం శాస్త్రం ఇదముక్తం మయానఘ !
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్ కృత కృత్యశ్చ భారత !

ఇతి పంచదశోఽధ్యాయః

అథ షోడశోఽధ్యాయః

(4) దైవాసుర భూత సర్గోపనిషత్—చతురుపదేశీ.

(1) జన్మసిద్ధ నైసర్గిక దైవాసుర సంపత్తి నిబంధనలగు, స్వభావసిద్ధ సహజ గుణ కర్మానుబంధములు :

శ్రీ భగవానువాచ

అభయం సత్వ సంశుద్ధిః జ్ఞానయోగ వ్యవస్థితిః
దానం, దమశ్చ, యజ్ఞశ్చ, స్వాధ్యాయ, స్తప, ఆర్జవం,
అహింసా, సత్య, మక్రోధ, స్త్యాగ, శ్శాంతి రపైశునం,
దయాభూతే, ష్వలోలు ప్త్వం, మార్దవం, హ్రీర, చాపలం,

తేజః, క్షమా, ధృతిః, శౌచం, అద్రోహో నాతి మానితా
భవంతి సంపదం దైవీం అభిజాతస్య భారత!
దంభో దర్పో౽భిమానశ్చ, క్రోధః పారుష్యమేవ చ
అజ్ఞానం చాభి జాతస్య పార్థ సంపదమాసురీం
దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా
మా శుచః సంపదం దైవీం అభిజాతోసి పాండవ!
ద్వౌ భూతసర్గౌ లోకే౽స్మిన్ దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్తః ఆసురం పార్థమే శ్రుణు!

(2) దైవాసుర భేదమున ద్వివిధమగు భూతసర్గమందు, ఆసుర సర్గానుగతములు, విద్యా నిరపేక్షములు నగు గుణకర్మలు :

ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
న శౌచం నాపిచాచారో న సత్యం తేషు విద్యతే
అసత్య మప్రతిష్ఠంతే జగదాహు రనీశ్వరం
అపరస్పర సంభూతం కిమన్య త్కామ హైతుకం
ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో౽ల్ప బుద్ధయః
ప్రభవన్త్యుగ్ర కర్మాణః క్షయాయ జగతో౽హితాః
కామ మాశ్రిత్య దుష్పూరం, దంభమాన మదాన్వితాః
మోహాద్గృహీత్వా సద్గ్రాహాన్ ప్రవర్తన్తే౽శుచి వ్రతాః
చింతామపరిమేయాం చ ప్రళయాం తా ముపాశ్రితాః
కామోప భోగ పరమాః ఏతావదితి నిశ్చితాః
ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః
ఈహంతే కామభోగార్థం అన్యాయేనార్థ సంచయాన్

ఇదమద్య మయాలబ్ధం, ఇమం ప్రాప్స్యే మనోరథం
ఇదమస్తీద మపి మే, భవిష్యతి పునర్ధనం,
అసౌమయా హత శ్శత్రుర్ హనిష్యే చాపరానపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ
ఆఢ్యోఽభి జనవానస్మికోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యేదాస్యామి మోదిష్యే ఇత్యజ్ఞాన విమోహితాః
అనేక చిత్త విభ్రాంతాః మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ.
ఆత్మ సంభావితాః స్తబ్ధాః ధన మాన మదాన్వితాః
యజంతే నామ యజ్ఞై స్తే దంభేనా విధిపూర్వకమ్
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మాం ఆత్మ పరదేహేషు ప్రద్విషంతోఽభ్య సూయకాః
తా నహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవ యోనిషు
ఆసురీం యోని మాపన్నాః మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌంతేయ! తతోయాం త్యధమాం గతిం.

(3) ఆసుర సంపన్మూలకములగు కామ, క్రోధ, లోభములకు నరక ద్వారత్వము.

త్రివిధం నరకస్యేదం, ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధః తథాలోభః తస్మాదేతత్త్రయంత్యజేత్
ఏతైర్విముక్తః కౌన్తేయ! తమో ద్వారై స్త్రిభిర్నరః
ఆచరత్యాత్మనః శ్రేయః తతోయాతి పరాంగతిం

4. దైవసంపన్మూలకములగు విద్యాసముచ్చిత గుణకర్మల ప్రచారము కొరకు వేదాది శాస్త్ర పరిశీలనాదేశము :

యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిం
తస్మాత్ శాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం, కర్మకర్తు మిహార్హసి.

ఇతి షోడశోఽధ్యాయః

## అథ సప్తదశోధ్యాయః

5. గుణ1కర్మ2 ప్రచయోపనిషత్. వింశత్యుపదేశీ

([1]గుణ ప్రచయోపనిషత్) (షడుపదేశీ)

(1) సర్వవిధ వ్యవహారాత్మక లోకయాత్రయందు దైవసంపత్తిచే సత్వగుణము యొక్కయు. ఆసుర సంపత్తిచే తమోగుణము యొక్కయు ఉభయ సంపత్తి సామ్యమున రజోగుణము యొక్కయు. ననుషంగ సంభవము వలన గుణత్రయ భేద భిన్న - దైవాసుర యోగమాయా లక్షణ - ప్రకృత్యభిధా భిన్న - భూత సర్గములయొక్క కొన్ని యుదాహరణములు ; మరియు నింతకును గుణత్రయ నిష్ఠాభేదముచే శ్రద్ధా త్రైవిధ్యము.

అర్జున ఉవాచ

యే శాస్త్రవిధి మృత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః
తేషాం నిష్ఠాతు కా ? కృష్ణ ! సత్త్వమాహో రజ స్తమః

శ్రీ భగవానువాచ

త్రివిధా భవతి శ్రద్ధా, దేహినాం ; సా స్వభావజా,

సాత్త్వికీ రాజసీచైవ తామసీ చేతి తాం శ్రుణు
సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధా మయోఽయం పురుషః యో యచ్ఛ్రద్ధః సఏవ సః
యజంతే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజన్తే తామసా జనాః
అశాస్త్ర విహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగ బలాన్వితాః
కర్షయంతః శరీరస్థం, భూతగ్రామ మచేతసః
మాం చైవాంత శ్శరీరస్థం తాన్ విద్ధ్యా సురనిశ్చయాన్

(2) గుణత్రయ వృత్తి భేదమున నాహారాది త్రైవిధ్యము :

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి భారత
యజ్ఞ స్తప స్తథాదానం తేషాం భేద మిమం శ్రుణు
ఆయుస్సత్త్వబలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరాః హృద్యాః ఆహారాః సాత్త్వికప్రియాః
కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారాః రాజసస్యేష్టాః దుఃఖ శోకామయ ప్రదాః
యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియం

(3) గుణత్రయ వృత్తి భేదమున యజ్ఞ త్రైవిధ్యము.

అఫలా కాంక్షిభిర్యజ్ఞో విధి దృష్టోయ ఇజ్యతే
యష్టవ్యమేవేతి మనః సమాధాయ ససాత్త్వికః

అభి సంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్
ఇజ్యతే భరత శ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసం
విధి హీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణం
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే

(4) శరీర వాఙ్మనో రూపాధిష్ఠాన భేదమున తపస్త్రైవిధ్యము.

దేవద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే
అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచయత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తపఉచ్యతే
మనః ప్రసాద సౌమ్యత్వం మౌన మాత్మ వినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యేతత్ తపోమాన సముచ్యతే

(5) గుణత్రయ వృత్తిభేదమున తపస్త్రైవిధ్యము :-

శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్* త్రివిధం నరైః
అఫలా కాంక్షిభిః యుక్తైః సాత్త్వికం పరిచక్షతే
సత్కార మాన పూజార్థం తపో దంభే నచైవ యత్
క్రియతే తదిహప్రోక్తం రాజసం చలమధ్రువం
మూఢ గ్రాహేణాత్మనో యత్ పీడయా క్రియతే తపః
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతం

(6) గుణత్రయ వృత్తిభేదమున దాన త్రైవిధ్యము.

దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే

---

* "ఏతద్వై తప ఇత్యాహుః యత్ స్వం దదాతి" అని తపోలక్షణము శ్రుత్యుక్తము. స్వ మనో యోగ దానమున ఆత్మ నొకచో కొంతకాల ముంచుట తపము. యోగాభ్యాసము తపము.

దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్వికం స్మృతం
యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతం
అదేశకాలే యద్దానం అపాత్రేభ్యశ్చ దీయతే
అసత్కృత మవజ్ఞాతం, తత్తామస ముదాహృతం

(2) కర్మ ప్రచయోపనిషత్తు – చతుర్దశోపదేశీ.

(7) ప్రవృత్త నివృత్త కామ్య కర్మలకుగాని, యజ్ఞ తపో దానములకుగాని, అపూర్ణత కలిగిన దనుకొన్నప్పుడు, తత్పూర్ణత కొరకు, "న్యూనాతి రిక్తములకు బ్రతిష్ఠ ప్రజాపతి" యని వేద ప్రామాణ్య మంగీకరించువానికి ఈశ్వరావ్యయ స్మరణ రూప - బ్రహ్మ నిర్దేశము మూడు విధములుగ గర్తవ్యమని యుపదేశము :—

ఓమ్[1] త[2]త్స[3]దితి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా
తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మ వాదినాం
తదిత్యనభి సంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియంతే మోక్ష కాంక్షిభిః
సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ ! యుజ్యతే
యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ ! న చ తత్ప్రేత్యనో ఇహ
ఇతి సప్తదశోఽధ్యాయః

అథ అష్టాదశోఽధ్యాయః

(8) కర్మ సంన్యాస, కర్మత్యాగముల, వివేక పరిజ్ఞానము :—

అర్జున ఉవాచ

సన్న్యాసస్య మహాబాహూ ! తత్త్వమిచ్ఛామి వేదితుం
త్యాగస్య చ హృషీకేశ ! పృథక్ కేశి నిషూదన !

శ్రీ భగవానువాచ

కామ్యానాం కర్మణాం న్యాసం సం న్యాసం కవయోవిదుః
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః
త్యాజ్యం దోషవదిత్యేకే కర్మప్రాహుర్మనీషిణః
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యమితి చాపరే
నిశ్చయం శ్రుణుమేతత్ర త్యాగే భరతసత్తమ !
త్యాగోహి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః
యజ్ఞదానతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణాం
ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వా ఫలానిచ
కర్తవ్యానీతిమేపార్థ ! నిశ్చితం మతముత్తమం.

(9) గుణత్రయవృత్తిభేదమున త్యాగత్రైవిధ్యము.

నియతస్యతు సంన్యాసః కర్మణోనోపపద్యతే

మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః
దుఃఖమిత్యేవయత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్
సకృత్వారాజసం త్యాగం నైవత్యాగఫలం లభేత్
కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున!
సంగం త్యక్త్వాఫలంచైవ సత్యాగస్సాత్త్వికోమతః
నద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీఛిన్న సంశయః
నహి దేహభృతాశక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః
యస్తుకర్మ ఫలత్యాగీ సత్యాగీ త్యభిధీయతే.

(10) కర్మయోగులకు కర్మత్యాగదోషమువలన కర్మత్రైవిధ్యము. కర్మ సంన్యాసులకు కర్మ ఫలోదయాభావము.

అనిష్టమిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలం
భవత్యత్యాగినాం ప్రేత్య; నతుసంన్యాసినాం క్వచిత్

(11) సాంఖ్య సిద్ధాంతమునందు కర్మసిద్ధి హేతువుల పాంచ విధ్యము.

పంచైతాని* మహాబాహో! కారణాని నిబోధమే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణాం
[1]అధిష్ఠానం తథాకర్తా[2] కరణం[3] చ పృథగ్విధం
వివిధాశ్చపృథక్చేష్టాః[4] దైవం[5] చైవాత్రపంచమం
శారీరవాఙ్మనోభిర్యత్ కర్మప్రారభతేనరః
న్యాయ్యంవావిపరీతంవా పంచైతే తస్యహేతవః

* 1 దైవం, 2 కర్తా, 3 కరణం, 4 అధిష్ఠానం, 5 క్రియాః పురుషకారః యథాహ్యేకేచక్రేణ.

తత్రైవం సతికర్తార మాత్మానం కేవలంతుయః
పశ్యత్యకృతబుద్ధిత్వాత్ నసపశ్యతి దుర్మతిః
యస్యనాహం కృతోభావో బుద్ధిర్యస్య నలిప్యతే
హత్వాపిస ఇమాఀ లోకాఀ నహన్తి ననిబధ్యతే

(12) జ్ఞానత్రిపుటీ కర్మత్రిపుటీ రూపములగు నారు భావములకును కర్మస్వరూప నియామకత్వము.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధాకర్మచోదనా
కరణం కర్మకర్తేతి త్రివిధః కర్మసంగ్రహః.

(13) కర్మస్వరూప నియామకములందలి జ్ఞాన, కర్మ, కర్తల యొక్కొక్కటియు గుణత్రయభేదమున మూడేసి విధములు.

జ్ఞానం కర్మచ కర్తాచ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి.

(14) జ్ఞానత్రైవిధ్యము.

సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్‌జ్ఞానం విద్ధిసాత్వికం
పృథక్త్వేన తు యద్‌జ్ఞానం నానాభావాఀ పృథగ్విధాఀ
వేత్తి సర్వేషు భూతేషు తద్‌జ్ఞానం విద్ధి రాజసం
యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకం
అతత్వార్థవదల్పం చ తత్తామస ముదాహృతం

(15) కర్మ త్రైవిధ్యము :

నియతం సంగరహిత మరాగ ద్వేషతః కృతం

అఫలప్రేప్సునాకర్మ యత్ తత్ సాత్త్విక ముచ్యతే
యత్తు కామేప్సునాకర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్
అనుబంధం క్షయం హింసాం అనపేక్ష్య చ పౌరుషం
మోహాదారభ్యతే కర్మ యత్ తత్ తామసముచ్యతే

(16) కర్తృత్రైవిధ్యము :-

క్తసంగోఽనహం వాదీ ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే
గీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
ర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః
అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీచ కర్తా తామస ఉచ్యతే

(17) గుణత్రయ వృత్తిభేదమున - బుద్ధిత్రైవిధ్యము.

బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతః త్రివిధం శ్రుణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ!
ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యా కార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ! సాత్త్వికీ
యయా ధర్మ మధర్మం చ కార్యంచా కార్యమేవ చ
అయథావత్ప్రజానాతి బుద్ధిః సాపార్థ రాజసీ
అధర్మం ధర్మమితియా మన్యతే తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ.

(18) గుణత్రయ వృత్తి భేదమున ధృతి త్రైవిధ్యము.

ధృత్యాయ యాధారయతే మనః ప్రాణేంద్రియ క్రియాః
యోగేనా వ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్వికీ
యయాతు ధర్మ కామార్థాన్ ధృత్యాధారయతేర్జున!
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ! రాజసీ
యయా స్వప్నం భయం శోకం, విషాదం మదమేవ
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ

(19) గుణత్రయ వృత్తి భేదమున సుఖత్రైవిధ్యము:

సుఖం త్విదానీం త్రివిధం శ్రుణుమే భరతర్షభ!
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతంచని గచ్ఛతి
యత్తదగ్రేవిషమివ పరిణామేఽమృతోపమం
తత్సుఖం సాత్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజం
విషయేంద్రియ సంయోగాద్ యత్తదగ్రేఽమృతోపమం
పరిణామే విషమివ తత్సుఖం రాజసంస్మృతం
యదగ్రేచాను బంధేచ సుఖం మోహనమాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతం.

(20) సర్వభావానుగతత్వముచే గుణత్రయవృత్తుల యుపసంహారము.

నతదస్తి పృథివ్యాం వా దివిదేవేషు వాపునః
సత్త్వం ప్రకృతి జైర్ముక్తం యదేభిస్స్యాత్ త్రిభిర్గుణైః.

6. అత్యాజ్యకర్మోపనిషత్—ద్వ్యపదేశి

* (1) అధికారసిద్ధ సాంస్కారిక-దైవాసురసంపత్తి నిబంధనలు; స్వభావసిద్ధ స్వీయగుణకర్మాను బంధములు.

---

* అధికారసిద్ధ సాంస్కారికసంపత్తి నిబంధన కర్మములు.

బ్రాహ్మణ క్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః
శమోదమస్తపశ్శౌచం క్షాంతిరార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం
శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనం
దానమీశ్వర భావశ్చ క్షాత్రం కర్మస్వభావజం
కృషిగోరక్ష వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజం.

(2) దోషవంతములైనను, స్వకర్మలయొక్కయు, సహజ యొక్కయు పరిత్యాగానౌచిత్యము.

స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతేనరః
స్వకర్మనిరతః సిద్ధిం యథావిందతి తచ్ఛృణు
యతః ప్రవృత్తిర్భూతానాం యేనసర్వమిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః
శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం
సహజం కర్మకౌన్తేయ సదోషమపి నత్యజేత్
సర్వారంభాహిదోషేణ ధూమేనాగ్నిరివావృతాః.

7. అనావరణకర్మోపనిషత్—ద్వ్యుపదేశీ

(1) అనాసక్తుడు, ఫలవాసనాశూన్యుడు, కామ్యకర్మ సన్యాసి యగువానికి కర్మానుష్ఠానమున్నను, నైష్కర్మ్యసిద్ధి.

---

• జన్మసిద్ధ నైసర్గికసంపత్తి నిబంధన కర్మలు.

అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతి
సిద్ధిం ప్రాప్తోయథా బ్రహ్మ తథాప్నోతిని బోధమే
సమాసే నైవకౌన్తేయ! నిష్ఠాజ్ఞానస్యయా పరా
బుద్ధ్యావిశుద్ధయాయుక్తో ధృత్యాత్మానం నియమ్యచ
శబ్దాదీన్ విషయాన్ స్త్యక్త్వా రాగద్వేషౌవ్యుదస్య
వివిక్తసేవీలఘ్వాశీ యత వాక్కాయమానసః
ధ్యానయోగ పరోనిత్యం వైరాగ్యం సముపాశ్రితః
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహం
విముచ్యనిర్మమః శాంతో బ్రహ్మభూయాయకల్పతే

(2) నైష్కర్మ్యముచే బ్రహ్మభూతుడై విదేహస్థితి నొం వానికి సర్వవిధ కర్మాచరణమున్నను సద్యోముక్తి సిద్ధిచే పరమావ్యయ పదప్రాప్త్యానందము.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతేపరాం
భక్త్యామా మభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనంతరం
సర్వకర్మాణ్యపి సదా కుర్వాణోమద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయం.

ఇతి

భగవద్గీతోపనిషది అభినివేశ క్లేశనివర్తికా
బుద్ధియోగపరిష్కృతా అర్షవిద్యా సమాప్తా
త్రవిద్యా చతుష్టయీ, పూర్ణా.

ఇక

సర్వవిధ క్లేశ నివర్తిక చతుర్విధ బుద్ధియోగ విద్యల యుద్ధార ముపదేశింప బడుచున్నది :

ప్రతి ప్రాణియందును. జీవేశ్వర భేదమున గూడియున్న ఆత్మ ద్వైవిధ్య సిద్ధాంతమునందు. జన్మసిద్ధ - అధికారసిద్ధ - దైవాసురసంపత్తి పరిష్కృత - ప్రకృతి వశీభూత-జీవాత్మ. స్వసం లగ్నేశ్వర శరణాగతిచే తదేకీభావమునొంది. తన్నియోగవశీభూతుడై వర్తింపవలయునవి పరమాదేశము :—అందు నాల్గు విద్యల యుద్ధారము నొక్కొక్కటిగా జూపబడును. ఇందు మూడుపనిషత్తులు : అందు.

1. సారోద్ధారోపనిషత్ :—చతురుపదేశీ

(1) పూర్వాచార్య పరంపరా సిద్ధ కర్మ విద్యాచతుష్టయోపదేశా నంతరము చివరకువివక్షిత విద్యాచతుష్టయ నిష్కర్షయందు. మొదట వైరాగ్య బుద్ధియోగ విద్యా నిష్కర్షసిద్ధ - జీవావ్యయ లక్షణ స్వాత్మ నిర్భరత యొక్క యాదేశము.

చేతసా సర్వ కర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ!
మచ్చిత్తః సర్వ దుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథచేత్త్వ మహంకారాత్ న శ్రోష్యసి వినంక్ష్యసి :

(2) ఆర్ష విద్యాలక్షణ చతుర్ధ విద్యోద్ధార స్వరూపమునందు ధర్మ బుద్ధి యోగవిద్యా నిష్కర్షసిద్ధ - ప్రకృతి సిద్ధకర్మ కర్తవ్యత యొక్క యాదేశము :—

యదహంకార మాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి :

(3) సిద్ధ విద్యాలక్షణ ద్వితీయ విద్యోద్ధార స్వరూపమందు. జ్ఞానబుద్ధియోగ విద్యానిష్కర్ష సిద్ధ-స్వభావసిద్ధ స్వకర్మ ప్రవణతాదేశము:

స్వభావజేన కౌంతేయ! నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్య స్యవశోఽపి తత్

(4) రాజవిద్యాలక్షణ తృతీయ విద్యోద్ధార స్వరూపమందు. మరల నైశ్వర్య బుద్ధియోగ నిష్కర్షసిద్ధ-జీవావ్య యాత్మసం లగ్నేశ్వ రావ్యయ లక్షణాంతరాత్మ ప్రేరిత కర్మ కర్తవ్యతాదేశము :-

ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి.
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా
తమేవ శరణం గచ్ఛ! సర్వ భావేన భారత!
తత్ప్రసాదాత్పరాం శాంతిం, స్థానం ప్రాప్స్యసి శాశ్వతం
ఇతి తే జ్ఞాన మాఖ్యాతం, గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యై త దశేషేణ యథేచ్ఛసి తథా కురు.

2. ఉద్ధారోద్ధారోపనిషత్ :-ద్వ్యుపదేశీ

(1) రాజర్షి విద్యోద్ధార స్వరూపముగు. గూఢోత్మావ్యయ పురుషైక నిష్ఠతాదేశము :-

సర్వ గుహ్యతమం భూయః శ్రుణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితం
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే
సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ!
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

ఇతి సర్వవిధక్లేశ నివర్తికానాం, చతుర్విధ బుద్ధియోగవిద్యానాం, ఉద్ధారలక్షణః విద్యోపసంహారః. సమాప్తః.

(2) గీతోపదేశానర్హ నిర్వచనము :—

ఇదం తే నా తపస్కాయ నా భక్తాయకదాచన
నచాశుశ్రూష వేవాచ్యం, నచమాంయోఽభ్యసూయతి.

3. గీతాఫల శ్రుత్యుపనిషత్.

(1) భగవద్గీతార్థ భావనా ప్రవణత్వ ప్రశంసా :—

యఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి.
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్య సంశయః
న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియ కృత్తమః
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి
అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞాన యజ్ఞేన తే నాహం ఇష్టస్స్యాం ఇతి మే మతిః
శ్రద్ధావా న నసూయశ్చ శ్రుణు యాదపి యో నరః
సోఽపిముక్తః శుభాంల్లోకాన్ ప్రాప్నుయా త్పుణ్యకర్మణాం

(2) ఇతిహాస ప్రకరణమునందు, విజ్ఞాన ప్రకరణో.

పసంహారము

కచ్చిదేత చ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా
కచ్చిదజ్ఞాన సంమోహః ప్రణష్టః తే ధనంజయ! ?

అర్జున ఉవాచ

నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాచ్యుత!
స్థితోఽస్మి గత సందేహః కరిష్యే వచనం తవ

ఇతి

వైజ్ఞానిక గీతాసమాప్తా.

## ఇతిహాసోప సంహారము

### సంజయ ఉవాచ

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిద మశ్రౌషం అద్భుతం రోమ హర్షణం
వ్యాస ప్రసాదా చ్ఛ్రుతవాన్ ఏతద్గుహ్యమహం పరం
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్ సాక్షాత్కథయతః స్వయం
రాజన్ ! సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమమద్భుతం
కేశవార్జున యోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః
తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహాన్ రాజన్ ! హృష్యామిచ పునఃపునః
యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతిః ధ్రువానీతి ర్మతిర్మమ

ఇతి గీతా సమాప్తిః

# గీతాతాత్పర్య నిరుక్తి.

ఇంతటితో గీత బహిరంగ పరీక్ష ముగిసిన దనవచ్చును. ఇందు అంతరంగ పరీక్షకు గావలసిన విషయములు గూడ నందందు స్పృశింప బడినవి. కాని, యిక విశదముగా నంతరంగ పరీక్ష యొక్కొక్క విషయముం గూర్చి కావింప వలసియున్నది. అందుల కుపయోగపడునట్లు పునరుక్తి ఘటిల్లినను కొన్ని విషయములు ముందుగ, సంక్షేపముగ నిచ్చట సూచించెదము.

గీత ఈ క్రిందచూపిన విధములుగ నెరుంగదగి యున్నది:

1. ద్విధా :— (1) బ్రహ్మ విజ్ఞానము, (2) కర్మ విజ్ఞానము.

2. చతుర్ధా :— (1) వైరాగ్య విద్య, (2) జ్ఞానవిద్య, (3) ఐశ్వర్య విద్య, (4) ధర్మవిద్య.

3. దశధా :— (1) ఆత్మ, (2) ఆత్మధాతువులు, (3) చాతుర్విద్యము, (4) శోక నివారణము, (5) ఈశ్వరత్వము, (6) శోక కారణము, (7) త్రివీర్యము, (8) బుద్ధియోగము, (9) ధాతు సామ్యము, (10) ప్రతిష్ఠ.

4. షోడశధా:— విద్యా చతుష్టయీ[1], బుద్ధియోగ చతుష్టయీ[2], సామ్యవాద చతుష్టయీ[3], ఆత్మదర్శన చతుష్టయీ[4]. $4 \times 4 = 16$.

5. చతుర్వింశతిధా :— ఉపనిషత్తు లిరువదినాల్గు పూర్వోక్తములు.

6. షష్ఠి శతధా :— ఉపదేశములు నూటయరువది పూర్వోక్తమూల శీర్షికలు :

ఇందు : (3) దశధా. విభక్త విషయ విచారణ మించుక ప్రస్తావింప బడును. తక్కిన వించుమించుగ గతార్థములే యయినవి. లేదా దీనితో నగును. పిమ్మట విస్తరించి యెరుంగ వీలగును.

శిక్షాదశతయీ.

1. గీత బుద్ధియోగ శాస్త్రము. బుద్ధియోగము జ్ఞానయోగ కర్మయోగ సముచ్చితరూపము కనుక గీత ఆత్మజ్ఞాన శాస్త్రము, యోగశాస్త్రమును.

2. క్షరాక్షరావ్యయ భేదభిన్న త్రిధాతుపురుషుడాత్మ.

3. మనోమయ విజ్ఞాన గర్భితానందము విద్య అది జ్ఞానము. మనోమయ ప్రాణగర్భిత వాక్కు వీర్యము అది కర్మ. విద్యావీర్యములు రెండును ఆత్మధాతువులు :

4. విద్యాసముచ్చిత వీర్య ప్రయోగమునందు, జ్ఞాన కర్మల సమత్వోపపత్తి ధాతుసామ్యము.

5. అవ్యయాత్మ భాగభూత విద్యయందు, విజ్ఞానాత్మ భాగభూత చతుర్విధ విద్యాబుద్ధి సంప్రయోగము బుద్ధియోగము.

6. అవ్యయము, విద్యా, బుద్ధియోగము, సమత్వము, ఇవి చాతుర్విద్యము.

7. బ్రహ్మ, క్షత్రం, విట్ ఇది త్రివీర్యము.

8. విద్యాపచారము - కర్మాపచారము - శోకకారణములు :

9. ఆత్మవిద్య - నిష్కామకర్మ - శోకనివారకములు.

10. బుద్ధియోగ చతుష్టయమున జీవుల కాత్మవిద్యోదయము, అందువలన భగవత్ప్రసిద్ధి-అది ఈశ్వరసాధర్మ్యము.

### 1. ఆత్మ - యోగము

జీవప్రకృతిసిద్ధ-అవిద్యా బుద్ధియోగమున బుట్టిన, సర్వవిధశోక వినాశోపాయ ప్రదర్శనాత్మకము గీతాశాస్త్రము. సమత్వమున నుపపన్నములును-ఆత్మకళలు నగు బ్రహ్మకర్మల-సహయోగ ప్రవృత్తి వశమున- విద్యాబుద్ధి యోగ చతుష్టయ నిబంధనాత్మ సాక్షాత్కార మొక్కటియే, సర్వవిధ శోకవ్యుదాసోపాయము. కనుక, ఆత్మ సాక్షాత్కారోపాయభూత - బుద్ధియోగ విద్యా చతుష్టయ ప్రచారకత్వము వలన నీ గీతా విజ్ఞానము, యోగశాస్త్రము, ఆత్మశాస్త్రము నగుచున్నది. మరియు :—అవ్యయ పురుషుడగు నాత్మ బ్రహ్మ, విద్యా బుద్ధియోగ చతుష్టయము కర్మ, విద్యాబుద్ధియోగవశమున నవిద్యాబుద్ధియోగ నివృత్తికాగా, అవ్యయాత్మా వరక యోగమాయపరిహృత యగును. అంతట మేఘావరణాపాయమున సూర్యునివలె నాత్మ స్వయముగా ప్రకాశించును. అదియే, ఆత్మ సాక్షాత్కారము, పరమ పురుషార్థము, తద్విజ్ఞానోపదేశము భగవద్గీతాశాస్త్రార్థము :

### 2. ఆత్మ

ఆత్మ యన్వేష్టవ్యము (వెదుకదగినది) ఒకడును, ఆత్మను

విశేషించి స్పష్టముగా నెరుగడు : శ్రుతియు :—

నవిజానామి యది వేదమస్మి నిణ్యః సంనద్ధో మనసాచరామి.
యదామాఽగన్ : ప్రథమ జాఋతస్య. ఆదిద్ వాచో అశ్నువే భాగ
మస్యాః.

అనుచున్నది. కాని తెలిసికొనదగినంత-శక్యమగునంత-వరకు గీత యాత్మను దర్శింపుచున్నది :—

నిర్విశేషాత్మ యచింత్యమే. అందు త్రివేది అవ్యయము యజస్సునందు పొందినది. వాఙ్మయము - అగ్ని - యగునాత్మ ఇట్లు ఆ యాత్మ ప్రణవమై యున్నది :

"అచింత్య ఏషోఽస్తి హినిర్విశేషః, తత్రావ్యయం మామగమత్ త్రివేదీ యజుష్యపాగాదథ వాఙ్మయోఽగ్నిః సఇత్థమాత్మా ప్రణవోయమస్తి"

అనాత్మజ్ఞుడు దుఃఖము ననుభవించును. కారణము? అతడు మృత్యువులచే నావృతుడు గదా! కనుక :—దుఃఖాత్యంత నివృత్తికారకాత్మ యవగంతవ్యము,- ఇందుకనేక విప్రతిపత్తులుండుటచే తత్స్వరూప విజ్ఞానము యథార్థముగా దెలియకున్నది : 1. శరీరము, ఇంద్రియగ్రామము, మనస్సు, బుద్ధి, మహత్తు. 2. భూతము, ప్రాణము, చేతన : ఇవి యొకొకటియు నాత్మ యనుకొనుచున్నారు. వస్తుతః ఆత్మ నెరుంగమిచే నొకలాగుననున్న దానిని మరియొక లాగున భావించుచు, అనాత్మ రక్షణ వ్యగ్రతచే ఆత్మనుపేక్షింపుచు, ప్రజ్ఞాపరాధమున నెల్లరు దుఃఖమనుభవించుచున్నారు. కనుక నాత్మ యవగంతవ్యము. అట్టి యాత్మను గీత చక్కగా జూపుచున్నది :

# ఈశ్వరప్రజాపతి - యాత్మవ్యూహము

| స్తరము | అశ్వత్థధాతువులు | బ్రహ్మవివర్తములు | ఆత్మలు | ఆత్మ పర్వవిశేషములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | అమృతము | పరాత్పరః | నిగూఢాత్మ | సర్వశక్తి ఘనము. అనంతరము అబాహ్యము భూమా | | | | |
| 2. | అమృతము | పురుషః | పరమాత్మా | అవ్యయః | | అక్షరః | క్షరః | |
| | | | | 1 | 2 | 3 | 4 | 5 |
| 3. | బ్రహ్మ | ప్రకృతిః | అధియజ్ఞాత్మా | స్వయంభు బ్రహ్మాగ్ని | పరమేష్ఠి | సూర్యః దేవాగ్ని | చంద్రః | పృధివి భూతాగ్ని |
| 4. | శుక్రము | వైకారికః | సర్వభూతాంతరాత్మ | బ్రహ్మ | | విష్ణుః | | మహాదేవః |

## జీవప్రజాపతి యాత్మవ్యూహము.

| ఆత్మకారాః | ఆత్మవర్గము | ఆత్మవివర్తము | ఆత్మభావములు : | | |
|---|---|---|---|---|---|
| (1) | అమృతమ్ | పరాత్పరః | అభయాత్మా | 1 | పురుషాత్మా. |
| | | అవ్యయః | ఆలంబనాత్మా | 2 | |
| | | అక్షరః | నియంతాత్మా | 3 | |
| | | క్షరః | పరిణామ్యాత్మా | 4 | |
| (2) | బ్రహ్మ | ప్రాణః | శాంతాత్మా | 5 | అవ్యక్తమ్ |
| | | ఆపః | మహానాత్మా | 6 | మహాన్ |
| | | వాక్ | విజ్ఞానాత్మా | 7 | బుద్ధిః |
| | | అన్నః | ప్రజ్ఞానాత్మ | 8 | మనః |
| | | అన్నాదః | ప్రాణాత్మా | 9 | ఇంద్రియములు |
| (3) | శుక్రమ్ : | ఇంద్రః | ప్రాజ్ఞాత్మా | 10 | అంతరాత్మా |
| | | వాయుః | తైజసాత్మా | 11 | |
| | | అగ్ని (అమృత) | వైశ్వానరాత్మా | 12 | |
| | | అగ్నిర్మర్త్యః | శరీరాత్మా | 13 | బాహ్యాత్మా |

లేదా: జీవులందు 18 ఆత్మలు : 4 అమృతవర్గీయములు, 5 బ్రహ్మ వర్గీయములు, 9 శుక్ర వర్గీయములు : ఎట్లన :— (శుక్ర వర్గీయములు)

1 పార్థివాగ్ని — శరీరాత్మా

2 పార్థివ వాయువు — హంసాత్మా

3 పార్థివ ఇంద్రుడు దివ్యాత్మా — ఇది మూడు విధములు.

1 అగ్ని — వైశ్వానరుడు — దీనిచే ఆత్మస్వీ అసంజ్ఞ జీవులు

2 వాయువు — తైజసుడు „ „ అంతస్సంజ్ఞ జీవులు

3 ఇంద్రుడు — ప్రాజ్ఞుడు „ „ ససంజ్ఞ జీవులు

ఈ ఇంద్రుడు మూడు విధములు.

1 కర్మాత్మా – వాసనామయుడు – ఈశ్వర జనితుడు. *

2 చిదాభాసుడు – జ్యోతిర్మయుడు – ఈశ్వరాంశః

3 ఈశ్వరః – పరదేవత – ఈశ్వరా నతిరిక్తః

ఈశ్వరుడు జీవ శరీరానుగతుడై మూడు విధముల నొప్పారును:

1. ఊర్గ్లక్షణః

2. శ్రీ లక్షణః

3. విభూతి లక్షణః

ఇంతవరకు ఆత్మ సర్వము.

ఆత్మ స్వరూప జ్ఞాపక వేద వచనములు.

అజుడు ఆత్మయు, ప్రకృతికి పరుడగు నొకానొక పురుషుని శ్రుతి యనువదించెను.

1. అచికిత్వాం శ్చికితుషః చిదత్ర కవీన్ పృచ్ఛామి విద్మనేన విద్వాన్
వియస్తస్తంభ షడిమారజాంసి అజస్యరూపే కిమపి స్విదేకమ్
ఋ 1-22-1646.

2. యస్యానువిత్తః ప్రతిబుద్ధ ఆత్మా అస్మిన్ సందేహ్యే గహనే ప్రవిష్టః
సవిశ్వకృత్ సహి సర్వస్య కర్తా తస్యలోకః సఉలోక ఏవ (బృహ)

3. ఇహైవసంతోఽథ విద్మస్తదద్వయం, నచేదవేదీ ర్మహతీ వినష్టిః
యఏతద్విదు రమృతాస్తే భవన్తి అథేతరే దుఃఖమేవాపి యన్తి

* సుశ్రుత శారీరకమునందు పదునారు కళలు గల యీ కర్మ పురుషునకే పదునారు గుణములు చూపబడినవి :– 1. సుఖం, 2. దుఃఖం, 3. ఇచ్ఛా, 4. ద్వేషము, 5. ప్రాణము, 6. అపానము, 7. ఉన్మేషనిమేషములు, 8. ప్రయత్నము 9. బుద్ధి, 10. మనస్సు, 11. సంకల్పము, 12. విచారణ, 13. స్మృతి, 14. విజ్ఞానము, 15. అధ్యవసాయము, 16 విశేషోప లబ్ధి.

4. ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతి పూరుషః
కిమిచ్ఛన్ ? కస్య కామాయ ? శరీర మనుసం జ్వరేత్

5. యదైత మనుపశ్యతి ఆత్మానం వేదమంజసా
ఈశానం భూత భవ్యస్య న తతో విజుగుప్సతే.

అశ్వత్థహృదయ బిందుస్థ - అనిరుక్త
సప్తలోక వ్యాపీ - ఆత్మా.

6. ఏకధైవాను ద్రష్టవ్య మేతదప్రమేయం ధృవం
విరజః పరఆకాశా దజఆత్మా మహాన్ ధృవః

7. యస్మాత్పరం నా పరమస్తి కించిత్
యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్
వృక్షఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః
తేనేదం పూర్ణం పురుషేణ సర్వం

8. తతో యదుత్తర తరం తదరూప మనామయం
యఏతద్విదు రమృతాస్తే భవన్తి అథేతరే దుఃఖమేవాపి యన్తి

9. తమేవధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః
నాను ధ్యాయా ద్బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్

అశ్వత్థబల్మా మూల భూత - స్వయంభూ.

10. యస్మిన్ పంచ పంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః
తమేవ మన్య ఆత్మానం విద్వాన్ బ్రహ్మ[2]మృతోఽమృతం

11. అంభస్య పారే భువనస్యమధ్యే

---

వైశేషిక దర్శనమందు 8 గుణములు చెప్పబడినవి. 1. బుద్ధి, 2. సుఖము, 3. దుఃఖము, 4. ఇచ్ఛా, 5. ద్వేషము, 6. ప్రయత్నము, 7. ధర్మము, 8. అధర్మము, సంస్కారమను నింకొకటికూడ నున్నది.

నాకస్యపృష్టే మహతోమహీయాన్
శుక్రేణ జ్యోతీంషి సమను ప్రవిష్టః
ప్రజాపతి శ్చరతి గర్భే అంతః

12. యస్మిన్నిదం సంచ విచైతి సర్వం
యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః.
తదేవ భూతం తదుభవ్య మా ఇదం
తదక్షరే పరమే వ్యోమన్

13. యేనావృతం ఖం చ దివం మహీం చ
యేనాదిత్య స్తపతి తేజసాభ్రాజసా చ
యమంత స్సముద్రేక వయో వయన్తి
యదక్షరే పరమే ప్రజాః

14. న సంధృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం
హృదామనీషా మనసాభిక్లృప్తో యఏనం విదురమృతాస్తే భవన్తి

పరమేష్ఠీ - వాయు సముద్రాత్మా

15. మహాన్ ప్రభుర్వై పురుషః సత్వస్యైష ప్రవర్తకః
సు విర్మల మిమాం ప్రాప్తిం ఈశానో జ్యోతి రవ్యయః

హిరణ్య గర్భః సూర్యః

16. యస్మాదర్వాక్సం వత్సరో అహోభిః పరివర్తతే
తద్దేవా జ్యోతిషాం జ్యోతిః ఆయుర్హోపాసతేఽమృతం

17. విశ్వత శ్చక్షురుత విశ్వతో ముఖః
విశ్వతో బాహురుత విశ్వతస్థాత్
సంబాహుభ్యాంధ మతి సంపతత్రై
ర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః

18. యో బ్రహ్మాణం విదధాతి పూర్వం
యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై
తం హ దేవం ఆత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే

జీవ - ఈశ్వర - ఆత్మలు ; భోక్త - సాక్షులు.

19. ద్వా సుపర్ణా సయుజా సఖాయా,
సమానం వృక్షం పరిషస్వ జాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్ అన్యోఽభిచాకశీతి

ఆత్మగతి హేతువులు

విద్యా నిరపేక్ష - విద్యాసాపేక్ష కర్మలు.

20. ఇష్టాపూర్తం మన్య మనావరిష్టం
నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః
నాకస్య పృష్ఠే తే సుకృతేను భూత్వా
ఇమం లోకం హీనతరం చా విశంతి
తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే
శాంతా విద్వాంసో భైక్ష్యచర్యాం చరంతః
సూర్యద్వారేణ తే విరజాః ప్రయాన్తి
యత్రామృతః పురుషోహ్యవ్యయాత్మా.

వేదవచన తాత్పర్య మెరుకపడనందున
వాఖ్యాన మవసరము.

వేదమంచాత్మ యిట్లు నిరూపింపబడినను అందరకు తద
వ్యయ విశేషము తెలియరాదు: "నాహం ప్రకాశః సర్వస్య

యోగమాయా సమావృతం" అని భగవదుక్తి కదా! ఆర్ష దృష్టితో వేదార్థ తాత్పర్య మెరుంగని వారికి వారివారి మతి కల్పిత మతము లనేకములై విరోధమూలకము లగుచున్నవి. అందు సత్యములేదు. గీత శ్రుతిసిద్ధమగు నవ్యయజ్ఞానము. ఆర్ష దృష్టితో నుపదేశించుచున్నది. కనుక గీతార్థము శ్రుతి సామ్యమున జెప్పబడుట యవసరము:

## వేద - గీతాసామ్యత కొరకు: వైదిక బ్రహ్మ విజ్ఞానోపదేశ సంగ్రహము.

ఈ యంతయు ప్రజాపతి. అతడు షోడశీ, సత్యము, యజ్ఞమునై యున్నాడు. మనము చూచు ప్రతి వస్తువు యజ్ఞము. అది సత్యప్రజాపతి యందున్నది: ప్రతి వస్తువును పాప్మ, విత్తము, ప్రాణము, ఆత్మయని నాల్గు కళలు కలది. విత్తమున్నంతవరకు ఆత్మ. ఆ యాత్మ త్రిమాత్రి యగుటవలన నోంకారము. ఆ యీ త్రికలాత్మ శుక్రము-బ్రహ్మ-అమృతము-దీనియందు ప్రాణము, విత్తము-పాప్మప్రతిష్ఠితములై యున్నవి. వాక్ ఆపః అగ్ని ఈ మూడును అమృతమృత్యు భేదమున శుక్రములు: బ్రహ్మ-సుబ్రహ్మ యోగమువలన ద్వివేదవత్ శుక్రము బ్రహ్మ;* ఆ శుక్రముల కాశ్రయము పంచప్రకృతులు.

---

* సూర్యాంశు వాక్కు- ఇంద్రుడు. అది కృష్ణము. దానినుండి ఆపస్సు సృజింప బడినది. ఆపస్సులనగా:- భృగ్వంగిరసులు - స్నేహ తేజములు - అఘోర్ధ్వ ప్రవాహిణులు. సుబ్రహ్మ సంజ్ఞములు, సువేదరూపములు. అందు భృగ్వారూఢాంగిరసులు, అగ్ని వాయు ఆదిత్యులని మూడు విధములు. అవి క్రమముగ ధ్రూమ

అవి నేమే క్షర పంచకళామయ పంచబ్రహ్మలు. (ప్రాణః ఆపః వాక్ అన్నము, అన్నాదములు, ఇవి బ్రహ్మ విష్ణు ఇంద్ర అగ్ని సోమ-అను అక్షర నియంత్రితములు.) స్వయంభూ, పరమేష్ఠి, సూర్య, చంద్ర, పృథివి. ఇవి పంచబ్రహ్మలు. పూర్వ పూర్వా హితోత్తరములు. వాక్కు స్వయంభువునందు, వాగాపస్సులు పరమేష్ఠియందు, వాగాపోఽగ్నులు, సూర్యునందు నిత్య సంశ్రితములు : ఈ మూడు అమృతములు. అగ్ని-ఆపః, వాక్కు సూర్యునందు. ఆపః, వాక్కు చంద్రునందు. వాక్కు పృథివి యందు సంశ్రితములు. ఇవి మూడును మర్త్యములు. సూర్యుని క్రింద మర్త్యాగ్ని- పైని అమృతాగ్ని ఈయగ్నులే సూర్యునందు రెండును ప్రతిష్ఠితములు. ప్రతియొక విశ్వరూపమును; తన పూర్వ పూర్వాయతనమున ప్రతిష్ఠిత మగుచుండును. పృథివి యందాందము, చంద్రునందు నక్షత్రము, రవియందు సంవత్సరము, పారమేష్ఠ్యమందు సాముద్రము, స్వాయంభువమందాకాశము. అన్నాదము పృథివి. అన్నము చంద్రుడు. సూర్యుడు వాక్కు, పరమేష్ఠి అమ్మయుడు ఆ పైని స్వయంభువు ప్రాణవిగ్రహుడు. వేద బ్రహ్మమయ స్వాయంభువ సత్యలోకమందు బ్రహ్మనియంత. అతని కొరకు ప్రథమజములగు

---

రక్త హిరణ్య వర్ణములు. ఈ మూడు అగ్నిశుక్రము. ఇక అంగిరోఽధ్యారూఢ భృగువు ఆప - వాయు - సోమ అని మూడు విధములు. పీత హరిత పీతములు వర్ణములు. అవి ఆపశ్శుక్రము. ఈ రెంటి కారణమగు వాగర్థము కృష్ణవర్ణము మధ్యస్థమును. ఇట్లు వాక్, ఆప, అగ్ని అని మూడు శుక్రములు : బ్రహ్మ సుబ్రహ్మ (భృగువు) సుబ్రహ్మ (అంగిరస్సు).

వేదములు ధృతములు. (శత : 11-1-) బ్రహ్మగతి స్థితిమయము. వాయువు గతి - ఆకాశము స్థితి, వానికన్యోన్య గర్భత్వము కలదు. తదుదరమున అనగా గతిస్థితిమయ బ్రహ్మోదరమున భృగ్వంగి రోమయ సుబ్రహ్మయున్నది: అందు తేజోమయ మంగిరస్సు. రస, స్నేహమయము భృగువు. అనగా:-స్నిగ్ధము లగు ఆప, వాయు, సోమములు మూడును భృగువులు: ఆది త్య యమ అగ్ని అనునీ మూడు తేజస్సులు అంగిరసులు. ఈద్వి బ్రహ్మ బ్రహ్మసత్యము. ఇది ప్రాణగర్భిత వాఙ్మయము. ఇక 'షడ్బ్రహ్మ సుబ్రహ్మ' ఈ రెండును యోనియు రేతస్సును, పంచీకృత ప్రకృతి బ్రహ్మల కూర్ధ్వమునందమృతము. అది పురుషుడు. క్షరము, అక్షరము, అవ్యయము అని మూడు తెరగులు. అందు అవ్యయు నాత్మగా శ్రుతిచెప్పను. సంవత్స రము, సముద్రము, ఆకాశము, నక్షత్రము, ఆందము, ద్యావా భూమి-దేవతలు, అన్నియు నవ్యయుడే. అతనికంటె వేరే మియు లేదు.

ఆ యవ్యయాశ్వత్థమున రెండు సుపర్ణములు, ప్రజా పతులు, ఈశ్వరుడు, జీవుడు ననువారు సాక్షియు భోక్తయునై యున్నారు. ఒకడగు నీశ్వరునందు అనంతజీవులందు నాయవ్యయు డవిభక్తుడై విభక్తునివలె తెలియబడుచున్నాడు.

ప్రకృతికి బరుడగు నతడే యాత్మ. ఈ శరీరమందే యున్న అవ్యయు నీశ్వరావ్యయునిగ నెరింగెదము. గీత యితడే సర్వాత్మయనుచు తక్కి వానికాత్మత్వము నిషేధించుచున్నది.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమం
పరస్తస్మాత్తు భావోఽన్యః అవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః
యస్ససర్వేషు భూతేషు నశ్యత్సునవి నశ్యతి
పురుషః సపరః పార్థ! భక్త్యాలభ్యస్త్వనన్యయా
యస్యాంతస్థాని భూతానియేన సర్వమిదంతతం.

ఇతి ఆత్మశిక్ష

## 2. ఆత్మధాతువులు-బ్రహ్మకర్మలు

(1) అవ్యయాత్మకు బ్రహ్మ-కర్మయని రెండు పర్వములు. బ్రహ్మవిద, కర్మవీర్యము. ఈ రెండు నాత్మరూపము. ప్రతిక్షణము ఆత్మచేయును, తెలిసికొనును. ఈ రెండు లేనిదాత్మ కాదు. క్రియోదయ రసము వీర్యము, జ్ఞానోదయరసము విద్య-లేదా:-అవ్యయునందు జ్ఞానోక్థము విద్య-క్రియోక్థము,వీర్యము. ఉక్థము, బ్రహ్మ-సామ, ఈ మూటి సమష్టియు నాత్మ. (శత 14-4-3) ఉక్థమునుండి యుత్థానము ; బ్రహ్మభరించును; సామమంతటను సమము. అవ్యయుని యర్థభాగము విద్యోక్థము, అర్థభాగము కర్మోక్థము అందు ధాతుత్రియము విద్య, ధాతుత్రయము వీర్యము.

(2) ప్రత్యర్థమందును ఈ యాత్మ గూఢము పురుషుడు పరమసత్య కామాత్మకమగు నియ్యాది పంచకళలు గలది. మనస్సు విజ్ఞానము ఆనందము నను నివి ముక్తికొరకు మూడు

కళలు. మనస్సు, వాక్కు, ప్రాణము అనునీ మూడు కళలును సృష్టికొరకు.

(3) మనోమయ ప్రాణగర్భయగు వాక్కునుండి సృష్టి. మనము చూచునదెల్ల వాక్కు. తదంతర్వర్తి ప్రాణము. అది మనోమయము. ఈ వాక్ప్రాణ మనస్సుల సమష్టి యొక అచ్యుత కోశము. పంచవిధములై గారణమగు బ్రహ్మ మూడు విధములగు శుక్రము, ఆత్మ ప్రాణ మనః కోశమునంకును, అందు సర్వమును ప్రతిష్ఠితములై యున్నవి. మనస్సు, ఆత్మ, ప్రాణములు హితములు ;వాక్కు ఉపహితము :

అంతరతమ నిగూఢాత్మ అవ్యయుడు కోశము

1. మనః-ఆత్మా-విద్యా-బ్రహ్మ-ప్రతిష్ఠా-అస్తీతిధృతి
2. ప్రాణః-హితః-వీర్యం-కర్మ-విసర్గ-ఉత్పన్నవ్యయము
3. వాక్-ఉపహిత-అన్నం-అర్ధ-సంగ్రాహ్యః-అన్యతః పరిగ్రహము

మనస్సు విద్యాకోశము, ప్రాణము వీర్యకోశము. వాక్కు పరతో గృహ్యమాణాన్నకోశము. బ్రహ్మవిద్య, కర్మ వీర్యము, అర్థము అన్నము, బ్రహ్మప్రతిష్ఠ, అది అస్తి ధృతి. సత్తునుండి పుట్టి వ్యయించునది కర్మయను విసర్గము. అర్థించి మరొకచోటనుండి గ్రహింపబడు నర్థమన్నము. అది బాహ్యము సంగ్రాహ్యము, అధ్రువము. విద్యా వీర్యములు ఆత్మకన్యత్ర యుండవు.

(4) అవ్యయాత్మకు బ్రహ్మ - కర్మలు రెండు పర్వములు- అమృతము బ్రహ్మ, పూర్వార్ధము, కర్మమర్త్య

ముత్తరార్థము,- 1. జ్యోతి, జ్ఞానము, బ్రహ్మ, విద్యా. 2. కర్మ వాసన, ఆరంభము, మోహము - ఈ రెండు నాత్మధాతువులు. ఈ రెండు నవినాభూతములు. రెండు గల యాత్మయొకటే, కర్మచే వీర్యము, విద్యచే నమృతము నొందును.

{ బ్రహ్మ — జ్యోతి — విద్యా — జ్ఞానము — భావన }
{ కర్మ — మోహము — వీర్యము — ఆరంభము — వాసన }

(5) కర్మ రెండు విధములు. 1. ప్రవర్తకము, వాసనాత్మకము. 2. నివర్తకము, భావనాత్మకము. 1. వాసనయందు వాసనయొక్క యుపధానము వలన వృద్ధినొందు స్థూలకర్మ ప్రవృత్తము. అందువలనజ్యోతి యావరింపబడును. 2. నివృత్త కర్మ విద్యాజ్యోతి జనకమై పూర్వకర్మ నివర్తన పూర్వకముగా మలినతోయ మందలి కతకకర్జమట్లు తానునునివృత్తి నొందును.

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా
నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే.

అనావరణ కారకము నివృత్తకర్మగా నెరుంగవలయును.

(6) ప్రవృత్తి నివృత్తి కర్మలు రెంటియందును, వాగ్బుద్ధికాయముల కారంభకమగు కర్మ లక్షణము సమానము. రెంటియందును కామాసక్తి వశముచే భేదము.

"కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః"
"ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే"

కామాసక్తి కృతకర్మ 'వాసన' యను అపూర్వ సంస్కారము నాత్మయందాధానము గావించును. అందువలన జ్యోతి యావరింపబడును. కామాసక్తి రహితముగ జేయబడిన కర్మ జ్యోతిస్సుచే కర్మ శిథిలము గావించి తానును శమించును. కనుక ఆత్మయందు గామాసక్తి నివారణార్థము బుద్ధియోగమున బ్రవర్తింపవలయును. ఈ విషయము భగవద్గీతయందు విస్తరింపబడినది. అందువలన త్రిగుణమాయ తన శక్తిని పరిత్యజించును.

(7) 1. "దైవీహ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే

2. నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోఽయం నాభి జానాతి లోకో మా మజమవ్యయం

3. సంగా త్సంజాయతే కామః కామాత్క్రోధోఽభి జాయతే
క్రోధాద్భవతి సమ్మోహః సంమ్మోహాత్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ప్రణశ్యతి.

(8) ఇట్లు ఆవరణమునను గామమునను ఆత్మశక్తి నశించును. కామము వలన రాగజ ద్వేషజములని రెండు విధముల స్రోతస్సు కలుగును. ద్వేషముచే విజ్ఞానావరణము, రాగముచే మనోబంధనము నగును. విషయములచే నాత్మశక్తి హృతము కాగా పరతంత్రత ఏర్పడును. ఆనందజ్యోతి యయ్యు నాత్మ కామదోష దూషితమై సంసార క్లేశము నొందు విధమును భగవంతుడు చెప్పెను:

1. కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః.

2. చింతామపరిమేయాంచ ప్రళయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమాః ఏతావదితినిశ్చితాః,

3. 'కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః'
'లభతేచతతః కామాన్ మయైవవిహితాన్ హితాన్'

4. అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యన్తి జంతవః

5. జ్ఞానే నతుతదజ్ఞానం యేషాంనాశిత మాత్మనః
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం.

6. రాగద్వేష వియుక్తైస్తు విషయానింద్రి యైశ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి.

7. ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే
ప్రసన్నచేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే.

8. రజోరాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవం
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మసంగేన దేహినం.

9. తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం
ప్రమాదా లస్యనిద్రాభిః తన్నిబధ్నాతిభారత ।

10. అనేక చిత్తవిభ్రాంతాః మోహజాల సమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ.

11. యః శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
నససిద్ధి మవాప్నోతి నసుఖం నపరాంగతిం.

12. అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌన్తేయ। నకరోతి నలిప్యతే.

ఇతి ఆత్మధాతుద్వయశిక్ష.

### 3. బ్రహ్మరూపములగు విద్యావిభాగములు మూడు

మనస్సు - విజ్ఞానము-ఆనందము ఇవి విద్యాత్రయి. జ్యోతిర్విశేషము విజ్ఞానము. సంకల్పిత రూపము మనస్సు. కర్మయందంతరతః జ్యోతిర్మనస్సు. జ్యోతియందు కర్మ. అది విజ్ఞానము. ఇక కర్మాస్పృష్ట పృథగ్రసము ఆనందము. అవ్యయునందు బ్రహ్మ - విష్ణు - ఇంద్రులను మూడక్షరులు నిత్యులు. ఈ మూడక్షరులందును మూడు విద్యలు. ఆ యవ్యయ ధర్మములు మూటిచే నీ మూడక్షరులును ధర్ములు. ధర్మత్రయ వశమున విశ్వ మాత్మయందు బ్రతిష్ఠితము. ఆనందము బ్రహ్మవిద్య. ఇంద్రవిద్య విజ్ఞానము. సంకల్పము వైష్ణవవిద్య. బుద్ధియోగము వలన నీ మూడవ్యయములు భాసింపగా సత్య సంకల్పము కలుగును. షడూర్మి సంక్షయము నగును. సమృద్ధ్యానందము వలన బుద్ధి విజ్ఞానమునందు, మనస్సునందు, ఇంద్రియములందు, బ్రహ్మ వీర్యమందు, సత్వగుణమందు ఆ సిద్ధి యుపకల్పింపబడదు.

ఇది విద్యాలక్షణ జ్ఞానయోగ శిక్షా.

### 4. కర్మరూపములగు వీర్యవిభాగములు మూడు.

మనస్సు, ప్రాణము, వాక్కు, అను నీ త్రయము వీర్యము లేదాకర్మ. మనస్సుచే కామము, ప్రాణముచే తపస్సు, వాక్కుచే శ్రమ.

"కామ స్తదగ్రే సమవర్తతాధి మనసోరేతః ప్రథమం యదాసీత్
సతో బంధు మసతి నిరవిందన్ హృది ప్రతీష్యా కవయో మనీషా"

ఆత్మ - వాఙ్మయము - ప్రాణమయము-మనోమయము; ఆనందము, జ్ఞానవాక్ కర్మద్రూపము, ఆత్మ; మనస్సునందు వీర్యము విద్యకొరకు, ప్రాణమునందు వీర్యము క్రియకొరకు, వాక్కు (అర్థము)నందు వీర్యము అన్నము కొరకు. ధామచ్ఛద మగునది యర్థము. వాక్కునం దన్నము, క్రియ ప్రాణమునందు, జ్ఞానము మనస్సునందు సక్తములగును. అన్నముచే జీవించును. కర్మచే సంచరించును. విద్యచే తెలిసికొనును. ఆత్మ అన్నము నాహారించునట్లు విద్యా కర్మలను గూడ నాహరించును. అన్న రసాసిక్తావ్యయము నుండి వాక్ప్రాణ మనస్సు లుదయించును. కర్మ (వీర్యము) మూడు తెరగులు. 1. బ్రహ్మ, 2. క్షత్రము, 3. విట్ అని! విద్య మనస్సునందు, బలము ప్రాణమందు, అన్నము వాక్కునందు, అర్పితములు : బ్రహ్మ వీర్యము భోగ హేతువు. క్షత్రము, విట్టును ప్రాప్తి కారణములు. భోక్తేంద్రుడు తన యింద్రియమున యథాప్రాప్తి ననుభవించును. విద్యా మయము బ్రహ్మవీర్యము. ప్రాణమయ బలము క్షత్రము. అన్న మయ వీర్యము విడ్వీర్యము. ఇట్లు కర్మవీర్యము మూడు విధ ములు. మూడక్షరము లందును మూడు వీర్యములు భిన్నము లట్లుండును. బ్రహ్మ బ్రాహ్మము, క్షత్ర మైంద్రము, వైష్ణవము విట్. ఈ బ్రహ్మేంద్ర విష్ణులను నక్షరు లవ్యయునందు నిత్యులు. ఈ మువ్వురిచే ఈశ్వరు డనావ్యయుడు. సర్వ ధర్మోపపన్నుడు సర్వశక్తి. ఇట్లు విద్యా వీర్యములచే ద్వైధాతవ్యుడగు నవ్యయు డాత్మగ - జీవుల కీశ్వరుడుగ గీతయందుపదిష్టు డయ్యెను.

ఇతి వీర్యలక్షణ కర్మయోగ శిక్షా.

## (5) అనుశోకప్రత్యయ దర్శనమువలన ఆత్మానంద మయత్వమునందు సంశయము.

జీవుల యాత్మవిజ్ఞానానంద విగ్రహమైనచో అనిచ్ఛగ దుఃఖము లభించుట, యత్నించినను సుఖము లభింపమి, యేల? బ్రహ్మాది పిపీలికాంతము దుఃఖనివృత్తి క్షణిక సుఖమునేగాని కేవల సుఖము ననుభవించుటలేదు. "ప్రతీకారం వ్యాధేఃసుఖమితి విపర్యస్యతిజనః" శోక మసంభవము. ఆత్మ ఆనంద మయము అయినచో ఈ ప్రశ్నకు గీత సమాధానమేమి చెప్పును?

## (6) శోకకారణము.

ఆత్మ ఆనందము, అదే ప్రియతమము. కామములెల్ల నాత్మార్థములు. ఆత్మకొరకన్నియు ప్రియములు. 'ఆత్మనస్తుకామాయసర్వం ప్రియంభవతి' విజ్ఞాన జ్యోతియందానందము ద్యోతకత్వము నొందును. విజ్ఞానము పాప్మావృతి నొందినచో ఆనందము భాసింపదు. ఆత్మ యానందమయ్యును పాపనికాయ ధృతమై ఆ విశ్వనికాయ సంఘర్షమున కేవలము దుర్బలమై విషాద మొందుచున్నది. పాపనికాయమందే విశ్వసంఘర్షము కల్గుచున్నది. పాప్మావరణ నాశముకాగా సంఘర్షము శమించును. అప్పుడు దుఃఖశాంతి సుఖోదయము. అందుచే ఆత్మ యానందమయమని సాధకుడు స్వయముగా నెరుగును. బ్రహ్మవీర్యము వలన పాప్మావరణము క్షీంచి విజ్ఞానమునకు బలము

రాగా ఆనందము భాసించును. ఆనందము స్వతస్సిద్ధమయ్యును భాసింపకుండుటకు మూడు కారణములు. 1. ఆత్మకంటె నన్యమగుదాని యందాత్మయను నజ్ఞానము. 2. ఆత్మధాతు ద్వయమగు బ్రహ్మకర్మల వైషమ్యము. 3. అవిద్యాబుద్ధులు నాల్గింటిలో నేదోయొక దాని యోగముండుట.

ఇతి శోకోత్పత్తికారణశిక్ష

### (7) జీవునకు భగవత్త్వసిద్ధి

కనుక ఆత్మ అవగంతవ్యము. అంతికంటె సుఖములేదు. "అథేతరే దుఃఖమేవాపియంతి" అని శ్రుతి. ఆత్మధాతువులగు విద్యా వీర్యముల సమత్వము సాధింపవలెను. "ఆత్మనావిందతే వీర్యం విద్యయావిందతేఽ మృతం" అవిద్యాచ్ఛన్న విద్యావికాసము వలన సుఖసంవిత్తునందు పాప్మాపహారక చతుర్విధ బుద్ధి యోగము సంఘటింప జేయవలయును. బుద్ధియోగమువలన, విద్యావీర్య ప్రభావము వలన, భగ షట్కాధానమువలన, జీవునకు భగవత్త్వసిద్ధి యనును.

### (8) శోకనివారణము.

ఆత్మకు శోక హేతువులగు మూటిని విడచి శోక ప్రశమ హేతు సంపాదన గావించు నుపాయములను గీత మనకు బోధించును:—అందుకు ఆత్మను సాక్షాత్కరించుకోవలెను. సమత్వ యోగ మవలంబింపవలెను.

"నాహం ప్రకాశస్సర్వస్య యోగమాయా సమావృతః
మూఢోయం నాభిజానాతి లోకో మామజ మవ్యయం"
"దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా
మామేవయే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే"

విద్యచే నానంద ప్రాప్తి. అది అవ్యయధాతువు. విద్యా నాశమున, అథవాకర్మ నాశమున, శోకానువర్తనము కలుగును.

(9) కర్మాత్యంత సంన్యాసమునకు శోకవ్యుత్థాపకత్వ ప్రత్యాఖ్యానము

కొందరాచార్యులు "కర్మనాశము మంచిది, కృత్స్న కర్మక్షయమే మోక్షము" అందురు. అది సరికాదు. వాసనా సంస్కారము కర్మ - కర్మ జనితాపూర్వము కర్మ శబ్దవాచ్యము వాసనాకర్మక్షయము, మోక్షము. కర్మ రెండువిధములు. 1. తామిస్రము అది విద్య నావరించును. 2. సాత్వికము, అది బ్రహ్మవీర్యము. అయ్యది విద్య నావరింపదు. అనావరకము విద్యామయమునగు కర్మత్యాజ్యముకాదు: "కర్మణైవహిసంసిద్ధి మాస్థితా జనకాదయః" కనుక ఏకాంతిక కర్మసన్యాసము ముముక్షువులకుచితముకాదు.

"నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే
స్వేస్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతేనరః
సహజం కర్మ కౌంతేయ! సదోషమపి నత్యజేత్
యోగినః కర్మకుర్వన్తి సంగం త్యక్త్వాత్మశుద్ధయే
సర్వం కర్మాఖిలంపార్థ! జ్ఞానే పరిసమాప్యతే

త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతిసః.

కనుక ననావరక కర్మ యవశ్యమాచరణీయము. "నహి కశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్య కర్మకృత్" ఆత్మరూపమగు కర్మ నత్యంతము విడువగోరువాడు క్లేశభాజనుడై యాత్మతో గూడ క్షీణించును.

ఇతిశోకవ్యుత్థానశిక్ష.

## (10) ధాతుసామ్యము

కనుక కేవల యథాభూత కర్మ విజయము వలన విద్యావరణము కాగా లోకమందంతటను దుఃఖమగపడును. అట్లే కేవల విద్యావిజయము కాగా ఫీర్యత్రయాత్యంత నాశనము వలన నానందానుభవాత్యయము లభించును. కనుక కేవల కర్మయు కేవల విద్యయు శ్రేయోదాయకములు కావు. రెంటి సమత్వము సాధింపవలయును. విద్యాసాపేక్షకర్మలు విద్యతో చేయవలయును. విద్యానిరపేక్షకర్మఠులు శుద్ధా విద్యానుశీలన మున అంధతమస్సునం బడుదురు. విద్యాపరాయణులై నిత్యకర్మ లందత్యజించువారు విద్యాకర్మోభయ భ్రష్టులై పరమతమో లీనులగుదురు. "నకర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషో శ్నుతే" విద్యా సాపేక్షమాణ కర్మ విద్యాహేతువు కాదగును. విద్యావరణకర్మ కర్మచేతనే నివృత్తినొందును. మాలిన్యము మృత్తికచేతను, కరటకము కంటకముచేతను తొలగించు

కొందుము కదా! విద్యానావరక కర్మ నిరాకరణమువలన నిత్యసిద్ధమగు నాత్మజ్యోతి లబ్ధమయ్యు ననుపలబ్ధమగుచున్నది. విద్యలేని కర్మ సంసిద్ధి నొందదు. కర్మ విద్యనపేక్షించి కర్మ హేతుత్వము నొందగలదు. విద్యాకర్మల పరస్పరానపేక్షిత్వము నిషిద్ధము. నిర్విద్యాకర్మయు నిష్కర్మవిద్యయు వ్యర్థములు. వైదికకర్మ 1. ప్రవృత్తమనియు 2. నివృత్తమనియు రెండు విధములు. నివృత్తకర్మవలన నాత్మబంధమగు మృత్యువు నివర్తించును. నివృత్తకర్మయు విద్యయు నేకముగ నుపాసింపదగును. గీతయు, శ్రుతియు నీ యర్థమునే వివరించును :—

"అంధంతమః ప్రవిశన్తియే అవిద్యా ముపాసతే
తతోభూయ ఇవతే తమోయ ఉవిద్యాయాం రతాః
విద్యాంచా విద్యాంచ యస్తద్వేదో భయంసహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే
సంభూతించ వినాశంచ యస్తద్వేదోభయం సహ
వినాశేనమృత్యుం తీర్త్వా సంభూత్యామృత మశ్నుతే."

ప్రవృత్త నివృత్త కర్మలు రెండును అవిద్యాశబ్ద వాచ్యములే కాని నివృత్త కర్మవలన వాసనయను మృత్యు బంధముం ధరించును. మృత్యువునకు మృత్యువుం గలిగించు కర్మ యాచరణీయము. అట్టి యనావరక కర్మవలన విద్య లోపింపదు. అందువలన విద్యా వీర్యములగు నాత్మ ధాతువులకు సామ్య సిద్ధి యగును. ధాతు సామ్యము వలన శాంతియు సుఖమును, వైషమ్యము వలన దుఃఖమును కలుగును. కనుక బ్రహ్మ—కర్మల

సమత్వము గీత బోధించుచున్నది. స్థూల దేహాగ్ని వైషమ్యము రోగకారణము. వాత పిత్త కఫాదుల సామ్యము స్వాస్థ్యకరము. ప్రాజ్ఞతైజసుల వైషమ్యము రోగకారణము. కామక్రోధాది ధాతుసామ్యము స్వాస్థ్యము. అవ్యయుడు బ్రహ్మకర్మ ధాతు ద్వయరూపి. కనుక విద్యావీర్య సమత్వమాత్మ స్వాస్థ్య హేతువు. ప్రాణులం దవిద్యాబుద్ధులు సహజముగ నుద్రిక్తములు. వానిని తత్ప్రతి ద్వంద్వాలగు విద్యాబుద్ధులచే క్రమముగ శమింపచేయ దగును. విద్యావరణ హేతు పాపకర్మ నివృత్తిచే సహజ సిద్ధ విద్యాప్రకాశము కలుగగా నానందసిద్ధి యగును.

ఇతి ఆత్మధాతుద్వయ శిక్షా.

ఉపసంహారము

"భిద్యతే హృదయగ్రంధిః ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే."

ఇట్లు ఆవరణ ధ్వంసము, హృదయ గ్రంథుల విచ్యుతి, సంశయచ్ఛేదము గీత బోధించును. నాల్గువిధముల బ్రహ్మవిద్య నాల్గువిధముల కర్మయోగము. ఇవి యనావరకములు. ఇందును ప్రధానముగ నవ్యయ విద్యయు, బుద్ధియోగమును గీత వక్కాణించును. గీతయందలి అహం శబ్దము మానుష కృష్ణునందును, అవ్యయునందును సామ్యమున వర్తించును. ఇది గీతా సంక్షేపము : ముందు ముందిది యంతయు విస్తరింప బడును: విద్యా కర్మల వైషమ్యమున దుఃఖ ప్రాప్తి కనుక తత్సామ్యోపాయ

ప్రదర్శనార్థము గీతాశాస్త్ర ప్రవృత్తిః యని ఫలితార్థము. అదియే గీత యందలి "సమత్వం యోగ ఉచ్యతే" అదియే బుద్ధియోగము.

ఇతి గీతా తాత్పర్య నిరుక్తి.

జ్ఞాన - క్రియా - సామ్యవాద శిక్ష.

గీత యందలి సామ్యవాదము (1) అనాసక్తి, (2) నిష్కామ, (3) యజ్ఞార్థ, (4) ఈశ్వరార్పిత, (5) ఆత్మ జ్ఞానమయ - భేదములచే అయిదు విధములగును. వీనిని క్రమముగా ఈ క్రింద నుదహరించిన శ్లోకోదాహరణముల వలన గ్రహింపనగును :

(1) అనాసక్తి - సామ్యవాదము.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతియః
సనన్యాసీ చ యోగీచ న నిరగ్నిర్నచాక్రియః
తస్మాద సక్తః సతతం కార్యం కర్మసమాచర
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః
యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగం అసక్తః సవిశిష్యతే
సుఖదుఃఖేసమేకృత్వా లాభాలాభౌజయాజయౌ
యోగస్థఃకురు కర్మాణి సంగంత్యక్త్వాధనంజయ।
సిద్ధ్య సిద్ధ్యోః సమోభూత్వా. సమత్వం యోగ ఉచ్యతే.
యంహినవ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖ సుఖంధీరం సోఽమృతత్వాయకల్పతే

నద్వేష్ట్య కుశలం కర్మకుశలే నానుషజ్జతే
హర్షామర్ష భయోద్వేగైః ముక్తోయః సచమేప్రియః
సమదుఃఖ సుఖః స్వస్థః సమలోష్టాశ్మ కాంచనః
తుల్యప్రియా ప్రియోధీరః, తుల్యనిందాత్మ సంస్తుతిః
మానాపమాన యోస్తుల్యః తుల్యోమిత్రారి పక్షయోః
సర్వారంభ పరిత్యాగీ గుణాతీతఃస ఉచ్యతే
ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వా ఫలానిచ
కర్తవ్యా నీతి మేపార్థ। నిశ్చితం మతముత్తమం-

(2) నిష్కామ - సామ్యవాదము.

అనాసక్తితో వలెనే నిష్కామముగ కర్తవ్య బుద్ధితో కర్మచేయుట యుపదేశింప బడుచున్నది:

కార్యమిత్యేవయత్కర్మ నియతంక్రియతేఽర్జున
సంగంత్యక్త్వా ఫలంచైవ సత్యాగః సాత్వికోమతః
అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధి దృష్టోయ ఇజ్యతే
యష్టవ్యమే వేతిమనః సమాధాయస సాత్వికః
కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన।
మా కర్మఫల హేతుర్భూః మాతే సంగోస్త్వ కర్మణి
యస్యనాహం కృతోభావో బుద్ధిర్యస్యన లిప్యతే
హత్వాఽపిస ఇమాన్ లోకాన్ నహన్తి న నిబధ్యతే
ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్య సిద్ధ్యోర్నిర్వికారః కర్తాసాత్విక ఉచ్యతే
పాప్మానం ప్రజహిహ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనం
జహిశత్రుం మహాబాహో, కామరూపం దురాసదం
ఏతాన్యపితుకర్మాణి సంగంత్యక్త్వా ఫలానిచ
కర్తవ్యా నీతిమేపార్థ। నిశ్చితం మతముత్తమం.

యజ్ఞార్థ సామ్యవాదము.

"సృష్టియంతయు యజ్ఞరూపము. ఆత్మయందు దేవతలందు, ఈశ్వరునందు, నా యందు, అగునది, కావింపబడునది, సర్వము యజ్ఞము. నియంత, అంతర్యామి, యజ్ఞరూపి యగు నేను వేరుగ నెవడను? యజ్ఞము దానియంత నదియే జరుగుచున్నది. యజ్ఞముకంటె వేరేమియు లేదు" ఈదృష్టితో గావింపబడు కర్మ బంధకారణముకాదని భగవంతుడు చెప్పుచున్నాడు.

యజ్ఞార్థాత్కర్మణో౽న్యత్ర లోకో౽యం కర్మ బంధనః
తదర్థం కర్మకౌన్తేయ ! ముక్తసంగః సమాచర
గత సంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే
బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవతేనగంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా
దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి
శ్రోత్రాదీనింద్రియాణ్యన్యే సంయమాగ్నిషుజుహ్వతి
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషుజుహ్వతి
సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమ యోగాగ్నౌజుహ్వతి జ్ఞాన దీపితే
ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞాః యోగయజ్ఞాస్తథాపరే
స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చ యతయః సంశిత వ్రతాః
అపానేజుహ్వతి ప్రాణం ప్రాణే౽పానంతథాపరే
ప్రాణాపానగతీరుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః
అపరేనియతాహారాః ప్రాణాన్ ప్రాణేషుజుహ్వతి
సర్వేప్యేతే యజ్ఞవిదః యజ్ఞక్షపిత కల్మషాః

యజ్ఞశిష్టామృత భుజో యాంతి బ్రహ్మసనాతనం
నాయంలోకోస్త్య యజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ ।
ఏవంబహువిధాయజ్ఞా వితతా బ్రహ్మణోముఖే
కర్మజాన్ విద్ధితాన్ సర్వాన్ ఏవంజ్ఞాత్వా విమోక్ష్యసే

(4) ఈశ్వరార్పణ సామ్యవాదము

"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" అన్నట్లు సర్వత్ర వ్యాప్త వస్తువు జీవునందు నుండును గదా !

"యదేవే హతదముత్రయదముత్రత దన్విహ
మృత్యోః సమృత్యు మాప్నోతి య ఇహనానేవ పశ్యతి"
"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ. పూర్ణమేవావశిష్యతే.

ఈశ్వరత్వమునుండి జీవత్వము, జీవత్వమునుండి యీశ్వరత్వము అను ఈశాశ్వత వినిమయమున జీవు డీశ్వరుని కంటె వేరైనవాడు కాడు. ఎట్లన : ఈశ్వరునుండి పుట్టి ఈశ్వరునందే విలీను డగుచున్నాడు కదా ! జీవచేష్టయంతయు నీశ్వర చేష్టయే. జ్ఞానము వలన గాని, యజ్ఞానమువలన గాని కావింపబడునదెల్ల నీశ్వరార్పితమే. జీవత్వము వ్యామోహ మాత్రమేకాని, ఈశ్వరాన్యము కాదు. సముద్రమునుండి యుద్ధృతమగు బిందువు సముద్రమందే లీనమగును. ఈశ్వరకృత కర్మ యీశ్వరునందే యుండుచు విపాకము నొందుచుండును. దానికి కర్తయు, భోక్తయు నీశ్వరుడే. కర్మవిపాకములు జాత్యాయుర్భోగములని

మూడు విధములు. అయ్యవి స్వ ప్రకృతియొక్క యిచ్ఛచే గావింపబడినవి గావున ఈశ్వరునకు విరోధములు కావు (జీవునకు నంతే). ఇట్లనుభవ పూర్వకముగ నెరింగిన సత్పురుషుల కీశ్వరాన్య సత్త లేనందునను, ఈశ్వరసత్త వలననే వారు వేరుగా భాసించుచుండుట వలనను వారు కావించు కర్మ లేపకారణము కాదు. ముక్తుడగు నీశ్వరునికి కర్మ బంధకారణము కానట్లే సర్వత్ర సమవస్థితేశ్వరుని సామ్యమున జూచువారల సమబుద్ధి పరమ శాంతి నొందును. కనుక వారి కర్మ బంధకారణము కాదు. అభ్యాసమున క్రమముగ నీ సమబుద్ధి లభించును. భగవంతుడు దీని నిట్లు ప్రశంసింపు చున్నాడు.

"సమోహం సర్వభూతేషు నమేద్వేష్యోస్తిన ప్రియః
యే భజన్తితుమాం భక్త్యామయితే తేషుచాప్యహం
యత్కరోషియ దశ్నాసి యజ్జుహోషిద దాసియత్
యత్తపస్యసి కౌన్తేయ ః తత్కురుష్వమదర్పణం.
శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః
సంన్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి
మయి సర్వాణి కర్మాణి సన్యస్యధ్యాత్మచేతసా
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి
యతః ప్రవృత్తి ర్భూతానాం యేనసర్వమిదం తతం
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతిమానవః.

(5) జీవ-ఆత్మసామ్యవాదము

విశ్వమునకు ఈశ్వరాత్మనుగాని అక్షరమును గాని పరాయణముగా జూచువాడు - పరాగతి నొంద జాలడు. ఏలయన -

అందు ఏ యొకదానికిని పరాగతి లేదు. అవ్యయుం కనుగొన్న వాడే కన్నవాడు. అవ్యయుకంటె పై నేమియు లేదు. అతనిచే నంతయు వ్యాప్తము. కారణ కార్యములన్నియునతడే. అవ్యయ తత్త్వమే. ప్రవివిక్తబ్రహ్మ, ప్రవిష్టబ్రహ్మ, సృష్టబ్రహ్మ, లేదా విశ్వాతీతము, విశ్వాత్మ, విశ్వము అని మూడు విధముల నొప్పు చున్నది. ఈ మూడు నభిన్నములు. విశ్వాత్మ జీవ - ఈశ్వర భేదమున రెండు విధములు. అందు ఈశ్వరు డొకడు. తదంశ భూతులగు జీవులనేకులు. జీవావ్యయులు నీశ్వరావ్యయుడు నొకటే. సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థాదులం దందరియందు నన్నిటియందు నాత్మ అవిశేషముగ నుండును. ఇట్టి యాత్మైక త్వ సమదృష్టి గలది జీవాత్మ సామ్యవాదము భగవంతుడిట్లు చెప్పుచున్నాడు :—

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః
మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
మనః షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి
విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని
శునిచైవశ్వపాకేచ పండితాః సమదర్శినః
ఇహైవతైర్జితస్సర్గః యేషాం సామ్యేస్థితం మనః
నిర్దోషం హిసమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తేస్థితాః
నప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్యచా ప్రియం
స్థిరబుద్ధిరసం మూఢః బ్రహ్మ విద్బ్రహ్మణిస్థితః
సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని

ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోర్జున
సుఖంవాయదివా దుఃఖం సయోగీ పరమోమతః
సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం
వినశ్యత్స్వవినశ్యన్తం యఃపశ్యతి సపశ్యతి
సమం పశ్యన్‌హిసర్వత్ర సమవస్థిత మీశ్వరం
నహినస్త్యాత్మ నాత్మానం తతోయాతి పరాంగతిం
యదాభూత పృథగ్భావం ఏకస్థమనుపశ్యతి
తతఏవచ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా
అనాదిత్వా న్నిర్గుణత్వాత్ పరమాత్మాయ మవ్యయః
శరీరస్థోపి కౌన్తేయ। నకరోతి నలిప్యతే
సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్‌జ్ఞానం విద్ధిసాత్వికమ్
అవిభక్తంచ భూతేషు విభక్తమివచస్థితం
భూతభర్తృచతద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణుచ.

### సామ్యవాద విష్కర్ష

ఈ చూపబడిన యయిదువిధముల సామ్యవాదము నను సరించువారు గూడ (1) స్థితప్రజ్ఞుడు, (2) యుక్తుడు, (యోగి) (3) కర్మి. (4) భక్తుడు (ప్రపన్నుడు), (5) గుణాతీతుడు అని అయిదు తెరగులుగ నుందురు. బుద్ధియోగ వశమున నీ యైదు గురును సమ దర్శనులే — విద్యాకర్మ సామ్యముచే సుఖులే — ఇందు అనాసక్తి - నిష్కామ కర్మ లొకటియే యనుకొన్నచో సామ్యవాదము నాల్గు విధములే యగును. అనాసక్తి - నిష్కామ ములకే భగవత్సమ్మతి విశేషముగ గలదు.

"ఏతాన్యపితుకర్మాణి సంగం త్యక్త్వాఫలానిచ
కర్తవ్యానీతి మేపార్థ నిశ్చితం మతముత్తమం
యేమే మతమిదం నిత్యం అనుతిష్ఠన్తి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యన్తేతేపి కర్మభిః
యేత్వేతదభ్యసూయంతో నానుతిష్ఠన్తి మేమతం
సర్వజ్ఞాన విమూఢాన్‌స్తాన్ విద్ధినష్టానచేతసః.

సాంఖ్యులు, జ్ఞానయోగ నిష్ఠులు, సన్యాసులు నగువారికి సమత్వ యోగము లేదు. కర్మయోగ నిష్ఠులు, ఆరంభులు, యోగులు నగువారికిని సమత్వ యోగము లేదు. ఆసక్తుడు, కామ కామియునగు యోగి క్లేశమొందును. సర్వకర్మ పరిత్యాగి సన్యాసియు క్లేశము నొందును. సంగము, ఫలమును విడచి కర్మ నారంభించువాడు సన్యాసియు, యోగియు నగును. అతడు శాంతి సుఖము నొందును.

సర్వ నిర్కర్ష

ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా
తమేవశరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్
చేత సాసర్వకర్మాణి మయి సంన్యస్యమత్పరః
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తః సతతం భవ
మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు
మా మేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజః
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

ఇతి సామ్యవాద శిక్షా.

## శ్రీమద్భగవద్గీతా విషయ రహస్య సంక్షేపము.

బ్రహ్మ విజ్ఞాన మెరుంగనిచో నితర విజ్ఞానములన్నియును వ్యర్థములు. బ్రహ్మకంటె నితరము లేదు. ఇతరముగా నెరుంగు విజ్ఞానమంతయు 'బ్రహ్మవిజ్ఞానముపై నాధారపడి యుండును. బ్రహ్మవిజ్ఞాన మితర విజ్ఞానముల కాధారమై పరమశాంతికి మూలమగును. అందుచే నాత్మ నిర్వచనమునకు ముందుగా ఆత్మదర్శన సమీక్ష గావింపబడును. బ్రహ్మమే ఆత్మ. ఆత్మ విజ్ఞానమే బ్రహ్మ విజ్ఞానము. ఇవి క్రమముగా విశద పడును.

ఆత్మ దర్శన సమీక్షా సంగ్రహము.

అపూర్వోపదేశకమగు భగవద్గీతా శాస్త్రము విజ్ఞాన శాస్త్రమయ్యును దర్శన శాస్త్రములకు బూర్ణతను (కార్త్స్న్యము) సంపాదింపుచున్నది. ఎట్లన :— సర్వ సాధారణ విశ్వ విద్యకు (1) సమ్యగ్దర్శనము, (2) సమ్యగ్జ్ఞానము, (3) సమ్యక్ చారిత్ర్యము అని మూడుపర్వములు (భాగములు-మెట్లు).

(1) దృష్టార్థమును సిద్ధాంతమాత్రముగ ప్రదర్శించుట దర్శనము. అందు అన్య దృష్టార్థ శ్రవణమున నాపాతతః అవగ్రహలక్షణ దర్శన తుల్యము, సామాన్య జ్ఞానమాత్రము సిద్ధ

మగును. గాని వినువాడాయర్థ సాక్షాత్కారము కొరకు గావింప దగిన కర్తవ్యోపదేశ ముండదు. ఆ యీదర్శనము విశ్వవిద్యకు మొదటి పర్వము.

అందును * అవగ్రహ[1] - ఈహా[2] - అవగమ[3] - [4]ధారణా త్మక జ్ఞాన పర్వ చతుష్టయమం దవగ్రహ మాత్రము పుట్టును. గాని అవగమ పర్యంత పూర్ణజ్ఞానము (విజ్ఞానము) గలుగదు. ఇక నభినివేశమను ధారణ కలుగనేకలుగదని వేరుగ జెప్పనక్కర లేదు. ఏలయన :- ప్రత్యక్ష మూలకమగు గవాశ్వాది పరిచయ రూపాభినివేశ జ్ఞానము ప్రత్యక్షీకారము లేనిచో దుష్ప్రాప్యము కదా ! భగవంతుడు గౌతముడు ధర్మస్మృతియందు జ్ఞానాభి నివేశములచే సర్వసిద్ధియని వచించెను. కనుక నభినివేశోపపత్తి కొరకు సామాన్యతః జ్ఞానములయొక్కయు, నర్థములయొక్కయు ప్రత్యక్షీకారార్థము యత్నము కర్తవ్యము. అందువలన విజ్ఞాన శాస్త్రము దర్శన శాస్త్రముల యపూర్ణతను పూరించుననియు, దర్శన శాస్త్రములకంటె విజ్ఞాన శాస్త్రము శ్రేయస్కరమనియు నెరుంగ దగును.

---

* ఇంద్రియములకు విషయములందు స్పర్శ అవగ్రహము. ఈహ = చేష్ట అనగా :—ఇంద్రియములచే మనస్సునందును, మనస్సుచే బుద్ధియందును, బుద్ధిచే ఆత్మయందును ఈవిధముగ ఇంద్రియార్థముల నాత్మయందు ప్రాపింప జేయు చేష్ట. అందువలన బుద్ధిచే ఆత్మయందు విషయముల స్థిరీకరణము అవ గమము. (నిర్ధారణము) ఈయవగమమునే ఈహావాయ శబ్దమున జెప్పుదురు. అవ గమజనిత సంస్కారము ధారణ. ఇంతటితో ప్రత్యక్షజ్ఞానమగును. అని జైనదర్శ నమునందు వ్యాఖ్యాతము.

(2) అందు శ్రోతవ్యమగు నర్థమునందు నించుక కర్తవ్యముగూడ నుపపన్న మగును — ఉపదేశ గృహీతార్థ పరీక్షా కర్మచే తదర్థ సాక్షాత్కారార్థము ప్రయత్నము కర్తవ్యమగును గనుక జ్ఞాన - కర్మల సహయోగము వలన నవగమ పర్యంతము జ్ఞానము, నభినివేశము గలుగుచున్నవి. కనుక నీ విజ్ఞానము విశ్వవిద్యకు ద్వితీయ పర్వము.

(3) ఇక :— కర్మయోగము చారిత్ర్యము. యథాదృష్టముగ, యథావిజ్ఞాతముగ నాచరించువానికి కర్మజన్య సిద్ధి లభించును. ఆచరణార్థమును, శక్తి లాభము కొరకునే దర్శన విజ్ఞాన సాఫల్య ముపపన్న మగును. ఆ రెండు లేనినాడంతయు వ్యర్థము. సిద్ధియు దూరమగును. కనుక యథాదర్శనముగ నెరుంగ వలయును. యథావిజ్ఞాతముగ నాచరింప వలయును, పరిశీలింప వలయును. తదర్థ వశీకారమున యత్నమాచరింప వలయును. అట్లు కర్మయుక్త బ్రహ్మచే పూర్ణవిజ్ఞానము నొందును. యథాకామముగ సిద్ధినొందును.

ఈ దర్శనములే లేదా విజ్ఞానము (1) అధిభూతము, (2) అధ్యాత్మము, (3) అధిదైవతము అని మూడు విధములు: విశ్వ పదార్థములు మూడు విధములే యగును గదా! అందు దర్శన విభాగమున ఒకే శాస్త్ర మధికరణ విభాగము వలన మూడు భాగములుగ నుపదేశింప బడుచున్నది. (1) ఆధిభౌతికము వైశేషిక శాస్త్రము, (2) ఆధ్యాత్మికము ప్రాధానిక శాస్త్రము,

(3) ఆధిదైవికము శారీరక శాస్త్రము. ప్రాధాన్యము ననుసరించి యిట్లు చెప్పబడినది గాని యనుషంగమువలన నన్నిటి యందు నన్ని ధర్మములును అవినాభావముగ నిరూపింపబడును. ఎట్లన : అధ్యాత్మముగ నీ ధర్మములను మూడు తెరగులుగ నిట్లు విభాగించి చూతురు :—

| | వైశేషికము 1 | * ప్రాధానికము 2 | శారీరకము 3 | |
|---|---|---|---|---|
| 1. | స్థూలశరీరము | సూక్ష్మశరీరము | కారణశరీరము | నని కొందరు |
| 2. | భూతమాత్రా | ప్రాణమాత్రా | ప్రజ్ఞామాత్రా | యని కొందరు |
| 3. | భూతగ్రామము | దైవతగ్రామము | ఆత్మగ్రామము | నని కొందరు |
| 4. | శరీరవిభాగము | ప్రకృతివిభాగము | ఆత్మవిభాగము | నని కొందరు |
| | ఆదిభౌతికవిషయము | * ఆధ్యాత్మికశాస్త్ర విషయము | ఆధిదైవిక విషయము | |

ఇందు : ప్రకృతి విభాగానుగత పదార్థముల నిరూపణ మధికముగ ప్రాధాన్యముగా నిరూపితము లగుటచే ప్రాధానిక శాస్త్ర మొక్కటియే. విశేషించి యధ్యాత్మశాస్త్ర మయ్యును, అందు భూత గ్రామాత్మ గ్రామముల పరిగ్రహము లేకుండ నధ్యాత్మ నిరూపణ మసంభవ మగుట వలన ప్రకరణాంతర విధమున వైశేషికము, శారీరకమును అంశాంశతః పరిగ్రహము గావింపవలసి యుండును. ఇట్లే వైశేషిక శారీరములకును ప్రాధానిక పరిగ్రహము గావింపవలసి యుండును. ఇట్లు అధికరణత్రయ విభాగానురోధముగ విభజించి ధర్మములను నిరూపించుటకొరకె దర్శనశాస్త్రమే మూడు విధములుగ వైశేషికము,

ప్రాధానికము, శారీరకము నని యుపదేశింప బడుచున్నది. అందు వైశేషికము శరీర విషయమును, ప్రాధానికము ప్రకృతి విషయమును శారీరక మాత్మ విషయమును విశేషించి చూపుచున్నవి. ఏతత్సంబంధానుబంధమున నివియు నితర విషయములను జూపుచున్నవి.

ఈ మూడు దర్శనము లందును మూడు ప్రకరణములు: అనగా: భూత గ్రామోపపన్న స్థూల శరీరముం గూర్చిన దొకటి — దైవత గ్రామోపపన్నమగు ప్రకృతి మండలముం గూర్చినది రెండవది — పురుషత్రయోప పన్నమగు నాత్మ సంస్థానముం గూర్చినది మూడవది. ఇట్లు నిరూపింప దలచినను, ప్రత్యేక వైలక్షణ్యా మగపడుచున్నది. ఏలయన—ముఖ్య నిరూపణీయ ప్రకరణాను రోధమున — నుపసర్గ భూతములగు నితరములకుం బ్రతి తంత్రమునందును భేదోపత్తి యుండుచుండునుగదా! అందువలన బ్రతితంత్రమునందును నొకానొక యాత్మ నిరూపణ ముఖ్యముగ నైనది. క్షరుడు, అక్షరుడు, అవ్యయుడు నను మూల పురుషులు మూడు విధముల యాత్మలుగా బ్రసిద్ధి నొందియున్నారుగదా!

1. మృత్తికవలె వికారోపాదాన భూతుడు, పరిణామి, యొకానొక యవ్యక్తుడు క్షరపురుషుడు.

2. కుంభకారుని వలె నిర్మాత, సర్వశక్తిఘనుడు, అంతర్యామి, నియంత, నిర్వికారుడు, అపరిణామి, యొకానొక అవ్యక్తుడు, అక్షర పురుషుడు.

3. కార్య కారణాతీతుడు, అసంగుడు, ఆలంబన భూతుడు, సర్వాధారుడు, నిరాధారుడు, నోకానోక అవ్యక్తుడవ్యయ పురుషుడు.

ఈ మూవురి యందును నక్షర పురుషుని - ద్రవ్య - గుణ - కర్మ - సామాన్య - విశేష - సమవాయ రూపములచే నారు విధములుగ విభజింపబడిన వానినిగా వైశేషికులందురు. ఈ యెల్ల క్షరులందును వెలయు నక్షరు, నాత్మగా - జీవాత్మ పర మాత్మ భేదమున రెండు విధములగు వానిగ నంగీకరింతురు. అంతకంటె పరముగ నవ్యయుని వారుచూడరు. అక్షరధర్మములును, అవ్యయ ధర్మములు వారి యాత్మయందే యంతర్భాగములుగ నెంచి దానితో కృతకృత్యులమైతిమని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 'బ్రహ్మైవేదం సర్వం' ఇత్యాది శ్రుతులందలి బ్రహ్మ శబ్దముచే జగత్ప్రకృతిభూత క్షరమునో, యక్షరమునో తదవస్థాతగ నభిప్రాయ పడుదురు. ఎట్లన: పరిణామి క్షరగుణాక్షర తత్త్వమునకందు ఆత్మత్వము ప్రతిపన్నమైనది. వారి తంత్రము నందు వైశేషికులాత్మయందు బుద్ధి ప్రయత్నములు సుఖదుఃఖములు, ఇచ్ఛాద్వేషములు, ధర్మాధర్మములు, నని యెనిమిది గుణములను చూచుచున్నారు.

ఇది వైశేషికమగు మొదటి శాస్త్రము.

ఇక నింతటితో నూరట నొందక ప్రాధానికులగు సాంఖ్య విద్వాంసులు భూతభావసత్త్వమున బ్రతిపన్నమగు నాక్షరాత్మ

కంటె పరము, సత్యము, గుణత్రయ సమష్టిరూపము, నగు నొకానొక యవ్యక్తమును జగత్ప్రకృతిత్వమున ప్రతిపాదించుచు నయ్యది మహదక్షరమందురు. ఆ యవ్యక్తాక్షరము కంటె సత్య మగు నొకానొక యవ్యయాత్మను వారు తలపెట్టరు ఈ మహ దవ్యక్తము యొక్క వ్యక్తీభావము వలననే ఈ యశేష జగదు త్పత్తి: శ్రుతియు:—"భూతం భవిష్యత్ ప్రస్తాని మహద్బ్ర హ్మైకమక్షరం, బహుబ్రహ్మైకమక్షరం" అనుచున్నది కదా!

అథవా:— క్షేత్రజ్ఞుడగు నవ్యయ పురుషాత్మ నొప్పి కొన్నను, అయ్యది కేవలము, చేతనము, భోక్తయు మాత్రమే కాని దానికీసృష్టి విధియందు ప్రవృత్తిత్వముచే నే యుపయో గము లేదని చెప్పిరి.

ఇతి ప్రాధానికమను రెండవ శాస్త్రము.

ఈ రెంటికంటె పరము నుత్తమమునగు నది శారీరకమను శాస్త్రము. అందు శారీరక విద్వాంసులు ఈ క్షరాక్షరులచేతనే యీ సృష్టి విధియందు కృతకృత్యతం జూడక యాపరావరజ్ఞులు అక్షరునికంటె నొకానొక యుత్కృష్టుని అవ్యయనామకాత్మను ఈ విశ్వరూపత్వమున నంగీకరింపుచు. "సర్వంఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మైవేదం సర్వం" ఇత్యాది శ్రుతుల నా యవ్యయాత్మ యందే సమన్వయించుచున్నారు.

"ద్వావిమౌ పురుషౌలోకే క్షరశ్చాక్షర ఏవచ
క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే

ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యోలోక త్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః
యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరా దపిచోత్తమః
అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః.

"ఐతదాత్మ్యమిదం సర్వమ్" అని శ్రుతియు "సర్వం బ్రహ్మ" యనుచున్నది. కనుకనే యీ విశ్వమునకు అవ్యక్తైక సారత్వము, ప్రధాన మాత్రపర్యవసాయిత్వము నంగీకరించు సాంఖ్యుల మతమపర్యాప్తమను నీ యర్థము భగవద్గీత యందు స్పష్టీకరింపబడినది.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరంభావ మజానంతో మమావ్యయ మనుత్తమం
నాహం ప్రకాశః సర్వస్యయోగ మాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయం
త్రిభిర్గుణమయై ర్భావై రేభిః సర్వమిదం జగత్
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయం
దైవీహ్యేషా గుణమయీ మమమాయాదురత్యయా
మామేవయేప్రపద్యన్తే మాయామేతాం తరంతితే
అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే
పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః
యఃససర్వేషు భూతేషు నశ్యత్సు నవినశ్యతి
అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాంగతిం
యం ప్రాప్య ననివర్తన్తే తద్ధామపరమం మమ
పురుషః పరః పార్థ! భక్త్యాలభ్యస్త్వనన్యయా
యస్యాంతస్థాని భూతానియేన సర్వమిదం తతమ్."

"మమపరమంభావం" అనుచో నస్మచ్ఛబ్దముచే నీ శరీరాభి మానిత్వమున శారీరక-ప్రాజ్ఞ-ఆత్మ చెప్పబడినది. దానికి యాత్మత్వ మూలమేమి? యనుటకు అవ్యక్తాక్షర పరమత్వము సాంఖ్యులంగీకరింపుచున్నారు,- గీతా సిద్ధాంతమన్ననో, అక్షరాలంబన చిదవ్యయ పరమత్వము,- అథవా గీత యందెల్లెడల నస్మచ్ఛబ్ద మవ్యయైకమాత్ర వాచక మనవచ్చును—

"త్రిభిర్గుణ మయైర్భావైః ఏభిః సర్వమిదం జగత్
మోహితం నాభిజానాతి మామేభ్య పరమవ్యయం."

అని అవ్యయోపదేశము వలన అతడే శారీరకుడగును గాని ప్రాజ్ఞాత్మకాదు - అందును :—అవ్యయుడు. (1) శరీరాభిమాని జీవావ్యయుడనియు. (2) విశ్వాభిమాని పరమావ్యయుడనియు భేదముచే రెండు విధములుగ నెరుంగదగును. "పరంభావమజానంతో మమ" అను వాక్యమందు, అస్మచ్ఛబ్దముచే శరీరాభిమాని యగు జీవాత్మ లక్ష్యము గావింపబడుచున్నాడు. అతనికి 'పరంభావము' విశ్వాభిమానియగు నవ్యయునిగ నెరుంగవలయును. ఆ పరమావ్యయుడే నా యీ జీవావ్యయునకు 'పరమంధామ' గా నుపపన్నుడగుచున్నాడు.

ఆ యీ యుభయ విధావ్యయుడు యోగమాయావశమున నీ యక్షరునందు నిత్యానైక భావ్యము నొందియుండుట వలన నక్షరుని కంటె వేరుగా నందరకు వెల్లడి కానందున ప్రాజ్ఞాత్మ నవ్యక్తమాత్ర పర్యవసానముగ సాంఖ్యులు తలచు

చున్నారు. తదవ్యక్తాంతర్నిగూఢాత్మాన్వయ పర్యవసాన మవ ధేయమని భగవద్గీతాదేశము.

అథవా :— స్థూలారుంధతీ న్యాయమునఁనీ - వైశేషిక - ప్రాధానిక - శాంకరకముల మూటికి క్రమిక ప్రవృత్తియైన నవంగ తవ్యము : ఎట్లన :—

"క్షరపురుష పర్యవసాన మీ వైశేషికము మొదటి దర్శనము. అంతకంటె నవ్యక్తాక్షర పురుష పర్యవసాన మీ ప్రాధానిక దర్శనము రెండవదర్శనము. అనంతరము అవ్యయ పురుష పర్యవసాన మీ మూడవదగు శారీరక దర్శనము." అని బోధ సౌకర్యము నిమిత్త మీయను గ్రహదృష్టిభావ్యము. ఈ మూడు ప్రకరణములు నొకే శాస్త్రమను కొనవచ్చును. ఇట్లు :—ఈ క్షరబ్రహ్మ యొక్కయు, అక్షరబ్రహ్మ యొక్కయు- అవ్యయబ్రహ్మ యొక్కయు ఆత్మత్వములను పృథక్తంత్రము లచే క్రమముగ నంగీకరించు నీ వైశేషిక-ప్రాధానిక - శారీర కముల క్రమనిర్దేశ నిబంధనముం గూర్చిన ప్రతి తంత్రవైష మ్యము. సోపాధికత్వము వలన నైనదని యుపేక్ష్యము. అందును, వైశేషికనయమున విస్తరముగా నిరూపితమైన సగుణభావలక్షణ క్షరబ్రహ్మయొక్కయు, సాంఖ్యనయమున విస్తరించి నిరూపింపబడిన యవ్యక్త లక్షణాక్షర బ్రహ్మ యొక్కయు-అవిష్టభాగ విప్రతిపన్న భాగములకు సంబంధించిన విజ్ఞానము, ననువ్యాఖ్యానమును గావించు నిమిత్తము శారీరక శాస్త్రము ప్రవృత్తమైనదెంచదగును.

ఇంకను మరొక విధముగా స్థూలారుంధతీ న్యాయమున నీయాత్మ ప్రకరణములను విభజించి తెలిసికొన దగును. ఎట్లన అమృతము బ్రహ్మ శుక్రమునను నీ మూడు ననుసంహితముగ నేకమగు నశ్వత్థ నామమున నీ యాత్మగా చెప్పవచ్చును. అందు శుక్రావచ్ఛేదము దేవసత్త్వానుగతమునగు నాత్మ చతుర్వేద మంత్ర సంహితానుగత బ్రాహ్మణ ప్రకరణమున నిరూపితము. పిమ్మట బ్రహ్మావచ్ఛేదమున సూక్ష్మ ప్రకృతియు, బ్రహ్మసత్త్వానుగతమునగు నాత్మ ఆరణ్యకభాగ ప్రకరణమున నిరూపితము. అనంతరము నమృతావచ్ఛేదమున నిగూఢ తమమగు పురుషాత్మ యుపనిషద్భాగ ప్రకరణమున నిరూపితము. ఉపనిషత్సంగము వేదాంతము.

ఉపనిషత్తాత్పర్య నిరూపణ కొరకు బ్రహ్మసూత్ర గీతా శాస్త్రములను రెండు తంత్రములు ప్రవర్తించినవి. అందు అక్షర పురుషుడు బ్రహ్మ సూత్రముల చేతను అవ్యయ పురుషుడీ గీతాశాస్త్రముచేతను సువిశదముగా వ్యాఖ్యాతులైరి. అవ్యయుని కంటె నధికముగా నేమియు లేదనియు "సాకాష్ఠా సా పరాగతి" యనియు నిష్కర్ష.

అవ్యయ బ్రహ్మమే భగవద్గీతా బ్రహ్మ సూత్రాది రూప శారీరక దర్శనమునకు ముఖ్యమగు శాస్త్రార్థము అయినను పూర్వపక్షము బ్రహ్మసూత్రములందు 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' 'జన్మాద్యస్యయతః' 'శాస్త్రయోనిత్వాత్' 'తత్తు సమన్వ

త్వాత్' అని యిట్లు ప్రతిపన్నేయు శాస్త్రకర్మచే సామాన్యముగ బ్రహ్మశబ్దమొకయర్థమున వ్యాచిఖ్యాసితమై యున్నది. అయ్యది క్షరపురుషపరము కావచ్చును. ఏలయన "తస్మాదేత ద్బ్రహ్మనామరూప మన్నం చ జాయతే" అను శ్రుతిచే అనుప సృష్టమగు బ్రహ్మ శబ్దముచే యథా సంభవముగ క్షరపురు షుడే యభిప్రేతుడై యుండవచ్చును గదా! మరియు పరబ్రహ్మ శబ్దమున నవ్యయుని పరమబ్రహ్మ శబ్దమున నక్షరుని వ్యవహ రించు గీతయందు "బ్రహ్మాక్షర సముద్భవమ్" "బ్రహ్మణో హి ప్రతిష్ఠాహం" ఇత్యాదులం దనుపసృష్ట బ్రహ్మ శబ్దమున క్షర పురుష గ్రహణమే యిష్టమగుటచే సమాన తంత్రమగు నీ శారీ రక సూత్రములందు గూడ నట్లే యంగీకరించుట యుక్తము కదా!

"ఈ యభిప్రాయముం దెలుపుటకే శారీరక సూత్రము లందు "జన్మాద్యస్య యతః" అని యిట్లు వ్యాచిఖ్యాసిత క్షర బ్రహ్మ లక్షణము చెప్పబడినది. ఈసర్వమును పుట్టుట, నుండుట లయించుట క్షరబ్రహ్మనుండియే గదా! అక్షరావ్యయు లపరి ణాములగుటవలన వారికి వికార సంభవ యోగము లేదు. కనుక క్షరబ్రహ్మ నిరూపణమే యీ శారీరక దర్శనమని తోచు చున్నది. అనినచో సిద్ధాంతము కార్యారంభకత్వమున నుపా దానత్వమునను నిర్దిష్టమగు బ్రహ్మకు క్షరత్వమున నుపపత్తి యున్నను, సామాన్యముగ సర్వత్ర బ్రహ్మశబ్దమునకు క్షరత్వ మంగీకరించినచో "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" "నిత్యం

విజ్ఞాన మానందం బ్రహ్మ" ఇత్యాది బ్రహ్మవాక్యము లన్నిటికి నవిషయత్వము సిద్ధమగును. కనుక నవిశేషముగ బ్రయుక్తమగు బ్రహ్మశబ్దము అవ్యయాక్షర క్షరపురుషులను వ్యాసజ్యము గావించి చెప్పును. లేదా ప్రత్యేకించి చెప్పననవలయును. ముష్వురు పురుషులు నొక పురుషుడే - అతడే అవ్యయుడు, అక్షరుడు, క్షరుడును. అట్టి ఏక పురుషుడే శారీరకమునగు వ్యాఖ్యాతవ్యుడు. క్షరు డక్షరునందు అత డవ్యయునందు ఇట్లు ముష్వురికి నేకీభావము. "తాద్ధార్మ్యాత్ తాచ్ఛబ్ద్యమ్" అను న్యాయమున అవ్యయశబ్ద బోధ్యు డనదగు అవినాభూతులగు నీ మూవురకు నవ్యయ పరత్వమువలన నవ్యయునందే నిష్ఠ చెప్పదగినది.

ఆ యీ త్రిపురుష పురుషుడు పరమాత్మ ప్రత్యగాత్మ యని రెండు విధముల దెలియనగును. విశ్వాభిమానియగు నీశ్వరుడు పరమాత్మ, శారీరక జీవుడు ప్రత్యగాత్మ. ఈ యిరువురికి నన్యోన్యము భిన్నత్వమా? ఏకత్వమా? యను సంశయ నిరాకరణము శారీరక శాస్త్ర ముఖ్యార్థము. అందు "దర్శనాంతర సిద్ధాంతానుసారమున క్షరపురుష మాత్రమునగాని - అక్షర పురుషమాత్రమునగాని సర్వార్థసిద్ధి యగు నుండగ మరల నెందుకీ మూడవ వాడగు నవ్యయ పురుషు నంగీకరింపవలయును?" అను నాశంకకు సమాధానముగ బ్రకరణాంతరమగు నీ గీతాశాస్త్రము ప్రవర్తించినదని యెంచవలయును.

ప్రతి తంత్రమును సూత్రమయము, కారికామయమునగు శాస్త్రముగ నుండును. అందు జాలుక్య సూత్రము (వైశేషి

కము)షడధ్యాయీసూత్రము(ప్రాధానికము), శారీరకసూత్రము (వ్యాస దర్శనము) నని సూత్ర సందర్భములు. ఇక కారికా సందర్భమన్ననో, వైశేషికమునకు ప్రామాణికమగు కారికలు విలుప్తమగుటచే లభించుట లేదు. కాని ఈశ్వర కృష్ణకృత కారికా సప్తతి ప్రాధానిక తంత్రమునం దున్నట్లే భగవద్గీతోప నిషత్తు శారీరక తంత్రమున గారికా రూపమున గీర్తి నొందు చున్నది. మరియు గీతయన శ్రీకృష్ణార్జున సంవాద ప్రసంగమున గృష్ణద్వైపాయనప్రణీతమై శ్రీకృష్ణ వాసుదేవోపదిష్ట సిద్ధాంత ప్రకరణ రూపమగు నధ్యాత్మశాస్త్రము. కాని యిందొక విశేష మేమన ఒకటేయగు తంత్రమందు శారీరకసూత్రము, భూతాత్మా మృతాత్మ లక్షణములుగల ప్రత్యగాత్మ పరమాత్మల జీవేశ్వరుల అంశాంశిభావమున నగు భేదాభేద సిద్ధాంత వ్యాఖ్యానార్థము ప్రవర్తించుచుండగా: గీతాశాస్త్రమన్ననో, జీవేశ్వర లక్షణ ణములు గల ప్రత్యగాత్మ పరమాత్మలను నుభయుల ప్రత్యేక స్వరూపమున పరాపర ప్రకృతి విశేష క్షరాక్షరోభయాశ్రయ త్వముచే తృతీయ పురుషుడగు నవ్యయునియొక్క సమావేశ విజ్ఞానార్థము వేరుగా ప్రవర్తించుచున్నది. జీవేశ్వరాక్షర భేదా భేద నిరూపణము బ్రహ్మసూత్ర ప్రకరణార్థము జీవునకు నీశ్వరు నకును అమృతాత్మయందు క్షరాక్షరులకంటె నతిరేకముగా నవ్యయపురుష నిరూపణము గీతా ప్రకరణార్థమని నిష్కర్ష.

వైశేషిక-ప్రాధానికోభయ ప్రకరణోత్తరమున నీ సిద్ధాంత ప్రకరణ ముపదేశింప బడుచున్నది. ప్రాధానిక

సిద్ధాంతములకు చాలవరకు నుపాదేయత్వమున్నను, కొన్నిటి కనుపాదేయత్వమున్నందున తత్ప్రత్యాఖ్యానార్థ మీ యుత్తర సందర్భము ప్రవర్తించుచున్నది: అందు ప్రకృతి-పురుష సంబంధమున సాంఖ్య ప్రకరణోక్త సిద్ధాంత మిందు ప్రత్యాఖ్యేయము. ఎట్లన :—సాంఖ్య ప్రకరణమున అవ్యక్తమగు నక్షరము భోక్తయగు పురుషునకు భోగ్యార్థ సృష్టికొరకు ప్రకృతిత్వముచే జెప్పబడుచున్నది. ఉపాదాన కారణము ప్రకృతి. ఆ యక్షరమునకు బరిణామిత్వ మంగీకరింప బడుచున్నది. దానికి పురుషత్వము, ఆత్మత్వమును ఇష్టపడుటలేదు. పురుషాత్మ యనునది క్షేత్రజ్ఞము, చిన్మాత్రము, నిష్క్రియము, జగత్సృష్టియం దుదాసీనము నని యందు సిద్ధాంతము. ఆ యంశమిందు ప్రత్యాఖ్యానము సేయబడుచున్నది. ఎట్లన :—క్షరమే జగజ్జన్మస్థితి భంగోపాదానమగుచున్నది. అక్షరము సర్వజగన్నియంతృ భూతమగు నిమిత్తకారణ మాత్రము. ప్రకృతి సంబంధముచే సాంఖ్యతంత్రమున జెప్పబడిన దంతయు క్షరబ్రహ్మను గతమని యెరుంగ నగును.

"అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవన్త్య హరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే
అవ్యక్తోఽక్షర ఇత్యుక్తః తమాహుః పరమాంగతిం
పరస్తస్మాత్తుభావోఽన్యః అవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః"

అని యిట్లవ్యక్త శబ్దముచే, క్షరము, నక్షరము, నవ్యయము స్మరింపబడుచున్నను ప్రకృత్యభిప్రాయముచే ప్రాయ

మాణమగు నీ యవ్యక్తశబ్దము క్షరబ్రహ్మ పరముగనే యున్నే యము కాని అక్షరావ్యక్త పరముగగాదు. "తథాక్షరాద్వి విధాః సోమ్యభావాః, ప్రజాయన్తే తత్రచైవాపియన్తి" అను నీశ్రుతియందు 'క్షరాత్' పాఠము భావ్యము 'అక్షరాత్' అనుపాఠ మంగీకరించినచో క్షరాక్షరుల యాత్యంతిక సంశ్లేషావస్థానము వలన క్షరావసాయి ధర్మములకు, నక్షరునందు గూడ నుపచా రము కల్పింపదగును. ఇక :—అవ్యయునందు పరబ్రహ్మ శబ్దము, అక్షరమునందు పరమ బ్రహ్మశబ్దము. కేవల బ్రహ్మశబ్దము పఠింప బడుచో నయ్యది క్షరమాత్ర పర్యవసితమునగును "బ్రహ్మాక్షర సముద్భవమ్" అను గీతావాక్యముచే గూడ నట్లే తెలియు చున్నది కదా!

"యఃసర్వజ్ఞః సర్వవిద్ యస్యజ్ఞాన మయంతపః
తస్మాదేతద్ బ్రహ్మనామరూప మన్నంచ జాయతే"

ఇత్యాది శ్రుతి వాక్యములందును బ్రహ్మశబ్దమునకు క్షర పరత్వమే యుపనేయము 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' "జన్మాద్యస్య యతః" "శాస్త్రయోనిత్వాత్" "తత్తుసమన్వయాత్" అని బ్రహ్మసూత్రోప క్రమమున నుపాదీయమానమగు నీ బ్రహ్మ శబ్దము క్షరాభిప్రాయము గలదైనను, ఏకాంతతః అక్షరుని విడువదు. అక్షరునకు బ్రహ్మత్వము, జగజ్జన్మాది కారణత్వమును, క్షరునం దక్షరసమన్వయము వలననే యుపపన్నమగుం గాని స్వాతంత్ర్యమున గాదు. స్వరూపమున నుండుటట్టియు, అవి

నాశియునగు నక్షరున కపరిణామిత్వమున, వికార రూపత్వా సంభముగదా! అవ్యయాలంబితుడగు నీ యక్షరుడు ప్రాణా ప్యాగన్యాద్యన్న సముచ్చాయాత్మక పంచాక్షర కూటస్థమగు నాత్మయగును, ఈ యాత్మలకు బురుషత్వమన్ననో, వ్యాసజ్య వృత్తిచే "సముదాయే దృష్టాః శబ్దాః అవయవేఽపివర్తన్తే" అను న్యాయమువలన ప్రత్యేక పర్యాప్తముగ నుపపన్నమగును. కనుకనే "ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ" "ఉత్తమః పురుష స్త్వన్యః" ఇత్యాది వ్యవహారములు సంగతము లగుచున్నవి. ఇట్లు ఈ యక్షరుని బురుషత్వము, ఆత్మత్వము-అపరిణామిత్వము నధికరించి సర్వ వేదాంతములు నీ యక్షరపరతచే బ్రహ్మ సూత్రములందు వ్యాఖ్యాతములైనవి. ఇక మరల నీ గీతాశాస్త్రమందు :—

"యస్మాత్ క్షరమతీతోఽహం అక్షరాద పిచోత్తమః
అతోఽస్మి లోకేవేదేచ ప్రథితః పురుషోత్తమః"

అని యిట్లుపదేశించు భగవంతునిచే క్షరాక్షరుల కంటె నతిరిక్తుడగు నొకానొక యవ్యయ నామక పురుషుడు ముఖ్యుడుగ నాత్మత్వమున విధింపబడుచున్నాడు. అతనికి "ఉదాసీనవ దాసీనం అసక్తం తేషుకర్మసు" అని యిట్లు అసంగత్వమున నుదాసీత్వముం బ్రతిపాదించు నా భగవంతుడగు శ్రీకృష్ణునిచే నేకాంతతః సృష్టియందు కారణత్వము నిరసింపబడుటలేదు.

"అజోఽపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ, సంభవామ్యాత్మ మాయయా."

అని యిట్లు ప్రకృత్యవష్టంభమున నశేషోత్పాదకత్వము నీయవ్యయ పురుషునందే సిద్ధాంతిత మైనదికదా! కనుకనే ఈయవ్యయలక్షణ పురుషవిశేషానుదర్శనార్థ మతఃప్రతిపాదక సందర్భముకంటె వేరుగ నీగీతాశాస్త్రారంభమని భావింపదగును.

ఇక:—దర్శనము లారనుకొను కొందరు విద్వాంసులు, న్యాయ, యోగ, మీమాంసాదర్శములను మూటినిగూడ జెప్పుచున్నారు. అది అవిచారితమణీయము. విశ్వాత్మ దర్శనోపచారమునకు అధిభూతము, అధ్యాత్మము, అధిదైవతమునని యిట్లు మూడు విశ్వాధికరణములందే యవసరత్వముండుటచే నంతకంటె నన్యత్ర ఏకదేశికార్థమున యాథాతథ్యముగ నాత్మదర్శనార్థము ప్రయత్నము నిష్ప్రయోజనమగుటవలన దర్శనశాస్త్రాతిరేక మయుక్తముగదా! అటుగానిచో శబ్ద-నిరుక్త-సాహిత్య-ధర్మ-జ్యోతిషాద్యైకదేశిక శాస్త్రములకుగూడ దర్శశాస్త్రత్వాపత్తి రాగా:-దర్శనశాస్త్రము లారనుదాని కనుపపత్తి కంఠమున దగుల్కొనును. శబ్ద శాస్త్రాదులవలె తర్క- న్యాయశాస్త్రముగూడ నన్వీక్షికీ నీతి విజ్ఞాన ప్రకరణ భూత కథాశాస్త్ర మగుటవలన నైకదేశిక శాస్త్రము. అందలి షోడశ పదార్థములును కథాంగత్వమున నుపన్యసింప బడినవి. అయ్యవి యాత్మ శరీరేంద్రియార్థాదులవలె విశ్వాంగత్వమున నభిప్రేతములు. ఆత్మ శరీరేంద్రియార్థాది ద్వాదశ ప్రమేయ భావములను దర్శన శాస్త్రమునందు వలె న్యాయశాస్త్రమునందును విచార ప్రసంగమున్నను వానికి వాది

ప్రతివాది విచార క్షోదాహరణ విధమున నుపన్యాస మగపడు చున్నది. అందువలన నా శాస్త్రోద్దేశ్యము కథా స్వరూపమునే గాని విశ్వాత్మ స్వరూప మెరింగించుట కాదని పూర్వాపర ప్రకరణములంబరిశీలించిన దేలగలదు. కనుక తర్క న్యాయశాస్త్ర మొకదేశికత్వముచే దర్శనశాస్త్ర మనజెల్లదని యెరుగనగును: ఇక యోగ శాస్త్రము సాంఖ్య శాస్త్రమునకే చారిత్ర్య లక్ష ణముగల యుత్తరాంగము. అయ్యది పూర్వ సాంఖ్యోపపాద్య కైవల్య జ్ఞానోపాయ భూతము. కనుకనే యీ యుత్తర సాంఖ్య ప్రవచనము సేశ్వర సాంఖ్య నామమున ప్రసిద్ధి నొందినదని యెంచవలయును. ఇట్లే పూర్వమీమాంసా శాస్త్రముగూడ కర్మ విధాయక వైదిక వాక్యార్థ సమన్వయోపపాదక తర్క శాస్త్రమేగాని విశ్వశాస్త్రము కాదు. ఒక విధముగా "బ్రహ్మకు వలె కర్మకుగూడ విశ్వరూపత్వము సంభవ" మనుకొని "బ్రహ్మ మీమాంసకు వలె దీనికిగూడ విశ్వ శాస్త్రత్వము" చెల్లునను కొన్నచో జైమినికృత ద్వాదశ లక్షణ కర్మ ప్రకరణము, శాండిల్యకృత చతుర్లక్షణ భక్తి ప్రకరణము, బాదరాయణకృత చతుర్లక్షణ బ్రహ్మప్రకరణము మొత్త మీ మూడును వింశతి లక్షణ మీమాంసా శాస్త్రమునకే ప్రకరణత్రయముగా నెంచు కొని యొకే శాస్త్రముగా నెరుంగవలయును. ఆవిధమునైనను వైశేషిక ప్రాధానిక శారీర భేదములచే దర్శన త్రయమే యుప పన్నమగును. మరియు నొక విధముగ నీ మూడు నేకమై యొకే దర్శన మగుననిగూడ గుర్తింపవలయునని మనవి.

ఇతి దర్శన శాస్త్ర సమాలోచనా

విషయ రహస్యే ఆత్మ సమీక్షా.

బుద్ధియోగ జ్ఞానౌపయిక — జీవాత్మ జ్ఞానము.

సర్వవిధానుశోక నివృత్త్యుపాయమగు బుద్ధియోగము గీతయం దుపదేశింప బడుచున్నది. అయ్యది యాత్మయందా ధానము గావింపబడును. కనుక నాత్మనుగూర్చి విశేషముగ నెరుంగవలయును.

జీవ ప్రజాపతి - చతుఃపర్వత్వము.

"ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వారూపాణి పరితా బభూవ"(యజు) అన్నట్లీ సర్వము నొక్కొక్కటి యొక్కొక ప్రజాపతి: ప్రజాపతిర్వా ఇదం సర్వం" అని శ్రుతి. ఆ యీ ప్రజాపతి ఈశ్వరుడు, జీవుడునని రెండు విధములు. అందు నీ జీవ ప్రజాపతి ఆత్మ - ప్రాణము - విత్తము - పాపము నని నాల్గు పర్వములు. "చతుష్టయం వా ఇదం సర్వం" అనియు శ్రుతి. ఉక్థము ఆత్మ[1]; అర్క ప్రాణము[2]; వీర్యమో అన్నమో పశువో యగునది విత్తము[3]. ఆవరణము పాపము[4]. అందు ప్రాణము విత్తమునను ఉపకరణ మనుకూల ధర్మము. ఉపసర్గమగు పాపము, ప్రతికూల ధర్మము. ప్రాణాదులు మహిమలు. స్వస్వ మహిమ యందీయాత్మ ప్రతిష్ఠితమై యుండును (స్వేమహిమ్ని ప్రతిష్ఠితః) కైవల్యము నొందువరకు నిత్యము నీ ప్రాణ విత్తము లందే యీ యాత్మయుండును. 'యావద్విత్తం తావదాత్మా' అని ప్రాణ విత్తములందు దీని కభివ్యాప్తి. పాపము ఆత్మ

యొక్క విద్యను, శక్తిని క్షీణింపజేయును. యిక ప్రాణ మాత్మ యందభేదమున ననుషక్తమగును. ఓతప్రోతమగు నీ యాత్మ ప్రాణమందు, ప్రాణమాత్మయందు సంపన్నము లగును. శీతజల ద్రవతా హేతు వరుణాగ్నికి వలె నంతర్యామ సంబంధము. ఇక విత్తమాత్మయందు పాధానమగును. ప్రతప్త జలతాప హేత్వాగ్ని వలె బహిర్యామ సంబంధము పాపమునకు పాత్రోప హితాగ్ని వలె నుపయామ సంబంధము.

## 1. ఆత్మ - పరాత్పరుడు.

అమృతము - బ్రహ్మ - శుక్రము నని యాత్మ త్రివర్గము. పరాత్పర - అవ్యయ - అక్షర - క్షరము లమృతములు. అనంత బలసంపన్న రసము పరాత్పరుడు. ఉన్ముగ్ధసత్తా చిదానందముల యైకాత్మ్యమగు నిర్విశేషభావము రసము. అది యానందము. అవాఙ్మానస గోచరత్వమున నది యనిర్వచనీయమున విజ్ఞేయము నగును. ఆ యమృత రసమునందు బలలక్షణానంత మృత్యువు లాధారపడి యుండును. మృత్యుగర్భితమగు నారసము జ్ఞానము. మృత్యురూప బలము లసత్తులు. వానియందలి యమృత రూప సత్తరసము. సత్తయొకటియే గనుక ఈ నిర్విశేష బ్రహ్మ యేక మేవాద్వితీయము. అందుద్బుద్ధ సత్తా చిదానందముల యైకా త్మ్యము పరాత్పర భావము. అది మూడు విధములుగ నెంతురు. అసీమము, అత్యనపినద్ధము, విశ్వాతీతము నగు భూమ యొకటి. శూన్య బిందు వణిమ రెండవది. అది విశ్వాతీతము. విశ్వమం

దుపపన్నములగు భూమాణిమలు రెండును సనిరూప్యములు. ఒక యర్థమే పరస్పర సాపేక్షికముగ భూమయు, నణిమయు నగును. ఘటమందు సర్షపముకంటె భూమయు, పర్వతముకంటె నణిమయు గనబడుచున్నవి గదా! కనుక నిది మూడవది. అందుచే విశ్వాత్మయు-జీవాత్మయు అణోరణీయము, మహతో మహీయము నగునని యెరుంగనగు.

అమృతాత్మలు - మూవురు పురుషులు.

అవ్యయ-అక్షర-క్షర యను నీ మూవురును పురుషులు. అనవచ్ఛిన్నత్వమున మాయోపజనిత పురోపాధి కావచ్ఛేదవత్త్వము పురుషత్త్వము. అందు విద్యారూపములును బ్రహ్మభాగములునగు ఆనంద విజ్ఞానముల చేతను, వీర్యరూపములును కర్మభాగములు నగు వాక్ప్రాణములచేతను నుపచీయమానమగు శ్వోవసీయసమను మనస్సు అవ్యయు డనబడును. అతడే కామాత్మ. అవ్యయ ధర్మములగు నీయానందాది ధర్మములచే ధర్మి యగు. సచ్చిదానందాక్షర పురుషుడు మనస్సుచే గోరుచు ప్రాణములచే తపించుచు, వాక్కుచే శ్రమించుచు, క్షరబ్రహ్మను వికార మొందించుచు ఈ సృష్టి సంతటిని విస్తరింపచేయును. హృద్య భాగములును, ఋతములును అంతర్యామి రూపములు నగు నింద్ర విష్ణువులచేతను, పృష్ఠ్య భాగములును, ఋతములును సూత్రాత్మ రూపములునగు నగ్నిషోములచేతను, నుపచీయమాన సత్యబ్రహ్మ యక్షరపురుషుడు హృదయము మొదలు

పృష్ఠమువరకు గర్భమం దుండుచు, ఈ విశ్వము నాత్మయందాధానము గావించుచున్నాడు. ఆత్మ యందు విశ్వమును విశ్వము నందాత్మను హోమము గావించుటచే సర్వహుద్యజ్ఞము సంపన్న మగుచున్నది. యజ్ఞము విష్ణువు. బ్రహ్మకర్మలు రెండు నవ్యయ రూపములు. బ్రహ్మవిద్య ; కర్మ వీర్యము. అందీకర్మ ప్రవృత్తము, నివృత్తమునని రెండు విధములు. ప్రవృత్తకర్మచే విశ్వయజ్ఞము ప్రవర్తించును. కనుక విశ్వ మగపడును. నివృత్త కర్మచే యజ్ఞనివృత్తి యగును. విశ్వము నశించును. అట్లు ఈ ప్రవృత్తి కర్మావచ్ఛిన్నుడగు నక్షరుడు విష్ణువు, యజ్ఞము. నివృత్తి కర్మావచ్ఛిన్నుడగు నా యక్షరుడే క్రతుధ్వంసి మహేశ్వరు డనబడును. ఆ యీ విష్ణువే పర్యాయమున గతిం బరివర్తింపచేయుచు మహేశ్వరుడను సంహారకుడుగ నగును. స్థిత మగు నీ విశ్వ మనుక్షణ గతిమంతము గనుక జగత్తని చెప్ప బడుచున్నది. స్థితిగతుల యోగమున నిది నానావస్థలు గలదిగా నగపడుచున్నది. గతి (1) యర్వాచీనము, (2) పరాచీనము నని రెండు విధములు. ఇందు మొదటిది స్థితికొరకు, రెండవదినాశము కొరకు నగును. ఆ యుభయ గత్యవచ్ఛిన్నులగు నింద్ర విష్ణువులచే సంపద్యమానుడు, స్థిత్యవచ్ఛిన్న బ్రహ్మ యీ విశ్వమంతయు సృష్టించును, రక్షించును, సంహరించునని యెరుంగ వలయును. అది ఆత్మ.

ఆ యాత్మయందు విశ్వాహుతిభోగము. ఆ యీ యాత్మకు భోగాయతనము శరీరమనునది. దాని నగ్నిషోములను నక్షరులు

జనింపజేయుచురు. వికాసవృత్తిగల యగ్ని తేజస్సు-సంకోచ వృత్తిగల సోమము స్నేహము. వాని యోగతారతమ్యమున సర్వమూర్తద్రవ్యోత్పాదన మగును. మూర్తము శరీరము. "అగ్నిషో మాత్మకం జగత్" అని శ్రుతి. ఆత్మజనిత శరీర మాత్మయే యగును. కనుకనే శరీరధర్మముల నధ్యాత్మముగా జెప్పుదురు. ఈయధ్యాత్మమునందు పౌరుషరూపముగ నెరుంగు నంతవరకు అమృతమను నాత్మభాగముగ నెరుంగదగును.

పంచబ్రహ్మలు - ఆత్మలు

అక్షరపురుష నియుక్తక్షరపురుషుడు ప్రాణ-ఆప-వాక్-అన్న-అన్నాద అను పంచవిధములుగ వికృతినొందును.

"యః సర్వజ్ఞః సర్వవిద్ యస్యజ్ఞానమయం తపః
తస్మాదేతద్బ్రహ్మ నామరూప మన్నంచ జాయతే."

ఈనామరూపము లన్నము. ఈసర్వము నామరూపాభినీతము. మనము చూచునదంతయు అన్నము. భూతమును, భవిష్యత్తును, మనము భావించునదంతయు "బ్రహ్మైవేదం సర్వమ్" ప్రాణాదిభేదమున నైదువిధములుగ విభక్తమనుకొందము. అది మరల ఋతము, సత్యమునని రెండు విధములు. ప్రాణ వాక్ అన్నాదములను నగ్నులు మూడును సత్యము. ఆపః, అన్నమ్ అను సోమద్వయము ఋతము. సత్యము బ్రహ్మ-ఋతము సుబ్రహ్మ - కామయమానాక్షర పురుషుని తపమున నీరెండు గలిగినవి "ఋతంచ సత్యంచాభీద్ధాత్ తపసోధ్యజాయత"

అగ్ని సత్యము, సోమము ఋతము. సహృదయశరీరము సత్యము, అహృదయశరీరము ఋతము. ప్రతిష్ఠయందు సత్యశబ్దము. ఇది స్వప్రతిష్ఠయందు ప్రతిష్ఠనొందుచు సత్యమగును. స్వప్రతిష్ఠలేక అన్యప్రతిష్ఠచే ప్రతిష్ఠ గాంచునది ఋతము. ఈరెంటిలో నొక దానిని విడచి మఱొకటుండదు. అవినాభావసంబంధము. "ఋతం సత్యేధాయి, సత్యమృతేధాయి" (యజు) అందు, సత్యములకు ఋతజనితత్వ-ఋతగర్భత్వ-ఋతపరాయణత్వము లుండుటచే ఋతము ప్రధానము, సత్యమగు ఘటము. ఋతమృత్తునుండి పుట్టి యందే యుండి అందే లయించునుగదా! "ఋతమేవ పరమేష్ఠి ఋతం నాత్యేతి కించన, ఋతే సముద్ర ఆహితః ఋతే భూమిరియం శ్రితా" అని శ్రుతి. ఈపంచబ్రహ్మలందును సోమత్వమువలన ఆపస్సు అన్నము ఋతములు, తక్కిన మూడు నగ్నులగుటవలన సత్యములు. ఆయీసత్యాగ్ని విజ్ఞానమున త్రయీ-బ్రహ్మ-వేద-విద్యాశబ్దములు. ఇక సోమ విజ్ఞానమున అథర్వ-సుబ్రహ్మ-సువేద-శబ్దములు. ఆయీయగ్ని షోములు రెండును బ్రహ్మ; అగ్నియం దాహూయమానమగు సోమము ఏరూపమొందునో అది యజ్ఞము. అగ్నిషోముల-ఋతసత్యముల-నైకభావ్యము యజ్ఞము. మనము చూచున దంతయు యజ్ఞము. సర్వము నగ్నిషోమీయముగదా! ప్రాణః వాక్ అన్నాదభేదముల త్రివిధమగు నీయగ్ని నీక్రింది విధము నను బిలుతురు.

| | | |
|---|---|---|
| ప్రాణాగ్నిః 1 | వాగగ్నిః 2 | అన్నాదాగ్నిః |
| యాజుషాగ్నిః | ఆంగిరసాగ్నిః | పాశవ్యాగ్నిః |
| బ్రహ్మాగ్నిః | దేవాగ్నిః | భూతాగ్నిః |

అగ్నిత్వసాధర్మ్యమున్నను ఈమూడగ్నులును భిన్నజాతీయములు. వీని రూపభేదములు మరియొకచో జూచుకొనవచ్చును. (బ్రహ్మవిజ్ఞానే)

అందిప్రాణాగ్నిబ్రహ్మ :—తపస్సుచే తపించుచు నన్నాది పారమేష్ఠ్య ఋతములను పరిగ్రహించి వానిచే సత్యములం బుట్టించి యాసత్యములచేతనే ఆత్మ-ప్రాణ-పశువులను త్రిపర్వములుగల ప్రజాపతికి ఆత్మను, కారణశరీరమును కల్గించును. ఆసత్యమగు నాత్మ హృదయస్థము, మనోమయము, భారూపము. ఆకాశాత్మ-మహీయాన్ లేక అణీయాన్ (1) ఇక వాగగ్నివిష్ణువు:—బ్రహ్మ శరీరమునుండి ప్రాణములను పరిగ్రహించి వానిచే దేవతలను సృజించి యా దేవతలచే ప్రజాపతి యొక్క ప్రాణము, సూక్ష్మశరీరమును కల్గించును. ఆప్రాణము, ఏకర్షిగనో, సప్తర్షిగనో, దశర్షిగనో నానారూపములుగ అధిదైవతము, అధ్యాత్మము, అధిభూతముగ వెలయుచున్నది. మరియు నన్నాదాగ్ని మహాదేవుడు రుద్రుడు :-విష్ణువునుండి శిపివిష్టములను (పశువులను) పరిగ్రహించి వానిచే భూతములం బుట్టించి యాభూతములచే ప్రజాపతికి పశువులను స్థూలశరీరమును గలిగించును. భౌతికమగు స్థూలశరీరము పశుమయము

గదా! అందీ 1 గుణభూతములు, 2 పరమాణుభూతములు, 3 త్రసరేణుభూతములు, 4 మహాభూతములు, 5 సత్వభూతములు ననునవి యైదు విధములుగ వివర్తములగునవి యొప్పుచున్నవి! ఈమూడగున్నలే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు. సత్య-దేవ-భూతభేదములవలన పృథక్త్వంత్రములు కలవారైనను, కలసి యేకనికాయు లయినను, ఈ యొక్కొక్కమూర్తి నధిష్ఠించి యుందురు. "ఏకామూర్తి స్త్రయోదేవాః బ్రహ్మావిష్ణుమహేశ్వరాః" అని యభియుక్తులు. ప్రతి శరీరమునను, 1 బ్రహ్మ బుుతపతి, సత్యపతి, నిధారకుడు, జనకుడు, 2 విష్ణువు, ప్రాణపతి, దేవపతి, ఆకర్షకుడు, రక్షకుడు. 3 మహేశ్వరుడు, పశుపతి, భూతపతి, విక్షేపకుడు, సంహారకుడు ఇక :-ఈమూవురందును బ్రహ్మకు వాక్కయిా ప్రకృతిపత్ని-విష్ణువునకు అమ్మయిా ప్రకృతిపత్ని-రుద్రునకు అగ్నియయిా ప్రకృతిపత్ని యనియెరుంగవలయును.

### ఆత్మ నిష్కర్ష.

1. అమృతవర్గమునందు :—

| | |
|---|---|
| 1. పరాత్పరః | భూమా |
| 2. అవ్యయః | పురుషః |
| 3. అక్షరః | పురుషః |
| 4. క్షరః | పురుషః |

ఈనాల్గు ఆత్మలు అమృత సత్యములు.

2. బ్రహ్మవర్గమునందు :—

| | | |
|---|---|---|
| 5. (1) శాంతాత్మ ప్రకృతి | బ్రహ్మాగ్ని-బ్రహ్మ | 1 |
| 6. (2) మహానాత్మా ప్రకృతి | అబ్లక్షణసోమము | 4 |
| 7. (3) విజ్ఞానాత్మా ప్రకృతి | దేవాగ్ని-నారాయణః | 2 |
| 8. (4) ప్రజ్ఞానాత్మా ప్రకృతి | అన్నలక్షణసోమము | 5 |
| 9. (5) ప్రాణాత్మా ప్రకృతి | భూతాగ్ని-మహాదేవుడు | 3 |

ఈపంచాత్మలు బ్రహ్మసత్యములు.

3. శుక్రవర్గమునందు:— (శుక్రస్వరూపము మరొకచో వ్యాఖ్యాతము: (బ్రహ్మవిజ్ఞానే)

10. శరీరాత్మా-భూతమయః-వాక్ఛుక్రః

11. హంసాత్మా-వాయుమయః-అప్శుక్రః

12. దివ్యాత్మా-అగ్నిమయః-అగ్నిశుక్రః
ఇది మూడు విధములు (1) వైశ్వానరాత్మ-అగ్నిమయః

13. (2) తైజసాత్మ-వాయుమయః

14. (3) ప్రాజ్ఞాత్మ-ఇంద్రమయః
ఈప్రాజ్ఞుడు మూడు విధములు.
(1) కర్మాత్మ-ఈశ్వరజన్మా-వాసనాలక్షణ కర్మమయః

15. (2) చిదాభాసః-ఈశ్వరాంశః-జ్యోతిర్లక్షణ జ్ఞానమయః

16. (3) ఈశ్వరః-ఈశ్వరాభిన్నః-సర్వశక్తి లక్షణార్థమయః
ఇతడు అధ్యాత్మముగ మూడు విధముల ప్రవర్తించును.
(1) ఊర్గ్లక్షణః-ప్రాణమయః

17. (2) శ్రీలక్షణః-వాఙ్మయః

18. (3) విభూతిలక్షణః-మనోమయః

కొందరీ షట్క్రవర్గమున నాత్మగ్రామము మరియొక విధముగా జూతురు.

1. వాగ్జన్యః-శరీరాత్మా-భూతమయః
2. అబ్జన్యః-హంసాత్మా-వాయుమయః
3. అగ్నిజన్యః-దివ్యాత్మా-ప్రాణమయః

ఈ దివ్యాత్మ త్రివిధము :

1. కర్మాత్మ-వాసనామయః-ఈశ్వరజన్మా
2. చిదాభాసః-జ్యోతిర్మయః-ఈశ్వరాంశః
3. ఈశ్వరః-శక్తిమయః-ఈశ్వరాభిన్నః

ఈ యీశ్వరుడు త్రివిధము.

1. ప్రాణాగ్నిమయః-సప్తలోకశరీరః-సత్యాత్మ-బ్రహ్మ
2. వాగగ్నిమయః-హిరణ్యగర్భశరీరః-సర్వహృద్యజ్ఞాత్మ-విష్ణుః
3. అన్నాదాగ్నిమయః-మర్త్యత్రైలోక్యశరీరః-సర్వభూతాంతరాత్మ-మహాదేవః

బ్రహ్మ ఊర్క్‌ను, విష్ణువు శ్రీని-మహాదేవుడు విభూతిని ప్రవర్తింపజేయుదురు.

ఆయీ యీశ్వరుడు జీవశరీరావచ్ఛిన్నుడై జీవుని శక్తి విశేష జనితమహత్వముతో సంయోజించును. అందు నొకానొక జీవాత్మనూర్క్‌తోడను, యొక జీవాత్మను శ్రీతోడను, యొక జీవాత్మను ప్రభావవిశేషములతోడను (విభూతులు) యోగము నొందించును. ఇట్లు జీవాత్మ యష్టాదశాత్మలతోడనో షోడశాత్మలతోడనో అన్వాధక్తుడగు నొకమగా సంపన్నతము డని యెరుంగదగును. ఇత్యాత్మనిష్కర్షః.

విషయరహస్యే - బ్రహ్మకర్మసమీక్షా

మనోమయవిజ్ఞానగర్భితానందము విద్య. అది బ్రహ్మ-అదియే జ్ఞానము. మనోమయప్రాణగర్భితవాక్కు వీర్యము-అది కర్మ-క్రియ; బ్రహ్మ-కర్మలను రెంటిచే రెండు విధములుగ విభక్తుడగు నవ్యయుడను నొకయర్థ మాత్మ. ఈశ్వరావ్యయుడును, జీవావ్యయుడును, అనునుభయవిధాత్మయు బ్రహ్మకర్మలను రెండు ధాతువులు కలదని తెలియనగును.

మరియు అవ్యయలక్షణము బ్రహ్మ, అందు బుద్ధియోగలక్షణము కర్మ, అను నీయర్థద్వయ మీభగవద్గీతయందు సిద్ధాంతరూపమున నిరూపింపబడును. కనుక నీబ్రహ్మకర్మ వివేకలక్షణ విజ్ఞాన మవసరము.

కొందరిమతమిది :-బ్రహ్మ - కర్మ - అభ్వమునని మూడు తత్వములు. బ్రహ్మజ్ఞానము, కర్మక్రియ, కనబడుచు నుపపన్నముగాని దభ్వము అనగా నామరూపము లభ్వమని భావము.

కొందరిమతమిది :-బ్రహ్మ కర్మలు రెండే తత్త్వములు అభ్వమనునది కాదు. మాయామయమగు నీయభ్వమునకు కర్మయందే యంతర్భావము. దిగ్దేశ కాలసంఖ్యలచే ననవచ్ఛిన్నము అనంతము నఖండము ననవయవము బ్రహ్మ. ఇందుకు వ్యతిరేకమగునది కర్మ. రసోదయహేతువు బ్రహ్మ. బలోదయహేతువు కర్మ.

ఇక :-బ్రహ్మ కర్మల రెంటిలో కర్మయే తత్త్వమని శ్రమణులంటరు. ఎట్లన :-ఈసర్వము కర్మగనే చూతుము.

బ్రహ్మయను వేరొక పదార్థములేదు. బ్రహ్మయే జ్ఞానమందురు. అది కర్మవిశేషమనియే సంభావింపబడుచున్నది. 'తెలిసికొనుచున్నాము' 'తెలిసికొనుట లేదు.' అని యిట్లు ఇతరక్రియాసాధారణ్యమున నభినయము కలదుగదా! కనుక యీకర్మ అకస్మాత్తుగ బుట్టును. తనయందే తానుండును. తానంతతానే లయించును. ఇయ్యది దుఃఖము, క్షణికము, స్వలక్షణము, శూన్యమునని వారిసిద్ధాంతము.

బ్రాహ్మణమతమిది:—ఈసర్వము బ్రహ్మ - జ్ఞానమే. అయంఘటః, అయంపటః ఇదమస్తి-నాస్తి ఇత్యాదికముగ మనకుగల ప్రత్యయము జ్ఞానమే. అయ్యది జ్ఞాత-జ్ఞానము-జ్ఞేయము నను త్రివృత్కృతరూపమగునని-జ్ఞానముకంటె వేరుగా జ్ఞేయము ప్రతిపాదింపబడు ననుకొన్నను, ఆమాటి ప్రతిపత్తియు నిశ్చయముగ జ్ఞానముగనే యుపపన్నమగును, జ్ఞానముకంటె నతిరేకించు కర్మలేదు.

"జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధాకర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః."

అని యిట్లు బ్రహ్మయందే యాహితులగు కర్మల కభేదము గీతయందు కమైనదిగదా! జ్ఞానము బ్రహ్మ-కనుక-ఈస్వరము పూర్ణబ్రహ్మమే యనివేదము. "ఈసర్వము శూన్యమగు కర్మమేగాని పూర్ణమగు బ్రహ్మకాద" ననది విశ్వసనీయముకాదు. అసద్రూపమగు కర్మ యకస్మాత్తుగ బుట్ట

జాలదు. పుట్టిన దకస్మాత్తుగ విలయమొందదు. అనాశ్రయముగ నిరాధారముగ నుండు కర్మ కనుపింపదు. అట్టి దృష్టాంతమును లేదు. ఇక నీజ్ఞానమన్ననో, స్వప్నప్రత్యయాదులందు జ్ఞాతా, జ్ఞానం, జ్ఞేయమని యిట్లు త్రివృద్రూపముగ నగపడుచున్నది. కనుక నీసర్వమును బ్రహ్మలక్షణముగల జ్ఞానమొకటియే యని యెరుంగనగును.

ఈవిధముగ బ్రహ్మైకాంతికమత మొకటియు, కర్మై కాంతికమత మొకటియు వేరువేరుగ నున్నవి. ఇక :-

కొందరు విద్వాంసులు, మహర్షులు, బ్రాహ్మణులు ఈబ్రహ్మకర్తల ద్వైతము నంగీకరింపుచున్నారు. బ్రహ్మ-కర్తయను నీరెండును సనాతనములని యెరుంగనగును. ఎట్లన :- ప్రభవ ప్రతిష్ఠాపరాయణ మగుదానియందు బ్రహ్మశబ్దము, దేనికైన మూలకారణమగుచున్నప్పుడు కిమస్యబ్రహ్మ? యందురు. మనకగపడు నీవిశ్వమునకు మూలమేమి? కిం బ్రహ్మ? యను జిజ్ఞాసకు సమాధానముగ :-అమృత మృత్యుమయం బ్రహ్మ-సదసన్మయం బ్రహ్మ-అని భావింపనగును.

అందు సత్తు-అమృతము అనునది బ్రహ్మ. మృత్యువు, అసత్తు, అనునది కర్మ. మృత్యువుయొక్క యసత్వము నపేక్షించి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" సంగతమగును. శ్రుతు లందును,

1. అసన్నేవస భవతి అసద్బ్రహ్మేతి వేదచేత్
అస్తిబ్రహ్మేతి చేద్వేద సంతమేనంతతో విదుః
2. యోనః పితాజనితాయో విధాతా, యోనః సతో అభ్యాసజ్జజాన
3. సదేవేద మగ్రఆసీత్..................

ఇత్యాదిగా సద్వాదమును,

1. దేవానాం పూర్వ్యేయుగే అసతః సదజాయత
2. దేవానాం యుగే ప్రథమే అసతః సదజాయత
3. అసదేవేదమగ్ర ఆసీత్ అసతోవై సదజాయత
4. అసద్వా ఇదమగ్ర ఆసీత్తతోవై సదజాయత
5. అసదేవ సన్మనోఽకురుతస్యామితి."

ఇత్యాదిగా నసద్వాదమును,

(1) అసదే వేదమగ్ర ఆసీత్ తత్సదాసీత్ తత్సమభవత్.
(2) సతశ్చ యోని మసతశ్చవివః.
(3) సతోబంధు మసతి నిరవిందన్.

ఇత్యాదిగా సదసద్వాదమును కలవు. ఇక నాయీ శ్రుతి వాక్య సామంజస్యము మరొక విధముగ గుదురుట దుర్ఘటము గనుక నా సదసత్తులగు బ్రహ్మకర్మలు విశ్వ మూలకములనుకొందుము. మరియు ఈ విశ్వమండలి ప్రతి పదార్థమును బ్రహ్మకర్మోభయాత్మక తత్త్వద్వయమే. ఈ రెండే అమృత మృత్యువులుగ నెరుంగనగును. అమృతము అభయము బ్రహ్మ. మృత్యువు కర్మ.

"అంతరం మృత్యోరమృతం మృత్యా వమృత మా హితం
మృత్యుర్వివ స్వంతం వస్తే మృత్యోరాత్మా వివస్వతి" అనియు శ్రుతి.

ఈ రెండునే విద్యయు నవిద్యయునని యెరుంగవలయును. బ్రహ్మవిద్య. కర్మ అవిద్య.

"విద్యాంచా విద్యాం చ యస్తద్వేదో భయం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే"

ఇక యివియే కర్మయు అకర్మయు. బ్రహ్మమే అకర్మ. అకర్మయం దీకర్మ యుపపన్న మగుచున్నది. కర్మయం దక ర్మయు నట్లే యుపపన్నమగును.

"కర్మణ్యకర్మయః పశ్యే దకర్మణి చ కర్మయః
స బుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్న కర్మ కృత్"
"బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతియః
లిప్యతేన సపాపేన పద్మపత్ర మివాంభసా"
"నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్
నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్."

క్షుభ్యమాణము, కుర్వద్రూపము నగు కర్మకంటె నతి రిక్తముగ నకుర్వద్రూపము, నితాంత శాంతమునగు తత్త్వము బ్రహ్మ. కనుక నది చేయదు, చేయింప దంకును. అక్షణమగు నీయాత్మ బ్రహ్మ. అందు త్రిక్షణమగు నిదియంతయు గర్మ. ఇటజ్ఞాతవ్య మంతయు బ్రహ్మ. జ్ఞానము బ్రహ్మ. కర్తవ్యమంతయు కర్మ. క్రియ కర్మ. ప్రతి యర్థమును జ్ఞానక్రియల యేకరూపము. ఏ యర్థము నందును జ్ఞాన క్రియలను మించి యేమియు లేదు. మరియు ఇదియంతయు నొక తత్త్వమగు బ్రహ్మమే. "బ్రహ్మై వేదం సర్వమ్" అది యొకటియే శాంతము క్షుబ్ధమునని రెండు

విధముల వివర్తము నొందును. అందు శాంత రూపమున బ్రహ్మ శబ్దము, క్షుబ్ధరూపమున గర్మశబ్దము, ఇట్లువిశేషమున ద్వైవిధ్య మున్నను, సామాన్యముగ నిది యొకటే బ్రహ్మ కదా! యను కొన వలయును. ఎట్లన :

మన కగపడున దంతయు బ్రహ్మయు కర్మయునై యున్నది. కర్మ క్షుబ్ధము, బ్రహ్మ శాంతము. రెంటి యన్వ యము విశ్వము. అన్యోన్య మవినాభూతమగు నీ ద్వంద్వము ప్రతిద్వంది, అభిభావకము, సహకారి, సాపేక్షము, సధర్మియు, విధర్మియునై యున్నది. కర్మయోగ తారతమ్యమున బ్రహ్మ రెండు విధములుగ నెరుంగనగును. (1) పరబ్రహ్మ, (2) అపర బ్రహ్మ. (1) పరబ్రహ్మ ఆత్మయే. అది రెండు తెరగులు :

(1) అశేష కర్మవత్పరాత్పర బ్రహ్మ, (2) పరుడగు మహామాయా కర్మ భేదావచ్ఛిన్న షోడశీ బ్రహ్మ. ఇందు పరా త్పరుడు పరమేశ్వరుడు విశ్వాతీతుడు నగును. అతనియందు పరాత్మలగు షోడశీ పురుషు లెందరో యుంటారు. ఒక షోడశిం జూతము. ఇతడు మూడు భాగములగును. (1) మహామాయా కర్మభేదావచ్ఛిన్నుడగు పరుడు అవ్యయుడు. (2) అతని యం దుండు పరావరుడు అక్షరుడు. (3) అతనియం దవరుడను క్షరుడు. ఈ యవ్యయాక్షర క్షరులు మూవురును పురుషులనియు మూవురి యేక రూపముతో పరాత్పరుని గలుపగ షోడశి యని చెప్పబడును. పరంబ్రహ్మ ఆత్మయే సర్వత్ర వ్యాప్తము. అది

యకర్మ. ఇక (2) కర్మచే అవర బ్రహ్మ. అది ఆత్మయు, పుర మును. మరియు కర్మానుబంధముం బట్టి బ్రహ్మ మూడు విధ ములుగ నెంచబడును. (1) సృష్టబ్రహ్మ, (2) ప్రవిష్ట బ్రహ్మ, (3) ఉన్ముక్త బ్రహ్మ. "తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అని శ్రుతి గదా! (1) సృష్టము కర్మ. కర్మచితి వ్యష్ట్యవలంబ నము సృష్టబ్రహ్మ. (2) సమష్ట్యవలంబనము ప్రవిష్టబ్రహ్మ. (3) భిన్నమువలె కర్మోపహితమై కర్మాతీతమున నుండు నిత్య శుద్ధబుద్ధనిరంజన మున్ముక్తబ్రహ్మ.

ఇక :-కర్మయు, చేతనప్రతిష్ఠితము, జడప్రతిష్ఠితము నని రెండు విధములుగ జూతుము. అందు చేతనస్థకర్మల యుత్థాన ప్రత్యుత్థాన ప్రతిష్ఠలకు జ్ఞానాధీనత్వ మగపడుచున్నదిక దా! తత్సామాన్యమున నెల్లజడకర్మలకును, నొకానొక యలౌకిక మహాజ్ఞానాధీనత్వ ముండవలయుననుకొని యామహాజ్ఞానమును సర్వాధిష్ఠాతయు, చేతనవిగ్రహము నగుపరమాత్మ-ఈశ్వరుడు నని వ్యపదేశింతుము. ఆవిధముగ నీకర్తయంతయు శుద్ధచేతన స్థత్వ, మహాచేతనస్థత్వములచే రెండు భాగములుగ నుపపన్న మగును గనుక నశేషకర్తలకు జ్ఞానాధీనత్వము సిద్ధమగుచున్నది. జ్ఞానమునందు బ్రహ్మశబ్దము. కనుక సర్వము :-కర్మబలప్రతిష్ఠిత బ్రహ్మశక్త్యుదయ ప్రలయముగలదిగనే యున్నదగుటచే "బ్రహ్మైవేదం సర్వం" అనుకొందుము. అప్పుడు "బ్రహ్మణ్యా ధాయకర్మాణి" అను గీతోక్తి యుపపన్నమగును. ఈకర్మ

యంతయు బ్రహ్మాయందుండుటవలన నాబ్రహ్మవిద్యయే, కర్మ యోగ, బుద్ధియోగ, జ్ఞానయోగోపాదాన భూతయోగ విద్య యగును. ఆయీబ్రహ్మవిద్య - యోగవిద్యయను నీయుభయ విద్యయే బ్రహ్మశబ్దాభిధేయమగు భగద్గీతాశాస్త్రార్థము.

అందు :—1 సమ్యగ్జ్ఞానము, 2 మిథ్యాజ్ఞానము, 3 అజ్ఞానము నని జ్ఞానవివర్తములు మూడును, 1 సత్కర్మ, 2 వికర్మ, 3 అకర్మయని కర్మవివర్తములు మూడును అగును. ఈరెండు వివర్తములకు నన్యోన్యత్వోఽను గ్రాహ్యానుగ్రాహక భావము సంభవించును. జ్ఞానవివర్తములచే కర్మవివర్తము లను గ్రహింపబడి, 1 సరిగా తెలిసికొనుట, 2 మఱియొకలాగున దెలిసికొనుట, 3 తెలిసికొనకుండుట కలుగునట్లే కర్మవివర్తము లచే జ్ఞానవివర్తము లనుగ్రహింపబడినప్పుడు, 1 సరిగా చేయుట, 2 విరుద్ధముగ జేయుట, 3 చేయకుండుట కలుగును. ఈయారిం టిలో వివేకించి మిథ్యాజ్ఞానాజ్ఞానములును, వికర్మాకర్మలును పరిత్యజింపబడి, సమ్యజ్ఞానము, సత్కర్మయు, సంగ్రహింప బడును. సర్వశాస్త్రముల యర్థము నిదియే. సమ్యగ్జ్ఞానము సత్కర్మ ఈరెండే శ్రేయస్కరములు. కనుక బ్రహ్మకర్మ లీరెండే గీతయందును దెలియదగిన యర్థములు.

"కర్మణో హ్యపిబోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణోఽపి బోద్ధవ్యం గహనాకర్మణోగతిః."

ఇతి బ్రహ్మకర్మసమీక్షా.

## విషయరహస్యే త్రియోగనిర్వచనే
## గీతోక్తయోగత్రయ మూలాఖ్యానమ్

యోగ శాస్త్రమగు గీతయందు కర్మయోగము, భక్తి యోగము, జ్ఞానయోగమునని మూడు యోగము లుపదేశింప బడుచున్నవి. ఈ మూడును వేదశాస్త్ర ప్రకరణములందు వేర్వేరుగ నుపదేశింప బడుటవలన నియ్యవి వైదికములని యెంచ నగును. ఎట్లన:

అసందిగ్ధార్థము, విదితాశేష వేదిత్వము, విజ్ఞాన శాస్త్రము వేదము. యథార్థ ద్రష్టయగు పరీక్షకుని, విజ్ఞానము, విజ్ఞానోపదేశ వాక్యమును, వేదము. అయ్యది బ్రహ్మ, బ్రాహ్మణమునని రెండు విధములు. అందు మంత్రభాగము బ్రహ్మ. బ్రహ్మ తాత్పర్యాను వర్ణనము బ్రాహ్మణము. ఈ బ్రాహ్మణము విధి, ఆరణ్యకము, ఉపనిషత్తునని మూడు భాగములు. వీని యందు పై జెప్పిన మూడుయోగములు వరుసగ నుపదిష్టములు. అందు 1. గృహస్థులకు త్రైగుణ్య విషయములగు కర్మోపదేశములు కర్మవిధులు. 2. నిర్గుణ విద్యోపదేశ భూమికా రూపమును, సగుణ విద్యోపదేశమును, వానప్రస్థ జీవనయాత్రానుకూలాత్మ విచారోపయోగము గలది యారణ్యకము. (3) సగుణ విద్యోపదేశ మూలక నిర్గుణ విద్యోపదేశ ముపనిషత్తు. ఇట్లుపాసనకును, జ్ఞానమునకు నొకవిధముగ భేదమున్నందున విద్వత్సమాజమున నిష్ఠాత్రైవిధ్యమున కుపపత్తి యున్నను

విద్యోపదేశత్వ సామాన్యమున నీ యారణ్యకోపనిషత్తుల
కైతరేయ బృహదారణ్యకాది శ్రుతులందు దరచుగ వ్యవహార
సాంకర్య మగుపడుచున్నందున, సాధారణ జనతా ప్రతిపత్త్యను
రోధమున భగవంతుడు నిష్ఠా ద్వైవిధ్యముం జెప్పెను.

"లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం, కర్మయోగేన యోగినాం."

అందు కర్మయోగ సముచ్చిత జ్ఞానయోగ రూపమగు నీ భక్తియోగ నిష్ఠకు జ్ఞానయోగ నిష్ఠయం దంతర్భావమని తెలియనగును. కనుక నిట్లు వేదోపదేశ త్రైవిధ్యమున నీ యోగములకు త్రిత్వోపపత్తి యున్నను బుద్ధియోగా యోగములచే ద్వైవిధ్యమును భగవంతు డపేక్షించుచున్నాడు. మరియు ఈ మూడు యోగములును బుద్ధియుక్తములైనపు డుపాదేయములును లేనినాడు విగర్హ్యములు నగుచున్నవి. ప్రేక్షాపూర్వకారి విధేయత్వమున నెల్ల యోగములును బుద్ధియుక్తములే యగుంగాని కానిదొకటియు నుండదు. అయినను (1) విద్యాబుద్ధి,(2) అవిద్యాబుద్ధియునని బుద్ధి రెండు విధములు. (1) వ్యవసాయాత్మిక బుద్ధి విద్య, (2) అవ్యవసాయాత్మికబుద్ధి యవిద్య. (1) దృఢ ప్రత్యయరూప, నిశ్చితైకార్థ, నిస్సందిగ్ధ వ్యవసాయ బుద్ధి, విద్య.(2) బహుశాఖ, అనంత, అనిశ్చిత నానార్థ సంశయావహ అవ్యసాయ బుద్ధి యవిద్య. అజ్ఞాన సంపర్కమువలన గర్మబంధము గలిగి యాత్మ బలాపఘాత సమర్థమగును. కనుక నవిద్యా యుక్తములగు నీ మూడు యోగములు నుపేక్ష్యము

లగును. బుద్ధియుక్తము లైనప్పుడు ఈ మూడును శ్రేయస్కర ములగునని భగవంతుని సిద్ధాంతము.

అందు అవిద్యా బుద్ధి: (1) అభినివేశము, (2) అజ్ఞానము, (3) రాగ ద్వేషములు, (4) అస్మిత యని నాల్గు విధ ములు. (1) అతద్ధర్మమగు నర్థమునందు తద్ధర్మ ప్రత్యయము కలుగగా, నది యథార్థమనుకొను నాసాధారణ మభినివేశము. దాని వలననైన తమస్సుచే నతద్ధర్మమునందు బుద్ధిని కర్మ బంధించును. (2) అర్థముల కార్యత్వ కారణత్వములు గ్రహింపకుండుట యజ్ఞానము. అందువలననైన తమస్సుచేబుద్ధియావృత మగును. (3) కామానుశయి - ప్రవృత్తి హేతువు రాగము; క్రోధానుశయి నివృత్తి హేతువు ద్వేషము. ఈ రెండును ప్రజ్ఞానము ను వెనుక ముందులకు లాగుచు బుద్ధిని సమ స్థాన చ్యుతి నొందించి అశాంతి క్షోభలచే వ్యాకులము గావించును. (4) బాలక - భూతావిష్ట - గ్రామీణ పామరాదులకు వలె ప్రజ్ఞానము యొక్క యవికాసము మాంద్యము అస్మిత. అందువలన నాత్మ ప్రాణమున కర్కరూప స్ఫురణ యభావముకాగా, నాత్మబల మున్నను, దాని కార్యకారిత బద్ధమగును. అట్లు స్వజ్యోతి ప్రతిబంధము వలన నాత్మ తమస్సుచే నావరింపబడును.

ఆ యీ నాల్గు కర్మదోషములు విద్యావపాతము గావించు గావున నవిద్యయుండుము. తత్సన్నియోగ క్రియమాణ కర్మజ్ఞాన భక్తియోగము లించుకైన శ్రేయోదాయకములు

గానందున వీనియందు విద్యాబుద్ధియోగ మపేక్షింప బడు చున్నది.

ఆ యీ బుద్ధియోగముకూడ ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము, అని నాల్గు విధములు. ఐశ్వర్యము వలన నస్మిత నివృత్తి నొందగా ననావరణమగు నీయాత్మ తమస్సునుండి జ్యోతిని, మృత్యువునుండి యమృతమును, అసత్తునుండి సత్తును పొందును. ఇట్లు యీ సిద్ధి విద్యాబుద్ధి యోగమున నుపపన్నమగుం గావున జ్ఞాన యోగముగాని, కర్మ యోగముగాని భక్తియోగముగాని బుద్ధియోగ మయముగ వర్తింపజేయనగునని యాదేశించుటకు గీతాశాస్త్రము ప్రవర్తించు చున్నది. అందు మొదట నెనిమిది యుపనిషత్తులచే పైనజూపిన యోగత్రయమునకు బరిష్కార హేతువగు బుద్ధియోగముయొక్క యపూర్వ స్వరూపము విస్పష్టముగ వ్యాఖ్యాతమైనది. ఆపిమ్మట పరోవర్య విదులగు ప్రాచీనులచే నుపదిష్టములగు జ్ఞాన, భక్తి, కర్మయోగముల వివక్షితరూపము సంక్షేపముగ ప్రదర్శింపబడినది.

ఇతి యోగత్రయ మూలాఖ్యానమ్.

విషయ రహస్యే కర్మయోగ సమీక్షా.

వైదికములు ప్రవృత్తములును, రమణీయములు, లౌకికములు నగు: యథాధికార విహిత కర్మలను యథాధికారముగ యథాకామముగ నాచరించుట కర్మయోగము. యజ్ఞాది కర్మ

లన్నియు సమిదాజ్యవేది బర్హిః పురోడాశాది రూపసాధనముల వలన శత్రుక్షయ, రాయస్పోష, అన్న, యశః, శ్రీ ప్రజాసుఖ విశేషరూప ఫలములవలనను, ఐహ లౌకికములను గాని, పార లౌకికములను గాని విషయసుఖ భోగోపయికములగు నర్థముల నపేక్షించును. ఆధిభౌతికాధిదైవిక సాధన కల్ప్యమాన కర్మలు మరల నట్టి యాధిభౌతికాధి దైవిక సుఖభోగోపయిక సంస్కార విశేషములనే కల్గించును. అట్టి కర్మల సంగ్రహమును, అనుశాస నమును కర్మకాండ. అందు వ్యావహారిక కర్మకలాపములే యుపదేశింప బడును. కర్మలకు వాని యధికార విశేష సాపేక్ష త్వము. కర్మభేదముచే నందు బహువిధ మర్యాదలచే నియంత్రి తులగు భిన్నభిన్నాధికారులు వ్యవస్థాపింప బడుదురు. ఈవ్యవస్థ (1) చాతుర్వర్ణ్యము, (2) చాతురాశ్రమ్యము నని రెండు విధములు.

### మహారంభములగు కర్మలకు చాతుర్వర్ణ్య చాతురాశ్రమ్య వ్యవస్థాసాపేక్షత్వము

చాతుర్వర్ణ్యము, చాతురాశ్రమ్యము నను నీరెండును కర్తృవిభాగముచే కర్మవిభాగవ్యవస్థాపేక్షములు. పరస్పరా త్యంత విరుద్ధానేక కర్మకలాపసముచ్చయరూపమగు నేకమహా రంభకర్మ గావింపదలచినపుడు అందొకనిచే నాపని యశక్య మగునెడ తత్సాధనోపాయము వ్యవస్థావిశేషముగనే జూతురు. మహాకర్మారంభక సర్వకర్మలను, విభజించి యందొక మహార్థ

మగుకర్మ అనేకపురుషు లొకేకాలమం దేకముగనై సంపాదింతురుగాక! యనుకొనున దొక వ్యవస్థ. అది చాతుర్వర్ణ్యపద్ధతి. ఒకే పురుషుడు కాలభేదము ననుసరించి యన్యోన్యావిరుద్ధములైనను నానాకర్మలను సంపాదించుగాక! యనుకొనునది ద్వితీయ వ్యవస్థ. అది చాతురాశ్రమ్యపద్ధతి. జగత్ప్రసిద్ధమగు నేతద్వ్యవస్థాద్వయము లోకమందు సర్వత్ర నిర్విశేషముగా నగపడుచున్నది. ఎట్లన :-

## చాతుర్వర్ణ్య చాతురాశ్రమ్య వ్యవస్థాపేక్షిత్వమునకు సర్వజగత్ప్రకృతి సిద్ధత్వము

ప్రతి పురుష శరీరమునందును మనో వాక్ప్రాణ కర్మల నుద్బోధించు నగ్నిబల ముండును. యజ్ఞ కర్మలందు 1. అధ్యాత్మము, 2. అధిభూతము, 3. అధిదైవతము, 4. అధియజ్ఞముగ పరస్పర సాపేక్షకములగు నాలుగగ్ను లుండును. అందు యాజ్ఞికమగు వైధాగ్నియందు, యజమాన శరీరాగ్నికి అగ్న్యాధాన కర్మచే సంధానము గలుగజేసి యందు సమిత్ హవిర్ద్రవ్యాదులచే భౌతికాగ్నియొక్క సంధాన పూర్వకముగ వైదికమంత్ర విశేషములచే నాధిదైవికాగ్ని సంధానము గావింపబడును.

ఆవిధముగనే యీనాలుగగ్నుల యేకీభావమున ప్రత్యగ్నియందును నిగూఢములగు వాక్ప్రాణ మనఃకర్మల యేకీభావము సజాతీయానుబంధమున సంపాదింపబడును. 1. అందు నాల్గు మనస్సుల యేకీభావము కొరకు యజమానుడు బ్రహ్మాయును.

2. నాల్గు ప్రాణముల యేకీభావము కొఱకు యజమానుడు నధ్వర్యుడును. 3. నాల్గువాక్కుల యేకీభావము కొఱకు యజమానుడు, అధ్వర్యుడు, హోతా, ఉద్గాతయు నియోజితు లగుదురు. 1. అధ్వర్యుడు యజుస్సులచే, 2. హోత ఋక్కులచే 3. ఉద్గాత సామములచే ఆధిదైవిక వాక్కుల ననుగ్రహించుచు యజమానాగ్నిని వాక్కునందు సంధానింతురు. ఈకర్మలన్నియు జేయుటకొక యజమాని సమర్థుడు గాజాలడు. కనుక లౌకికములగు నాయా మహోత్సవములందు వలె నిందును కర్తృ విభాగముచే కార్య విభాగము కల్పించి యీ మహారంభమగు కర్మ సంపాదనకు బూనును. ఇదే విధముగ జగద్ధర్మ ప్రవర్తకుడగు నొక మనువు గాని, మను ప్రవర్తిత సమాజ బంధన రూపైక ధర్మ ప్రవర్తకుడును, సర్వ సమాజైక రక్షకుడు నగు ధర్మ సమ్రాట్టుగాని సమాజమందు వీర్యమును సాధించుటకు వేదము ననుసరించి కర్తృ విభాగమున గార్య విభాగముం గల్పించి సామాజిక బల సంపాదనకు బూనుకొనును. ఆ విధముగనే యొక సమాజము నొక మనుష్య వ్యక్తియట్లు ఏకత్వమున నధ్యవసాయము గావించి దానికి (సమాజమునకు) నాల్గు విధములుగ మనుష్య విభాగములచే వీర్య చతుష్టయాధిష్ఠాన భూతములగు ముఖబాహూరుపాదములను విభాగించి యందందయ్యె వీర్యము సంపన్నము గావించి యీ సమాజమును వీర్యవంతము గావించెను.

మరియు నెచ్చట నీచాతుర్వర్ణ్యవ్యవస్థలేదో యాసమాజము పాపభూయిష్ఠము నిర్వీర్యమునై గర్తపతితమగును. యావద్భూమండలమం దెందు నట్టి వ్యవస్థలేని సమాజము లేదు. ఈవ్యవస్థ రాజకీయ నియమమున నిజధర్మాభిమాన సంపత్తితో నుండునంతవరకే సమాజముగూడ నభివృద్ధియం దుండును. ఏలయన :-"యతోఽభ్యుదయనిశ్శ్రేయససిద్ధిః సధర్మః" అను సిద్ధాంతమువలన ధృఢధర్మతాధృతవీర్యములకే సమాజోన్నతి హేతుత్వముండును. "ధర్మోరక్షతి రక్షితః" అని యవ్యాహతనియమమును గలదుగదా! ప్రత్యక్షముగగూడ ప్రతి శరీరమందును, ధర్మభూతములగు చతుర్వీర్యములకును పురుషసంరక్షకత్వము చూచుచున్నాము. అట్లే సామాజిక పురుషునకుగూడ ధర్మభూతములగు నీవీర్యములే రక్షకములగు చున్నవి. ఎట్లన :-చాతుర్వర్ణ్యవ్యవస్థాసాధ్యములగు వీర్యములు నాలుగువిధములుగనే యుపపన్నములగును. అట్లు :-దివ్య-వీర-పశు-మృత-భావప్రయోజకములగు బ్రహ్మ-క్షత్ర-విట్-శూద్ర శబ్దవాచ్య చతుర్వీర్యవిభాగ సంసాధనము చాతుర్వర్ణ్యము. అందు చాతుర్వర్ణ్యోచితములగు కొన్ని కర్మలు దైవసంస్కార సాధ్యములగు నాత్మవీర్యప్రాప్తి సాధనసాపేక్షము లగుచున్నవి. ఒకడే యీసర్వవీర్యము లనేకముగ నారాధింపజాలడు. ఏలయన :- ఉపకారోపకారకభావములచే పరస్పరాత్యంతసాపేక్షములయినను ఇయ్యవి స్వరూపతః విభిన్నచ్ఛందస్క-దేవ సంస్కారసాధనములు గలవై యున్నందున నత్యంతవిరుద్ధము

లుగ నుండును. అనియమముగను యథాకామముగ నవ్యవస్థగ నెక్కట్లో ప్రవర్తించు సాధకులకు తత్తద్వీర్యసాధనయందు కర్తృబల ముపపన్నముకాదు. కనుక కేవలము వ్యక్తివిభాగమున మరియు కులవిభాగమున గార్యవిభాగముం గల్పించి ప్రవర్తించువారికి నాయాకర్మసంసిద్ధియం దనాయాసము, సౌకర్యము కలుగును. నిజధర్మత్వాభిమానదార్ఢ్యమును, కులక్రమానువర్తమువల్లనే యుపపన్నమగునుగాని, కేవలవ్యక్తివిశేషపరిగ్రహమాత్రమునగాదు. కనుక నీవీర్యసంసాధనమును, కులక్రమానుగతమగుదానిని, కులధర్మతచే ధరింపనగునని దూరదర్శులగు విద్వాంసుల సిద్ధాంతము.

చాతురాశ్రమ్య మింతకంటె భిన్నము. ఎట్లన:-ఒకే పురుషుడు విరుద్ధములైనను ననేక కర్మలను సమయభేదమున గావింపగలడు. కనుక సమయవిభాగమున గార్యవిభాగవ్యవస్థాపేక్షము చాతురాశ్రమ్యము. కర్మ-జ్ఞానమున నివి వీర్యోపేతములు. ఈశ్వర రూపములు. రెండు శక్తులు. అందుచే నీశ్వరునారాధింపగోరు శతాయుః పురుషుడు పూర్వవయస్సుచే కర్మశక్తియందు వీర్యమునుపార్జింపుచు, నుత్తరవయస్సుచే జ్ఞానశక్తియందు వీర్యమునుపార్జింప వలయును. అందుచే వీర్యలక్షణు డీశ్వరుడు సంపూర్ణముగ ననుగృహీతుడగును. కాని జ్ఞాన-కర్మలు ప్రత్యేకముగ వీర్య సముపార్జనకు సమర్థములు కావు. అవి యన్యోన్యాశ్రయములు కదా! కనుక పూర్వవయస్సుగూడ పూర్వము, నుత్తరమునని రెండు భాగ

ములుగ జేయబడును. అందుచే నీ జన్మ మొదలు పంచవింశతి (25) వర్ష పర్యంతము బ్రహ్మచర్యము. అందు కర్మాచరణ దీక్షాలాభము కొరకు కర్మ సాధనోపాయ భూతజ్ఞాన సాధనము గావింపవలయును. ఆయిజ్ఞానము క్రత్వర్థసంపాదనోప యుక్తమగును. ఆ పిమ్మట యిరువది యైదేండ్లు తత్పూర్వసాధిత జ్ఞాన సాధ్యములగునా యా కర్మలు సేయనగును. అతడు కర్మదీక్షితుడనబడును. అతని యీ కర్మ పురుషార్థ హేతువగును గదా! ఈ యభియుక్త వచనము చూడుడు.

"అహారార్థం కర్మ కుర్యాద నింద్యం
తచ్చాహార్యం ప్రాణసంధారణార్థం
ప్రాణాధార్యాః తత్త్వజిజ్ఞాసనార్థం
తత్త్వం జ్ఞేయం యేనదుఃఖం నభూయః"

ధర్మార్థ కామమోక్షములు పురుషార్థములు. ధర్మార్థములు సాధనములు కామమోక్షములు సాధ్యములు. ధర్మము వలన :— నర్థకామమోక్షములు. అర్థమువలన :— కామము మోక్షసాధనమగు ధర్మమును; దీనిచే మోక్షము సంపన్నము కాదు. కామము :— రెండు విధములు (1) ఐహికము, విషయ సుఖము. (2) ఆముష్మికము స్వర్గసుఖము. మోక్షము ఈ రెంటికి వేరగు నిశ్శ్రేయస సుఖము. అది యకామునకు సంపన్నమగును. ధర్మమువలన నివి సిద్ధించును. ఆత్మయందు కర్మజన్యమగు నతిశయము - వాసన - ధర్మము. కర్మజన్యమగుట నది కర్మయేయందురు. ఇహ పరములందు భోగసాధనముగ నాత్మ

యందారోపితమగు బీజరూపము వాసనాకర్మ. విద్యావశము ననో, స్వకీయరుచివశముననో, కర్మవ్యాసజ్యమాన ప్రాణి క్రియమాణ శుభాశుభ కర్మల కవశ్యమొక యుదర్కముప్ప తిల్లి కర్తయగు నాత్మయందు సక్తమగునది వాసనాకర్మ. అందు అశుభోదర్కము కాకుండు గాక! యని యాచార్యులు శుభోదర్కము నాదేశింతురు.

"జ్ఞాత్వాకర్మాణి కుర్వీత నాజ్ఞాత్వా కించిదాచరేత్
అజ్ఞానేన ప్రవృత్తానాం స్ఖలనం స్యాత్పదేపదే."

అందు:—ఐహికమగు విషయభోగ సుఖమో, ఆముష్మి కములగు పితృస్వర్గదేవ స్వర్గసుఖములో కోరువానికి తెలిసి కర్మల ననుష్ఠించుట వయస్సుయొక్క పూర్వపక్షము. ఇక నుత్తరపక్షమున నైహికమో, ఆముష్మికమో, యగు కర్మ నిష్కామముగా నాచరించి జ్ఞానము నుపాసింపవలయును. ఎట్లన:- గృహధర్మములను పుత్రుల కప్పగించి భార్యతో గూడియో కూడకయో, గృహధర్మములనుండి విరక్తినొంది జ్ఞానసాధనోపాయభూతమగు కర్మ చేయుటకేబది వత్సరముల వయస్సున వనమునకు బోవలయును. అందిరువది యైదేండ్లు జ్ఞానమందు దీక్షాలాభముకొరకు జ్ఞానోపయికములగు నివృత్తి కర్మల సాధనముచే కర్మబల నివృత్తిగావింప వలయును. అది తపశ్చర్య యనబడును. మరియు జ్ఞానదీక్షితుడగు నితడు కర్మ ఫలత్యాగ లక్షణముగల సన్యాసనిష్ఠ నాత్మయందు భావన

సేయవలయును. అందీ కర్మక్రతత్త్వార్థమగును. మరియు, నతనికి జ్ఞానము పురుషార్థ హేతువుగ సంపన్నమగును. ఆ తత్త్వజ్ఞానము వలన పరమశాంతి, నిశ్శ్రేయసమను నిరతిశయ సుఖము లభించును. కనుక నీ విధముగ నొక పురుషునికి సమయభేదమునం గర్తవ్య భేదోపపాదనము చాతురాశ్రమ్యము. ఆ యీ చాతురాశ్రమ్యోపపాదకములగు కొన్ని కర్మలు పృథగ్భావ్యములు.

ఉదర్క నిబంధనములగు షట్కర్మలు

శుభాశుభ కర్మఫలముదర్కము: తద్భేదమున నీ కర్మయు 1. పుణ్యము. 2. పాపమునని రెండు విధములు. (1) శ్రేయసీయము పుణ్యము (2) పాతకము పాపము. ఈ రెండును మూడు విధములగుట వలన మొత్తమారు విధము లగును.

1. అభ్యుదయజనకము:-సత్కర్మ - అది శ్రేయస్సు - లేక సుకృతము అందురది పుణ్యము.
2. ప్రత్యవాయజనకము :-వికర్మ-అది యేనస్సు అందురు-అదిపాపము.
3. అభ్యుదయవిఘాతకము :-వికర్మ-అదియఘము-అందురది పాపము.
4. ప్రత్యవాయవిఘాతము :-సత్కర్మ-ప్రాయశ్చిత్తమందురు-అది పుణ్యము.
5. అభ్యుదయనిమిత్తప్రతిబంధకము :-అకర్మ-కిల్బిషము-అది పాపము.
6. ప్రత్యవాయనిమిత్తప్రతిబంధకము :-శాంతిస్వస్త్యయనము- సత్కర్మ-పుణ్యము.

ఇచ్చట నభిసంధియిది :-'సూర్యఆత్మా జగతస్తుషశ్చ' అను యజుశ్శ్రుతివలన సూర్యరసములగు జ్యోతి-గౌ-ఆయువు లను నీ మూటిలో నాయువు సర్వజీవులకు నాత్మయగును. అది

ప్రజ్ఞాత్మయగు నింద్రప్రాణము. "తంమాం ఆయురమృత మిత్యుపాస్వ" అని కౌషీతకీ యందింద్రవాక్యము. ఆ యీ ప్రాజ్ఞుడు, భూతాత్మయునగు జీవునకు స్వప్రభవమునకు సూర్యుని కభిముఖముగ నూర్ధ్వమున కయనము (అభి-అయ)=అభ్యుదయము. ఇక :—నైపరీత్యమునందు, ప్రతి శబ్దము, సూర్యాభిముఖమునకు విపరీతముగ 'అవ' = క్రిందికి ఆత్మయొక్క అయనము (ప్రతి-అవ-అయ.) ప్రత్యవాయము. అభ్యుదయమున జీవించువానికి ప్రతి క్షణమును, సూర్యునుండి యాత్మరస మెక్కువగ లభించును గనుక శ్రీవృద్ధియు, శరీర త్యాగానంతరము ఆత్మకు సూర్యాభిముఖగతియు నగును. అటుగాక :—ప్రత్యవాయమున జీవించువానికి ప్రతి క్షణమును, సూర్యవిప్రకర్షమున, నాత్మరస క్షయము కనుక శ్రీహానియు, శరీరత్యాగానంతరమున నాత్మకు శనైశ్చరాభి ముఖ్యమున యమరాజాభిముఖగతియు. అభ్యుదయ ప్రత్యవాయ సంజ్ఞలుగల నీ రెండు గతివిశేషములకును, భూతాత్మయందు కర్మవిశేషజనితనగు వాసనాసంస్కారము హేతువు. అందు (1) అభ్యుదయ వాసనయందు శ్వఃశ్రేయఃశబ్దమును, పుణ్యశబ్దమును. 2 ప్రత్యవాయవాసనయందు పాతక-పాపశబ్దములు. మరియు, అభ్యుదయ వాసనావిఘాతక మఘమను పాతకము కనుక పాపము, ఇట్లే :—ప్రత్యవాయవాసనావి ఘాతకము ప్రాయశ్చిత్తము, ప్రాయః=ప్రగతము వినష్టమగు శుభధర్మము, దానియొక్క పునశ్చయనము ప్రాయశ్చిత్తము అభ్యుదయ నిమిత్త ప్రతిబంధకము కిల్బిషము. ప్రత్యవాయ

నిమిత్త ప్రతిబంధకము శాంతిస్వస్త్యయనము. అందు (1) అభ్యుదయ ప్రవర్తకము, (2) ప్రత్యవాయ నివర్తకము, (3) ప్రత్యవాయ నిమిత్త నివర్తకము అనునవి పుణ్యకర్మలు మూడు. ఇతరములగు కర్మలు పాపములు మూడు. ఆత్మకు శుభఫలోదయాపాదకమగు సంస్కారము కళ. కళకు దగినది కల్యము. లేదా అస్తమించిన పిదప మరల నుదయించుట కల్యము. ఈ యీ యుభయవిధ కల్యజీవనము పరిపోషకము, పురుషార్థానవంతమునగునది కల్యాణము. లవణాది శబ్దములందు వలె నకారమునకు ణకారము, మరియు రాజున కీదగిన భాగము కరము. దానికి యోగ్యము కర్యము. అట్లు ధనాగమ యుక్తమగు జీవనము కర్యాణము. ర, లల కభేదాధ్యవసాయముచే నదే కల్యాణము. కల్యాణ పుణ్య శబ్దము లేకార్థములు. తద్విరుద్ధమగు నభద్రము పాపము. 1. పా, ధాతువునకు రక్షణ యర్థము. పా=రక్ష—స్వాస్థ్యము, స్వరూప స్వభావముచే నాత్మ యొక్క స్థితి. అందుండి అపగమము (పా+అప)= పాపము. అపగమార్థమున నపశబ్దము. (2) లేనిచో పామ్=ఆత్మరక్షకమును నపాతి=బొందుట లేదు. అనగా ఆత్మస్వరూప ధర్మవ్యాపాదకమగు కర్మ పాపము. లేదా (3) అపగతాగ=నికృష్ట దశ నొందిన ఆపః=స్వాత్మజీవన ప్రవాహము; అపాపము, యాదృచ్ఛికమును, మూలస్థితి విలోప సూచకమునగు నాయకార లోపము వలన పాపము. (4) అట్లు గానిచో ఆత్మకు ప్రకృతి యాపస్సు,

దానినుండియే యీ భోగాయతనమగు లింగశరీర ముత్పత్తి యగుచున్నది. కనుక నది యాపస్సు అనబడును. అపశబ్దము క్రింద యనునర్థము గలది. అథోగతి వశమున పతితమగు భోగ శరీరమునకు గారణమగు కర్మ పాపము. కాని యీ యర్థమున నిది యపాపమని యుండదగి యున్నను మొదటి అకారలోపము చిరంతన వ్యవహార విశేషమున నైనదని యెరుంగ నగును.

ఈ విధముగ నుదయనీయ, పతనీయ భేదము వలన కర్మకు ద్వైవిధ్యమే సిద్ధాంతము. కొందరు పతనీయ కర్మకు వీర్య తారతమ్యమున ద్వైవిధ్య మంగీకరించు చున్నారు. ఆ ప్రకారమును కర్మ 1. సత్కర్మ, 2. వికర్మ, 3. అకర్మ యని మూడు విధములగును. 3. అభ్యుదయ నిమిత్త ప్రతిబంధక మకర్మ. 1. అభ్యుదయ జనకము ప్రత్యవాయ వినాశకము సత్కర్మ. 2. ప్రత్యవాయ జనకము నభ్యుదయ వినాశకము వికర్మ. ఈ త్రైవిధ్యమునే భగవంతు డంగీకరింపుచున్నాడు.

"కర్మణో హ్యపి బోద్ధవ్యం, బోద్ధవ్యంచ వికర్మణః
అకర్మణోఽపి బోద్ధవ్యం, గహనా కర్మణో గతిః."

ఆత్మనిబంధనములగు షట్కర్మలు

ఎట్లన:- విద్య, కర్మ యని ఆత్మధాతువులు రెండు. 1. వేదశాస్త్ర పరిశీలన సిద్ధమగు బ్రహ్మోత్పత్తము విద్య. 2. ప్రాక్తన కర్మ జనిత వాసనా సంస్కారమయ కర్మోత్పత్త జనిత రుచి విశేషోదయము కర్మ. అందరును వేదాజ్ఞా నిబంధనమగు కర్మనో,

స్వరుచి విశేష నిబంధన కర్మనో చేయుచున్నారు. ఆ విధమున కర్మయంతయు 1. వైదికము, 2. లౌకికమునని రెండు విధములగును. 1. విద్యాసాపేక్షము. ఆజ్ఞాసిద్ధము, ఈశ్వర జ్ఞానోపేతమునగు కర్మ వైదికము. ఇది ఆజ్ఞావిశేష నిబంధనత్వమున స్వరుచి విశేషాపేక్ష లేకుండ, గార్య కారణభావ సాపేక్ష కర్తవ్యతా బుద్ధిచే జేయబడుచున్నది. 2. విద్యా నిరపేక్షము స్వరుచిసిద్ధము, ఇంద్రియ ప్రజ్ఞానోపేతము, లౌకికము. అయ్యది వ్యక్తివిశేషోపకార - సమాజోపకారాది సాధుత్వావ్యాప్తి నిబంధన కర్తవ్యతాబుద్ధిచే జేయబడుచున్నది.

అందు వైదికము:-యజ్ఞము, తపస్సు, దానమునని మూడు విధములు. 1. ఆధిదైవికాధికాధిభౌతికాధ్యాత్మికములగు నగ్నులకు ప్రకారవిశేషములచే నేకీభావ సంపాదనజేసి, యాధ్యాత్మికాగ్నియందు వాక్ప్రాణ మనస్సుల బలాతిరేక సంపాదన యజ్ఞము. ఆ యీ కర్మ యధ్యాత్మముగ నన్న ప్రధాన, ప్రకార విశేషమున సంపాదింపబడును. 2. అనశనాదులచే క్షుబ్ధమగు నాధ్యాత్మికాగ్నికి బ్రత్యర్పిత - స్వకీయశరీర ధాతువులచే బలాతిరేక సంపాదనము తపస్సు. బీజావాపమున క్షేత్రమునందధికముగ ఫలింపజేయునట్లు, వ్యాయామాదిశ్రమచే శరీరబలమును వంచి హెచ్చుబలమును సంపాదించునట్లు—అగ్నియందు హుతములగు శరీర ధాతువులచేతనే యధికాధికముగ నాత్మబలము బుట్టించుట తపస్సు. శ్రుతియు "ఏతద్వైతప ఇత్యాహుఃయత్

వలన సిద్ధమగు నాత్మస్వరూపమగు జ్యోతి, యోగజ జ్ఞానము, (3) బుద్ధి వికాస రూపమును, జ్యోతిర్వివేచనా హేతువు నగు నది విజ్ఞానము. (4) సర్వేంద్రియ సాధారణమై మానస వికాస రూపమగు జ్యోతి ప్రజ్ఞానము. (5) పంచేంద్రియ వికాస రూపమును ఏకైకేంద్రియ విభక్త విషయానుగతము, పంచధా విభక్తమునగు జ్యోతి యైంద్రియక జ్ఞానము.

ఆ యీ పంచవిధ జ్ఞానము గుణభేదముచే మరల 1. శుద్ధ సాత్త్వికము, 2. మలిన సాత్త్వికము, 3. రాజసము, 4. తామసమునని నాల్గువిధములు. ఈ విధముగ జ్ఞానమున కిరువది కళ లుపపన్నము లగును. అందు నైసర్గికములగు బౌద్ధ మానసైంద్రియకములగు ద్వాదశ విధముల జ్ఞానములు ఆ విద్వత్తుల మపామరముగ సర్వలోక సాధారణములుగ నగపడుచున్నవి. ఇక నైశ్వరములు నాత్మీయములునగు నెనిమిది విధములగు జ్ఞానములు ప్రయత్న సాధ్యములు. అవియు నొకానొక జీవు నందు, బుద్ధియోగ మాహాత్మ్యము వలననే తదుదయ ప్రతిబంధక లశున పలాండ్వాది దోషములు లేని యాహార శుద్ధి యున్నప్పుడు కదాచిత్కముగ నుదయించును. దోష సంయోగము వలన మరల నశించునని పూర్వీయులు దూరదర్శులు నగు పండితుల పరామర్శ. ఆ యీ యుభయ విధ జ్ఞానములను నిత్య విజ్ఞాన శబ్దమున నిందు వ్యవహరించెదము.

మనోమయ ప్రాణగర్భిత వాక్ప్రకాశకమగు నానంద

జ్యోతి నిత్య విజ్ఞానము. ఈశ్వరుడను నిత్య విజ్ఞాన ఘనుడొకడే అవ్యయాక్షర క్షరమయుడగు నమృత పురుషుడు. విశవ్యాపీ యగునతడు నిత్యుడు పరిపూర్ణ రూపుడునని శ్రుతి:

"యస్మాత్పరం నాపరమస్తి కించిత్
యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్
వృక్షఇవ స్తబ్ధః దివి తిష్ఠత్యేకః
తేనేదం పూర్ణం పురుషేణ విశ్వమ్."

తద్వాచకము ప్రణవము. ఏలయన అకారోకార మకార ములకు వైజ్ఞానిక న్యాయమునందు, మనఃప్రాణ వాగభిధాయి త్వము కలదు. మరియు వర్ణస్ఫోట - పదస్ఫోట రూపమును, అంత్యమగు నర్థమాత్రా భాగమునకు శాంతానంద జ్యోతిష్ట్వ ప్రతిపత్తియు కలదు. ఇంకను సర్వజగత్తనన హేతుత్వమున నా యీశ్వర వాచకము తచ్ఛబ్దము. భగవంతు డిట్లు చెప్పెను:

"యతః ప్రవృత్తి ర్భూతానాం యేనసర్వమిదం తతమ్
స్వకర్మణాత మభ్యర్చ్యసిద్ధిం విందతి మానవః
మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా
అవినాశి తుతద్విద్ధియేన సర్వమిదం తతమ్."

మరియు:-నీయీశ్వరరూపమగు విశ్వవ్యాపి విజ్ఞానము సత్తా రూపమున విశ్వవ్యాప్తత్వము కలదగుటవలన సచ్ఛబ్ద వాచ్యమునగును. ఆవిధముగ నీవిశ్వవ్యాపియగు నీశ్వరవిజ్ఞా నము, బ్రహ్మ ఓమ్-తత్-సత్ అని మూడు విధముల నిర్దే శింపబడుచున్నది. ఇట్లు:-ఈమూడు పర్యాయవచనములచే

ఈమూడు లౌకికకర్మలందు నందరు స్వరసముగనే ప్రవృత్తులగుదురు. ఏలయన:- సామాజికోపకారమును, స్వరుచి విశేషమును అగు ప్రవృత్తినిమిత్తమున కవిశేషముగ మనుష్య మాత్రునందు ప్రత్యుపస్థానమును, యీమూడు కర్మలకును విద్యానపేక్షిత్వమువలన నావిద్వత్తుల మాపారముగ నందరకు నవిశేషముగ నధికారోపపత్తియును కలదు.

మరి :-వైదికములగు మూడు కర్మలందును, విద్యాసాపేక్షిత్వమున విద్వాంసులకే యధికారముగాని యవిద్వాంసులకులేదు. ఏలయన :-వానికి వైజ్ఞానికత్వము కలదు. అట్టి కర్మలందజ్ఞానమున బ్రవృత్తులగు వారికి యథావత్కర్మ కరణమునందసమర్థత యుండును. అందువలన గర్మఫలలోదయ ముండదు. కనుక శ్రద్ధకు విఘాతము, దానివలననే ప్రవృత్తి నిమిత్తమగు స్వరుచి విశేషమునకు నపలాపము కల్గును. శ్రుతియందు నిట్లే చెప్పబడినది. (శత. 2-2-3) (వివరణమునజూడుడు)

ఆమూడు కర్మలందును తత్తత్ప్రయోగమునకు బూర్వమే బ్రహ్మ+విద్యాసంబంధము. 1 ఋత్విగ్బ్రాహ్మణులందు బ్రహ్మనిర్దేశముద్వారా, 2 వేదమంత్రములందు బ్రహ్మనిర్దేశముద్వారా, 3 యజ్ఞాదికర్మ సాధనసామగ్రీ విధియందు, బ్రహ్మనిర్దేశముచే ప్రయోగయాథార్థ్య ప్రతిపత్తిద్వారా అని మూడు విధములగును. ఆయీవిషయమున గీతయందు దిట్లున్నది.

1. ఓమ్[1] తత్[2] సత్[3] ఇతి నిర్దేశః బ్రహ్మణః త్రివిధః స్మృతః
బ్రాహ్మణాః[1] తేనవేదాశ్చ[2] యజ్ఞాశ్చ[3] విహితాః పురా
2. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినాం
3. తత్ ఇత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః
4. సద్భావేసాధుభావేచ సదిత్యేతత్ ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సత్ శబ్దః పార్థ! ఉచ్యతే
5. యజ్ఞేతపసి దానేచ స్థితిః సదితిచోచ్యతే
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే
6. అశ్రద్ధయాహుతం దత్తం తపస్తప్తం కృతంచయత్
అసదిత్యుచ్యతేపార్థ! నచతత్ ప్రేత్య, నోఇహ.

ఇచ్చట నభిసంధి యిది: బ్రహ్మ శబ్దము జ్ఞానముం జెప్పును-అభియుక్త వచనము.

"ప్రత్యస్తాశేషభేదం యత్ సత్తామాత్మ మగోచరమ్
వచసాం; ఆత్మసంవేద్యం తద్జ్ఞానం బ్రహ్మసంజ్ఞితమ్."

ఆ యీ జ్ఞానము (1)సత్యజ్ఞానము, (2) యోగజజ్ఞానము (3) విజ్ఞానము, (4) ప్రజ్ఞానము, (5) ఐంద్రియక జ్ఞానము నని పంచవిధములుగ నారద పాంచరాత్రమున జెప్పబడినది. (1) నిర్విషయకత్వము వలన నిర్వికల్పకమును, విశ్వవ్యాపియు, అనిరుక్తము, నీశ్వర స్వరూపమునగు జ్యోతి, సత్యము, (2) జీవావ్యయ విద్యాభాగము నిరావరణము కాగా ప్రకాశోదయము

స్వందదాతి" యనుచున్నది. 3. తన్నునీయక, తదదియగు బాహ్యవిత్తము నిచ్చుట దానము,- విత్తముంగొనువాని యాత్మ యం దిచ్చువాని యాత్మ స్వవిత్తాహితాత్మభాగాధాన ద్వార మున ప్రవిష్టమై వైభవము, భూమాత్వము నొంది బలిష్ఠ మగును. విత్తమందు మమతాసంబంధమున దాతయొక్క యాత్మయనుస్యూతమై యుండునని శ్రుతియు "ఏతావాన్ ఖలువై పురుషః, యావదస్యవిత్తమ్" (తై॥ బ్రా) "యావద్విత్తంతావదాత్మా" (శత,) ఈ విధముగ సౌరప్రాణానుగత్యోపచారము, పరోక్ష ఫలోదర్కము. విజ్ఞాన విశేష సంబంధమున క్రియమాణమగు కర్మత్రయము వైదికము. ఈ మూడు కర్మల యావశ్యకతయు గీతయందు భగవంతుడు వక్కాణించెను.

"యజ్ఞోదానంతపః కర్మ నత్యాజ్యం కార్యమేవతత్
యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణాం
ఏతాన్యపి తుకర్మాణి సంగం త్యక్త్వాఫలానిచ
కర్తవ్యానీతి మేపార్థ నిశ్చితం మతముత్తమం."

ఇక లౌకిక కర్మయు రెండు విధములు :- (1) రమణీయ చరణము, (2) కపూయ చరణము అని ; అందు (1) అవిహిత కర్మ యవిద్యా మూలక మగుట వలనను, (2) నిషిద్ధ కర్మ యావిద్యా జనక మగుట వలనను, అత్యంత హేయములు కనుక వివరింప బని లేదు. అవిద్యా సంబద్ధకర్మల నిష్టజనకములు కదా! ఇక అవిద్యాగంధ శూన్యములగు విద్యా నిరపేక్ష కర్మలకు గర్తవ్యతా నిషేధము లేదు. ఏలయన లోక రుచి సిద్ధములగు

కర్మ లవైదికము లైనను సమాజహితావహత్వముననుు, వ్యక్తి హితకారిత్వముననుు, నంగీకరింపదగిన వగును గదా! అట్టియీ లౌకిక శుభకర్మ (1) ఇష్టము, (2) ఆపూర్తము, (3) దత్తము నని మూడు విధములు.

1. అధ్యాత్మదేవతా పుష్ట్యై యత్కర్మ విధివత్కృతమ్
వాచా ప్రాణేనమనసా. తదిష్టమభిధీయతే.

2. [2] ఆతిథ్యం వైశ్వదేవంచ ఇష్టమిత్యభి ధీయతే
[1] అగ్నిహోత్రం తపస్సత్యం దేవానాంచాను పాలనమ్.

3. సర్వసాధారణార్థాయ ప్రవర్తయతి యశ్చిరమ్
బహుద్రవ్యవ్యయాపేక్షం కర్మ తత్పూర్తముచ్యతే

4. వాపీకూపతటాకాది దేవతాయతనానిచ
అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే

5. వాటశాలాం పాఠశాలాం మఠం శీతేఽనలం ప్రపాం
వాటం వాటీమన్నసత్రం కుల్యాం వాటద్రుమాం స్తథా

6. పణ్యశాలాంచ భైషజ్యశాలాం పుస్తకశాలికాం
నౌకాం సేతుం ఘట్టబంధం కుర్యాత్పూర్తం వదంతితత్

7. బహిర్వేదితు యద్దానం తద్దత్తమభిధీయతే
శరణాగత సంత్రాణం భూతానాం చాప్యహింసనమ్

8. ససాధనం సోపభోగం స్వమర్థం యస్సమర్పయేత్
పరస్మైయద్దరిద్రాయ తద్దత్త మితికథ్యతే

9. భూమిం సువర్ణంగాం వస్త్రం ఉత్థానం పుస్తకం గృహం
ఔషధం భోజనం దద్యాత్ తద్దత్తమితి కథ్యతే.

నాఖ్యాతమగు నేకమేవాద్వితీయము పరిపూర్ణము విశ్వవ్యాపి-యీశ్వరూపము. విజ్ఞాన మీలోకమునందు మూడాయతనము లందు వేరుగ మూడు శబ్దములచే సాక్షాత్కారమగుచున్నది. 1 శబ్దశ్రవణ వ్యవధానముచే నావిర్భూతము, శబ్దస్థానమునగు విజ్ఞానము వేదశబ్దముచేతను, 2 వేదార్థపరిశీలనోపనీతము నాత్మస్థానమునగు విజ్ఞానము, విద్వచ్ఛబ్దాపరపర్యాయ బ్రాహ్మణశబ్దముచేతను, 3 బ్రాహ్మణబుద్ధి విచారోపకల్పిత సాధనసామగ్రి సంపాదితయజ్ఞ ప్రక్రియావిషయమగు విజ్ఞానము యజ్ఞశబ్దము చేతను చెప్పబడినది. అందీ మూడు విజ్ఞానాయతనములందును త్రుటిసంభావ్యమానత్వముచే కర్మఫలవైకల్య హేతుభూతమగు సాధనవైకల్యము సంభావింపబడుచున్నది. కనుక నట్టి త్రుటి పూర్తికొరకు "ప్రజాపతి రూనాతిరిక్తయోః ప్రతిష్ఠా" అను వాక్యానుసారము, ఈమూడు విజ్ఞానాయతనములకును, విశ్వవ్యాపీశ్వరప్రజాపతి స్మరణోపస్థాపిత-పరిపూర్ణానంతవిజ్ఞానసము ద్రమున ప్రవేశ మపేక్షింపబడుచున్నది. అయీయుపనిషదాధారముననే యజ్ఞతపోదానములందు నీశ్వరస్మారక త్రివిధశబ్ద ప్రయోగము జరుగుచున్నది. భగవంతుడు నిట్లనియెను.

"కవింపురాణ మనుశాసితారం అణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్యధాతార మచింత్యరూపం సతం పరం పురుషముపైతిదివ్యం"
"అనన్యచేతా స్సతతం యోమాం స్మరతినిత్యశః
తస్యాహం సులభః పార్థ! నిత్యయుక్తస్య యోగినః"

అందీ నైదికకర్మ ద్వైవిధ్యముగ మనువు స్మరించెను:-

"సుఖాభ్యుదయికం చైవ నైశ్శ్రేయసికమేవచ
ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధం కర్మ వైదికమ్
ఇహచాముత్రవా కామ్యం ప్రవృత్తం కర్మకీర్త్యతే
నిష్కామం జ్ఞానపూర్వంతు నివృత్త ముపదిశ్యతే
ప్రవృత్తం కర్మసంసేవ్య దేవానామేతి సామ్యతాం
నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పంచవై."

దేవసత్యవిజయాపయికమును, దైవశక్త్యాఽర్ధసంసాధనమునగు నది ప్రవృత్తకర్మ-దానిచే కర్మాశ్వత్థప్రజన నౌపయికము, వాసనాలక్షణమునగు నాగామికర్మ ప్రవర్తిల్లును. ఇక:- బ్రహ్మసత్యవిజయాపయికమును, త్రిగుణదేవభూతమయ సర్వవిధాత్మావరణ నివర్తనమువలన విశుద్ధాత్మ స్వరూపధర్మాత్యాంతికానందసంధానము నగునది నివృత్తకర్మ. భగవంతుడు నిట్లు చెప్పెను.

"విముచ్యనిర్మమః శాంతః బ్రహ్మ భూయాయకల్పతే
బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాంక్షతి."

ఈ నివృత్తకర్మచే గర్మాశ్వత్థ ప్రజన నౌపయికబీజరూపమగు వాసనాకర్మ నివర్తించుచున్నది. కనుక నీయుభయమును విద్యాసాపేక్ష కర్మలు. ఫలయన ప్రవృత్త కర్మకు వైదిక విజ్ఞానాత్మక విద్యా మూలకత్వమును, నివృత్త కర్మకు విద్యా సముచ్చితత్వమును కలవు గదా! కనుక నారెండును వైదిక కర్మలు: ఇక లౌకికమగు ప్రవృత్తకర్మ వేరుగా నొకటి, మొత్తము కర్మలు మూడని నిష్కర్ష. అందు 1. సృష్టిసాక్షి మనఃప్రాణ

వాక్ర్కమానుగతమగు నోంకారము. బ్రహ్మారబ్ధ విశ్వదృష్టి ప్రవణమై, ప్రవృత్తిస్వరూపమై, ప్రవృత్తకర్మ విషయకవిజ్ఞానన్యూనతా పూర్తికొరకు విజ్ఞానస్రోతః ప్రచారక మగును. (2) విశ్వాతఃన కర్తృవచనమగు తత్ శబ్దము విశ్వారబ్ధ బ్రహ్మదృష్టి ప్రవణమై నివృత్తి స్వరూపమై, నివృత్తికర్మ విషయక విజ్ఞాన న్యూనతా పూర్తికొరకు, విజ్ఞానస్రోతః ప్రచారకమగును. (3) సాధుభావ వచనమగు సచ్ఛబ్దము సాధుత్వ ప్రత్యయోప జనిత లోకరుచి ప్రవృత్తి నిమిత్తక లౌకిక సత్కార్మ విషయక విజ్ఞాన న్యూనతా పూర్తికొరకు విజ్ఞానస్రోతః ప్రచారక మగును.

ఇతి కర్మయోగ సమీక్షా.

## జ్ఞానయోగ సమీక్ష

జ్ఞానములెల్ల సాధనతః, ఫలతః పారలౌకికార్థములనే యపేక్షించును. ఆధిదైవిక సాధనములచేతనే కల్ప్యమానము లగునవి మరల నాధిదైవికార్థములనే జనింపచేయును. ఆ జ్ఞానములను సవిజ్ఞానములుగ నుపసంగ్రహించుట, యనుశాసించుట జ్ఞానకాండ. అందు పారమార్థిక వైజ్ఞానిక భావోపదేశమే కావింపబడును. అందును జ్ఞానవిజ్ఞానములకు బరస్పర సాపేక్షత్వ ముండుట వలన ప్రక్రమ భేదముచే నా రెంటికి వ్యవస్థ సేయ బడును. విభిన్న రూపములగు ననేక కార్య జాతములకు కారణైకత్వోప పాదనమున నేకత్వ వ్యవస్థాపనము జ్ఞానపదార్థము.

ఏకత్వ ప్రతిపన్నమగు నొకానొక మూలతత్త్వమునుండి అనేకా నేక కార్యజాతముల యావిర్భావ క్రమోపపాదనము, విజ్ఞాన పదార్థము. ఒకే యర్థమునం దంతర్భూతములు ననేకములునగు నారంభక ద్రవ్యముల విభాగము గావించి నామ, రూప, కర్మలచే వ్యాకరణము గావించుట విజ్ఞాన పదార్థము.

ఏకమగు బ్రహ్మ తత్త్వమునుండి (1) పరాత్పర, (2) పురుష, (3) సత్య, (4) యజ్ఞ, (5) విరాట్స్వరూప పంచికచే తత్త్వవిభాగము; 1. స్వయంభూ, 2. పరమేష్ఠి, 3. ఇంద్ర, 4. సోమ, 5. అగ్ని రూప పంచికచే నీశ్వర విభాగము; 1. శాంతాత్మా, 2. మహానాత్మా, 3. విజ్ఞానాత్మా, 4. ప్రజ్ఞానాత్మా 5. భూతాత్మా యను పంచికచే పంచదశ కళలు గల జీవ విభాగము. ఇట్లు: తత్త్వ, ఈశ్వర, జీవ విభాగములను నీ మూఁటి విజ్ఞానమే సర్వజగద్విజ్ఞాన మగును.

జ్ఞానము, కర్మ యని రెండు తత్త్వములు. జ్ఞానమున గర్మలు చేయబడును. కర్మచే జ్ఞానములు జనించును. ఈవిధముగ జ్ఞానకర్మలకు రెంటికి నుపకార్యోపకారకభావము. అందు ప్రవృత్తి నివృత్తి భేదమున గర్మద్వివిధము. హృద్గ్రంధిజనకము, బంధకము, వాసనామయము నగునది ప్రవృత్తకర్మ. 2 హృదయగ్రంధిమోచకము, వాసనోచ్ఛేదకము, బంధమోచకము నివృత్తకర్మ. అందు ప్రవృత్తకర్మ జ్ఞానమున నట్టి యనుష్ఠింపబడును. జ్ఞానమన్ననో, నివృత్తికర్మవలన నుత్పన్నమగును

ప్రజ్ఞత్వమునొందును. అథవా:-కామమున జేయబడు కర్మవాసనా జనకత్వమునను, వాసనయు నుత్తరోత్తర కర్మశృంఖలా ప్రవర్తకమగుటవలనను, ప్రవృత్తకర్మ యగును. జ్ఞానోత్పాదకమన్ననో, కర్మనివర్తకత్వమున నివృత్తకర్మయగును. ఆ జ్ఞానము వృద్ధియగుకొలదియు, దానికి విరోధియగుకర్మ దానియంతట నదియే లోపించును. కతకరజస్సువలె కర్మయే నైష్కర్మ్యముం బుట్టించును.

"నకర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" అని భగవద్వచనము. నివృత్తకర్మచే సర్వకర్మాత్యంత నివృత్తికాగా, నైష్కర్మ్యసిద్ధియగుట జ్ఞానయోగము. జ్ఞానమువలన ముక్తి; ఎట్లన:-జ్ఞానమువలన గర్మమోచనము ముక్తి. హృదయ గ్రంథి ముక్తి, కర్మబంధత్రయముక్తి, వాసనాముక్తియునగును. హృదయగ్రంథులు కర్మమూలకములు గదా! కర్మబంధములు వాసనాకలాపములు గదా! జ్ఞానమన్ననో, కర్మవిసంవాదియగు పదార్థము. కనుక నీజ్ఞాన ముదయింపగనే దానిప్రాబల్యమున గర్మమూలకములగు నాహృదయగ్రంథ్యాది పదార్థములు నియమముగ విడిపోవును. జ్ఞానకర్మలు రెండును, ఈశ్వరస్వరూపారంభకములు కనుక నేకాంతతగ కర్మక్షయము కాకపోయినను, కర్మలయొక్క చితి భంగముచే బంధగ్రంథి నివర్తించి సహచరభావముచే నాత్మయందుండును. కనుక చితిమూలక బంధగ్రంథి కర్మనివృత్తియే. యీనైష్కర్మ్య

పదార్థమును, ముక్తిపదార్థమునని యభిప్రాయముగ నెంచనగు. ఈవిధముగ నిది నైష్కర్మ్యజ్ఞానసాధనోపదేశము గావించు జ్ఞానకాండార్థము.

ఇతి జ్ఞానయోగసమీక్షా.

భక్తియోగ సమీక్ష

వైదికోపాసనాకాండోద్దేశము భక్తియోగము. ఆధిదైవికము, నాధిభౌతికము నగు నీయుభయవిధకర్మసముచ్చయము లేదా జ్ఞానకర్మ సముచ్చయముయొక్క నొక యపర భాగము భక్తి. ఆయుభయభక్తులచే జ్ఞానకర్మమయమగు నొక సాధ్యము విధింపబడుచున్నది. అది యుపాసనాకాండ యర్థము. అందు వ్యావహారికమగు కర్మచే పారమార్థికజ్ఞానము సంపాదింపబడుచున్నది. (భక్తి=భాగము)

(1) ఆధిభౌతికమగు నొకానొక యర్థమునందు బాహ్య దృష్టినుంచి తన్మూలకముగ నసన్నికృష్టమగు నొకానొక యాధిదైవికార్థాంతరమునందు మనోదృష్టి నమున్నయన ముపాసనము. (2) ప్రత్యక్షప్రత్యయముచే పరోక్షమగు నర్థమందు, ప్రత్యయప్రవాహ సంపాదన ముపాసనము. (3) బుద్ధి సన్నికృష్టమగు నర్థమువలన విదూరమగు నర్థప్రత్యయమును ధారణ సేయుట యుపాసనము. (4) విజిజ్ఞాసితభావము యొక్క రూప మేకొంచెముగనో గ్రహించి యందు సత్యత్వముచే నాస్థగలిగియుండుట శ్రద్ధానము. ఆ శ్రద్ధాన పారవశ్యమున

దదనుకూలమగు నైజ్ఞానిక పరిచర్య, ధ్యానాదిరూప బుద్ధి యోగము ననునది యుపాసనము. 5. ఈశ్వరు డున్నాడను ఆస్తిక్య బుద్ధిగలవారు విశ్వాసపూర్వక దృఢ ప్రత్యయమున సూర్యునో, గురువునో, అవతార పురుషునో భావింపుచు నతని కీశ్వరోచిత కర్మలు గావించుట యుపాసనము. 6. మనస్సుచే ధార్యమాణమగు నర్థమందు మనస్సంయమనముచే బుద్ధిస్థైర్యము గాంచుట యుపాసనము. వీని కుదాహరణములు బ్రాహ్మణా రణ్యకోపనిషత్తులం దా యా చోటుల బ్రయుక్తములగు నుపా సనా శబ్దము లందు భావ్యములు.

అటుగానిచో ఒకానొక ప్రత్యేకార్థము. ఆధిదైవిక మగుటవలన విప్రకృష్టమై విజ్ఞానము వలననే విశ్వసింపజేయ శక్యమై యున్నపుడు, విజ్ఞానముచం దసమర్థులగు నధికారులకు సులభముగ విశ్వాసముఁ గలుగజేయుటకు, నాధిభౌతికమగు నొకానొక సికృష్ట తమార్థము(దు, 1. ఆహార్యారోప మూల కముగనో, 2. ప్రతిరూప మూలకముగనో, 3. ప్రతీక మూల కముగనో, ప్రత్యయాలంబనము గావించి తదీయ ప్రత్యయ ప్రవాహోత్పాదనము సేయుట యుపాసనము. ఎట్లన: 1. ఆహార్యారోపముచ రచింపబడిన లిపి విశేషము నాలంబముగా గొన్న మనస్సుచే నొకానొక ప్రత్యయమగు వాగక్షరమందు అ, క, చ, టాది లక్షణ స్వర వ్యంజ నాదులయందు బుద్ధి యుంప బడుచున్నది. ఈ లిపి యా వాగక్షరమునకు ప్రతికృతియు

ప్రతీకమును గాదు. ఏలయన లిపి సాకారము, వాగక్షరము నిరాకారము. కనుక దానికి ప్రతికృతిత్వ ప్రతీకత్వము లసంభావ్యములు కదా! కనుక నిది మూడవ విధమునకు చెందినది. ఈ విధముననే యజ్ఞమునందు కుశముష్టి వేదత్వమున వివక్షిత మగుచున్నది. ఒకచో మరల యోగ్యుడు, విద్వాంసుడు నగు బ్రహ్మ లభింపనియెడల నార్త్విజ్యమునను, బ్రహ్మత్వమునను ఆ కుశ ముష్టియే కల్పింప బడుచున్నది.

2. ప్రతిరూప విధ మెట్లన: చిత్రప్రతికృతిచే చిత్రితు నందు బుద్ధి యుత్పన్నయగున మగును. మరియు శిలాఖండ విశేష ప్రత్యాయకమగు శాలగ్రామ శిలా శబ్దముచే బ్రతిపన్నమును, ప్రత్యయాలంబన రూపమునగు భౌతికార్ధమున నాధిదైవిక హిరణ్య గర్భుడగు విష్ణూపాసన జరుగును. ఇంకను వృక్షవిశేష ప్రత్యాయకమగు నశ్వత్థశబ్దముచే బ్రహ్మాశ్వత్థ కర్మాశ్వత్థముల ప్రత్యయోత్పాదన మాచార్యు లుపదేశించు చున్నారు. ఇట్లే పశు విశేష వాచకములగు కూర్మ కశ్యప శబ్దములచే జగత్స్రష్ట యగు ప్రజాపతియందు బుద్ధి యుంప బడుచున్నది. ఆ యీ ప్రకృతి మూడు విధములగును.

3. ప్రతీక విధ మెట్లన: ప్రతీక మన నవయవము. అంగుళి గ్రహణమున బిత్రృగ్రహణ బుద్ధియు, చరణ సేవచే గురు సేవా బుద్ధియు, వలె సర్వత్ర జగద్వ్యాపకావ్యయున కైక్య డనో యొకచో పత్యంశ సమాలంబిత బుద్ధిచే విశ్వేశ్వర లక్ష

ణము సముదాయమునగు నవయవి యందు బుద్ధియుంచుట యుపాసనా రూప మగును. ఆ విధముననే మనుష్యవచ్ఛరీరోప లక్షితులగు రామ-కృష్ణులందు శ్రద్ధతో నుండు బుద్ధి యాధి దైవిక జగదీశ్వరుడు భగవంతునందు స్థిరత నొందుచున్నది.

ఇట్లు ఒక్కొక్క విధముగ వ్యాఖ్యాతమగు నీ యుపాసన యొక్కొకచో రెండు లేక మూడు విధముల సముచ్చయము కావచ్చును. ఎట్లన: చిత్ర పటాలంబిత దృష్టిచే చిత్ర వస్త్వర్థమునందు మనో యోగము వలె నిందును రామ కృష్ణాది ప్రతిమూర్తి పదాలంబిత బుద్ధిచే రామ కృష్ణాది శరీరియందు మనోయోగము కలుగగా, తద్ద్వారా మరల భగవంతుడును, యజ్ఞపురుషుడు నగు విష్ణువునందు మనస్సమర్పణము ప్రతిఫలించును. అది యుపాసన మగును. భగవద్ జ్ఞానమయమగు నా యుపాసన యందు మనుష్య స్వామికి వలె సర్వ పరిచర్యాది కర్మ వ్యవహారములు, లోకమున నగునట్లు కావింపబడును. ఆ యారాధన కర్మచే నలౌకికుడును, పరమార్థభూతుడు నగు భగవంతు డీశ్వరుడు బుద్ధిసాన్నిధ్యము నొందును. కనుక నిందు జ్ఞానకర్మోభయ సముచ్చయమున్నది. ఆధిభౌతికమగు స్నానీయ పాద్య అర్ఘ్య ఆచమనీయ భోగ-సమర్పణా ద్యుపచార రూపము సాధనము. ఆధిదైవికమగు భగవద్రూప సన్నికర్షాది రూపము ఫలము. ఇట్లుభయాధికరణములకు సముచ్చయము. అందాధిభౌతిక సాధన ప్రకరణము, సాధ్యమగు నాధిదైవిక

భగవద్ జ్ఞానమునకు భక్తి (భాగము) కనుక నది భక్తియోగ మని చెప్పబడును.

ఈభక్తియోగ సమీక్షయందు శ్రీకృష్ణోపాసనయందలి వైజ్ఞానికత్వము నావేదించుట కుపాసనారహస్యము దర్శింపబడినది. మరల శ్రీకృష్ణసంబంధముగ విశదముగ జెప్పెదము. ఉపాసనారహస్య మిట్లన:- మనస్సుచే ధారణము, 1 ధార్యమాణ విషయమందు సమానప్రత్యయప్రవాహ ముపాసయని శ్రీశంకరాచార్యులనిరి. ప్రత్యయము తద్బుద్ధి విజ్ఞానము. 2 భ్రమజ్ఞాన వ్యతిరేకముగ నన్యత్రానన్యభావనాబుద్ధి యుపాసన. 3 అన్యసిద్ధబద్ధమగు నన్యత్రస్థితి యుపాసన. 4 శ్రద్ధానసూత్రముచే మనోబుద్ధ్యర్పణ ముపాసన-శ్రద్ధాసూత్రముద్వారా, పరత్రఆత్మయందు ఆత్మాంశమగు మనోబుద్ధి నర్పించువారై పరమాత్మ భక్తులగుదురు. భక్తియన భాగము అంశము. భక్తికరణము కర్తయు నుపచారమున భక్తియగును. అట్లు భక్తి యుపాసన యగును. పృథగాత్మ యయ్యును పరత్ర ఆత్మయందు భక్తిభూతుడు (అంశభూతుడై) యుపాసించును. పరమాత్మయందాత్యంతిక మనోయోగముద్వారా తత్ సన్నిధానమున జీవాత్మయొక్క యవస్థానము సాసనము భక్తుడు:-సాలోక్య-సామీప్య-సారూప్య - సాయుజ్యాన్యతమసంబంధమున భగవత్ సాన్నిధ్యమునొంది యందు ప్రతిష్ఠితుడగును. అందుచే జీవాత్మకు పరమాత్మయొక్క భక్తిభావసంపత్తి యుపాసన. తద్వ్యత్యాసము

కూలవృత్తి ధారణసేయువాడు తదిచ్ఛానుసారమున నాచరించుట యుపాసనము. శ్రద్ధానసూత్రార్పిత మనోవృత్త్యనుకూల దృష్టి సూత్రార్పితయు, శ్రద్ధేయపరిస్థిత్యనురోధాపేక్ష బుద్ధి సహకృతయు నగు భావనాబుద్ధియొక్క యనురోధాపేక్షిత వృత్తి స్థిరతయుపాసనయని సిద్ధాంతము.

దోషదర్శనానుకూలవృత్తి ప్రతిబంధకవృత్తి ధారణము శ్రద్ధ. అదియు వృత్తినిర్దోషసత్యత్వ-విశ్వాసపురస్కృతాశ్రయణీయత్వములుగల యాస్థ, అందు దృష్టి చాక్షుషియో మానసియో కావచ్చును. అంతటను చాక్షుషీదృష్టి యసంభవము కదా! ఉపాస్యము, ధ్యేయము, లక్ష్యము, ప్రతీక్ష్యము, అనురోధ్యము, ఆరాధ్యము, వేద్యము అనున వొకే యర్థము. విత్త్యుపాస్తుల కనతి విశేషముగ నుపదేశము కలదు. కనుక విద్యోపాస్యముల కభేదాధ్యవసాయము. శ్రీశంకరులుకూడ "ఆవృత్తి రసకృదుపదేశాత్" అను సూత్రభాష్యమునందు, "విత్త్యుపాస్త్యోశ్చ వేదాంతేషు వ్యతిరేకేణ ప్రయోగోదృశ్యతే, క్వచిద్విదినోపక్రమ్య ఉపాస్తినోపసంహరతి క్వచిచ్చోపాస్తినోపక్రమ్యవిదినోపసంహరతి" అని చెప్పిరి. అందుచే విత్తియు విత్త్యుపాయక్రియయు నుపాసన, యన్నట్లైనది. ఇందు మాయభిప్రాయ మేమన:-విత్త్యుపాసన శబ్దములకు బర్యాయత్వము లేదనియే "యఏవముపాస్తే యఉచ్చైనమేవం వేద" ఇత్యాదులందు జ్ఞానోపాసనలకు భేదవ్యవహార మిష్టముకదా! కనుక

విషయభేద ముండుననుకొనవలయును. ఆత్మయొక్క నిర్గుణత్వ జ్ఞానము నిర్గుణవిద్య. అది విత్తి. సగుణత్వజ్ఞానము, సక్రియోపచారము, సగుణవిద్య. అది యుపాసన అని భేదము. ఆయుపాసనచే నేయర్థము లక్ష్యమో, అది ధ్యేయము, వేద్యము, ఉపాస్యము. ఆయీ యుపాసన త్రివిధము. 1 దృష్టిబుద్ధుల సామానాధికరణ్యమున బర్యాప్తము సత్యవతి. 2 అకృత్స్నపర్యాప్త దృష్టి సమర్పిత భావనాబుద్ధియొక్క కృత్స్నపర్యాప్తత్వము నందు అంగవతి. 3 దృష్టిబుద్ధుల వ్యధికరణత్వమునందు అన్యవతి-అందు అంగవత్యన్యవత్యుపాసనలందు భక్తిశబ్దము వర్తించును. కారణము? బుద్ధివిషయముం గూర్చి దృష్టివిషయమునకు భక్తిత్వము కలదుగదా!

అట్లు:-ఈభక్త్యుపాసనయందు దృష్టిబుద్ధుల సామానాధికరణ్యమున బర్యాప్తి యవివక్షితమగుటవలన నట్టియుపాసనా సంపత్తికొరకు నందు మూడుభావము లపేక్షింపబడుచున్నవి. 1 ఉపాసకుడు, 2 ప్రథమోపాస్యము, 3 పరమోపాస్యము అని. అందెవడు చూచుచు భావించునో అత డుపాసకుడు. చాక్షుషియో, మానసియో యగుదృష్టి దేనినవలంబముగ గొని తద్ద్వారమున నుపాస్యమందు బుద్ధినర్పించునో ఆయాలంబనము ప్రథమోపాస్యము. ఇక :-ఈభావనాబుద్ధి చివరకెందు విశ్రాంతి నొందునో యట్టి భావనావిషయము పరమోపాస్యము.

అయితే ఉపాసకునిచే పరమోపాస్యమే సాధ్యమైనచో నింకొక ప్రథమోపాస్య మనునది మధ్యగ నెందుకు? అన్నచో

పరమోపాస్యము మూడు విధములు: 1. ప్రత్యక్షము 2. పరోక్షము 3. అతీంద్రియము అని. 1. సన్నిహితేంద్రియ గ్రాహ్యము ప్రత్యక్షము. 2. అసన్నిహితేంద్రియ గ్రాహ్యము పరోక్షము. 3. అనింద్రియ గ్రాహ్య మతీంద్రియము. 1. ప్రత్యక్షముగ గురువు నుపాసించునట్లు, 2. ఏకలవ్యుడు గురువు ద్రోణుని పరోక్షముగ నుపాసించునట్లు, 3. అతీంద్రియు నీశ్వరు నుపాసించునట్లు. అని ఉదాహరణముల నెరుంగదగును. ఇందు పరోక్షము, నతీంద్రియము నగువానియందు బ్రత్యయోత్పత్తికొరకు కించిదింద్రియ గ్రాహ్యమగు దృష్ట ప్రత్యయమును మాధ్యామికముగ నంతర మపేక్షింపబడును. ఆ యీ ద్వారభూతమే ప్రథమోపాస్యము. గజాద్యాకార మెట్లుండునని యడిగిన పుత్రునకు దండ్రి పాషాణ మృణ్మయాది గజాది ప్రదర్శనము గావింపగా బుత్రుడు చేతనార్థము నెరుంగుచునే పాషాణ మయమగు నర్థము నుపాసించును. పాషాణ మయమునందు వ్యవహరించు దృష్టి చేతనమందుంచి యనిరుక్త గజమునందు బుద్ధినుంచును. ఇట్లు మాధ్యమికమగు పాషాణ గజము ప్రధానోపాస్యము. చేతన గజము పరోక్షము పరమోపాస్యమని భావ్యము. మరియు అతీంద్రియ శూన్యబిందు సంప్రత్యయార్థము స్థోకబిందువు ప్రదర్శింప బడుచున్నది. అప్పు డుపాస్యుడు స్థోకబిందువునందు శూన్యబిందువు నుపాసించును గదా! ఇట్లంతట నెరుంగనగును. దృష్టియోగ్యమగు మధ్యమ మేదియు లేకుండ బరమోపాస్యము సాధింప శక్యము కాదనుట సత్యదూరము కాదు. కనుక నోప

యికత్వమున బరమోపాస్యాతిరిక్తము ప్రధమోపాస్య మొకటి యీ భక్త్యుపాసనయందు వివక్షితమైనది.

ఆయీ మాధ్యమికము చతుర్విధసంబంధమర్యాదచే పరమోపాస్యమందు బుద్ధిం బ్రవర్తింపజేయును. 1 ప్రతీక విధము, 2 ప్రతిరూపవిధము, 3 భావప్రతిమావిధము. 4 నిదాన విధము. కనుక భక్త్యుపాసనయు నాల్గువిధములుగ నిష్కర్ష చేయబడును.

## 1. ప్రతీకోపాసన

కృత్స్నమగు దాని యేకదేశోపగ్రహము ప్రతీకము. అనగా:-జనపదమునకు బురము, పురమునకు గృహము; గృహమున కొకశాల, మనుష్యునకు హస్తాద్యేకాంగము, ప్రతీకమగును. పాంచాలదేశము దహిచ్ఛత్రనగరము దొకశాలకు జనినవానికి పాంచాలగమనము వ్యపదేశింపబడును. పుచ్ఛమాత్రస్పర్శచే గోవును స్పృశించితిననుు, అంగుళిగ్రహణమున బిత్రుగ్రహణము వ్యపదేశింపబడును. ఏకదేశావతిష్ఠమానబుద్ధి కృత్స్నబుద్ధి ప్రతిష్ఠాపన జేయును. ఆ విధమున భక్తి, భక్తిమదనతిరిక్తత్వమున, నవయవదృష్టిచే సముదాయమందు బుద్ధివృత్తియొక్క స్థిరీకరణము ప్రతీకోపాసన-ఉదాహరణమున:

"ఇంద్రం మిత్రం వరుణమగ్ని మాహుః అథదివ్యః ససుపర్ణోగరుత్మాన్
ఏకం సద్విప్రాబహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః"

"తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదు చంద్రమాః
తదేవశుక్రం తద్బ్రహ్మ తా ఆపః సప్రజాపతిః."

అని యనేకముల కైకాత్మ్య మామ్నాతమగుచున్నది. అనేకత్వ మంగిసాపేక్షము. ఇంద్రమిత్రాది రూపకర్మభేదమున భేదవ్యపదేశ మంగసాపేక్షము. ఇంద్రాది సర్వదేవతలు నొక యీశ్వరుని భిన్నభిన్నకర్మలు. భిన్నభిన్నములగు నంగములును, ఇందే యొకని నుపాసించినను సర్వథా ఒక యీశ్వరుడే ప్రతీకోపాసనోపాసితుడగును. ఆరాధితుడగును. ప్రతీకభేదమున్నను ప్రతీకమువలన గృహీతమగు నాత్మకు సర్వాంగపర్యాప్తత్వమున నభిన్నత్వముకదా! గంగానదియందు ఒకానొకచో స్నానమొనరించిన గంగావగాహన జేసినట్లుకదా! శారీరకమునందు భగవంతుడు వ్యాసుడుకూడ "సర్వాభేదాదన్యత్రేమే" అని వచించెను. సర్వమగు నంగికి ప్రత్యంగా భేదమున నీయంగి ధర్మము లన్యత్ర అంగమున బర్యాప్తించే వివక్షితములగునని భావము. ఇంకను పెద్దలు: "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి." అనిరి. గీతయందును :-

"యేప్యన్యదేవతా భక్తాః యజన్తే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవకౌన్తేయః యజన్త్య విధిపూర్వకమ్"

ఇందు 'మామేవ' యని యవ్యయు (నన్నుతాత్మను) జెప్పెను. అతడీ జీవాత్మలకెల్ల నంగియగును.

"సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు విభక్తమివచస్థితం

సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరం
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి సపశ్యతి."

అని యిట్లా యవ్యయుని విశ్వవ్యాపకైకాత్మ్యస్మరణ కలదుగదా! అందా దేవతలెల్లరు నంతర్భూతులగుదురు. శ్రుతియు నిట్లనుచున్నది :-

"యదక్షరం పంచవిధంసమేతి యుజోయుక్తా అభియత్నం వహన్తి
సత్యస్య సత్యమను యత్రయుజ్యతే యత్రదేవాః సర్వఏకీభవన్తి."

ఆ విధమున భగవద్రూపవిశేషత్వమున బ్రతీతులగు నీయెల్ల దేవతలలో నొక దేవతను భజించినను, అంగియగు భగవదవ్యయాత్మనే భజించునను నభిప్రాయముతో "త్రేపిమా మేవ యజన్తి" అని వక్కాణింపబడియెను. ఏకదేశ ప్రతిపత్తిచే కృత్స్నప్రతిపత్తిరూప ప్రతీకోపాసనయే పైని జూపిన శ్రుతి స్మృతులం దుపదేశింపబడినదగును.

## 2. ప్రతిరూప ప్రతిమోపాసన

చిత్రప్రతిమాది ప్రకృతి రూపమగు శిల్పము ప్రతి రూపము. అందాలంబితయగు బుద్ధికన్యత్ర విప్రకృష్ట ప్రతిమేయ స్థితి యుపపన్న మగును. ఆ యీ ప్రతిమ 1. ప్రతికృతి, (2) భావమునని ద్వివిధ మగును. సాకారరూపము చిత్రపటము ద్వారాగాని, దారు పాషాణాది ఫలక ద్వారమున గాని, ప్రతి రూప శిల్పమున సాదృశ్యోపపాదనము ప్రతికృతి ప్రతిమ యగును. మృణ్మయ ధాతుమయాది బింబ విశేషములందు

గజాశ్వాది బుద్ధి, సాదృశ్య మహిమచే ప్రతిష్ఠ నొందునట్లు విశ్వాత్మ, భగవంతుడు, హిరణ్యగర్భు డీశ్వరుడు, ప్రతిరూప దృష్టిచే సాక్షాత్కరింప నొప్పును. అతడే జగదాధారుడు భూత పతి యని శ్రుతి చెప్పుచున్నది :

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేకఆసీత్
సదాధార పృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషావిధేమ
యంక్రందసీ అవసాతస్తభానే అభ్యైక్షేతాం మనసారే జమానే
యత్రాధిసూర ఉదితో విభాతి కస్మైదేవాయ హవిషావిధేమ."

ఆ యీ హిరణ్య గర్భుని ప్రత్యక్షముగ దృశ్యమాని వలె నుపాసింప గోరువాడు తత్ప్రకృతి యపేక్షించును. అందు వలన నుపాసకుడు ప్రకృతి సిద్ధము. విశ్వాకారాకారిత హిరణ్య గర్భ సంజ్ఞకమునగు శాలగ్రామ శిల నుపాసించును. దాని రూపమే దివమందు బ్రతిష్ఠితుడగు హిరణ్యగర్భుని రూపము. ఈ శ్రుతి వచనములం గమనింపుడు :

"తస్మాత్పరం నాపరమస్తికించిత్ తస్మాన్నాణీయో నజ్యాయోస్తికించిత్
వృక్షఇవస్థబ్ధః దివితిష్ఠత్యేకః తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్."

"సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖం
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి."
"సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అమలం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ."

ఇందుచే హిరణ్య గర్భునకు వర్తుల వృత్తత్వ ముప పాదిత మగుచున్నది. ఆ విధముగ హిరణ్మయ సౌర జ్యోతి

ర్మాండల గర్భితుడును, భగవంతుడును, హిరణ్య గర్భుడును, పరమేష్ఠియు నగు కృష్ణమూర్తియొక్క సౌసాదృశ్య మన్ని విధములచేతను శాలగ్రామ శిలయం దుపపన్న మగుచున్నది. అందుంచిన దృష్టిసాదృశ్య మహిమచే విశ్వమూర్తియు భగవంతుడునగు హిరణ్యగర్భుడందు వెంటనే బుద్ధి నర్పించును. కనుక నీ శాలగ్రామోపాసన విశ్వమూర్తియగు నీశ్వరుని ప్రతిరూపోపాసన యగును.

### 3. భావమయ ప్రతిమోపాసన

నిరాకార నిరూపమునకు ప్రతికృతి యసంభవము కనుక భావమయీ ప్రతిమ గావింప బడును. వ్యాసము పృష్ఠములేని అపిండము, అనుపాఖ్యమునగు శూన్య బిందువుం జూపుటకు పిండ బిందువు నిర్దేశింప బడుచున్నది. అందీ స్థూల బిందువున అధ్యస్తమగు బుద్ధిచే శూన్యబిందు వుపాసింప బడుచున్నది. పిండబిందువు లక్షకము, శూన్యబిందువు లక్ష్యము. లేఖ లక్షిత పత్రాద్యుప నిబద్ధములగు విజ్ఞాన గ్రంథములు లక్షకములు. అశరీరములగు భావనాగమ్య విజ్ఞానములు లక్ష్యములు. వానియొక విధముగ నవి గుర్తింప శక్యము గానివి. కనుక ననాకార జ్ఞానోపయికమగు సాకారమం దర్పితమగు బుద్ధి యనాకారోపాసన యగును. అందు అనాకార సాకారములకు ప్రతిరూపత్వాసంభవ మైనను యెట్లో గృహీతమగు వివక్షిత ప్రాతిరూప్యము, భావమయ మగునది, భిన్నములగు నీ రెంటికిని ప్రత్యభిజ్ఞా హేతువగును. అదియే భావమయ ప్రతిమ.

## 4. నిదానోపాసన

సాధర్మ్య విశేషము లేకున్నను యాదృచ్ఛికమగు నొకానొక యర్థమున కహార్యారోప విధమున సంకేత సంబంధ ముత్పాదించి స్మారకత్వము కల్పించుట నిదానము. సంకేతము నిదానము. శోకమునకు నపకీర్తికి నలుపు. క్రోధమునకు నెరుపు. కీర్తికి మోక్షమునకు తెలుపు. సత్వరజస్తమములు, శుక్ల రక్త కృష్ణములు. గజముచేలక్ష్మి - ధ్వజముచే విజయము. ఛత్రముచే రాజ్యము. దండముచే శాసనము. పద్మముచే పృథివి. ఇట్లు నిరాకారార్థ మాయా పరికల్పిత సాకార ద్రవ్యముచే సంకేతింప బడుచున్నది. అది నిదానము ; లోకమంతయు నీ నిదాన విధము నాదరించి ప్రవర్తించుచుండుట తెల్లము. ఈ నిదానముచే నాహార్యారోప ప్రభావము వలన నన్యత్ర అన్యబుద్ధి కల్గుచున్నది. అంగుళి రచనా విశేష ప్రదర్శనమున సంకేత మెరిగినవాడు. సంకేతితస్థాన విశేష గమనాది వ్యవహారము గావించుచున్నాడు గదా! కనుక నిదానముకూడ మాధ్యమికమని సిద్ధమైనది. మాధ్యమికమం దవలంబిత మగు మనస్సు అప్రత్యక్షమగు నితరార్థమం దనుక్రమించు స్థితి నొందును. అందుచే నతీంద్రియార్థము వెంటనే విదితము నుపాసితము నగును.

ఈశ్వరు డతీంద్రియమగు నర్థము. మాధ్యమికము లేకుండ నుపాసింప శక్యము కాదు. ఇంద్రియాతీతార్థమునందు మనసున కవస్థానయోగము లేదు కదా! కనుక నుపాస్యోపాసకుల మధ్య నింద్రియమున కాలంబనము ఏదో కొంచె ముండ వలయును. అది యధ్యాస్యమగు భావప్రతిమానము, నిదంకార

భూత ప్రథమోపాస్యము నగును. గురువుయొక్క జీవాత్మయో జీవాత్మ ప్రతీకోప లక్షిత పరమాత్మయో, పరమోపాస్యమను కొనుడు. ఈ రెండు నింద్రియములచే గ్రహింప నశక్యములు. అట్టియెడ నుపాసన యెట్లు? ఇతర వృత్తి నిరోధ పూర్వకముగ మనో యోగమున నొకచో సమాన ప్రత్యయ ప్రవాహ ముపాసన మైనచో నిర్వికల్పక నిరాలంబన సమాధి యశక్యము గదా! ఇంక భావమయమగు మధ్యమమున, ప్రతిమాద్యవలంబనమున నధ్యాస నొందిన మనస్సు జహదజహల్లక్షణచే నప్రత్యక్షమగు నొక యర్థమం దనుక్రమింప గలదు.

మరియు ఒకానొక యర్థమునందు సాదర దీర్ఘకాల నిరంతర మనోఽవస్థాన యోగమున కసాధారణ కారణము ప్రేమ. ప్రేమ యున్నంత వరకు వస్తువు మనస్సు నంటియుండును. ప్రతికృతియో భావమయి ప్రతిమయో, శిల్పత్వమున ప్రేమోత్పత్తి హేతువు. ప్రేమపూర్ణుడగు సహృదయుడు మూర్తము నింద్రియ గ్రాహ్యమునగు నొక ప్రతిమనుచూచుచు, తద్ద్వారా దానికంటె నొకచో మనస్సంధానము గావించి శ్రద్ధయుంచును. అందా యారాధ్యమందు పరమ ప్రేమచేనగు మనస్సంధాన మున్నంత వరకది యుపాసకునకు దపస్సు - అట్టి తపస్సుచే భావితమగు నమూర్త దైవము. మూర్తబింబమున, నిదానారోపితుడై భాసిల్లును. అమూర్త మగుటవలన విప్రకృష్ట తమ మయ్యు నా యారాధ్యము మూర్తి బింబ ద్వారమున సన్నిహిత తమము ప్రగృహీతము నగు. అంకు నిరతిశయ ప్రేమయే హేతువు. అభిరూప మందన్ననో మూర్తద్రవ్యము హేతువు. ఆచార్యులట్లే స్మరించుచున్నారు.

"అర్చకస్యత పోయోగాత్ అర్చన స్యాతిశాయనాత్
ఆభిరూప్యాచ్చ బింబానాం దేవః సాన్నిధ్యమృచ్ఛతి."

అందును :- అమూర్తమగు వేద్యముయొక్క బుద్ధిసాన్నిధ్యముకొరకు సన్నిహితమును, కించిత్సాధర్మ్యముచే వివక్షితమును నగు భావప్రతిమనో, నిదానమునో మాధ్యమికముగ నుంచుకొనవలయును. అట్టి యీమాధ్యమికమగు నవలంబనము ప్రథమమగు పదము, అప్రత్యక్షమగు నుపాస్యము పునఃపదము పదపునగపదములు వేరని యెరింగియు, నభేదబుద్ధి వహించుట యుపాసన. ఇట్లు ఈ యుభయమునకే యుపాస్యత్వ నిష్కర్ష-మధ్యమమునకు ద్వారోపాస్యత్వము, ఉత్తమమునకు పరమోపాస్యత్వము, అన్యతరోపాస్యత్వమంతరము లేకుండ నుపపన్నము కాదు. మూర్తామూర్తములు రెండే యుపాసనాకర్మయందపేక్ష్యమాణములుకదా! అందనద్ధాభావమగు నమూర్తమును మూర్తత్వమున నుపాసించును. మూర్తమునో యమూర్తత్వమున నుపాసించును. ఎట్లన :- అగ్నిచయవిద్యయందు జగత్పితయు, గూఢరూపుడు నగు నమూర్తప్రజాపతి పురుషుని యనద్ధారూపతచే భావప్రతిమానమున గశ్యపరూపమున నుపాసించి యది మరల నుత్తరోత్తరావకరాపగ ప్రతిమా సంవృతము గావించి, లోకత్రయరసములగు దధి-ఘృత-మధువులచే నభ్యక్తము గావించి యీవిధమున చితి సంపాదింపబడును. అందు :-అపరిమితములు, అమూర్తములు, అనద్ధాభూతములు నగు నాకూర్త-లోకరసముల కద్ధాభూతములు, పరిమితములు, మూర్తములు నగు కశ్యపాకారములచే ప్రతిమానము విధింపబడు

చున్నది. మరియు హావిర్యజ్ఞమునందు మూర్తమగు కృష్ణాజినము నిరాకారమూర్తత్రయీవిద్యకు ప్రతిమగా విధింపబడు చున్నది. ఇట్లే శ్రుతియందు పెక్కుచోట్ల నిరాకారభావములకు సాకారభావ ప్రతిమానకరణము కలదు. లిప్యక్షర-శబ్దాక్షర-పరిమాణాక్షరములకువలె నామార్థామూర్తముల కభేదప్రత్యయము నెల్లరుం బ్రవర్తించుచున్నారు. వానిలో నొకదానియం దధ్యాసితయగు బుద్ధి-యన్యత్ర యుపాసితయగును. కనుక నిది వైజ్ఞానిక కర్మోపాసయని చెప్పబడునని యెంచవలయును.

ఈయుపాసన నాల్గువిధములయ్యెను, అందందు యథేచ్ఛగ జేయ వీలగును. చూడుడు: శ్రీకృష్ణోపాసన యధికార భేదమున, 1 ప్రతీకోపాసన, 2 భావోపాసన యని రెండు విధములు. యాదవుడు, మాధవుడు, సాత్వతుడు నగు నవతార పురుషుడు శ్రీకృష్ణుని యాకారము. పరమాత్మకు బ్రతీకము లేదా కొందరధికారుల కిది భావమయి ప్రతిమ. ఆయీవైజ్ఞానిక సత్యకృష్ణతత్త్వ మనేకవిధముల సమీక్షింపబడు నెట్లన:- "అస్తినై చతుర్థో దేవలోక ఆపః" అను వాక్యమువలన లోక చతుష్టయము వినబడుచున్నది. కనుక నీయీశ్వరుడు సత్య రూపి, లోకచతుష్టయ సాక్షియగుటచే పృథివి, వ్యంతరిక్ష, ద్యు, పరమవ్యోమలోకానుగతములగు నాలుగురూపము లతని కగునని గుర్తింతము. 1 మానుషము, 2 వైహాయసము, 3 చాక్షుషము, 4 పారమేష్ఠ్యము. (1) యాదవ, వాసుదేవుడనునది మానుషము, (2) అంతరిక్ష్య-చంద్రుడన్నది వైహాయసము, (3) దివ్యసూర్యుడన్నది చాక్షుషము, (4) చతుర్థలోక సముద్రమున గోసవ, గోవిందుడనునది యతని పారమేష్ఠ్యరూపము.

ఈనలువురు కృష్ణులకును సత్యాత్మయగు స్వయంభువుతో దాదాత్మ్యము భావింపదగినది. ఒకడేయగు నీయంతర్యామి సత్యుడు, ఆయాలోకములందు విభూతిచే నవతరించుచు విభిన్న రూపములతో నాల్గులోకములందు నవభాసిల్లు చున్నాడు. ఇట్లు సత్యాత్మయగు దివ్యకృష్ణుని చతుర్లోకవాసిత్వ స్వాభావ్య ముననీసత్యావతార, మనుష్యరూపకృష్ణుడును తననివాస స్థానము నాల్గువిధముల బరికల్పించెను. (1) పృథ్వీలోకమునందు వలె కారాగారవాసము, (2) పిమ్మట నంతరిక్షలోకమందువలె పరివిస్తృతగోకులాదులు విహారస్థానములుగ నుండెను. (3) పిదప ద్యులోకమందువలె మథురారాజ్యాశ్రయరూపమున నుండెను. (4) తరువాత నాలవదగు నాంలోకమందువలె సముద్ర గర్భమున ద్వారకయందు పరమస్థాన నివాసము, ఇట్లు అద్భుత ముగ చతుర్లోకవాసిత్వ గ్రహణము గావించెనుకదా! ఇచ్చట నొక విశేషము :-మనుష్యావతారమునం దొకడే కాలభేదమున నాల్గుచోటుల నుండెను. అధిదైవతముగ విశ్వాత్మయగు భగ వత్కృష్ణుడు పృథివ్యంతరిక్షద్యు సముద్రములందు భిన్నభిన్నావ తారములతో నొక్కమారే యన్నిచోటుల నుండగలడు. ఆయీ నాల్గు సత్యావతారములను బ్రత్యక్షము గావించుకొన జాలనివాడు. చిత్రపట మెదుట నుంచుకొని యందీసత్యాత్మను భావించి యుపాసించుగాక యని యాదేశము. భక్త్యుపాసన యందు మాధ్యమికము, సానుచరితము నగునీమానుషరూపము మధ్యమోపాస్యము. తత్ప్రతిమాచిత్రాదికము మరల మాధ్య మికమై ప్రథమోపాస్యము నగును. ఇట్లుపాసనారహస్య మనేక విధములుగ నెరుంగవలయును.

ఇతి భక్తియోగసమీక్ష.

## బుద్ధియోగ విద్యారహస్యమ్

గుణమయయోగమాయావరణమున నప్రకాశితావ్యయ ప్రకాశోపాయము బుద్ధియోగము. విద్యాబుద్ధి కవ్యయునితో విద్యావిభాగావచ్ఛేదమున యోగము బుద్ధియోగము. బుద్ధితో గూడిన యవ్యయుడును బుద్ధియోగము.

"ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్."

అని భగవంతు డవ్యయశబ్దమున యోగమే యుపదేశించెనుకదా! బుద్ధి యెనిమిది విధములు. ధర్మము, జ్ఞానము-వైరాగ్యము-ఐశ్వర్యము నని విద్యాబుద్ధులు నాలుగు. ఇందుకు విపరీతములగు నవిద్యాబుద్ధులు అవిద్యా-అస్మితా-రాగద్వేషములు అభినివేశము నని నాలుగు. సర్వవిధక్లేశహేతువులగుటవలన నీనాల్గును పంచక్లేశములందురు. అవిద్యకు జ్ఞానముతో అస్మితకైశ్వర్యముతో-రాగద్వేములకు వైరాగ్యముతో, అభినివేశమునకు ధర్మముతో ప్రతిద్వంద్విత్వముకలదు.

### 1. వైరాగ్యబుద్ధియోగము

రాగ ద్వేష మోహమయ్యాసక్తి-వైరాగ్యమునని పరస్పర ప్రతిద్వంద్వి భూతబుద్ధులు రెండు. అందు సుఖానుశయి కామానుబంధి అనుకూల భావనాజనక వాసనా సంస్కారాసక్తి బంధము రాగము. దుఃఖానుశయి, క్రోధానుబంధి, ప్రతికూల భావనాజనక వాసనా సంస్కారాసక్తి బంధము ద్వేషము. ఆకర్షణ బలప్రయోగము రాగము. విక్షేపణ బలప్రయోగము ద్వేషము. కామానుబంధి రాగము. క్రోధానుబంధి ద్వేషము. కామక్రోధ వైకల్యము వలన ననాసక్తి వైరాగ్యము. రాగ ద్వేష మోహములను దోషములు మూటికి పరస్పరాను భావిత

సాహచర్య ముండుట వలన నొకటి మరొకదాని కుపలక్షణ మగును. కనుక రాగ ద్వేష మోహముల శూన్యతయందు వైరాగ్య శబ్దము వర్తించును. మరియు విషయానుగతములగు రాగద్వేష మోహములు పరస్పరము విరోధించును. కాని యాత్మచే గృహీతములగు నివి రాగముచే ననుగ్రహింపబడును. ద్వేషమునందు రాగము లేనిచో ద్వేష ముండదు గదా! కనుక రాగమన్నిటికి మూలము. ఈయన్నిటియందు నౌదాసీన్యము వైరాగ్యము. ఇది విద్యాబుద్ధి. యిందుకు విపరీతమగు రాగద్వేష మూలాసక్తి రూప మవిద్యాబుద్ధి. ఆసక్తిచే పుత్ర దార గృహ పశు విత్తములందు బద్ధము వలె నాత్మ పారవశ్యము నొందును. అప్పుడు తన దుఃఖముచేతనే గాక యీ పుత్ర దారాదుల దుఃఖముచేకూడ దుఃఖియగును. కనుక దుఃఖాతిశయ మొందును. అట్టి దుఃఖోద్గార నివృత్తి కొరకు, దుఃఖలక్షణ చిత్త క్షోభ ప్రవర్తక రాగద్వేష నివృత్తిలక్షణ సమత్వ సిద్ధి కొరకు, వైరాగ్య బుద్ధియోగ ప్రకరణ ప్రకాశికయగు రాజర్షి విద్య యుపయోగించును: ఇది గీతయందు మొదటి విద్య. 2 జ్ఞానబుద్ధియోగము.

విద్య - అవిద్యయని రెండు ప్రతిద్వంద్వి భూతబుద్ధులు. అవిద్యయన విద్యయొక్క అభావము కాదు. అంచలి నశబ్ద మల్పార్థము. సామాన్యముగ జ్ఞాతము విశేషముగ నజ్ఞాతము. అథవా కించిదజ్ఞాతము కించిత్ జ్ఞాతము. లేదా "వచ్చునని తెలిసినది వచ్చి యేమిచేయునో తెలియదు" అను నిత్యాది జ్ఞానాభావ సముచ్చితజ్ఞాన మజ్ఞాన మది యవిద్య. అజ్ఞానావృత జ్ఞాన మవిద్య. ఒక విధముగనున్నది మరొకవిధముగ నెరుంగుట

యవిద్య- భ్రమజ్ఞానము సంశయజ్ఞానము నవిద్య-ఆయీ ప్రమా జ్ఞాన విపర్యయము నానానర్థ ప్రసవమగును. భగవంతుడును :-

"అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః"

అని చెప్పెను. జ్ఞాన సముచ్చితాజ్ఞానము భయకారణము. తత్త్వ జ్ఞానమువలన నభయములభించును. సుయోగమువలన సుఖము. హీనయోగ, మిథ్యాయోగ, అతియోగముల వలన దుఃఖము. అవియును ప్రజ్ఞాపరాధమున నగుఁగావున నవిద్య దుఃఖ హేతువు, అట్టి దుఃఖ హేతూపస్థితి నివృత్తికొరకు, తత్వజ్ఞానార్థము, జ్ఞాన బుద్ధియోగ ప్రకార ప్రకాశికయగు సిద్ధవిద్య యుపయోగించును. నిది గీతయందు రెండవ విద్య.

అస్మితయన నవిశ్వాసము, బాల బుద్ధి యస్మితా వ్యామోహ మెుంపను. వ్యవహార సమర్థము కాదు. కొంత కాలమునకు వికాస మొందును. మొగ్గ వికసింపగ పుష్పమె యధిక దేశావగాహి యగును. సూర్యమండలము రశ్మిలచే వికసింపగా ప్రభామండలము మహిమ యగును. మహిమ యైశ్వర్య మందురు. మహిమయుండియు వికసింపమిచే యనై శ్వరము. అది యస్మితయను నవిద్యాబుద్ధి. అస్మితచే శక్తిహీను డగును. శిశు శరీరమున ప్రజ్ఞా ప్రాణ భూతమాత్రల యస్మిత యుండును కనుక నిర్బలుడగును. ఆత్మ నిర్భరత యశక్యము. కనుక పరాశ్రితుడు వశ్యుడునై దుఃఖయోగము నొందును. యౌవనమున సర్వమాత్రా వికాసము. తాదృశ బాలోచితదుఃఖ నిర్ముక్తి నొందును. బుద్ధియొక్క యస్మిత జ్ఞానమునందు కొన్ని యజ్ఞాన మాత్రల సమావేశమునకు హేతువగును. అందుచే

నస్మితా నివృత్తి కొరకు, స్వాత్మ పరాత్మైశ్వర్య ప్రతిపత్తి కొరకు నైశ్వర్య బుద్ధియోగ ప్రకార ప్రకాశికయగు రాజవిద్య యుపయోగపడును. ఇది గీతయందు దృతీయ విద్య.

## 4. ధర్మబుద్ధియోగము

జ్ఞానేంద్రియ జనితానుభవాహిత సంస్కారము భావన. కర్మేంద్రియజనిత శ్రమాహిత సంస్కారము వాసన. ఈ యుభయము దుర్వ్యసన రూపమగు నభివేశమను హృదయగ్రంథి బంధము. జలద్వారాహిత రంజనాభినివేశము వస్త్రాదుల శౌక్ల్యము నావరించునట్లు భావనా వాసనా సంసారాభి నివేశము పురుషుని ప్రకృతిసిద్ధ భావచతుష్టయము నావరించును. ఆత్మకు స్వాభావికము, నైసర్గికము, జన్మసిద్ధము నగు ధర్మమును, జ్ఞానమును వైరారాగ్యమును, ఐశ్వర్యమును ఆవరించి, సాంస్కారికము, నధికారసిద్ధము నగుదానినో, దైవియో యాసురియో యగు సంపదను, యాత్మయం దధివసింప జేయును. ఈ దైవాసుర సంపద లాగంతుకములగు నాశ్రిత ధర్మము లగుటవలన నాత్మకు స్వరూపము గాదు. ఆగంతుక ధర్మత్వమగు నీ సంపద యాత్మ ననేకానర్థములచే నప్పుడప్పుడు ద్రోహభావమున బడవేయు చుండును. ఆత్మాభినివిష్టమగు నీయనాత్మధర్మోపక్షయము. 1. పరిపాకసిద్ధ సుఖదుఃఖాది ప్రత్యయలక్షణ భోగజననమునసో, 2. సంస్కారసిద్ధ విరుద్ధ ధర్మాంతర ప్రత్యాఘాతముననో, 3. అవిద్యాబుద్ధి ప్రతిబంధక విద్యాబుద్ధి ప్రతిబంధముననో కాగలదు. ఇందు (1) భోగము : గుణత్రయ ప్రకృతి సిద్ధము, సర్వప్రాణి సాధారణము, దాని

యంతనది నే యంతట నగపడుచున్నది. (2) విరుద్ధ ధర్మము లన్ననో, సత్త్వ రజ స్తమస్సుల యితరేతరావేశమున నితరేత రముగ సంభవించుచున్నది. అట్టి స్థితియు నక్కడక్కడ స్వత స్సిద్ధముగా నగపడుచున్నది. (౨) ఇక విశుద్ధ సత్త్వమున నుప పన్నములగు నివృత్తిలక్షణకర్మలకు ఆత్మావరణ వాసనామయ కర్మ నివృత్తి హేతుత్వము కనుక వానికి విద్యోదయోపాయిక త్వము కలదు. నివృత్తి కర్మజనిత విద్యాతిశయమున, నాత్మ యొక్క ప్రవృత్తి కర్మజనిత విషయ వాసనయగు నధర్మము నశింపగా, స్వీయ ధర్మోదయమున నాత్మ స్వతంత్రమగును. అయ్యది సచ్చిదానంద స్వభావము గలది గనుక స్వధర్మ వశ మున మృత్యురూప వినాశము జడము దుఃఖమునగు నధర్మ నుండి విముక్తి నొందును. అందుకొరకు ధర్మబుద్ధియోగ ప్రకార ప్రకాశిక ఆర్షవిద్య యుపయోగించును. ఆ యీ విద్య గీత యందు నాల్గవది.

ఈవిధముగ అయత్నసిద్ధములగు నవిద్యాస్మితారాగ ద్వేషాభినివేశములను క్లేశములచే విక్లిష్టమగు నాత్మయొక్క క్లేశాపగమార్థము. జ్ఞానైశ్వర్యవైరాగ్యధర్మలక్షణ బుద్ధియో గము లవసరములైనవి. వానిచే క్లేశలక్షణములగు నవిద్యాబుద్ధి యోగములు నివృత్తినొందును. అవ్యయపురుషభక్తి భూతము లగు విద్యావిద్యలు రెంటికి పరస్పర ప్రతిద్వంద్విత్వమున్నది కనుక నవిద్యాతిశయమున విద్యయొక్కయు, విద్యాతిశయమున నవిద్యయొక్కయు తిరోభావ మవశ్యం భావికదా!

ఇ॥ :-ఆత్మస్వరూపలక్షణ-శాంత్యుదయోపాయభూత- విద్యాబుద్ధికి నిద్యావ్యయునందు యోగముబుద్ధియోగము. క్లేశో

దయోపాయభూత-అవిద్యాబుద్ధికి అవిద్యావ్యయునందు యోగము, అవిద్యాబుద్ధియోగము. ధర్మాదిచతుష్టయము. నధర్మాది చతుష్టయము నీరెండు బుద్ధియోగములకును హేతువులు. కర్మాత్మకు బుద్ధ్యాత్మద్వారముననే యవ్యయాత్మయందు విభాగముచే నుపపత్తియగును. కనుక నాకర్మాత్మ తనంతతానే బద్ధమో ముక్తమో యగునని యెరుంగనగును.

మరియొకటి :-సంసారయాత్రానిర్వాహకము లాత్మకు ధర్మము నీతియనునవి రెండు సాధనములు. అందు ధర్మమెట్టిది? అధర్మమెట్టిది ? యనుకొన్నచో:-సర్వప్రాణి సాధారణాత్మయగు నవ్యయుని స్వరూపధర్మములగు ఆనందవిజ్ఞాన మనోలక్షణవిద్యలును, బ్రహ్మక్షత్ర విలక్షణ కర్మలు ననునీయుభయము నేకారణమున ప్రకాశముచే బ్రవర్తిల్లునో అట్టి యానాలుగు విద్యాబుద్ధులే ఆత్మస్వరూప ధర్మోదయ హేతువులగుటవలన ధర్మములు. తద్విపర్యయముగ ధర్మావరణ హేతుభూతములగు కర్మలు అధర్మములు - ఆత్మధర్మోదయహేతు భూతకర్మలు ధర్మములు. వానికావరణహేతుభూతములగు కర్మలధర్మములు. విశ్వాత్మ కేకత్వము, దాని నపేక్షించి శాంత్యానందోదయ హేతుభూతములగు కర్మలు, ధర్మములు, ఒక జీవాత్మ విశ్వాత్మఖండభూతుడు, అత్యల్పరూపి, యట్టివాని నపేక్షించి శాంత్యానందోదయ హేతుభూతములగు కర్మలు, పరాత్మ వ్యాఘాతకత్వమున్నపు డధర్మములు. ఏలయన :-ఏకావయవ సాధకత్వమున్నను, అపరావయవబాధకములగు కర్మలు ఆత్మ స్వరూప ధర్మానందప్రతిబంధకములుకదా! కనుకనే తత్తద్వ్యక్తి స్వార్థపరాయణులగు నైతికులు అహర్నిశ మత్యంతాధ్యవ

సాయ వ్యవసాయపరాయణులయ్యును, నితాంతాశాంతాత్ములై దుఃఖభాజులుగ నగపడుచున్నారు. వారికి గలలోనైన స్వాస్థ్యములేదు. ఇక:-అభ్యాసపారవశ్యమున దుఃఖమునే యానందముగ నెంచుకొని వారు సంతోషించుచున్నారన్నది వేరగువిషయము.

ఆయీనైతికులు, ఏకైక జీవాతిక్షుద్రస్వార్థ సంపాధనార్థ మితరుల నహర్నిశము బీడింప వ్యగ్రచిత్తులై యుందురు. "ఆత్మోదయః పరగ్లానిః నీతిరి త్యభిధీయతే" యనునిష్ఠ ననుష్ఠించువారై పరగ్లాని పూర్వకమగు నాత్మోదయము వాంఛించి విశ్వమందు పరస్పరమనోమాలిన్య విద్రోహములం బెంచి యశాంతి సంచారము గావించుచున్నారు. శాంతికొరకు నీతియని యశాంతి ప్రయత్నములే జరుగుచున్నవి. కనుక ధర్మవిరుద్ధమగు నీతి ననుష్ఠించు సాధారణులు, అవరులు, విశ్వాసయోగ్యులుకారు.

"అధర్మేణైధతే రాజన్ తతోభద్రాణి పశ్యతి
తతః సపత్నాన్ జయతి సమూలస్తువి నశ్యతి."

ఇక :-ధార్మికులన్ననో విశ్వవ్యాపి, ఏకమునగు నాత్మ స్వశరీరమందును బ్రవిష్టమని యెరింగి విశ్వమందంతటను, శాంతి యుండిన తమకును సుఖోదయమగునని నిశ్చయించి స్వార్థముగా విశ్వార్థము కర్మలందు బ్రవర్తింతురు. నైతికుల కర్మలు భూతమాత్రాప్రవణములు. ధార్మికుల కర్మలు ప్రాణప్రవణములు. వీరొకచో భూతసంసక్తి నొందుట ప్రాణలాభార్థమే యనుకొనవలయును. బహిరంగ బలసాధన ప్రవణులగు నైతికులకు భూమి ధనశస్త్రాది తుచ్ఛలాభము పురుషార్థము. అంతరంగబల

సాధనప్రవణులగు ధార్మికులకు ఆత్మబలసంపత్తికొరకు ఆత్మ యందు దైవతలాభము విశిష్టపురుషార్థము. భూతబలులు నైతికులు. ప్రాణబలులు ధార్మికులు.

మరియు:- పార్థివాధిభౌతికపదార్థసాధితైహలౌకికమాత్ర సుఖసంసాధనము నీతిమార్గము. దివ్యాధిదైవిక పదార్థసాధితైహలౌకిక పారలౌకికోభయవిధ సుఖసంసాధనము ధర్మమార్గము. పరావనతి సంసాధనము గావించి దానిచేతనే స్వోన్నతి సంపాదన మనుకొనుట నీతిమార్గము. స్వోన్నతి సుసాధనము గావించుకొని దానిచే పరావనతి సాధనమైన దనుకొనుట ధర్మమార్గమునం దొక నీతిమార్గమును, అష్టవిధ నీతిమార్గమునం దొక ధర్మమార్గమును, అంతర్భావ్యమను నీవిషయము మరొకచో జూచుకొందము :

ఇతి బుద్ధియోగవిద్యారహస్యమ్

నిష్కర్ష.

1. తత్తత్కర్మ విషయక శ్రద్ధానోపపాదికయగు నది విద్య. అది యుపనిషత్తు. గీతయం దది నాలువిధములు, 1 కర్మ యోగనిష్ఠా, 2 జ్ఞానయోగనిష్ఠా, 3 భక్తియోగనిష్ఠ, 4 బుద్ధియోగనిష్ఠ - యని. (1) లౌకిక వైదిక నిత్యకామ్య సర్వవిధ కర్మైకాంతారంభోపపాదిక యగువిద్య కర్మయోగోపనిషత్తు. ఇందలి యోగశబ్దము కర్మారంభమున ప్రయుక్తము. (2) లౌకిక వైదిక నిత్యకామ్య సర్వవిధ కర్మైకాంత సన్యాసోపపాదిక యగు విద్య జ్ఞాన యోగోపనిషత్తు. ఇందలి కర్మసన్యాసము నందు సాంఖ్యశబ్దము ప్రయుక్తము. (3) నిష్కామముగనో,

పరమేశ్వర శరణాగతి సాధనోపాసనా కర్మప్రవణత సకామము గనో భక్తియోగోపనిషత్తు. ఇందలి కర్మారంభమునందుపాసనా శబ్దము ప్రయుక్తము. (4) కామ్యకర్మ ఫలానాసక్తి పూర్వికయు, సర్వవిధశుభ కర్మారంభోపపాదికయు నగువిద్య బుద్ధియోగోపనిషత్తు. ఇందుసాంఖ్యయోగముల కేకత్వమున్నను యోగశబ్దమే యిష్టము.

2. ఈబుద్ధియోగోపనిషత్తులు రెండు భాగము లగును. 1. సమ్యగ్దర్శన లక్షణము, ఆత్మప్రకాశావరణ లక్షణ వాసనా కర్మసంన్యాస రూపమునగు జ్ఞానయోగము మొదటిది. ఇది యారంభక కర్మజనిత వాసనాకర్మ సంన్యాస లక్షణము గలదై సాంఖ్య మనిపించుకొనుచున్నది. తన్నిష్ఠులు సాంఖ్యులు. (2) సమ్యక్చారిత్ర్య లక్షణము సర్వవిధాత్మ బల సిద్ధి సమృద్ధి రూపమునగు కర్మయోగ ముత్తమము. (కర్మసన్యాసా త్కర్మ యోగో విశిష్యతే) ఇది యోగమందురు. తన్నిష్ఠులు యోగులు సాంఖ్య యోగములు రెండు నొకటిచే యగు శాస్త్రము బుద్ధియోగోపనిషత్తు. దీనికొకదానికే వాసనాత్మక కర్మైకాంత సన్న్యాస ధర్మమును, ఆత్మనిత్య జ్యోతిర్లక్షణ జ్ఞానోపపాదనము నుండుటచే సాంఖ్యత్వము[1]. నిష్కామ సర్వవిధ కర్మైకాంతారంభ దర్శిత్వమునను, సర్వవిధాత్మ బల సిద్ధి సమృద్ధి రూపత్వమునను, యోగత్వము.[2]

(3) ఈ విధముగ నిష్కర్ష సిద్ధించును :— (1) విశ్వప్రవణతచే సర్వవిధ ప్రవృత్త కర్మకరణము : కర్మయోగము. (2) ఆత్మ ప్రవణతచే ప్రవృత్తి నివృత్త్యోభయవిధ కర్మ సంన్యాస

నము జ్ఞానయోగము. (3) ఈశ్వర ప్రవణతచే ప్రవృత్తి నివృత్తోభయవిధ కర్మకరణము: భక్తియోగము. (4) విశ్వేశ్వరాత్మ ప్రవణతచే సర్వవిధ నివృత్త కర్మకరణము: బుద్ధియోగము.

(4) ఈ బుద్ధియోగోపనిషత్తు ఆచార్యభేదమున (1) భగవద్విద్య, (2) సిద్ధవిద్య, (3) రాజవిద్య, (4) ఆర్షవిద్యయని నాల్గువిధములు. అందు మొదటిది భగవంతుడగు కృష్ణునిచేతనే స్వోపజ్ఞముగ నుపదిష్టము. తక్కిన మూడును అప్పుడప్పుడితర పురాణ పురుషులచే నుపదిష్టములు. ఆయ్యవి తన కిష్టములని యాదరార్థమును స్వమత పుష్టి కొరకును, భగవంతుడను వదించి ప్రదర్శించెను. అట్లు యీ బుద్ధియోగ చతుష్టయి, భగవద్గీతోపనిషత్తు. ఈ శాస్త్ర చతుష్టయ మొక్కచోట సంగ్రహించి పదర్శింప బడినది. ఇదియే గీతా శాస్త్రము:

ఇతి నిష్కర్ష.

ఇతి శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్ర చల్లా సుబ్బా
రాయ తనూభవస్య కృష్ణమూర్తి శర్మణః
కృతిషు, అనుశ్రుత్యుపనామక శ్రీవిజ్ఞాన
లక్ష్మీనారాయణీయే, ప్రస్థానమీ
మాంసాయాం, శ్రీమద్భగవ
ద్గీతోపనిష ద్విజ్ఞానపరిచ
యోనామ సంక్షేప
గ్రంథః సమాప్తః.



---



# మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B 158 |
| పుస్తకం పేరు | శ్రీమద్భాగవద్ గీతా విమర్శనము |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 615 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | XXXvi, 838, 1 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |